| ల గు బు కే | ర శు | కు కు | చ |
|---|---|---|---|
| | జగల్లగ్న కుండలి. | | |
| | | | |
| | | | రా |

| ర చ గు కే | శు | కు కు | |
|---|---|---|---|
| బు | వర్ష లగ్న కుండలి | | |
| | | | |
| ల | | | రా |

వీటినిబట్టి విచారించగా నీ సంవత్సరము జనులకు కష్టసుఖము లలో కష్టము లెక్కువగ నుండును. లోకమున చోరాగ్నిరోగ బాధ లున్నూ యుద్ధభయాద్యుపద్రవములున్నూ కన్పించుచున్నవి. వర్ష కాలమున వర్షములు తక్కువగ నుండును. బాలులకు పశువులకు అరిష్ట ములు గలుగును. ఉత్తర దేశమునను పూర్వ దేశమునను సుభిక్షముగా నుండును. మధ్యదేశమున అతివృష్టియున్నీ రోగపీడయు గలిగి దుర్భిక్ష భూయిష్ఠముగ నుండును. పశ్చిమదేశమున ఉపద్రవము లెక్కువగును. దక్షిణదేశమున జనులకు సౌఖ్యమున్నూ పశువుల కరిష్టమున్నూ గలు గును. ఆషాఢమున సుభిక్షముగ నుండును. వైశాఖ మాసమున లోక మున కల్లోలములు గలిగి కొన్నిముఖ్య విషయములలో నవగా రాజ్యాంగ వాణిజ్యాదులలో మార్పులు కనిపించుచున్నవి. జ్యేష్ఠ మాసమున రోగాగ్ని బాధలున్నూ భాద్రపదమున మారీమశూచకాది రోగబాధలున్నూ గలుగును. ఆర్థికవ్యాపారములలోను దేశాంతర ద్రవ్యవినిమయమందును మార్పులు విశేషముగా జరుగనున్నవి. వెండి బంగారములు, రత్నములు మొదలగు వాటిధరలలో విశేషమార్పులు గలుగును. అందు బంగారమునకు ధరతగ్గుటయు ఇనుమునకు ధర హెచ్చుటయు కనుపించుచున్నవి. సర్వేజనాస్సుఖినోభవంతు. శ్రీ శ్రీ శ్రీ.

## ధర్మశాస్త్రనిర్ణయములు

### కటకసంక్రమణపుణ్యకాలము

ఆషాఢ శు ౧౨ మంగళవారం ఉదయాది ౦-౧౫ ఘడియలకు కటక సంక్రమణమగుటచే ప్రాయశఃపూర్వమందు జరుగదగినపుణ్యకాల ప్రయుక్తకలాపము పరమందు జరుపదగినదిగా నిర్ణయించబడినది. అందు కు ప్రమాణములు ధర్మసింధు 'సూర్యోదయోత్తరం ఘటికాద్వయా త్ప్రాక్సంక్రమే పరత ఏవ పుణ్యం' కాలమాధవీయం 'ఉదయానంతర భావిని దక్షిణాయనే పూర్వభాగప్రాశస్త్యం బాధిత్వా ఉత్తరభాగే అనుష్ఠానం భవతి' నిర్ణయసింధు 'సూర్యోదయోత్తరం సంక్రమేతు పరత ఏవ పుణ్యం' స్మృతికౌస్తుభం 'ఉదయాఽవ్యవహిత ఉత్తర క్షణవర్తిని కర్కేతు యద్దినే సంక్రమణం తద్దినం పుణ్యమితి నియమః. 'వృద్ధవసిష్ఠః' 'అర్ధరాత్రేత దూర్ధ్వం వా సంక్రాంతౌ దక్షిణాయనే' పూర్వమేవ దినం గ్రాహ్యం యావన్నోదయతే రవిః' అనుటచేత సూర్యోదయాత్పూర్వమువఱకు రాత్రియం దెప్పుడు కర్కటసంక్రాంతి యైనను పూర్వదినమే పుణ్యకాల మని చెప్పుటచే సూర్యోదయా నంతరము సంక్రమణమైనపుడు పరదినమే పుణ్యకాలమని సిద్ధమగు చున్నది. మరిన్ని ముహూర్తచింతామణిలో ప్రాతస్సంధ్యాకాలమున కర్కసంక్రాంతియైనను పరదినమే పుణ్యకాలమని చెప్పుటచేత సంధ్యానంతరమందు సంక్రమమయినపుడు పరదినము పుణ్యకాలమనుట నిర్వివాదాంశము.

స్కందషష్ఠీ:—మార్గశిరశుద్ధ ౫ బుధవారం ౩-౨౮ షష్ఠీగురు వారం ౩-౫౨. ఇట్లుండ స్కందషష్ఠీవ్రతము బుధవారమున ఆరం భించి ఆనాడుపవసించి మరునాడు బ్రాహ్మణసహితముగ పారణ చేయవలసినట్లుశాస్త్రముండుటచే బుధవారమున వ్రతారంభమనియు గురువారమున వ్రతప్రయుక్తపారణయనియు నిర్ణయించబడినది. కాల మాధవీయే వసిష్ఠః 'కృష్ణాష్టమీస్కందషష్ఠీశివరాత్రిః చతుర్దశీ, ఏతాః పూర్వయుతాః కార్యాః' ధర్మప్రదీపే, స్కందపూజాప్రకరణే 'మార్గశుక్లషష్ఠీస్కందవ్రతే సాయాహ్నవ్యాపినీ గ్రాహ్యా. ఉభయ దినేసత్త్వేపూర్వవిద్ధాగ్రాహ్యా 'కృష్ణాష్టమీ స్కందషష్ఠీతి' పూర్వోక్త వసిష్ఠవాక్యాత్ మాధవీయేప్యేవం. దీపికావ్రతార్కయోరప్యేవం. ప్రతాపమార్తాండేప్యేవం. కాలనిర్ణయచంద్రికాయాం స్కాందే 'యస్మాన్మార్గశిరే షష్ఠ్యాం తారకాఖ్యో మహాసురః,స్కందేన నిహత స్తస్మాత్స్కందషష్ఠీతివిశ్రుతా. తస్యాం యేపూజయంతీహ, స్కందం భక్తిపురస్సరం, సప్తజన్మార్జితం తేషాం దుష్కృతం నశ్యతే క్షణాత్. ఇయం పూర్వవిద్ధాగ్రాహ్యాస్కందవ్రతత్వాత్, బృహస్పతిః 'కృష్ణాష్టమీ స్కందషష్ఠీ శివరాత్రిశ్చతుర్దశీ, ఏతాః పూర్వయుతాః కార్యాః తిథ్యంతేపారణం భవేత్. ఇత్యాది వచనములబలమువల్ల ఉపవాసపూర్వక స్కందవ్రతం బుధవారమునాడున్నూ పారణ గురువారమునయున్నూ నిర్ణయించి వ్రాయబడినవి.

### అనధ్యాయములు

జ్యోతిర్నిబంధము—'ప్రతిపత్పూర్ణిమాచ చతుర్దశ్యష్టమీ తథా, అనధ్యాయాస్సోపపదాః, యుగమన్వాదయస్తథా' అని యుండుటవల్ల ప్రతిపత్తు, పూర్ణిమా, అమావాస్యా, చతుర్దశ్యష్టములు సోపపదతిథులు, యుగాది మన్వాది దినములు, దక్షిణోత్తరాయణ పుణ్యకాలదినములు, విషువత్పుణ్యకాలదినములు, ప్రదోషములు, శయన బోధనైకాదశులు, వీటియందు వేదశాస్త్రాదులధ్యయనం చేయరాదు,

ఈ పంచాంగమున వ్రాయబడిన వ్రతాది సమస్త ధర్మనిర్ణయములున్నూ గ్రంథబాహుళ్యముచే నిర్ణయములకు వచనములు వ్రాయకపోయినను ధర్మశాస్త్రగ్రంథములను పూర్వాపరసందర్భ విమర్శపూర్వకముగా పరిశీలించబడియే నిర్ణయించబడినవి. కనుక సంశయగ్రస్తుల కెప్పటికప్పుడు తగుసమాధానము తీయబడును.




# ఊరగాయలువేసేకాలం

**సమీపించినది**

మీ ఊరగాయలును ఘాటైన కమ్మని సువాసన, మంచి రుచులు గలిగియుండుటకు శాస్త్రోక్తమగు మంచివస్తువుగ మాత్రమే అన్నిచోట్లను దిగువగుర్తులతో అమ్మబడుచున్నదానినే నిర్ణయించుకొనుడు.

## టి.టి. సైన్టిఫిక్ మిస్కి ఇంగువ

బహుమతి కూపనులతో అమ్మబడును. పౌను 1-కి రు. 1-14-0.



BENGAL
★ బెంగాల్ బల్బులు విదేశ బల్బు లన్నిటికి, మన్నికలో మిన్న యగుచున్నవి. ఇవి తక్కువ వెలకే యెక్కువ కాంతి నిచ్చును.
★ భారత దేశములో ఇవి ఒక్కటియే పరీక్షల్లో అన్ని బల్బులకన్న మంచివని పేరు పొంది, అనేక పతకములు బహుమానములను పొందినవి.
★ ఇండియాలో తయారు చేయబడినవి (మేడిన్ ఇండియా) అను గుర్తు చూచి మరీ కొనుడు. ఈ గుర్తు యే మన హిందూదేశపు పనివారిచే తయారు చేయబడిన వని తెలుపును. బెంగాల్ బల్బులనే ఆదర్శముగా పెట్టుకొని మిగత బల్బులను పరీక్షించుదరు.
BENGAL LAMPS

# సకాలమైన హెచ్చరిక

జీవనోపాధి లేక వితంతువులు, పిల్లలు తిండికి అల్లాడుచున్న సంగతి నిత్యకృత్యమునందు యెల్లరు తరచు చూచుచున్నారు. ఏల ననగా వారు యెవరిమీద ఆధారపడియున్నారో అట్టివారు ఎప్పటికైనా రాక తప్పనిసరియగు మృత్యువు వచ్చినయెడల తమ ఆశ్రితులకు తగిన ఉపాధి నేర్పాటు చేయవలెనని దూరదృష్టి లేకపోవుటయే కారణము.

మీ తదనంతరము మీ ఆశ్రితవర్గము స్వతంత్రజీవనోపాధి గడప గలుగుదు రని మీరు నిశ్చయించితిరా? అట్లు చేయనిచో యిక నెంత మాత్రము ఆలస్యము చేయక "ఓరియంటల్ పాలిసీ" వెంటనే తీసికొని మీకు ఆప్తులు, అత్యంత ప్రియులు, అయినవారికి ఆర్థిక స్వాతంత్ర్యమును దిట్టపరచుడు.

**ఎప్పుడో ఒకప్పుడు ప్రతివారికి భీమా చేయించుకొనుటకు అనర్హత రాక తప్పదు.**

**ఎప్పుడో ఎవరును చెప్పలేరు.**

**అందుచే ఆలసింపవద్దు— "ఓరియంటల్" లో మీ జీవితమును భీమా చేయుడు. భీమా చేయువారిలో అనేకమంది వివేకవంతులు అచ్చటనే ప్రతి సంవత్సరము భీమా చేయుచున్నారు.**

**రు. 21 కోట్లకు పైగా**

ఇప్పటివరకు పాలిసీ హోల్డర్ల యొక్క వేలకొలది కృతజ్ఞులగు ఆశ్రితులకు వారి కష్టకాలమందు "ఓరియంటల్" వారిచే చెల్లింపబడినది.

**అమలులో నున్న పాలిసీలు**

**రు. 77½ కోట్ల భీమాకు మించినవి**

1938 డిసెంబరు 31-వ తేదీనాటికి ఫండ్సు

**రు. 23 కోట్లకు మించినవి**

## ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

### హెడ్ ఆఫీసు, ఓరియంటల్ బిల్డింగ్సు - బొంబాయి.

అత్యంతాకర్షణీయమైన మా పాలిసీల పూర్తి వివరములకు దయచేసి దిగువ ఏదైన ఒక అడ్రెసుకు వ్రాయుడు:-

బ్రాంచి సెక్రటరీ, ఓరియంటల్ లైఫ్ ఆఫీసు, ఆర్మీనియన్ స్ట్రీటు, మద్రాసు.
సబ్ బ్రాంచి సెక్రటరీ, ఓరియంటల్ లైఫ్ ఆఫీసు, గోల్డ్‌స్మిత్తురోడ్, బళ్లారి.
ఇన్‌స్పెక్టర్, ఓరియంటల్ లైఫ్ ఆఫీసు, 17, ఆఫీసర్స్ లైన్, వెల్లూరు.
బ్రాంచి సెక్రటరీ, ఓరియంటల్ లైఫ్ ఆఫీసు, గోడేవారి వీథి, విశాఖపట్నం.

# ప్రస్తావన

అల్లకల్లోలమగు నేటి ప్రపంచప్రవృత్తి కాలప్రభావమును ప్రకటించుచున్నది. మానవులు ఆత్మపరిజ్ఞానమును గోలుపోయి, కామక్రోధాది అరిషడ్వర్గలోలురై మారణకృత్యములం దుద్యోగులగుచున్నారు. జాతీయత నూతగగొని ధనకాంక్ష విజృంభించుచున్నది. సత్యస్వరూపమును అణచివేయుచున్నది. ప్రపంచము శాంతివిదూరమై, మానవజీవితము దుర్భర మగుచున్నది.

పాశ్చాత్య జాతులయందు నేడు వ్యాపించుచున్న సంగ్రామములకు లోభపూరితమగు సామ్రాజ్యకాంక్షయే తప్ప మరియొక కారణము గన్పింపదు. గత ఐరోపామహాసంగ్రామముతో నీ సామ్రాజ్యతత్త్వము అంతమందునని భావించిరి. నూతనముగ నేర్పడిన జాతిసమితి ప్రపంచమున తమోరూప మగు పశుబలాధిక్యతను తొలగించి సత్యస్వరూపమగు ధర్మయుగమును స్థాపించునని ఆశించిరి. కాని ఆసమితికి మూలకందములని చెప్పుకొనుజాతులే తమ సామ్రాజ్యకాంక్షను విసర్జింపజాలకపోవుటచే సమితి ఆదర్శములు కేవల మృగతృష్ణలయ్యెను. జాతిసమితి హాస్యాస్పద మయ్యెను. ఇతర దేశములలోగూడ దుర్బలజాతుల నిర్జించి సామ్రాజ్యముల నెలకొల్పుకొనవలె ననుతృష్ణ వ్యాపింప దొడగెను. ఈతృష్ణవలననే ఇటలీ అబిసీనియా, ఆల్బేనియా రాష్ట్రముల నాక్రమించినది. జపాను మంచూకో నాక్రమించి, చైనాను కబళించుచున్నది. జర్మనీ జెకోస్లోవేకియా, ఆస్ట్రియాలను దిగమ్రింగినది; నేటి మహాసంగ్రామకారణమగు పోలండుపై దండెత్తి ఆక్రమించినది. సోవియటు రష్యాగూడ రాజ్యతృష్ణకు లోనై జర్మనీతోగలసి పోలండును పంచుకొనినది. లటీవియా, ఎస్టోనియా, లుథేనియాలను బెదరించి ఆదేశములలో సైనికశిబిరముల నేర్పరుచుకొనినది. చిన్నదగు ఫిన్లండుపై దండెత్తి కొంత దేశము లాగుకొనినది. తుదకిపుడు ఆంగ్లపరాసు జాతులు జర్మనీతో నీ భయంకర సంగ్రామమునకు దిగవలసివచ్చుటకు గూడ జర్మను సామ్రాజ్యకాంక్షయే కారణము. జాతిసమితియందలి పెద్ద రాష్ట్రములు తమ సామ్రాజ్యకాంక్షను వదలియున్నయెడల నీసంఘటనలు సంభవించియుండెడివి కావు.

జర్మనీకిని ఆంగ్లపరాసు దేశములకును పొసగిన సంగ్రామ మింకను తీవ్రరూపమును దాల్చకుండుటను గాంచి, దాని దారుణఫలితముల చులకన జేయుటకు వీలులేదు. ప్రాతయుద్ధపద్ధతులకు అలవడినవారీసారి సంగ్రామము విద్యుద్వేగముతో సాగింపబడునని భావించియుండిరి. విషవాయు సహితములగు మహామారణయంత్రములు ఒక్కపెట్టున నుపయోగింపబడునని యూహించిరి. ఆయూహలన్నియు నిపుడు రిత్తలయ్యెనని సంతసించుట కింకను వీలులేదు. పార్టీలు పూర్తిగ సన్నద్ధమైన తరువాత నేక్షణమందైనను అట్టిదారుణచర్యలతో యుద్ధము తుములముగా వచ్చును. పైఅటుల గన్పడకపోయినను, ఇపుడు సాగించుచున్న యుద్ధపద్ధతు లంతకంటె దారుణతరములు. ఇంతవరకును — సంగ్రామరంగములందలి సైనికుల పోరాటమునందే జయాపజయములు నిర్ణయమయ్యెడివి. నేడటుల గాక వెనుకనున్న ప్రజలందరిపైనను గూడ ఆర్థిక సాధనములతో పోరాటము సాగింపబడుచున్నది. విదేశములనుండి సరకులురాకుండ అమలు జరుపబడు ముట్టడి వలన రణరంగమునందలి సైనికులు మాత్రమేగాక ప్రజలందరును గూడ శిథిల మగుదురు.

యుద్ధము ప్రారంభమగుట తోడనే ప్రధాన మగు దేశము లేదో యొకవైపున జేరునని తలచిరి.

కాని అటుల జరుగక ఇటలీ, జపాను, రష్యా మొదలగు దేశములన్నియు తటస్థముగ నుండుటకు నిశ్చయించుకొనినవి. కాని ఈ తాటస్థ్యము ఎంతకాలము నిలుచునో చెప్పుట కష్టము. యుద్ధమున దగుల్కొనియున్న వారి వ్యగ్రచర్యలచే నేతుణముననైన నీ తటస్థరాష్ట్రములు ఏదో యొకపక్షమున చేరవలసిన పరిస్థితు లేర్పడవచ్చును. ఈ విధముగ కాలక్రమమున ప్రపంచమునందన్ని ప్రాంతములకును గూడ నీ యుద్ధజ్వాలలు వ్యాపించు విపత్తు ఇంకను దాటలేదు. అందు ముఖ్యముగ చిన్నరాష్ట్రములు తమ తాటస్థ్యమును నిలుపుకొనుట దుస్సాధ్యముగ నున్నది.

ఈ మహాసంగ్రామమునుండి వెలువడు ప్రపంచము ఏరూపమున నుండునో చెప్పుట కష్టము. ఎవరు గెల్చినను, గెల్చినవారుగూడ సామ్రాజ్యకాంక్షను విసర్జించవలెను. ప్రతీకారవాంఛ గలుగకుండ ప్రవర్తించవలెను. అంతవరకును ప్రపంచమున శాంతి సుస్థిరము గాజాలదు.

సంగ్రామప్రారంభముతో భారతజాతీయ వ్యవహారములయందుగూడ విషమపరిస్థితులు సంఘటిల్లెను. బ్రిటిషుప్రభుత్వమువారు జర్మనీపై యుద్ధమును ప్రకటించుటతోడనే, ఇచటి రాజప్రతినిధి భారతదేశముగూడ జర్మనీతో యుద్ధమునకు దిగినటుల ప్రకటించెను. ఫెడరలు రాజ్యాంగస్థాపన ప్రయత్నములను తాత్కాలికముగ విరమించిరి. రాష్ట్రీయప్రభుత్వములతోగాని, భారతశాసనసభలతోగాని సంప్రదింపకయే వెంటనే భారతసైన్యములను ఐరోపారంగమునకును, ఇతర రంగములకును పంపుటకు ప్రారంభించిరి. భారతదేశ సంపద నంతను యుద్ధమున కుపయోగించుటకు సన్నాహము లొనర్చిరి. ప్రజల అంగీకారము నందకయే భారత సైన్యముల విదేశముల కంపినందులకు అన్ని పక్షముల వారును అసంతృప్తిని ప్రకటించిరి. కాంగ్రెసువారును అసమ్మతి సూచకముగ భారతశాసనసభలను బహిష్కరించిరి. ప్రజాపరిపాలనా సూత్రములకొరకును దుర్బలజాతుల స్వాతంత్ర్యముకొరకును జర్మనీపై యుద్ధమును ప్రారంభించితిమని బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రకటించిన ఆదర్శములను భారతదేశమునకుగూడ వర్తింపజేయవలెనని కాంగ్రెసువారు గోరిరి. సంగ్రామానంతరము, భారత రాజ్యాంగ నిర్మాణ నిర్ణయాధికారమును భారతప్రజా పరిషత్తున కొసగెదమని ప్రస్తుతము వాగ్దానమొనర్పవలెనని కోరిరి. కాని బ్రిటిషుప్రభుత్వమువారట్టివాగ్దానము నొసగకపోవుటచే, భారతజాతి సంగ్రామమున పాల్గొనుట లేదను విషయమును ప్రకటించుటకుగాను ఏడు రాష్ట్రములయందుగల కాంగ్రెసు మంత్రివర్గములు రాజీనామాల సమర్పించెను. బ్రిటిషు అధికారవర్గమువారు ప్రజలు కాంగ్రెసునకే బాసటయై యున్న విషయమును గుర్తించి, తిరిగి ఎన్నికల జరుప సాహసింపకపోయిరి. శాసనసభలను, మంత్రిపదవులను రద్దుచేసి గవర్నరులు రాజ్యాంగాధికారముల నన్నిటిని తామే స్వీకరించి నిరంకుశాధికారుల సలహాతో పరిపాలనను సాగించుట కారంభించిరి.

జర్మనీతో ప్రజాపాలనా సూత్రములకొరకు పోరాడుచుంటి మని ప్రకటించుచు బ్రిటిషు ప్రభుత్వమువా రీ దేశమున నీవిధముగ రాష్ట్రీయ ప్రజా పరిపాలనను గూడ రద్దుచేసి నిరంకుశ పరిపాలనను సాగించుచున్నారు. చిన్నజాతుల స్వాతంత్ర్యరక్షణకు పోరాడుచుంటిమని ప్రకటించుచు, ఈ దేశమున భారతజాతీయ స్వాతంత్ర్యమును అంగీకరింప నిరాకరించుచున్నారు. జర్మను సామ్రాజ్యమును శిథిల మొనర్ప బూనుకొనియున్న ఆంగ్లదేశము భారతదేశమున తన సామ్రాజ్యాధికారమును విడువనొల్లకున్నది.

బ్రిటిషు ప్రభుత్వము భారతదేశముపట్ల నిట్టి విచిత్రవైఖరి నవలంబించుటకు భారతీయులయందలి విభేదములే సాకుగ నుపకరించుచుండుట దౌర్భాగ్యము. మహమ్మదాలీ జిన్నాగారి నాయకత్వమున ముస్లింలీగు, దేశమునందలి మహమ్మదీయుల కందరకును

తానే ఏకైక ప్రాతినిధ్య సంస్థనని దెలుపుచు, కాంగ్రెసు నెదుర్చుచున్నది. తమ అంగీకారములేనిదే యెట్టి రాజ్యాంగమును ప్రవేశపెట్టరా దనుచున్నది. భారత దేశమునకు ప్రజాప్రాతినిధ్య సూత్రముల వర్తింపజేయ రాదని ప్రజాపరిషత్తు పద్ధతిని ప్రతిఘటించుచున్నది. తుదకు లాహోరునందు సమావేశమైన వార్షిక సభ యందు భారతీయులందరొకజాతి గాదనియు, మహమ్మదీయు లొకప్రత్యేక జాతియనియు ప్రకటించి, భారత దేశము నా జాతులబట్టి విభజించి వేర్వేరు స్వతంత్ర ప్రభుత్వముల నేర్పరుప వలెనని కోరిరి. స్వాధిపత్య రక్షణాతురులగు బ్రిటిషువారి కీ విభేదములు అధికముగ నుపకరించుచున్నవి. బ్రిటిషుఅధికారవర్గము వారు, ఈ విభేదముల తొలగించుట తమ యుద్దేశమని ఎంతగ ప్రకటించుచున్నను వారి చర్యలు మాత్రము వీనిని మరింత యధిక మొనర్చుచున్నవి.

సంపూర్ణస్వాతంత్ర్యాదర్శమును సత్వరముగ సమీపింపవలసియున్న నేటిరోజులలో భారత దేశము ఎన్నియోవత్సరముల వెనుకటి గాఢాంధకార పరిస్థితులలోనికి ద్రోయబడినటుల గన్పించును. కాంగ్రెసు నందు ఏకీభావ మధికముగ నవసరమగు నీ సమయమున తీవ్రవాదులచే నేర్పడిన విభేదములుగూడ కొంతవరకు కాంగ్రెసును దుర్బల మొనర్చెను. ఏకనాయకత్వ మవసరమగుసమయమున బహునాయకత్వము తలజూపెను. అయినను, అన్నివర్గములవారును ఏకాశయులే యగుటచే రామఘురు కాంగ్రెసు గావించిన నిర్ణయము, తిరిగి అందర నేకముఖమునకు దెచ్చి స్వాతంత్ర్య సంరంభ మును అప్రతిఘటనీయముగ సాగింపవచ్చును.

ఈ సందర్భమున, పాశ్చాత్యదేశములందు సాగుచున్న సంఘర్షణకును భారతదేశమునందు సాగింపబడుచున్న స్వాతంత్ర్య సంరంభమునకును గల భేదము గమనింపదగి యున్నది. పాశ్చాత్యజాతులు తమోగుణ ప్రధానములై భయంకరమారణయంత్రములతో మానవకోటిని హతమార్చి, మానవశల్యములపై సౌఖ్యసౌధముల నిర్మించుకొనుటకు ప్రయత్నించుచున్నవి. భారత జాతి మహాత్ముని నాయకత్వమున సత్వగుణ ప్రధానమై సత్య, అహింసా ధర్మములనే అవలంబనముగ గొని విశుద్ధప్రేమతో పశుబలమును, స్వార్థపరత్వమును యెదుర్కొని స్వాతంత్ర్యమును సాధించుకొనుటకు ప్రయత్నించుచున్నది. ప్రేమచే ద్వేషమును, స్వార్థపరత్వమును పరాజిత మొనర్పజూచుచున్నది. సత్వగుణ ప్రేరితమైననే గాని ప్రపంచమున సుస్థిరమగు శాంతి సాధ్యముగాదు. అందుచే భారతస్వాతంత్ర్యోద్యమఫలితముపై ప్రపంచశాంతి చాలవరకు ఆధారపడి యుండుననుట అతిశయోక్తిగాదు.

జాతీయ అంతర్జాతీయ విషమపరిస్థితులు ఆంధ్రుల ఆశయసాధనకుగూడ ప్రతిబంధకమయ్యెను. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతనుగురించి మదరాసు మంత్రివర్గమువారు పంపిన శిఫార్సును బ్రిటిషు ప్రభుత్వమువా 'రిది తరుణముగా'దని త్రోసివేసిరి. ఆ నిర్ణయము నంగీకరింపక తిరిగి వత్తిడిచేయవలసిన సమయమున కాంగ్రెసుమంత్రివర్గములు రాజీనామాల నొసగవలసివచ్చెను. శాసనసభలు నిలుపుచేయబడెను. దీనితో చూపుమేరలోనికివచ్చె నని తలచిన ఆంధ్రాశయము తిరిగి దిగంతములయందు మరుగువడెను. అయినను ఆంధ్రులు ఏమాత్రమును దిగులుచెందక కృతనిశ్చయముతో ఆంధ్రరాష్ట్రముకొరకు కృషి సలుపవలసియున్నది.

మాకోరికను మన్నించి ఈ సంచికకు అమూల్యములగు వ్యాసములను రచించి పంపి ఆంధ్రపత్రికయెడల తమ సహజాభిమానముల ప్రకటించిన వ్యాసకర్తలందరకును మా హృదయపూర్వక మగు కృతజ్ఞతావందనముల సమర్పించుచున్నాము.

విక్రమ వత్సరము భారతజాతీయాభీష్టసంధాయకమై, ప్రపంచశాంతిసాధకమై, విశ్వమానవకల్యాణప్రదమై వెలయునని ఆశించెదము.

# ప్రమాది, విక్రమం

శ్రీ డి. నరసింహాచార్యులు



గాంధీజీ మొదలైన నాయకులకే గల్పించి వైషమ్య భా
వాంధత్వంబును, కాంగ్రెసేతరులకున్ హర్షంబుఁ జేకూర్చి ని
ర్బంధానన్ దొలఁగింపఁజేసి పదవుల్ స్వారాజ్యసంరంభసం
బంధంబౌ పను లన్నియున్ జెరపితే మాకున్ ప్రమాదాబ్దమా.

జిన్నాగాంధిజి సంప్రదింపులను రాజీయేర్పడున్ మా కటం
చున్నన్ బౌ డొనరించి, నష్టముల నెన్నో గూర్చి, కాంగ్రెస్సునం
పన్నత్వంబున కోర్వక న్ననలుకున్ పాల్జేసితే యొగ్జిబీ
ష న్నీనామము సార్థకంబుగద వర్షంబౌ ప్రమాదాబ్దమా.

స్టాలిన్ హిట్లరు లన్ ధరాధరములన్ సామాన్యరాజ్యాలపై
గూలన్ జేసియు, చిన్న రాజ్యముల సంక్షోభంబునన్ ముంచినా
వా లండన్ బెరిలిన్ ప్రభుత్వములకు న్నాలంబుఁ జేకూర్చి తీ
కాలంబందున మంచివార్త గలదే గాంచన్ ప్రమాదాబ్దమా.

ప్రత్యేకంబుగ నాంధ్రదేశమునకున్ రాష్ట్రంబు సిద్ధింప మే
మత్యుత్సాహముతోడఁ బోరఁగ వృథా యానట్లు గావించి మా
కత్యంతంబు నిరాశఁ గూర్చితివి నీదౌ దుష్టచేష్టంబులన్
ప్రత్యక్షం బొనరించినావుగద నీరాజాంగముల్ వద్దిఁకన్.

విక్రమవత్సరంబ కడు వేగమె వచ్చి ప్రమాదివోలె నీ
వక్రమరాజ్యపాలనమునం దినముల్ సరిపుచ్చబోకఁ మా
వక్రము లెల్లఁ దీర్చి పరిపాలన సేయుము కీర్తిగల్గెడున్
విక్రమనామసార్థకము విక్రమ మొప్పఁగఁ జేసికొమ్మిఁకన్.

మునుజన్నట్టి ప్రమాదివత్సరమునుంబోలెన్ ప్రమాదంబుల
న్ననయంబున్ గలిగింపఁబోక సతము న్నత్యంతస్నేహంబు మా
కును ముస్లింలకుఁ గల్గఁజేసి భరతక్షోణీమతల్లిన్ దయన్
గనఁగాఁజేయుము దాస్యముక్తి నిఁక విక్రమాబ్దమా వేగమే.



# విశ్వదాత విశాలహృదయము

[ స్మృతికణము ]

● శ్రీ అయితం కాళీవరప్రసాదరాయకవి ●

సరగ నేకాదశాబ్దముల్ సాగెఁ గాని
నిన్న మొన్నటివలెఁ దోఁచి నేఁడు నిలుచు
సరళమై విశ్వదాతవిశాలగుణము
ప్రస్ఫుటంబుగ నాభావఫలకమందు.

షష్టిలోఁ బడినట్టి విశ్వంపుదాత
సద్గుణాకరుఁ డా॥ వి. యల్. శాస్త్రిగారు
నపుడె యిరువది దాఁటినయట్టి నేను
నర్థిఁ గూడితి మొక శరణాలయమున.

దశదిశాపాళినిఁ దన తేజు వెలిఁగించి యస్తమింపఁగ నుండె నబ్జసఖుఁడు;
డెంద మానందింప మందమందంబుగా సారెకు వీచె సమీరణుండు
కనులపండువుగాఁగ ఘ్రాణతర్పణముగాఁ దనరె మేమున్న సౌధంపుఁదోఁట
సహజసుధావచస్సరణితో నామెతఁ బ్రేమఁ జేయుచునుండె విశ్వదాత,

యప్పా డాసంస్థవారితో నైదుగురము
చేరి కూర్చుంటి మైదుకుర్చీలయందు
చిత్రపటమును దీసెడు చిత్రకారుఁ
డెదుట నిలిచె చిత్రముఁ దీయ నెదఁ దలంచి.

పటుతరమగు నుత్సుకమతి
నటు నిటు నడయాడి, మమ్ము నారసి, యంత్రం
బిటునటుఁ గదలిచి యర్ధం
బెటులగు నటు నిలిపి, యంత నిట్లనె నతఁడున్.

"నలువురు గూర్చుండినచో
నలువగుఁ జిత్రంబుఁ దీయ, నైదుగురైనన్
పొలుపుగఁ దీయ నశక్యము
కలరూ పెడఁగించితి" నన గ్రక్కున నేనున్

"వల దటులైన నే నిలుతుఁ బ్రాజ్ఞులు వీరలు వీరివెన్క ; నీ
వలసినభంగిఁ జిత్రమును బాగుగఁ దీయు" మటంటి, నింతలో
లలిత గభీర మేఘరవ లక్షణ లక్షిత వాక్కుతోడుతన్
వల దటు లంచుఁ దా నుడివె వైళమ పంద్యుఁడు విశ్వదాతయున్.



దేశోద్ధారకనామధామసితదిగ్దేశుండు నాగేశుఁ డా
వేశం బొప్పఁగ లేచి తత్క్షణమునన్ "ఏ లేమి లేకున్నచో
నాళల్ పీఠకు నిల్తు మందరము కామ్యం బెట్టు లాభంగి నీ
ధీశక్తిన్ పటమున్ రచింపు" మనియెన్ ధీరోక్తి జిన్మేఘుఁడై.

అతఁడు లేవఁగఁ జూచినంతనే యాచిత్రకారుండు మిగుల కంగారుపడియెఁ,
దలవనితలఁపుగఁ దతవృద్ధసింహంబు నిలుచుటఁజేసి నే నులికిపడితి,
మిగిలినముప్వురు మిక్కిలి దోఁపక తమలోన తాము నిస్తబ్ధు లైరి,
యితరజనంబు లీగతి నంతయును గాంచి స్థావరరూపచిత్రంబు లైరి,

గనుల నేఁటికిఁ గట్టినగతినిఁ దోఁచు
నాఁటి దృశ్యంబు నా కిట నేఁటివరకు,
భావనాబలాతీతంబు, వర్ణనావి
ధాన దుర్గమంబగు, దృశ్యమానవిధము.

బాలుఁ డప్రాజ్ఞుఁ డేలీల భావించునో యిటు నిల్చుచో నని యెంచికొనెనో?
నలుగురుఁగూర్చుండఁ దొలఁగి యొక్కఁడు నిల్వఁదగదని మదిలోనఁ దలఁచికొనెనో?
బాలుఁ డయ్యును గవిపండితుం డీతండు తగ దిది యన్న యౌదార్యమునో?
మాదృశుల్ నేఁటికి మహితసద్గుణములు దలఁచు ధన్యత నీయఁ దలఁపుఁగొనెనో?

మెఱుఁగ రా దా విశాలాత్మయే మెఱుంగు
నాఁటి తనచర్య కర్థంబు దేటపఱుప,
నట్టియాతఁడు గాకున్న నతనిపేరు
సకలభారతభూమిలోఁ బ్రకటమగునె?

"కూర్చుండుఁడు, కూర్చుండుఁడు
కూర్చుండుం డైదుగురును కొదవ లేకుండన్
నేర్చెదఁ దీయంగ" ననుచు
నార్చెను చిత్రంబుఁ దీయునాతం డపుడే.

అనునంతన్ దరహాసభాసురముఖుండై రాజరీవిన్ మహా
స్థను గూర్చుండెను నాసనంబునను, సంస్థఁ గల్గువా రెల్ల భ
క్తిని హర్షంబును జూపు కన్గవలతోఁ దెల్లంబుగాఁ జూడ, మే
మును గూర్చుంటిమి చెంతఁ, దీసెను పటంబున్ జిత్రకారుం డొగిన్.

స్థాలీపులాకభంగిని
గీలించితి నాఁటిచర్యఁ, గీర్తికరోద్య
చ్ఛీలిని దేశోద్ధారకుఁ
దేలే, మైనఁ దలఁతుము, సుధీనుతు నతనిన్.

ఆతని యున్నతహృదయం
బాతని నిర్దంభగుణము నాతని విలువన్
చేతోవీథిఁ నిలుపఁగ
నేతాదృశఘటన మొకటియే చాలుఁ గదా

ఎవ్వాని తతకీర్తి మవ్వంపువెన్నెల దశదిశాంతరవీథిఁ దాండవించు ?
నెవ్వాని దానంబు, లెనలేని శిబికర్ణ కరదానధారలఁ బరిహసించు ?
నెవ్వాని కరుణ మహేంద్రజటాజూట నిష్యంద మందాకినిం జయించు ?
నెవ్వాని భావంబు లిద్ధంబులై యఖిలార్యహృద్యాబ్జముల నధివసించు ?
నెవఁడు మఱచినఁ గూడ తా నెదను నిలుచు
నట్టి కీర్త్యవశేషితు, నఖిలసుగుణ
భూషితుఁ బుధభాషితుఁ బుణ్యచరితు
సద్గుణేశుని నాగేశు సంస్మరింతు.

తాతగారూ ! మీరు దాఁటిపోతిరి కాని దాఁటిపోదమ్యో మీ ధవళకీర్తి ;
కమనీయగుణ! నీవు కానంబడవుగాని కనఁబడు నీపత్రికాచయంబు ;
వ్యాపారవీర! నీ వస్తమించితి గాని యస్తమింపని దమృతాంజనంబు ;
దానరాధేయ! నీదాన మాఁగెనుగాని యాఁగ దర్థిహృదంతరాత్మభక్తి ;
చిత్ర మియ్యది నాగేశ! శ్రీనివాస!
దానరాధేయ! పండిత తండ గేయ!
దేశకల్యాణహితకార్య! ధీరవర్య!
సకలసద్గుణగణగణ్య! సాధుమాన్య!

# ఆంధ్రప్రబోధము

### శ్రీ అవధానము చంద్రశేఖరశర్మ

అన్యద్వేషము గాదు, కాదు విమతప్రాణాపహారంబు, దా
ర్జన్యప్రేరణ లేదు, ప్రోదువడు నాంధ్రప్రాభవం బాత్మచై
తన్యం బంది పునస్సమేధిత నిజోదారప్రతిష్ఠాక మై
ధన్యం బౌట కొనర్చు నిర్మలినయత్నం, బేల సందేహముల్ ?

సంకుచితాభిమాన మని చాటెదరంట స్వరాష్ట్రవాంఛకుఁ
వంకల నెన్ని కొంద!! అటువంటివి గావొకో దేశభక్తర
క్తాంకితముల్ స్వరాజ్యపుఁ బ్రయత్నము? లాంధ్రుల నోర్వలేని దు
శ్శంకల కేమిలే ప్రతివచస్తతి నేల కలంతఁ జెందఁగన్?

కలవు గంగా సింధుగర్వాపహములు గోదావరీతుంగాదిజీవనదులు
కలవు కమ్మపసిండికణికల పంట ముక్కారునుం బండు కేదారతతులు
కల దేడుకోట్లసంఖ్యకు మించు రాఁబడి సవరించు నార్థికసౌష్ఠవంబు
కలవు మద్రాసు విక్రమపురీ రాణ్మహేంద్రము లాది నగరరాజముల గుములు

  కలరు కోటిద్వయంబు నెక్కాలుపఁ జాలు
  నేకభాషానిబద్ధ ధరాకజనము
  లేది కొదువయ్యె నాంధ్రరాష్ట్రోదయమున,
  కాత్మ ధృతిఁ బూను మిఁక సోదరాంధ్రవీర!

పాతికవత్సరమ్ములకుఁ బైఁ బడియెన్ నిజరాష్ట్రవాంఛకుఁ
జేతము నొగ్గి; నేఁటికిని సీ! ఫలియింపదు నీదుకోర్కె; క
ట్టా! తమ మర్కునిం బొదివెనా? కకుబంతవిశాలవిశ్వవి
ఖ్యాతమహాంధ్రరాజ్యరమ కా తుది రాష్ట్రములేని దుర్గతుల్!!

  నీదు కత్తిపోటు, నీ స్వర్ణయుగమును,
  నీదు పౌరుషంబు, నీ ప్రతిష్ఠ
  తల్లికోటతోడ కొల్లవోయెనె? గ్రహ
  ణంబు తుదియె భానుబింబమునకు?

ఐదవవేద మాంధ్రావని నున్మిషత్తేజ మెల్లెడల సంధించుచుండ
కంచుఢక్కన్ బగిలించిన సార్వభౌముని జయధ్వని దెసల్ మ్రోయుచుండ
ఆముక్తమాల్యద నాంధ్రవిష్ణుని వక్ష మమృతాంశువుల నోలలాడుచుండ
బాలచంద్రుని యశశ్శ్రీలఁ బల్నాటిశౌర్యామరప్రభలు నిండారుచుండ

దశదిశాభాగనిబిడ నిత్యప్రపూర్ణ
నిరుపమాంధ్రోజ్జ్వలయశోఘృణిప్రకాశ
మారిపోవునె? దావాగ్ని కకట చెదలు
వాఱునే? తేరు మాంధ్రకిశోరవీర!

మన్నన్ మిన్నను మాఱుమ్రోఁగినది నీ మధ్యాహ్న సూర్యప్రభా
స్వన్నిత్యాసదృశ ప్రతాపవిజయ ధ్యానంబు నాఁ; డాకథల్
విన్నన్ గుండెలు జల్దరించు నసుహృద్వీరాళికిన్ నేఁటి; కో
యన్నా! కేసరిబిడ్డ వీ; వెలుఁగ వాత్మానూన తేజోద్యుతుల్.

చెదరిపోలేదు తీర్చిన జీవకళ లజంతాగహ్వరములఁ జిత్తరువుమురువు
గోరిలఁ బండ దెల్లోరాగుహాంగణ ప్రథితకైలాస శిల్పప్రశస్తి
ఉఁడఁదగుల్కాన వోడల్ గరుపార్చు వీరబొబ్బిలిఁ బాడు జంగమయ్యలకు మెడలు
బూదిగాలేదు సంపూర్ణత్రయీభాష్యఫణితి విద్యారణ్యపాదరచన

తుడువ రాంధ్రనృపాల నిస్తులయశంబు
పసిఁడి వ్రాఁతలఁ జరితప్రబంధకర్త
లేల జీవన్మృతుఁడుపోలె నింట నిదుర
నంది, చలియింప వెద సోదరాంధ్రవీర?

నిన్నన్ మొన్న మహాప్రయత్నమున నున్నిద్రాత్ములై రాష్ట్రమున్
గన్నా రాంధ్రులు స్వప్రతిష్ఠ మిను వ్రాఁకన్; రాష్ట్రసంసిద్ధికిన్
కన్నుల్ విప్పవు; దుర్భరావమతి శగ్గంబయ్యె నాంధ్రత్వ; మిం
కెన్నాళుల్ సయిరింతు వన్యహ్రుత మోయీ! యాత్మసౌభాగ్యమున్?

తెలుఁగుపల్కులకమ్మఁదేనెసోనలు విషప్రాయంబులై చేఁదువాఱునాఁడు
తెలుఁగుకబ్బములఁ జిందిన సుధావాహిని నిప్పుటేటై చేరఁ దప్పునాఁడు
తెలుఁగుపండితుల నిర్మలినగౌరవము చెల్లనిగవ్వయై లెక్కఁగననినాఁడు
తెలుఁగునాటికి యశస్తిలకంబు మసనంపుబూదియై సుడిసిసొంపేదునాఁడు

పనికిరానట్టి యాంధ్రుల పౌరుషంబు
కలుగనేమి? విలీనమై కాడువాఱె
కాలిపోనేమి? లెమ్ము సింగమ్ముపోలె
రాష్ట్ర సంసిద్ధికై సోదరా! కడంగి.

సర్వప్రాభవపూర్ణమై ద్వీపదధృష్యప్రక్రమం బౌ భవ
త్పూర్వోన్నత్యము నెంచి, కాలగతి సొంపుల్ బెంపులున్ మాసి ని
ర్వీర్యంబై కొఱమాలు నేఁటిదశనున్ వీక్షింపు; మెట్టుల్ మన
స్థైర్యం బందెదవో తిరోహితనిజౌజస్తృష్ణ నిర్భాగ్యుఁడా !

కాడువాఱియు జీవకళలీను విద్యానగరజీర్ణదృశ్యముల్ కనులఁగాంచి
బండబండల నాంధ్రఘటిమఁ జాటెడు నోరుగలుకోటశిథిల భాగాల నరసి
చెదలుపుర్వులు మేసి చెడిన తంజాపురీభాండారమునఁ దెల్గుప్రతిభ నెంచి
వీరరక్తప్లవోదార ఘోరంబుగాఁ గూలు బొబ్బిలిమట్టికోటఁ జూచి

యూరకుందువె ? చచ్చెనే పౌరుషంబు ?
వేఁడిరక్తంబు తనువున మ్రోఁడువాఱె
చల్లనయ్యెనె ? నైజతేజఃప్రభావ
మరయలేని యభాగ్యత నెఱుఁగు మాంధ్ర !

త్రిజగత్పూజ్యము ప్రాక్చరిత్రము, రస శ్రీపెన్నిధానం బమ
ర్త్యజనప్రార్థ్యము వాఙ్మయం, బసుపణప్రఖ్యాతమై జాతి క
గ్రజహా త్యాగముఁ గల్గినన్ దుది కనైక్యం, బాత్మమాంద్యంబు, ది
గ్విజయస్ఫూర్తికి రాష్ట్రసిద్ధికిని బాపెన్ నేటి కాంధ్రావళిన్.

వెలినుంతురే యాంధ్ర విశ్వవిద్యాలయమునకు సాటితెనుంగుముత్తియముల ?
దూరీకరింతురే తుంగభద్రకుఁగట్టు ననకట్ట నొకటఁ గల్పాంతమునకు?
చేరనీయరె తోఁడిసీమనాయకుల నొక్కరినైన మంత్రివర్గప్రశస్తి?
కడకుఁద్రోతురె పత్రికా ప్రకటనములందును సరివారి కుందనపువ్రాఁత?

ఆంధ్రు లాంధ్రులనే యిట్టు లవమతింప
నొరులు గౌరవ ముంతురే? యుత్తమైక
మత్య మెడలిన జాతి కాత్మప్రవృద్ధి
క్రుంగదే ? యింకనైన నెఱుంగు మాంధ్ర !

రాయలసీమపై నొక నిరాదరణంబు ఘటించె నంచుఁ గ్రో
ధాయతి నైకమత్యమున కందక నైజయశఃఖలీకృతిన్
జేయుడి యాంధ్రమాతహృదిఁ జీలుపఁ బూనుదురయ్య ? యాత్మ హా
త్యాయుతి మెత్తురే ? కలియ నాడరె రాయలసీమసజ్జనుల్?

కారో నందను లాంధ్రమాతయొడికిన్, గారో స్వరాష్ట్రప్రియుల్,
గారో జాతివికాసవైభవము లాకాంక్షించువా, రింతకున్
దా రేలా తమలో విభేదములఁ దద్దన్ బెద్దఁ గావించి చే
యారన్ రాయలసీమసజ్జనులు గోయం జూతు రాంధ్రోన్నతిన్.

ఇరువదినాల్గు మండలుల నెంతయు రాయలసీమ పోరుటే
యురవా? స్వజాతి సోదరుల నొప్పు చతుర్దశమండలిన్ స్వస
త్వర పరివృద్ధికై పెనఁగుదారియె మేలా? తలంచిచూడుఁ డె
వ్వరి కయినన్ స్వరాష్ట్రము స్వవైభవమున్ విసమే వసుంధరన్ ;

తలఁపంబూనకుఁ డింకనైనను గతాంతర్ద్వేష ; మన్యోన్య ని
శ్చల సౌభ్రాత్రము నూనుఁ ; డావల మహారాజఃపూర్ణమా నాంధ్రపు
త్త్రుల యేకోన్ముఖరాష్ట్రవాంఛ నెటు సంరోధించి పోఁద్రోయఁగాఁ
గలదో భారతకార్యదర్శికి? నెఱుంగన్ వచ్చు దుస్తంత్రముల్.

రాజసూయమహాధ్వరమున ధర్మజుసభ రతనాలకాన్క గారవము నెఱపి
మౌర్యరాజన్యసంభ్రాంత సెల్యూకసుమకుటాగ్రమణుల నిచ్చకములాడి
సార్వభౌమాశోకసత్త్వసమ్మిళితరాజసతేజమునఁ బ్రేమసార మెఱిఁగి
గౌతమీపుత్త్రవిఖ్యాత ప్రతాపశంఖానఁ గర్ణాట నిస్వాన మూఁది

విశ్వమయమూర్తియై తాండవించె నేది
యార్పరాని పరంజ్యోతి యాంధ్రతేజ
మదియె ప్రతిఘటన ప్రచండానిలమున
రేగి విలయోగ్రమై యెదిరించు నెవఁడు?

దేశప్రాభవమూర్తులై తనరు జాతీయోద్యమాధార సం
దేశప్రాజ్ఞులు నాయకుల్ జయము సంధింపన్ "జిరం జీవ" యం
చాశీర్వాద మొనర్చి రాంధ్రకృతి; సిద్ధార్థంబు రాష్ట్రోద్యమం
బాశాసీమల నింపుఁ డాంధ్రులు జయోద్యత్సింహనాదంబులన్.

జాతీయోద్యమ దేవదత్తవిజయస్వానావళుల్ రాష్ట్రసం
ప్రీతాంధ్రోజ్జ్వలపాంచజన్యనినదస్ఫీతిన్ స్వరాజ్యోదయ
శ్రీతేజంబు దిగంతవీథికలఁ బర్వించున్ సమస్తాహిత
వ్రాతంబుల్ బెగడంద భారతజయస్వాతంత్ర్య ముప్పొంగఁగన్.

ఆంధ్రతేజంబు రోదోంతరాళమునఁ బ్రగుంకనిభాస్కరుం డయి క్రాలుఁగాక
ఆంధ్రవాఙ్మయవినిర్యద్రసాప్లుతి సుధీభూతమై విశ్వంబు పొలుచుఁగాక
ఆంధ్రయశంబు దిగంతసీమముల నిండిన వెలపంటఁ బండించుఁగాక
ఆంధ్రపతాక మనంతపథంబున ధ్రువతారయై తేజు మివులుఁగాక

కూడనిజనంబుకనుదోయి గోరగింప
రాష్ట్రఫలసిద్ధ మాంధ్రసామ్రాజ్య మాది
వాకరసుధాకరంబుగా నలరుఁగాక
యాంధ్రమాత సుఖాబ్ధి నోలాడుఁగాక.

# INDIAN MUTUAL LIFE ASSOCIATION, Ltd.

# ఇండియన్ మ్యూచుయల్ లైఫ్ అసోసియేషన్ లిమిటెడ్.

రక్షణ




ఇండియన్ మ్యూచుయల్ భవనము

## బోనసు

రూ **15/-:** రూ **1,000** ఎన్‌డౌమెంటుకు

రూ **18/-:** రూ **1,000** జీవితభీమాకు

●

వివిధరకముల అవసరములకు అనుకూలించు

**భీమాసౌకర్యములను**

మేము చేకూర్చుదుము.

## సేవ

పూర్తి వివరములకు దయచేసి ఈదిగువ విలాసమునకు వ్రాయుడు :—

హెడ్ ఆఫీసు :

ఇండియన్ మ్యూచుయల్ బిల్డింగ్సు,
10, మౌంటు రోడ్డు,
మద్రాసు.

★

కార్యదర్శి,
బెజవాడ బ్రాంచి,
గాంధినగరు - - బెజవాడ.



కాంగ్రెసు అధ్యక్షుడు : మౌలానా అబుల్‌కలాం ఆజద్



రామఘురులో వర్కింగుకమిటీ సమావేశమైన పర్ణకుటి



సాహిత్యమును వెనుకకునెట్టి
నూతనసృష్టి చేసిన
త్యాగయ్య గానప్రతిభ

★

# త్యాగరాజయ్య సాహిత్యము

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

★

అనితరసాధారణమైన కావ్యకళను త్యాగయ్య అబ్బురముగాఅబ్బించుకొన్నాడు.

★

త్యాగయ్యగారిసాహిత్యము ఆయనసంగీతమువలె విశాలము, వివిధము, ఉన్నతము, అపూర్వము నైన కళ. సరస్వతితల్లి యిరుప్రక్కల చనుబాలను ఇంతసమానముగా కడుపునిండ త్రాగి పెరిగిన బిడ్డడు—తెలుగువారిలోనే కాదు—నే నెఱిగినంతవఱకు ఎక్కడను ఇంకొక్కడు లేడు. ఇతని సమకాలికులై కర్ణాటకసంగీతరత్నములు అనదగిన ముత్తుస్వామిదీక్షితులు, శ్యామాశాస్త్రిలు, కులశేఖరమహారాజు—వీరిలో నే యెవరికిని కావ్యకళ ఇంత చక్కనిది, ఇంత తేజోవంతమైనది అబ్బలేదు. దీక్షితుల భాష మంత్రతంత్రపరిభాషలతో సంగీతపునాలుకకు సామాన్యముగా మెదగని సమాసములతో, శబ్దములతో ముక్తాయమయినది. శ్యామాశాస్త్రిల భావప్రవాహము కామాక్షమ్మను తలచుకొని 'అమ్మా! నను బ్రోవవే' యని వాయివిడిచి వేడుటతో పరవశమై స్తంభించుచున్నది. కులశేఖరుల సంస్కృతరచన ముద్దులమూటయైనను వట్టి మూర్తివర్ణనముతో మొదలై 'మాం పాహి'తో ముగియునేకాని తీవ్రభావముల లోతుకు దిగలేదు. ఇట్లగుటకు కారణము పై ముగ్గురిది హృదయమందు వేదనగాని, ఆందోళనగాని లేని యుపాసన. ముగ్గురును పరమభక్తులే; కావ్యాపేక్షము కలవారే. కాని తాము భజించు దేవత తమ్ముతప్పక కాపాడి మోక్ష మిచ్చునను గట్టినమ్మికతో సంప్రదాయముప్రకారము ఉపాసన చేసినవారు. కనుక వారికి ముక్తి లభించియుండవచ్చును గాని మనకు వారివలన కావ్యకళ లభింపలేదు.

త్యాగయ్యభక్తిజీవిత మట్టిది కాదు. చిన్నతనమున నుండియు నానాదేవతోపాసనకు వాడుకపడియున్నను, వేదశాస్త్రపురాణములందు విధింపబడిన నిత్యనైమిత్తిక కర్మములు చేయు సంప్రదాయమునకు లోగియున్నను, అవన్నియు 'కల్ల' లని వదలి శ్రీరామమూర్తిని 'వాడేరా

దైవ'మని నమ్మి 'నీవేరా కులధనము సంతతము నీవేరా జీవనము' అని శరణుఁజొచ్చినవాఁడు. అతని ఆశ అపారమైనది. నిరాశ యగునేమో యను ఆందోళన అంతులేనిది. శ్రీరాముని ఈ జన్మమందే, ఈ తోలుకన్నులతోనే దర్శించితీరవలయు నని పట్టుపట్టిన వాఁడు. అందుకని జపములుచేసి, ప్రార్థించి, పూజించి, నిందించి, తన్ను నిందించుకొని, వేసట పడి, విసుగుకొని, ఏడ్చి, తప్పాయె నని క్షమాపణ వేఁడుకొని, ఎన్నోతంటాలు పడినాఁడు. తన కోర్కె ఫలింపకపోయినప్పుడు తన కీమార్గ ముపదేశించిన 'పెద్దలమాటలు నేఁ డబద్ధమాయెనో!' యని భయపడినాఁడు. వైదికమార్గనిష్ఠులగు స్మార్తబ్రాహ్మణుల కులమందు పుట్టి ఆసంఘమందే పెరిఁగియున్నను 'వేదశాస్త్రపురాణవిద్యలచే భేదవాదములు తీరక' వా రందఱును 'భ్రమసేవా' రనియు, 'యజ్ఞాదులు సుఖమనువారు' 'అజ్ఞాను'లనియు, 'ఆసురచిత్తు'లనియు ఎదురుతిరిగి తిరస్కరించి తిట్టినవాఁడు. మనము కల్ల అనుకొన్నను, కలవరింపు అనుకొన్నను, భ్రాంతి అను కొన్నను సరే, అతఁడు శ్రీరామచంద్రమూర్తిని పలుమా ఱీజన్మమందే తాను దర్శించినట్లు అనుభవించి, అతనితో సాక్షాత్తుగా ఆడి పాడి వేఁడి ఆనందలీనుఁడైనవాఁడు. ఇతరులు భుక్తి, ముక్తి రెండును గావలెనని కోరఁగా, అతఁడు 'రామా! నీభక్తి నాకు భోగానుభవంబులందు బాగుగ బుద్ధి నీయదు' అని విరక్తికి పరవశుఁడైనవాఁడు. కావుననే దొరలను, వా రిచ్చు గౌరవములను మన్నింపక తిరస్కరించి తిరిగిన పరమస్వతంత్రుఁడు. కాఁబట్టి త్యాగయ్యభక్తి వట్టి దృఢమైన మూగనమ్మిక, జడశ్రద్ధ కాదు; నిమిషమైనను ఊరకుండనీయక దేహమనస్సుల ప్రతినాడిని కదలించి మీఁటి ఊఁగించి ఆడించునట్టి అమేయమైన విద్యుచ్ఛక్తి. అది ఆడించిన ఆట లలో మన పాలికి ముఖ్యమైనవి అతనిపాటలు.

> శాస్త్రచోదితములైన నిత్యనైమిత్తిక కర్మములు 'కల్ల' లని వానిని వదలివేసిన పరమ భాగవతోత్తముఁడు.

కాఁబట్టి త్యాగయ్యకృతులలో ఒకదానివలె మఱొక్కటి యుండదు. క్రొత్తభావమో, క్రొత్తనుడికారమో తప్పక యుండును. మనఃపూర్వకముగా తీవ్రముగా వెడలని భావ మేదియు కానరాదు. మఱియు మనస్సులో పుట్టిన భావము కావ్యరూపముగా బైలుపడు వేగమునకు అడ్డ పడున దేదియు నుండదు.

కాని ఒకటి తప్ప: ఏదనఁగా అతని గేయరచన. మాటలలో ఎంత ఎంత క్రొత్త దనము, వేగము, అందము కలదో అంతకన్న ఎక్కువగ వానిని పాటలందు చూపఁగల అపూర్వ గేయకల్పనాశక్తి అతనిది. ఒక శంకరాభరణరాగమందు ముప్పదివర్ణమెట్టుల నెత్తి, అన్నిటిని అన్నిముఖములుగా ఆద్యంతము నిర్వహింపఁగల అసాధారణప్రతిభ అతనిసొమ్ము. ఇతరు లెత్తిన మెట్లకు తన మాటలను జోడించు దేబతనము నతఁ డెప్పుడును చేసినట్లు కానరాదు. కాఁబట్టి మనసులో మాట తోఁచినవెంటనే దాని నేదైన క్రొత్త నడక గల పాటగానే కూర్పవలయు నను ఉత్సాహము అతనికి ఉగ్గుపాలతో వచ్చినది. ఇట్లై మాట పాటకు లోఁగినిలుచును. ఎన్నియో పాటలలో అతని మాటలు స్వేచ్ఛాప్రచారములు లేక మంత్రమునకు కట్టుపడిన నాగుఁబాము వలె ఎగరోజుచు అణఁగియుండును.

> గేయకల్పనలో అపూర్వశక్తి, అసాధారణ ప్రతిభలు గల ధీశాలి.

ఇట్లగుటకు కారణము త్యాగయ్యకుఁ గల అపారమైన గానవిద్యాపాండిత్యమే. నాకుఁ జూడఁగా పాటను నేర్చినంత శ్రద్ధతో అతఁడు మాటను నేర్వలేదు. మాటయం దతనిది ఇంచుమించు పోతన్నవంటి సహజపాండిత్యము. పాటలో నట్లు గాదు. సుప్రసిద్ధులగు సొంటి వారి యింటి శిష్యుఁడు. మీఁదుమిక్కిలి నారదమహర్షి యనుగ్రహమునకు పాత్రుఁడు. 'రజతగిరీశుఁడు నగజకుఁ దెల్పు స్వరార్ణవ మర్మములు విజయముగల త్యాగరాజు కెఱుకే'

అను గొప్ప ఆత్మప్రత్యయము గల క్రొవ్విన పండితుఁడు. కనుకనే అతని సాహిత్యము మూఁడుపాళ్లు సంగీతము నాశ్రయించి ఆకుమఱుఁగుపిందెవలె నున్నది. సంగీతభావముముందఱ సాహిత్యభావము గౌణముగానే నడచును. ఉదాహరణముగా అతని పంచరత్నములలో ఒక రత్నమగు 'సాధించెనే ఓ మనసా' అను ఆరభి పాటను గ్రహింపవచ్చును. 'శ్రీరాముఁడు తుట్టతుదకు తన్ను మోసగించెనే!' అని ఇందులో త్యాగయ్య అంగలార్చుచున్నాఁడు. శ్రీరాముఁడు 'సమయానికి తగుమాట లాడెనే; నే నిచ్చిన పూజ లన్ని కైకొననే; అలుగవద్దనెనే; విముఖులతో చేరఁబోకనెనే; వెత కల్గిన తాళుకొమ్మనెనే; ఇట్లాడినమాట లన్ని బొంకుచేసి తుదకు చెంత రాకనే తాఁ బట్టినపట్టు సాధించెనే!' యని—యిం కెవరితో చెప్పుకొనఁగలఁడు ?—తన మనస్సుతో త్యాగయ్య మొఱపెట్టుచున్న పాట యిది. ఈ భావమును, భాషను అడఁచిపట్టుకొన్న రాగము ఆరభి. అది ఉత్సాహప్రధానమగు ఘనరాగము. స్వరములనడక జంటలుజంటలుగా పందెపుగుఱ్ఱపునడకవలె, నాభినాదముతో గంభీరముగా, ధైర్యముగా, నిర్లక్ష్యముగా జరుగవలసియుండును. కాఁబట్టి విలంబకాలముకంటె మధ్యమ ద్రుతకాలములు ఈరాగస్వరూపమున కెక్కువ చేరికగలవి. ఈరాగమం దీపాటను పాడుచు పై నిరాశభావమును, దైన్యమును స్ఫురించునట్లు చేయుట నాకుఁ జూడఁగా అసాధ్యము. ఆరభిరాగమును లయమును బిగువుచెడును. కీర్తిశేషురాలగు వీణధనము దీనిని మార్దవప్రధానముగా పాడినప్పుడు విన్నవారి కిదే భావము కలిగినది.

అతఁడు పాటను నేర్చినంతశ్రద్ధతో మాటను నేర్వలేదు. సంగీతభావము ముందఱ సాహిత్యభావము గౌణముగానే నడచును.

త్యాగయ్యగారి గానప్రతిభ మఱియొక నూతనసృష్టి చేసి సాహిత్యమును వెనుకకు త్రోసినది. పల్లవి విస్తరింపులను శిష్యులు చిన్ననాఁటినుండి నేర్వవలయునను ఉద్దేశముతోఁ గాఁబోలును, త్యాగయ్య తనపాటలకు వీలున్నచోట్లనెల్ల కొన్ని సంగతుల నేర్పఱచి అవి తప్పక పాడవలయునని కట్టుపాటు చేసినాఁడు. ఈపద్ధతి అదివఱకు లేనిది. ఆసంగతులన్నియు రాగతాళభావములఁ జూపుట కెంతో అనుకూలముగా నున్నను సాహిత్యభావములతో ఏకీభవించుట కష్టము. తన ప్రియదైవము శ్రీరాముని అపూర్వమధురముగా

'నా జీవాధారా, నా నోముఫలమా
రాజీవలోచనా, రాజరాజశిరోమణీ
నాచూపుప్రకాశమా, నానాసికాపరిమళమా
నాజపవర్ణరూపమా, నామపూజాసుమమా త్యాగరాజనుతా'

అని మహాప్రేమతో సంబోధించుకృతికి త్యాగయ్య బిలహరిరాగములో ఏర్పఱచిన మెట్టును సంగతులన్నియు వేసి సంప్రదాయముగా పాడఁబోయినప్పుడు అక్షరములన్నియు తనుకులాడి ఎక్కడనో ఆవిరియై అంతర్ధానమగును! సంగీతమం దున్నంత పాండిత్యము లేకున్నను ఇదే చిత్తవృత్తి అతని కొన్ని సాహిత్యకల్పనలందును చూడవచ్చును. అష్టప్రాసములను నిర్వహించుచు అతఁడు రచించిన కొన్ని కీర్తనముల భాష భావశూన్యమై రాగలయములనుగూడ త్రోసి నడచును. 'తరాన దొరకని పరాకు నా యెడను రామ చేసితే సురాసురులు మెత్తురా యిపుడు ఈ హరామితన మేలరా భక్తత్యాగరాజనుత' ఇత్యాదు లుదాహరింపవచ్చును. సాహిత్యపాండిత్యము దుర్బలము కావుననే ఇట్టిచిత్రరచనల కతఁ డెక్కువగా చేయి వేయలేదు.

సాహిత్యమును వెనుకకు నెట్టి నూతనసృష్టిచేసిన త్యాగయ్య గాన ప్రతిభ.

అనఁగా త్యాగయ్యకృతు లన్నియు నిట్లున్నవని కాదు. ఆయనసృష్టిలో అట్లు జరుగుట అసాధ్యము. అతనిది చాల సుకుమారచిత్తము. నిర్మాణశక్తి మెఱుపువలె మెఱయునట్టిది. భావ

ములు తేజోమయములై అడఁచినను అడఁగనివి. కాఁబట్టి అతఁడు వట్టి పాండిత్యపుపొగరుతో తృప్తిపడఁజాలఁడు. చాలలోఁతుకు దిగిచూచు ఆధ్యాత్మికదృష్టి గలవాఁడు కావున పైదంభము లతనికి చాలవు. మఱియు సంగీత సాహిత్యములు రెంటిని అనుభవించి ఆనందించుశక్తియు, నిర్మించు శక్తియు కలవాఁడు కావున, అతని రచనలలో కొన్నిటియందు ఒకదాని కొకటి అడఁగియున్నను, అనేకకృతులలో రెండును చేయిచేయి పట్టుకొని అపూర్వసౌహార్దముతో ఏకాగ్రముగా రూపు గొన్న అద్భుతదృశ్యమును మనకు త్యాగయ్య ఎత్తిచూపఁగలిగినాఁడు. 'పలుకుపలుకులకు తేనె లొలుకు' కృతులు అతని వెన్నో కలవు. ఆ తేనెలు మాటలవో, పాటలవో చెప్పలేము. ఎందుకనఁగా అవి రెండును మేళగించి దింపిన రసాయనములు. 'దొరకునా ఇటువంటిసేవ', 'పక్కల నిలఁబడి', 'నీదయచే రామ' మొదలగు ఎన్నో కృతుల ధాతుమాతుమాధుర్యమును, భావగాంభీర్యమును ఎవరు వర్ణింపఁగలరు ?

★

వట్టిపాండిత్యపు పొగరుతో అతఁడు తృప్తిపడలేఁడు. అతనికి చాల లోఁతుకు దిగిచూచు ఆధ్యాత్మికదృష్టి గలదు.

★

కాని మొత్తముమీఁద త్యాగయ్య 'నాదవిద్యామర్మములను' గమనించినంత మెలఁకువతో శబ్దరచనారహస్యములను గమనింపలేదనుట మనము కనుఁగొనఁగలము. భావముల గొప్పతనమునకు సరిరాలేక ఎన్నోచోట్ల అతనిభాష తంటాలు పడుచున్నది. వ్యావహారిక రూపములను ఉదాసీనముతో దూర్చినాఁడేకాని అందుఁగూడ క్షేత్రయ్యవలె నయము నాజూకును తలపెట్టలేదు. సంగీతసాహిత్యములు రెంటికిని సమానగౌరవముగల రచన దైవశక్తితో రావలసినదేకాని దానికై ప్రయాసపడి ఫలములేదని త్యాగయ్యకుఁగూడ అర్థమాయెనేమో! భావము తోఁచి, మెట్టు స్ఫురించినప్పుడు దానికి తగిన భాష ధారాకారముగా రాదేని అది దాని తప్పేకాని నాదికాదను ఉదాసీనము అతని కుండెనని అనేకకృతులు చాటుచున్నవి. పాటలు రచించువారి కందఱికిని ఇది తెగని చిక్కు. తెలుఁగుపదకవులలో ఈచిక్కును కొన్నిచోట్లనైన తెంచుకొనఁ గల్గిన మహానుభావుఁడు ఒక్క త్యాగరాజే.

★

కాని, త్యాగయ్య మొత్తము మీఁద నాదవిద్యామర్మములను గమనించినంత మెలఁకువతో శబ్దరచనారహస్యములను గమనింపలేదు.

★

ఇట్లు సాహిత్యమును అరగంటితో చూచు చిత్తవృత్తి త్యాగయ్యగారియందే బీజరూపముగా నుండి, గురుభక్తికి పేరుపోయిన అతని శిష్య ప్రశిష్యపరంపరలో మొలచి పెరిఁగి పెద్దదైనది. ఆయనసంగీతమును పదిలపఱచుటకు భగీరథప్రయత్నము చేసినవారు, చేయుచున్నవారు ఎందఱో కలరు. కాని ఆసాహిత్యము స్ఫురించునట్లు పాడఁగలవారుకాని, దానిని భాషాదృష్టితో కాపాడినవారుగాని అరుదు. ఒకటికన్న ఎక్కువచరణములుగల అతనికృతి యేది పాడినను, ఎవరు పాడినను, రెండవచరణమైనను తాఁకఁగోరు పుణ్యాత్ములు నేఁటిగాయకులలో అపురూపమైనారు. చాలమందికి వేఱుచరణములు కల వనికూడ తెలియదు. డెబ్బదియేండ్ల గొప్ప విద్వాంసుఁ డొకఁడు, సంస్కృత సాహిత్యమును చక్కఁగా చదివినవాఁడు 'సాధించెనే' అను కీర్తనము 'సమయానికి తగుమాటలాడెనే' అనుపాదముతోనే ముగిసినదని, మొన్న నేను చెప్పవఱకును భావించియుండెను! నిజముగా ఆపాటలోని జీవమంతయు తరువాతిపంక్తులలోనే యున్నది. కాని ఆరభిరాగము నేర్చుటకై పడిన శ్రమమంతయు సార్థకపఱచి, పల్లవి ప్రస్తారము చేసి, స్వరరచనలతో పందిలిగట్టుటకు 'సమయానికి' అను ఆవర్తము మిక్కిలి తగియున్నది. ఆపని చేయుటతో పాటకునికిని, వినువారికిని తృప్తియగును. ఇఁక తక్కిన సాహిత్యభాగ మెవరికిఁ గావలయును? మఱియు పాడినంతలోనైనను శబ్దార్థములను గమనించు గాయకుఁడు దొరకుట నేఁటి మన గొప్ప భాగ్యఫలము. ఇది ఒక త్యాగయ్య తెలుఁగుకీర్తనలకే కాక సామాన్యముగా

అన్నిభాషల పాటలకును అంటిన చీడ. శ్రుతి తాళ లయములను చక్కఁగా నిర్వహించు ప్రయత్నములో నమలి మ్రింగవలసినది ఏశబ్దమైన నేమి, ఏయర్థమైన నేమి?

త్యాగయ్య తెలుఁగు సాహిత్యమునకు పట్టిన దురవస్థ.

సామాన్యముగ సంగీతవిద్వాంసులు నేఁడు సాహిత్యపరిశ్రమగాని, సంస్కారముగాని లేనివా రగుటచేత, సంగీతవిద్య ఇన్నాళ్లవలెఁగాక ఇప్పుడు సాహిత్యపుసంకెళ్లకు లోఁబడక స్వతంత్రముగా నిలుచుటకు ప్రయత్నించుచుండుటచేత, త్యాగయ్య తెలుఁగుదేశములో పుట్టి పెరుఁగకపోవుటచేత, అతనిశిష్యు లందఱును అఱవవారే యగుటచేత, తెలుఁగుదేశమునందు కర్ణాటకసంగీతమునకు వ్యాప్తి రానురాను క్షీణించుచుండుటచేత, ఉన్న కొందఱు తెలుఁగు గానవిద్వాంసులు తెలుఁగుపాటలు పాడినను అఱవవారిపద్ధతులే వారికి చాలవఱకు ఆదర్శముగా నుండుటచేత—త్యాగయ్యతెలుఁగుసాహిత్యము ఈయవస్థకు వచ్చినది.

ఇది అఱవవారి దూషణ కాదు. త్యాగయ్యపై నిజమైన భక్తిగల యెవ్వరైనను అఱవ దేశపు గాయకులను, రసికులను కృతజ్ఞతతో నమస్కరింపకతీరదు. నాఁటికిని నేఁటికిని త్యాగరాజకీర్తనలు వారు పెట్టవలసిన బిచ్చమే. త్యాగయ్య, క్షేత్రయ్య మొదలగువారి రచనల ననుభవించుకొఱకు ఎందఱో ద్రావిడులు తెలుఁగుభాష సలక్షణముగా నేర్చుకొన్నారు. వారి రచనలను వేదములవలె భక్తితో కాపాడినారు. అవేమాదిరిగా తెలుఁగులో ఎందఱో కృతులు రచింపఁ బ్రయత్నించినారు. వానిని అర్థతాత్పర్యములతో తెలుఁగులోను, అఱవములోను ప్రకటించినారు; ప్రకటించుచున్నారు. కాని యెంత భక్తిశ్రద్ధలతో నేర్చినను తెలుఁగు వారికి స్వభాష కాదు కావున వారికి పొరఁబాట్లు తప్పవు. తక్కినవారిమాట అట్లుండ నిండు: మహాప్రతిభగల పండితుఁడు కీర్తిశేషుఁడగు సి. ఆర్. శ్రీనివాసయ్యంగార్లవంటివాఁడే ప్రచురించిన త్యాగయ్యకీర్తనములందు, తెలుఁగురచనయందలి జీవగఱ్ఱలవంటి యతిప్రాసములను గమనింపక వర్ణమెట్లలో పదవిన్యాసము చేసెను. సాహిత్యపునడక స్పష్టముగా చతురశ్రగతిలో నుండఁగా 'సిగ్గుమాలి నావలె ధర నెవరు తిరుగఁజాలరయ్య' అను కీర్తనను మిశ్రచాపుతాళమున కమర్చి అవకతవకగా ప్రచురించిరి. ఇఁక కే. వి. శ్రీనివాసయ్యంగార్యులు తెలుఁగు వ్యాకరణ మందలి జడశ్రద్ధచే త్యాగయ్యరచనలను నానాముఖముగా తిద్దిపెట్టిన త్రిప్పటలకు తుది మొదలు లేదు. ఇది సహజము. తెలుఁగువారు అఱవసాహిత్యమునకు చేయివేసినచో ఇంతకంటె మేలుగ పనిచేయఁగలరని నమ్ముట కవకాశములేదు. మనము బుద్ధిమంతులమై ఊరకున్నాము గనుక బ్రతికినాము!

తెలుఁగువారికి మిగిలిన కర్తవ్యము.

కాఁబట్టి ఇదివఱకును తమిళులు చేసిన ఉపకారమునకు వారికి కృతజ్ఞులై, ఇప్పటికైన తెలుఁగువారు తెలుఁగుదృష్టితో త్యాగయ్యసాహిత్యమును సమకూర్చి శోధించిపెట్టుకొని దేశములో వ్యాప్తికి తేవలసియున్నారు. ఇప్పుడు స్వభాషాభిమానము అనుపేరితో పరభాషాతిరస్కారము చీడపురుగువలె అన్ని దేశములందును వ్యాపించుచు భారతీయవిజ్ఞానమును తునకలు తునకలుగా చేయుచున్నది. తెలుఁగుకీర్తనలు పాడఁగూడ దనుభావము అఱవదేశములో అం దందు తలచూపుచున్నది. అది ముదురుటకుముందే ఆంధ్రులు మేలుకొనుట మేలు.

[మద్రాసు రేడియోప్రసంగము నాశ్రయించి పెంచి వ్రాసిన వ్రాఁత]

మన బందరు పట్టణమునకు ఈ పేరు వచ్చుటకు కారణ మేమి ?

# మచిలీబందరు

మ్లేచ్ఛ సంపర్కముతో నిమిత్తములేక వైయాసికప్రామాణ్యమే దీనిని స్థాపించుచున్నది.

## శ్రీ వంగోలు వెంకటరంగయ్య

మచిలీ (మఛిలీ) మత్స్యశబ్దభవముగ నున్నది. బందరు (బందర్) రేవు అను నర్థముగల పార్సీ పదముగ నున్నది. ఈ సాంస్కృతిక, అన్యదేశీయశబ్దసంయోగ మెట్లు కలిగినదియో, యేకాలమున కలిగినదియో నిర్ణయింప వలనుగాకున్నది. దేశచరిత్రము నవలంబించిన నిచట ఓడరేవు అరబ్బీలచేత క్రీ. శ. పదునైదవ శతాబ్దమున స్థాపింపబడిన దనియు, ఎవరో కర్నాటకరాజులు ఇచట నొక మసీదుకట్టుకొనుటకు మహమ్మదీయులకు క్రీ. శ. 1425 ప్రాంతముల నుత్తరు విచ్చినట్లును తెలియుచున్నది (కృష్ణాడిస్ట్రిక్టుమాన్యుయలును, డాక్టరు మెక్లీనుగారి మద్రాసు అడ్మినిస్ట్రేషన్ మాన్యుయలును చూడుడు). ఇటుల తురకల సంబంధ మేర్పడిన పిదపనే దీనికి "బందరు"అను పేరు వచ్చియుండవచ్చునుగాని "మచిలీ" యను నామ చరిత్రమున కీయాధారము చాలదు. ప్రాయికముగ "మచిలీ"శబ్దము మత్స్యశబ్దవికారముగానే యుండవచ్చును. "మత్స్యము"నకు "మచ్ఛ"అను వికృతి యున్నట్లు వామన శివరామ ఆపటేగారిసంస్కృత డిక్షనరీలో నున్నది. స్వాద్వాదము నాశ్రయించి మత్స్యముతో దీనికి సాజాత్య మంగీకరించినమాత్రన ఈ గొప్పపట్టణమున కాచేపపేరు వచ్చుటెట్లు? బందరుకోటకు "చేపకన్ను" వంటి దర్వాజా యొకటియుండినదనియు, దానిచే "మచిలీబంద" రను పేరు వచ్చిన దనియు వయోవృద్ధులు కొందరు చెప్పెదరు. ఏప్రాతకాలమునన్నో యొక పెద్దచేప (తిమింగిలము) సముద్రమున ఆరేవునకు కొట్టుకొని వచ్చినదని కొందరు చెప్పెదరుకాని ఈ నిష్పత్తులవలన ఈ నగర ప్రాచీనత్వమున కొక హాని కలుగును. అరబ్బీలు, లేక ఇతరతురుష్కాదిజాతులవలన నీపేరు కలిగినదని యొప్పుకొనవలసియుండును. ఈవైదేశికజాతు లీభరతఖండమున ప్రవేశించుటకు ముందు ఈయూరే యుండలేదని దీనికి ప్రాగభావస్థితి నంగీకరింపవలయునా? వారీయూరికి నివేశనమునకు వచ్చి గ్రామము నేర్పరచిరా? ఇట్టిస్థితి దురూహ్యము. ఏల ననగా, మార్కోపోలో, పార్టిమా లోనగు ఐరోపీయయాత్రికుల కాలముననే ఈయూ రుండినటుల తెలియుచున్నది. ఈ యిద్దరి దేశయాత్రాకాలము అనుక్రమముగ క్రీ. శ. 13, 14 శతాబ్దమధ్యమముగ నున్నది. ఉదాహృత మసీదునిర్మాణము ఇందు కర్వాచీన మయియున్నది. అంతియగాక పైనజెప్పిన మెక్లీనుగారి మాన్యుయలులో దీనికి "మాసోలియా" యని గ్రీకుఅక్షరములలో పేరు వ్రాయబడియున్నది. ఇంతకును ఇది సముద్రతీరమున నొక యోడరేవుగా నుండుట ప్రసిద్ధము.

మత్స్యసంబంధ ముండుటంబట్టి మహాభారతప్రసిద్ధిగల మత్స్యదేశములోని పట్టణమాయనియూహించిన నదియు సమంజసముగతోపలేదు. భారతగత మత్స్యదేశము ఇప్పటి రాజపుత్రస్థాన(Rajputana) గత జయపురపరిసరములలో నుండినటుల యొక అభిప్రాయ మున్నది. మన మచిలీ ప్రాగ్దిశయం దున్నది. రాజపుత్రస్థానములు భరతఖండ వాయవ్యభాగమున నున్నవి.

ఉగాదిపండుగ సంబరము: 1. గృహాలంకరణము
పండుగనాటికోసం ఈరీతిగా ఇంటికి వెల్ల వేసి, ఎఱ్ఱమంటి పట్టెలు తీర్చడం ఆంధ్రగృహాలలో అలవాటు.



ఇక, ఎవరో మత్స్యభుక్కులు ప్రబలి, చేపల ఎగుమతి దిగుమతులకు ఒప్పియున్నదని మచిలీ, లేక మచ్ఛిలీ యని పేరుపెట్టి, ఆ సరకువ్యాపారము జరుగు రేవు అయినందున "మచిలీబందర్"అని నామకరణము చేసియుండుటకును ఏకాలముననైన చేపలయెగుమతికి ప్రసిద్ధమైన రేవయినటుల చరిత్రమున మృగ్యముగ నున్నది. ఇచట నివేశనము కుదుర్చుకొనిన అరబ్బీవర్తకులు కాయధాన్యములు, వెలగల లోహములు, బందరుచీటీగుడ్డలు (**chintz**) మొదలగువాని నిచటి నుండి యోడల కెక్కించుచుండినట్లు తెలియుచున్నది. కాబట్టి చేపల రేవుసిద్ధాంత మాదరణీయముగా కనుపడదు.

"బందర్" అనుపేరును పుచ్చుకొని మనపండితులు దీనిని "బృందారక"పురి జేసిరి. ఇది విచిత్రకల్పనయని సంతోషింపవచ్చును. అంతమాత్రమే. ఇది మాక్సుముల్లరును మోక్షమూలరు అనియు, గ్రిఫిత్ (**Griffith**) ను గిరిభిత్ అనియు అనినట్లుండును. చెన్నపట్టణ సమీపముననుండు ఫరంగికొండ (**St. Thomas Mount**) భృంగి శైలమట. ఇట్టికల్పనలకు మితిమేర లుండవు.

తెలుగుభారతమునందలి ద్రోణపర్వములోని మొదటియాశ్వాసపు కడభాగమున రెండుచోట్ల మచ్ఛల్లి, లేక మచ్ఛిల్లి యనుపద మున్నది. సందర్భమునుబట్టి ఇది యొక దేశనామముగ నున్నది. (1) తుండ కేరళ మాళవ శిలీంధ్ర మగధ మచ్ఛిల్లికాది దేశాధీశులును ఇత్యాది (ద్రోణ. 1-220 వచనము). (2) తుండి మగధ కేరళ మచ్ఛిల్లికాదులు ఇత్యాది (ద్రోణ. 1-254 వచనము). ఈ రెండు ఉద్ధృతములలో "మచ్ఛిల్లిక"ను ఆధారపరచుకొని క్రీ. శ. 1855 ప్రాంతముల రాక్షసనామసంవత్సరమున తెలుగక్షరముల నచ్చుపడిన బ్రహ్మశ్రీ పురాణం హయగ్రీవ శాస్త్రిలవారి ప్రతియందును, కలకత్తాలో నాగరాక్షరముల నచ్చుపడిన ప్రతాపచంద్రరాయిగారి ప్రతియందును, టి. ఆర్. కృష్ణాచార్యులవారి కుంభఘోణప్రతియందును, ఈవల ఆంధ్రగీర్వాణ గ్రంథముద్రణాదీక్షితులగు శ్రీవావిళ్లవారి ప్రతియందును ఉదాహృత తిక్కనవాక్యములకు సరియగు ఘట్టముల నన్వేషింపగా ఈ నాలిగింట నెందును మచ్ఛలి(మచ్ఛిల్లి) కానరాదు. ఆ పట్టున ఈ శ్లోకము లున్నవి:

"మాళవ స్తుండికేరళ్ళ రథానా మయుతైస్త్రిభిః"

ఇత్యాది (అధ్యాయము 17.)

తిక్కయజ్వ క్రీ. శ. పదుమూడవ శతాబ్దమున వర్ధిల్లినటుల కీర్తిమూర్తులు రావుబహద్దూరు వీరేశలింగముపంతులుగారు తమ "కవి జీవితముల"లో నిర్ణయించియున్నారు. పదమూడవ శతాబ్దమునాటికే తురుష్కు లిచట చేరి "మఛిలీబందర్" అను చేపలరేవును ఏర్పరచియుందురా యనుట కాధారము దుర్లభము. సోమయాజిచేత నుండిన భారతప్రతియందు "మచ్ఛిల్లి" పాఠముగల శ్లోక ముండియుండు నను నూహ సాహసము కాజాలదు. "తుండీర"మని యరవదేశము పలుకబడినది. ఇదియే తొండమండలము (చెంగల్పట్టు మొదలు నెల్లూరు జిల్లా సూళూరుపేటప్రాంతములవరకు నుండవచ్చును). కేరమని మలయాళదేశము ముచ్చటింపబడినది (ఇదియే కేరళము). ఆంధ్రదేశమున కీప్రణాళికయందు స్థానము లేకపోవలయునా? ఆంధ్రులును మహాభారతయుద్ధమున పాల్గొనినటుల మహాభారతమున అగపడుచున్నవి. (కర్ణపర్వ. ఆశ్వా 2, 317 వచనము)*

ఇత్యాది హేతు సమవాయముచే స్థాపింపదగిన నిగమన మేమనగా, మచిలీపట్టణమునకు విదేశీయ మ్లేచ్ఛభాషాజన్యభ్రాంతి నిరసింపబడి వైయాసికప్రామాణ్యమును, ఐతిహాసికప్రథయు అంగీకరింపదగియున్నవి. కాలగతిచేతను, ఉచ్చారణసౌలభ్యముకొరకును "మచ్ఛిల్లి" "మసూలా" కావచ్చును. "బందర్" అనునది నౌకావ్యాపారమును తెలియజేయు పదమే. ఇది మన మచిలీపట్టణమున కంటింపబడినట్లు మరియు ననేక ఓడరేవుపట్టణములకును చేర్పబడియున్నది. బొంబాయిలో అపొ్పలోబందర్, కరాచీ బందర్ ఇత్యాదు లెన్నియో కలవు.† "బందర్"పద సంయోగమాత్రమున ఆర్య హైందవ జాతి నశింపజాలదు. కాబట్టి పూర్వము మహాభారత కాలమునను "మచ్ఛిల్లి" యను నొక రాజ్య మాంధ్రదేశమున వెలసియుండిన దనియు, దాని ముఖ్యపట్టణముకూడ "మచ్ఛిల్లి"గా నుండి ఈనాటి గాలివానల (హరికేన్) పాలైన "మసూలిపటాం"గా మారియుండవచ్చు ననియు మనవి. బందరువా రిందు కేమందురో ?

---

* సంస్కృతభాగతమున "పుళింద కశబాహ్లీకాన్ నిసాదాంధకతంకణాన్" అని యున్న మూలమునకు (కలకత్తాప్రతి, కర్ణ. 20 అధ్యా) తిక్కనసోమయాజి "పుళిందబాహ్లిక టెంకణాంధ్ర"అని పరివర్తనము చేసియున్నాడు.

† బకింగాం కాలవలోను, కృష్ణకాలవలలోను రాహదారిపడవలు విడియు చోట్లను "బందర్" అనుట వాడుకలో నున్నది.

# కేరళ సబ్బులు

గ్యారంటీగా నిష్కళంకమైనవి.

కేరళ

రోజ్ సోపు

అందమును

చేకూర్చును.







కేరళ

వెప్ సోపు

చర్మమును

మృదుపరచును.

ముఖవర్చస్సునకు

కేరళ

శాండల్

సోపు




కేరళ సోప్ ఇన్‌స్టిట్యూటు, కాలికట్.

---

# జమున

## మూలికా మలాము

రణములు, పుండ్లు, కోతగాయములు, కురుపులు, నారిపుండ్లు, రక్తగడ్డలు, వడిసెగడ్డలు, కాలినగాయములు, కాళ్లు, చేతులు, పెదవులు పగలడము, మూలవ్యాధి, కంటిరెప్పలు రాలడము, గజ్జి, తీట, తామర, కరప్పాన్, సవాయి, సెగ, మొదలగు సమస్త చర్మవ్యాధులు మాన్పుటయందు మొదటి దని ఖ్యాతి గాంచినది. ఇది ఎల్లప్పుడు ఇంటిలో నుండిన డాక్టరువలె కాపాడును. మీపూరిలో దొరకనిచో తయారుచేయువారికి వ్రాయుడు. వెల పెద్దడబ్బి 1-కి రు. 0-10-0

చిన్న డబ్బి 1-కి రు. 0- 2-0

**పిశె కెమికల్ వర్క్స్, గుంతకల్.**

---

అనేకప్రదర్శనములలో బంగారుపతకములు సర్టిఫికెట్లు పొందిన

ఓంకార్ బ్రాండు

స్వదేశీ] [స్వదేశీ

రిజిష్టర్డు

**వేల్ కోపాల్ వార్నిషు**

హిందూదేశపు ముడివస్తువులతోను, పెట్టుబడితోను గృహపరిశ్రమగా తయారుకాబడినది. ఆరుదల, తళుకు కలిగి చిరకాల ముండునట్లుగా కర్పూరతైలము, అవిసినూనె వగైరాలతో జాగ్రత్తగా తయారుచేయబడినది. గాన యెల్లరు ప్రోత్సహింప కోరిక.

☞ యేజంట్లు కావలెను.

**కె. జి. రావు పెయింట్సు & వార్నిషు కో.,**

పాలకొల్లు, దక్షిణయిండియా.

# నవ్యాంధ్ర కవితా రీతులు

> కాలానుగతిగా నవకవులు నవ్యాంధ్ర
> వాఙ్మయంలో చొప్పించిన గుణవిశేషాలు

కవికిని, ప్రకృతికిని ఉన్న చుట్టరికము అసమానమైనది. ప్రకృతిలోని రహస్యాలను తెలిసికొనడానికి కవి సమర్థుడు; రసికుడైన కవిని అలరించడానికి ప్రకృతికన్నా సమర్థమైనది వేరొకటి లేదు. పురాణయుగంలోను, ప్రబంధయుగంలోను, నవయుగంలోను కవులు ప్రకృతిని గురించి గానం చేసినారు, చేస్తున్నారు, చేయనున్నారు. కాని ఎత్తుగడలోను, విషయాన్ని నిర్ణయించుకొనడంలోను, ఆ నిర్ణయించుకొన్న విషయాన్ని ప్రదర్శించడానికి ఉపయోగించే భాషలోను భావంలోను నేడు క్రొత్తదనం గోచరిస్తూ ఉన్నది. అందులకే దీనిని నవయుగ మన్నారు. ఆంగ్ల వాఙ్మయ ప్రాబల్యంవల్ల నేమి, ప్రజల అభిరుచిలో మార్పువల్ల నేమి, కాల మాహాత్మ్యంవల్ల ప్రతివిషయంలోను కలుగుతున్న మార్పువల్ల నేమి మన భాషలో, మన భావాలలో, కూర్పు నేర్పులో, పద సామగ్రిలో మార్పులు వచ్చిచేరినవి.

"భావనాబల మున్నది, ప్రకృతి యున్న;
దిష్ట ముండిన బదముల కేమి కొఱత?
వారిద విహార నగశృంగ పదము లరసి
స్వాదు జలపూర్ణ నదనదీ పదము లరసి
సార్థకంబుగ భావించి సరసకావ్య
మొకటి వ్రాయుము, వ్రాయుము సుకవిచంద్ర!"

అని వుత్సాహాన్ని గూర్చే గీతాలు నేడు తెనుగుసరస్వతీదేవాలయంలో మారుమ్రోగుతున్నవి. భావనాబలమున్న కవి కథావస్తువుకొరకు మానవలోకాన్ని వెదకవలసిన పనిలేదు; రాజులను, మహారాజులను ప్రశంసించి పుటలు నింపవలసిన అవసరము కనుపించదు. మానవజాతి నేర్చుకోదగిన విషయా లెన్నో ప్రకృతిమాతగర్భంలో దాగియున్నవి. వానిని సేకరించి, కేవలము ధన కాంక్షతో, స్వార్థంకొరకు, ఎన్నోవిధాల క్రిందుమీదగుతున్న లోకాన్ని సంస్కరించవలసిన బాధ్యత తన కున్నట్లు కవి తెలిసికొ



గలిగినాడు. తన ఆనందంకొరకు, తన హృదయంలో నూతన భావకుసుమాలు వికసించేటందుకు ప్రకృతిని పడిగాపుగా తన కంటియెదుట పడియుండమని కవి కోరటంలేదు. లతలను, మొక్కలను తీసుకొనివచ్చి తన పెరటిలో వేసుకుని ఆనందించి, తృప్తిపడవలెననే భ్రాంతి అతనికి లేదు. అది కృత్రిమసౌందర్యమని అతడు గ్రహించక పోలేదు. సహజమైన చక్కదనాన్ని తాను నిర్మించుకొన్న వనంలో కాకుండా, సహజంగా పెరిగిన అరణ్యాలలో, అతడు కనుగొన గల్గుతున్నాడు. అందులకే

"ఆకులో నాకునై, పూవులో బూవునై,
కొమ్మలో గొమ్మనై, నునులేత రెమ్మనై
ఈయడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా?

గలగలని వీచు చిరుగాలికెరటమ్మై,
జలజలని పారు సెలయేటిలో దేటనై
ఈయడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా?

ఆకలా దాహమా, చింతలా వంతలా
ఈకరణి వెఱ్ఱినై యేకతమ తిరుగాడ

శ్రీ చిరువూమిళ్ల శివరామకృష్ణప్రసాదు

ఈయడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?"

అని ప్రశ్నించుకుంటున్నాడు. వస్తుసందర్శనంవలన కలిగిన ఆవేశాన్ని వెలువరించడంలో ఆవస్తువుయొక్క చక్కదనాన్ని గూర్చి, పుట్టువునుగూర్చి ఉపమానాలతో, ఉత్ప్రేక్షాలంకారాలతో వర్ణించటం ఈనవయుగంలో విశేషంగా కానరాదు. కలిగిన ఆవేశంలోని అవ్యయానందాన్ని తృప్తిదీర అనుభవించడానికి ఆవస్తువునందు కలిసిపోయి, తన్నుదా మరచి, క్షణకాలం ఈదుఃఖమయ ప్రపంచాన్ని మరచిపోవలెననే కాంక్ష నేటి కవుల రచనయందు వ్యక్తమౌతున్నది. ముఖ్యంగా ప్రకృతిని వర్ణించేపట్ల ఈకాంక్ష మిక్కుటంగా నేడు గోచరిస్తూఉన్నదనటానికి పైగేయమే ఒక ఉదాహరణము. అవును, ప్రకృతి శోభావిలాసలాలసులుగదా కవులు. అందులకే

"వేగుజామున వికసించు
విరులయందు
తేకు లెడలించు సంజపూ
రెమ్మలందు
గావ్యమునబోలె బఠియింతు
గౌతుకమున
బ్రకృతిసామ్రాజ్యపాలనా
పద్ధతులను."

అని నేడు కవి సగర్వంగా పలుకుతున్నాడు.

కవికిని, ప్రకృతికిని ఎంత దగ్గిర బంధుత్వమున్నదో, కవికిని, దారిద్ర్యానికిని అంతే సంబంధమున్నది. ఈసంబంధము నవయుగంలోకూడా విడిపోలేదు. రాజాదరణ లేకపోయినప్పటికిని "నిరుపహతి స్థలమ్ము, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము, ఆత్మకింపయిన భోజనము" సమకూరనప్పటికిని అప్పుడప్పుడచ్చటచ్చట "తెలుంగువాణికి న్జాకిరి చేయసాగి కడచన్నవి పాతికవత్సరాలు, నాయాకటిపాట మాన్పిన మహాత్ములు లేరు, రసజ్ఞశేఖరా!" అని కవులు నేడు కంట తడిపెట్టినప్పటికిని, ఈయుగంలోకూడా రసోదంచితములైన కావ్యాలు సృష్టింపబడకపోలేదు. తనగురువుగా, మిత్రుడుగా కవి ప్రకృతినే ఆరాధించినాడు; కష్టసమయంలో ప్రకృతియొడిలోనే తలవాల్చినాడు. అదృష్టవంతులైన ఏకొలది మందికో తప్ప, నిజంగా విచారిస్తే ఈ నవయుగంలో తెలుగు మాగాణమున రాజాదరణపొందిన కవులకు ఆశాభంగమే ఎక్కువ మందికి కలిగినది. రాజాదరణతోపాటు కవికి ధనాపేక్షకూడ సన్నగిలినది. అందువలననే కవితాశిల్పాన్ని ప్రదర్శించడంకొరకు, జనసామాన్యాన్ని అలరించడంకొరకు కావ్యాలు సృష్టింపబడినవి. వీనియందు స్వాతంత్ర్యేచ్ఛ, నిజమైన తెనుగుదనం, కల్తీలేని కవితాశిల్పము, కఱుదులుకట్టిన దేశభక్తి, ప్రకృతిసౌందర్యము ప్రస్ఫుటమౌతున్నవి. ఏ ఒకరినో, లేదా ఏ ఒకరాజుసభలో నున్న పండితబృందాన్నో సంతోషింపచేయవలె, వారికి నచ్చే ఆశయాలనే రచనలో చొప్పించవలె అనే అనర్థకమైన, అస్వాభావికమైన నియమములు లేకపోవడంవలన నిరంకుశుడైన కవి స్వేచ్ఛగా క్రొత్తరీతులను రచనలో ప్రవేశపెట్టినాడు.

ఉగాదిపండుగ సంబరము

**2. కొత్తవస్త్రముల కొనుగోలు**

గ్రామవాసులు ముందుగానే సంతలకువెళ్లి పండుగకు కావలసిన క్రొత్తవస్త్రాలను కొని తెచ్చుకొంటూ వుంటారు.



ప్రబంధరచనకు చెందిన నిబంధనాలను అనుసరించి, తప్పని సరిగా కథావస్తువును నిలిపియుంచి, వసంతఋతువర్ణనలు, సంధ్యారాగవర్ణనలు మొదలైనవాటిని పూర్వకవులు తమ గ్రంథాలలో ప్రవేశపెట్టినారు. హృదయ ముప్పొంగేవిధంగా నాల్గుపంక్తులు ఒక ప్రకృతివిలాసాన్ని ఆధారపరచుకొని విడిగా వ్రాయతగిన అవకాశం వారికి లభించనే లేదు. అప్పటికిని కట్టుబాట్లను కాదనలేక ఆకొలది అవకాశంలోనే నిర్మలమైన హృదయాలతో, క్రొత్తభావాలతో ప్రకృతిని ఆరాధించి ధన్యులయినవారున్నారు. అయితే వారి సంఖ్య చాలా స్వల్పము.

"తారకాధీశు కిరణక
దంబకంబు
చిలికె బలుచని వలిపంపు
జిలుగుమంచు,
గైరవ శ్రీవధూకర
గ్రహణవేళ
వెలికి గ్రమ్మిన సాత్త్వీక
స్వేద మనగ."

లోను, బంగారపు మేడలలోను మాత్రమే అందాలు చందాలు కలవని తలచటం పొరపాటు. సీతాకోకచిలుకలోను, గడ్డిలోనుండి తొంగి చూచే నీలిపూవులోనుకూడా తన పనివానితనాన్ని సృష్టికర్త పొందు పరచినాడని లోకం గ్రహించేవిధంగా కవి చేసినాడు. కేవలము గ్రంథాలనుండే కాకుండా తేనెటీగనుండి, గువ్వలజంటనుండి ఎన్నో గుణపాఠాలను మనము నేర్చుకోవలసిఉంటుందని కవి తెలియచేశాడు. మానవుడు ప్రకృతిని ఆరాధించి, తనలో దాగియున్న స్వార్థాన్ని, ఇంకా ఇతరములైన దుర్గుణాలను మరచిపోవలసి ఉంటుందని కవి నిరూపించాడు. ఈయుగంలో తెనుగువాఙ్మయంలో ప్రకృతి కివ్వబడిన పవిత్రస్థానం పురాణయుగంలోను, ప్రబంధయుగంలోను కూడా ఇవ్వబడియుండలేదు.

నేటిరచనలయందు జాతీయభావాలు ఎక్కువగా గోచరించడం సంతోషింపతగినవిషయం. "రాయరాహుతుగండరాచయేనుగు వచ్చి ఆరట్లకోట గోరాడు" దినములు మన మెరుగము. అట్టి దృశ్యాలు ప్రస్తుతం మనము చూచే అవకాశంలేదు. ఆవిషయాలన్నీ మన కిపుడు కథలుగా మారిపోయినవి. మన వ్యక్తిత్వాన్ని, మన వైభవాన్ని మనము మరచిపోయినాము. ఇంగ్లీషుమాట లేనిది మన భావాలను వెలువరించలేనిస్థితి వచ్చినది. మనవాఙ్మయం క్రమేణ అనుకరణలతో, అనువాదాలతో నిండిపోవలసివచ్చినది. ఒకసారి వ్రాయబడిన గ్రంథాలే తిరిగి వ్రాయబడటం జరుగుతూవచ్చినది. చివరకు పంచమ జార్జిచక్రవర్తి పట్టాభిషేకచరిత్రనే కథావస్తువుగా నిర్ణయించుకొని కావ్యాలు వ్రాయటంలోనికి వచ్చినది. ఇంతలో తిలకుమహాశయుని స్వాతంత్ర్య శంఖారావం, గాంధీమహాత్ముని అహింసాతత్వం దేశాన్ని ఆవరించినై. అవిదితమూ, అనల్పమూ అయిన ఉత్సాహం దేశమంతటా కలిగినది. తెనుగుజాతిలోకూడా చైతన్యం కలిగింది. తెలుగుగుండెలో కలవరం ప్రారంభమైనది. తెనుగురక్తంలో వేడి కలిగినది:

"తనగీతి యఖిలజాతిని పాటకులనుగా
 దిద్ది వర్ధిల్లిన తెనుగువాణి,
తనపోటులు విరోధితండంబులకు సహిం
 పనివిగా మెరసిన తెనుగుకత్తి,
తనయందములు ప్రాంతజనుల కభిరుచివా
 సన నేర్ప నలరిన తెనుగురేఖ,
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
 లను జేయ జెలగిన తెనుగుభూమి,
అస్మదార్ద్రమనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాడ! చావలేదు,
చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర
హృదయములు చీల్చి చదువు డోహృదయులార!"

అని తెనుగుకవి సగర్వంగా గానంచేయటం ప్రారంభించినాడు. ఇప్పటినుండి దేశభక్తి నవ్యాంధ్రకవిహృదయంలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించినది.

"నీచపు దాస్యవృత్తి మన
 నేరని శూరత మాతృదేశసే
వాచరణమ్మునం దసువు
 లర్పణసేసినవారి పార్థివ
శ్రీ చెలువారుచోట తద
 సృగ్గుచులన్ వికసించి వాసనల్
వీచుచు రాలిపోవగవ
 లెం దదుదాత్త సమాధి మృత్తికన్."

అని కవి తన ఆశయాలను అన్యాపదేశంగా వ్రాసే పద్యాలలో కూడా వెలువరించడం ప్రారంభించినాడు.

"ఏదేశ మేగినా ఎందు గాలిడిన
ఏపీఠ మెక్కినా యెవ రెదు రయిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతినిండుగర్వమ్ము
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరు లింకెందు!
* * *
అవమాన మేలరా అనుమాన మేల
భరతపుత్త్రుడ నంచు భక్తితో బలుక!"

సన్నగిలిన దేశభక్తిని పునరుద్ధరింపదలచి, ఉత్తేజకరములైన రచనలతో తెలుగువాని మాంద్యాన్ని పారదోలడానికి కవులు పూనుకున్నారు.

పూర్వపు ఔన్నత్యాన్ని, నాగరికతా వైభవాన్ని, చిత్రకళా వైదగ్ధ్యాన్ని చూడవలయు ననే కాంక్ష కవికి కల్గినది. వ్యయ ప్రయాసలకు వెరువకుండా వరంగలు, హంపీ, కొండపల్లి వంటి ప్రాచీన శిల్పాన్ని ప్రకటించే ప్రసిద్ధ స్థలాలకు వెళ్లి

"తెలుగుంబాసకు వన్నెదెచ్చిన జగ
 ద్వీరుండు మా కృష్ణరా

చంద్రోదయవర్ణన గావించేటప్పుడు ముక్కుతిమ్మనార్యు డెంతటి లలితమైన భావాన్ని పైపద్యంలో వివరించినాడో చూడండి! అప్పుడే తూర్పుకొండపై కెక్కి తొంగిచూస్తూ ఉన్న పూర్ణిమనాటి చంద్రబింబాన్ని చూచి "పాకశాసన పుర ప్రాసాద శిఖరాగ్ర గురుతర సౌవర్ణకుంభ మనగ" అని వేరొక కవి గాన మొనరించినాడు. ప్రకృతిని వర్ణించవలసివచ్చినప్పుడు పూర్వ కవుల రచనలలో ఎక్కువచోట్ల అర్థాలంకారాలు విరివిగా కనుపించుతున్నవి. ముఖ్యంగా ఉత్ప్రేక్షను ఆధారపరచుకొని వారు ప్రకృతివర్ణనలు సాగించుటం ఆచారమైనది. మానవాతీతములైన విషయాలతో ప్రకృతిశోభను పోల్చిచూపించడం నేడు కానరాదు. పాకశాసనుని పురప్రాసాద శిఖరాన్ని చూచినవా రెవ రున్నారు? 'గురుతర సౌవర్ణకుంభాన్ని' ఊహించటం మొదటిపని; తరువాత పాకశాసనుని పురాన్ని, దాని శిఖరాగ్రమం దున్న గురుతర సౌవర్ణ కుంభాన్ని ఊహించడం వేరొక పని. నిత్యమూ చూచే విషయాలను ఉపమానంగా తీసుకొనడం నేటి కవుల రచనలయందు కనుపించుతున్నది. మానవుని జీవితాన్ని రసమయంగా చేయటానికి ప్రకృతి ఏవిధంగా సాయపడుచున్నది, ప్రకృతిసౌందర్యాన్ని చూచి సంతోషింపగల మానవునకు కష్టము లేవిధంగా మరపునకు రాగలవు, ప్రకృతిరహస్యాలను గుర్తించి తన తప్పులను తాను దిద్దుకొనడానికి మానవున కేవిధంగా అవకాశ మున్నది, మొదలగు విషయాలు నేటి కావ్యాలలో విశదీకరింపబడినవి. అంతేగాని ప్రకృతిని దూరంగా ఉంచి కేవలము చూచి సంతోషింపతగినట్టి, ఆరాధింపతగినట్టి విషయంగా నేటికవులు తలచియుండలేదు. ఖైదునందు బంధింపబడి, రోజొకయుగముగా గడుపుతున్న ఒక ఆధునికకవి ఇనుపకటకటాలు దాటి తన గదిలోనికి వచ్చిన వెన్నెలను, గుమ్మము వెలుపల నుండి తొంగిచూస్తూఉన్న చందమామను గాంచి తన్మయత్వంతో ఏమనుచున్నాడు?—

"ముకుళితములైన కలువపూవుల దళాలు
సీకరస్పర్శ పుల్కరించినవిధాన
ఎన్నడో మూగవడిన నాహృదయవీణ
తీగ లొకసారి కదలి నదింపదొడగె."

అని తనలో కలిగిన మార్పును విశదపరచుకున్నాడు; కాని తన హృదయంలో నిండియున్న స్వాతంత్ర్యేచ్ఛను, చంద్రదర్శనంవలన తనకు కలిగిన అమితానందాన్ని ఆతడు నిలుపుకొనలేకపోయినాడు. అందులకే

"నవ్యతారాపథమ్ముల నడచు నిన్ను
నే కిరీటాధిపతులు బంధింపగలరు?
కష్టతరదీర్ఘయామినుల్ గడచి వేగ
బంధనవిముక్తులను జేయవలయు మమ్ము."

అని ప్రార్థిస్తున్నాడు. ఊహాకందని వర్ణనలు జరపకుండా, నేటి కవులు ఈ విధంగా కష్టకాలంలో సహితం ప్రకృతిమాత-పాదాంకముల చెంత ప్రణమిల్లి, హృదయశాంతిని పొందుతున్నారు.

ఒక పద్యం వ్రాయడానికి నిర్ణయించుకునే విషయము ఉత్కృష్టమైనదిగా ఉండవలెననియు, కానుపించిన ప్రతివిషయాన్ని గూర్చి పద్యాలు వ్రాయకూడదనియు, ప్రతి అల్పమైన విషయాన్ని గూర్చి కవిత్వం వ్రానేటట్లయితే కవిత్వగౌరవం పోతుందనియు ఒక చిత్రమైన అభిప్రాయం మొన్న మొన్నటివరకు తెలుగుదేశంలో కవులకున్న మాట వాస్తవము. అందుచేతనే పురాణకథలు, రాజులచరిత్రలు, స్థలమాహాత్మ్యములు మన వాఙ్మయంలో మొదటినుండి వెలసినవి గాని భగవంతుని సృష్టివైభవాన్ని వెలువరించే పెక్కువిషయాలను కవులు గౌరవించనేలేదు. శకటరేఫకును, రేఫకును ప్రాసలో భేదం చూపించలేదనే దోషమే కాకుండా మహాకవిపోతన్న తన భాగవతంలో స్వతంత్రించి, ఒక అడివిని వర్ణించే సందర్భంలో ఝిల్లిని (ఈలపురుగు) గూర్చి ఒక కందపద్యం వ్రాశాడనే హేతువుచేత పోతన్నగారి కవిత్వాన్ని గూర్చి పెదవివిరచినవా రున్నారు. వస్తుసందర్శనంవలన కలిగిన ఆవేశాన్ని ఆధారపరచుకొని నాల్గు పద్యాలు వ్రాయగల స్వాతంత్ర్యం నేడు కలిగినందువలననే

"కులుకుపసిండినిగ్గుల దు
కూలములన్ ధరియించి, ముద్దుబి
డ్డలును, బడంతి సీపొదిగి
ట న్నిదురింపగ, గన్నెగాడ్పు లూ
యెలసవనంబు నూచ, భయ
మింత యెరుంగక కన్నుమూయు నీ
యలఘుసుఖంబు మాకు గల
దా! గిజిగా! యొకతేని కున్నదా?"

అని సృష్టిలోని ఒక దర్శనీయమైన విషయాన్ని గూర్చి నేటి కవి గానం చేయకలిగినాడు. గిజిగానిపిట్టయొక్క చక్కదనం అసమానమైనది. ఆపిట్టయొక్క గూటి నిర్మాణవిధానం ప్రతివానిని చకితులను చేస్తుంది; అందులకే అది కవిహృదయాన్ని పైవిధంగా కదిలించినది. గడ్డిపోచ మొదలుకొని హిమాలయపర్వతంవరకు ప్రతివస్తువులోను సృష్టికర్త తన నిర్మాణకౌశలాన్ని, ప్రజ్ఞావిశేషాన్ని ప్రదర్శించే ఉన్నాడని తెలిసికొనడానికిని, లోకానికి తెలియచేయడానికిని అవకాశం నేడు కవికి లభించినది. రత్నరాసుల


మీ చర్మము మృదువుగా
ఆరోగ్యముగా కోమల
ముగా నుండునటుల
కాపాడును.
MYSORE SOAP
మైసూరు
స్యాండల్ సోపు
గవర్నమెంటు సోపు ఫ్యాక్టరీ,
బెంగుళూరు.

యలు గట్టించిన వజ్రదుర్గముల, శు
ద్ధాంతప్రదేశంబులన్
దలక్రింపై తప మాచరించెడిని, సం
తానార్థమై, గబ్బి గ
బ్బిలపుంగుబ్బెత లక్కటా! మొయిలు గ
ప్పెం బ్రూర్వమర్యాదకున్."

అని కంట తడిపెట్టుకొన్నారు.

" తెలిరాతన్ జెలువార నచ్చరపడం
తిన్ దిద్ది, యా సోగక
న్నుల పజ్జన్ నిను నీవు దిద్దుకొని, సం
తోషించుచున్నాడవా ?
భళిరే! శిల్పి! జగంబులోన జిరజీ
వత్వంబు సృష్టించుకో
గల నీ కెవ్వడు సాటివచ్చును, నమ
స్కారంబు నీప్రజ్ఞకున్."

అని ప్రాచీన ఔన్నత్యాన్ని గాంచి దిగ్భ్రమ చెందినాడు.

"ఆ చాళుక్యనృపాల రత్నముల వి
య్యమ్మంది, శ్రీకాకతి
క్ష్మాచక్రేశుల లాలనల్ వడసి, కృ
ష్టప్రాజ్య సామ్రాజ్య పీ
ఠీచంచజ్జయకన్యతో సరసగో
ష్ఠిన్ ప్రొద్దుపోబుచ్చు నీ
ప్రాచీనాభ్యుదయమ్మ నెన్నెదరు గ
ర్వస్ఫూర్తి తల్లీ! సుతుల్."

అని ప్రశంసజరుపుతూ, తెనుగువాని ప్రాచీన రాజకీయ వ్యవహారాలను తెలిసికొనవలెననే ఉత్కంఠను పాఠకవర్గంలో కలిగించి, తెనుగుజాతికి నేటికవి మహోపకారం గావించినాడు. ఎంత మాత్రం ఉత్ప్రేక్షించకుండా, స్వభావసిద్ధంగాను, ఉత్తేజకరం గాను, కరతలామలకంగాను ఏ యుగంలోను దేశసౌభాగ్యాన్ని, శిల్పసంపదను ఈరీతిగా తెలుగుకవులు వర్ణించియుండలేదు.

ప్రేమతత్వాన్ని ఈనవయుగంలో కవులు క్రొత్తవిధంగా వర్ణించినారు. ప్రేయసిని ఒక పవిత్రప్రణయమూర్తిగా నిర్ణయించుకొని, లలితములైన భావాలతో వ్రాసిన చక్కని పద్యాలు నవ్యాంధ్ర వాఙ్మయంలో వెలసినవి. భగవంతుని సృష్టిలో ప్రతివిషయంలోను ప్రేమ నిలిచిఉన్నదనియు, సృష్టి అంతా ప్రేమమయ మనియు, విశాల హృదయంతో మానవుడు లోకాన్ని ప్రేమించవలె ననియు, ప్రేమకంటె అమూల్యమైనది లోకంలో వేరే లే దనియు కవులు నిదర్శనపూర్వకంగా ఈ యుగంలో ఎలుగెత్తి చెప్పినారు.

"చెట్టునకు మొగ్గదొడిగెడుచేష్ట గలదు,
కోరకమునకు వికసించుగుణము గలదు,
ఏరికి వలపుల వెదజల్లు విద్య కలదు,
దేనికొఱ కిది యంతయు దేనికొరకు?
ప్రేమకొరకు, ప్రేమకొరకు, ప్రేమకొరకు."

ప్రకృతిలోగూడా ప్రేమ నాధారపరచుకొని ప్రతివిషయం జరుగుతున్నదనియు, ఏదో ఒక అవిదితము, అసమానము నయిన సంబంధముండటంచేతనే ప్రకృతిలోకూడా ఒక వస్తువుపై వేరొకటి ఆధారపడియుండటం జరుగుతున్నదనియు కవి నిశ్చయించ గలిగినాడు.

ప్రేమలేని జీవితము వ్యర్థము. ప్రేమరుచి ఎరుగని మానవుడు ధనవంతుడైనా లాభంలేదు. అందులకే

"ప్రేమకంటే ఎక్కు
వేముందిరా, ఎల్ల
కామ్యపదవుల కన్న
ప్రేమె యెక్కువరా!
ప్రేమించు సుఖముకై!
ప్రేమించు ముక్తికై!
ప్రేమించు ప్రేమకై!
ఏమింక వలెనురా?
ఎద మెత్తనౌటకై
సొద గుందరా, అంత
మదిగల అహా మెల్ల
వదలిపోవునురా!"

అని కవి ప్రశంసించి, ప్రేమవలన మానవజీవితం పవిత్రమైన దౌతుం దని తెలుపుతున్నాడు. మోడైపోయిన ప్రతిజీవితానికీ ప్రేమ వసంతోదయమువంటి దనియు, కేవలము బాహ్యవస్తువులను, బాహ్యసౌందర్యాన్ని అసభ్యంగా వర్ణించినంతమాత్రంలో ప్రేమ తత్వం వెల్లడి అవుతుందని తలచడం పొరపాటనియు, పవిత్రాశయాలను ఉచితమైన భావంతో, భావాలతో వెలువరించవలసియుంటుందనియు నేటికవులు నిర్ణయించుకున్నారు.

"ప్రేమమధుపూర్ణ మైన నాహృదయపాత్ర
నీ దినము నీపెదవుల కందింతు ననెడు
నాసలో గన్నువిచ్చితి నమృతసరసి

ప్రాతరున్మిషిత మైన్మన పద్మమట్లు
ఆ త్రిలోకైకజనని పాదాబ్జ సవిధ
భూమి మీలిత నేత్రవై మోకరిల్లి
నీవు పూజాసుమమ్మవైనావు, హృదయ
కర్ణికామూలమున భక్తి కందళించి
అడరు పారవశ్యమ్మున తోడిమయాడి
నేను పూవునై పడితిని నీదు చెంత
జంటపూవుల యమృత నిశ్వాస సౌర
భముల రోదసి శుక్రవారము ధ్వనించె!"

ఈ పైగీతంలో ఎంతటి ఉన్నతాశయాలు మృదువైన భావాలతో అన్యోన్య ప్రేమను విశదపరుస్తూ ప్రదర్శింపబడినవో, చూడండి.

"......................తా నొక్క చే
తనకంఠంబును గౌగలించి, యొకచే
తన్ గడ్డమున్ బట్టి, చె
క్కున జెక్కానుచు నొక్క చన్మొన యురః
కోణంబుతో రాయగన్."

మొదలగు వర్ణనల మూలంగా నాయికానాయకుల సాంద్రానురాగం విశద మౌతుందని పూర్వకవులవలె నేటివారు తలచియుండలేదు. ఇట్టి వర్ణనలు నేటిరచనలలో కానరావు. ఆరాధింప యోగ్యమైన పవిత్ర ప్రణయమూర్తిగానే పెక్కుచోట్ల ప్రేయసిని నవ్యాంధ్రసాహిత్య నిర్మాతలు నిర్ణయించినారు. విరహాన్ని కూడా నవయుగంలో కవులు క్రొత్తరీతిని వర్ణించినారు. చంద్రదూషణ, తామరాకు వీవనలు, పన్నీట జలకమాడుట మొదలైనవి లేవు. మన ప్రస్తుత మర్యాదలకు విరుద్ధంగాకాకుండా ప్రతివారి మనస్సును ఆకట్టేవిధంగా ఈలాంటి ఘట్టాలను రసవంతంగా నిర్వహించినారు.—సమయమునకు ఇంటికి తిరిగిరాని మగనిని తలచి ఒకచిరంటి ఏవిధంగా తనవిరహాన్ని వెల్లడించుతున్నదో, ఎంత స్వభావయుక్తంగా కవి ఈక్రింది గేయంలో చిత్రించినాడో, తిలకించండి:

"దూరాన నారాజు కే రాయి డౌనో,
ఈరోజు నారాత లే రాలపాలో?
సీమ సిటు కనగానె
సెదిరిపోతది మనసు
కాకమ్మ నేనైన
కబు రంప డారాజు!
దూరాన నారాజు కేరాయి డౌనో,
ఈరోజు నారాత లేరాలపాలో?

కళ్ల కేటో మబ్బు
గమ్మిన ట్టుంటాది
నిదరల్లె నావొల్లు
నీరసిస్తున్నాది
దూరాన నారాజు కేరాయి డౌనో,
ఈరోజు నారాత లేరాలపాలో?

ఆవు లంబా యంట
అడలిపోతుండాయి
గుండెల్లొ వుండుండి
గుబులు బిగు లౌతాది!
దూరాన నారాజు కేరాయి డౌనో,
ఈరోజు నారాత లేరాలపాలో?

తులిసెమ్మ వొరిగింది
తొలిపూస పెరిగింది
మనసులో నాబొమ్మ
మసకమసి కేసింది
దూరాన నారాజు కేరాయి డౌనో,
ఈరోజు నారాత లేరాలపాలో?"

ప్రతివారూ ఆ పల్లెటూరి పడుచుయొక్క నిర్మలమైన ప్రేమను గుర్తించి సంతోషింపకపోతారా? ఇంకొకొంచెం సంపన్నమైన కుటుంబములోపుట్టిన వేరొక ఐదువరాలియొక్క విరహభరాన్ని నేటికవి ఎంతసహజంగా ప్రదర్శించుతున్నాడో, చిత్తగించండి:

"హేమపాత్రల జందన మెండిపోయె
ద్వారములు మోయుచున్నవి హారములను
సానలం దింకె స్నానకషాయగంధ
మబల, యెవనికోసము నగ మయి కృశింతు
చెక్కు చెదరని పాపట చిక్కువడియె
వేణిబంధము శిథిలమై పిరుదులందె
కరగి చెరగిన తిలకరేఖలను దుడువ
వతివ, యెవ డాహరించె నీ యార్ద్రహృదిని.
పాలుపొంగినగతి పొంగు ప్రణయరక్తి
నాపుకొనలేని పడుచుప్రాయంబుతోడ
నమ్మి యెవనికి నీ మన మమ్మికొంటి
వువిద, యీామేఘమాసనవోదయముల."

అసహజమైన ఆరాటం, ఆ ఆరాటాన్ని అణచివేయడానికి శైత్యోపచారాలు నేటి విరహవర్ణనలో కానరావడంలేదు.

"అనుపమప్రణయాతిథేయమ్ముతోడ
పారదెరచితి హృదయకవాట మిపుడె,
నీ గృహామె నీవె కైసేయ నేగుదెమ్ము
మొయిలు చీకట్లుక్రమ్మకమున్నె నాథ!"

అని నేటివిరహిణి ప్రాథేయపడుతున్నది కాని దేహసంబంధమైన బాధలను వ్యక్తీకరించడంలేదు.

"కాలసర్పము వేరు! పూమాల వేరు!
మృత్యువక్త్రము వేరు! యామినులు వేరు!
జ్వలితదావాగ్ని వేరు! భాస్కరుడు వేరు!
మలినకామమ్ము వేరు! ప్రేమమ్ము వేరు!"

అని ప్రేమతత్వాన్ని గ్రహించి, ప్రస్తుతసంప్రదాయాలకు అనుగుణంగా నేటికవి తన కలాన్ని నడిపినాడు.

వ్రాయబడే గ్రంథాలలో కవియొక్క ఆశయాలు కొంతవరకైనా ప్రతిబింబించడం చాలా అవసరము. ఆత్మస్వాతంత్ర్యాన్ని చంపుకుని, తనకు ఇష్టము కాకపోయినా ఏ కృతిభర్తనో సంతోషింపజేయటానికి వ్రాసిన పద్యాలు తాత్కాలికంగా చెవికి ఇంపుగా, సొంపుగా ఉన్నప్పటికిని వానిలో కవిహృదయం లేనందున త్వరలో విస్మృత వారాశిలో కలసిపోవటం జరుగుతున్నది. తాత్కాలికంగా ఒకరిని అలరించడానికి వ్రాసిన గ్రంథాన్ని **'Book of the hour'** (తాత్కాలిక గ్రంథము) అనియు, కవి అనుభవించి హృదయపూర్వకంగా వ్రాసిన గ్రంథాన్ని **'Book of all times'** (సార్వకాలిక గ్రంథము) అనియు రస్కినుకవి విభాగించినాడు. తామే ఒక విషయాన్ని నిర్ణయించి, తమ ఆశయాలకు అనుకూలంగా ఒక కావ్యం వ్రాసి తీసుకొని రమ్మని చందనతాంబూలాలిచ్చే రాజు లేనందున, తన పద్యాలమూలంగా సంఘంలోను, మతంలోను నిలిచియున్న లోపాలను నిర్భయంగా కవి వెలువరించడానికి నేడు అవకాశం లభించినది. ఈ యుగంలో వెలుగుచూచిన చాలా గ్రంథాలలో కవిహృదయం యొక్క ప్రతిబింబము కనబడుతూ ఉన్నది.

"అనుగుందమ్ములు దిక్కుమాలి పురబా
హ్యాత్క్షోణి గారాడ, హె
చ్చిన సౌభాగ్య సువర్ణ మందిర సమా
సీనుండవై హాయిగా
కనుమూయందగునా పరాకుపడి, యిం
క న్మేలుకొమ్మా! ధరా
జనయిత్రీమణి తమ్ముగుఱ్ఱలకు స్వే
చ్ఛాభిక్ష లర్థించెడిన్."

అని అస్పృశ్యతాజాడ్యాన్ని దేశంనుండి పారదోలవలెనని కోరుతున్నాడు. తన ఆశయాలను ఆమోదింపక, తన్ను నిరసించి, తన్ను ఆదరింపని లోకాన్ని కవి లక్ష్యపెట్టలేదు.

"నన్ను నిరసించువారి యానందమందు
నాకు భాగమ్ము వల దొక్కనాటికైన,
చీకటులు జీల్చికొని వచ్చు నీ కరాళ
గానరవములనే నా సుఖమ్ము కలదు!

* * *

మ్రొక్కనకొలంది గాలితో ద్రొక్కుచున్న
యీ కఠినలోక మెల్ల బహిష్కృతమ్ము,
రండు, చిమ్మటలార! ఈ రాత్రివేళ
నావలెనె పాడుకొను మీరె నాకు సఖులు!"

అని నిర్భయంగా లోకమువైపు పెడమొగము త్రిప్పినాడు.

"ఏ కడల మిన్నుమను చుక్కయేని లేని
యీ నభము క్రుంగి కూలిపోయెడివిధాన
కారుమబ్బులె కాదు, చీకటులె గాదు
క్రమ్ముకొననిమ్ము, కరడులు గట్టనిమ్ము,
వలపుతీపి యెరుంగని వట్టిరాతి
గుండెలోకమ్ము నిప్పులు గురియనిమ్ము,
హృదయ మున్నంతవరకు, నా ప్రేమకాంక్ష
బ్రతికియున్నంతవర కేడ్చి బ్రదుకుచుందు!
ఏ వెలుగు నన్ను తనదరి కీడ్చుకొనునొ!
ఏ తలపు దారి సూపునో!"

అని తనహృదయంలోని అశాంతిని వెలువరించినాడు. ఈ కావ్యంలో కవిహృదయం నిర్మలంగా, నిశ్చలంగా ప్రతిబింబించినందువలననే అంత రసవంతంగా ఉన్నది. ఈ విధంగా హృదయాన్ని గ్రుమ్మరించి, సంఘాన్ని మరమ్మతుచేయడానికిని, సోదరమానవులయందు కార్యాసక్తిని, అకుంఠితమైన దేశభక్తిని కలిగించడానికిని ఎన్నో ఏకాంకనాటకములు, ప్రహసనాలు ఈనవయుగంలో వెలుగుచూచినవి. తాను చెప్పదలచిన విషయాలను సూటిగా, నిర్మొఖమాటంగా కవి చెప్పివేసినాడు. అద్దములో నీడవలె తన రచనలో తాను ప్రతిబింబించి, ఒక నూతనశకాన్ని తెలుగు వాఙ్మయచరిత్రలో పాదుకొల్పినాడు.

"ఆకలిబాధచే జెమట
లారని గాసికి నోర్చి, ప్రాణముల్
పోకడపెట్టువారి శ్రమ
మున్ రుధిరమ్ము గడించి యీయగా
జేకురినట్టి యర్థము లి
సీ యని రోయ కేటుల్ భుజింతు వ
న్నా, కృపమాలి, ఘోరకలు
షాక్తత దుచ్ఛములైన భోగముల్?"

అని సిరిగర్వమున కాలుముబుచ్చువారిని మందలిస్తూఉన్నాడు. మొత్తముమీద అనువాదాల మోజు అంతరించినది; అనుకరణాల యుగం అడుగంటినది; స్వాతంత్ర్యరచన సాగించడానికిని, తనఆశయాలను వెల్లడించి లోకాన్ని దిద్దడానికిని కవికి అవకాశం లభించినది.

ఒకవిషయాన్నిగూర్చి క్లుప్తంగా, దాదాపు నూరుపద్యాలకు మించకుండా ఒక రసవంతమైన కావ్యాన్ని సృష్టించే పద్ధతి ఈ యుగంలోనే తలచూపినది. ఇష్టదేవతాప్రార్థనలు, కృతిపతివంశావళి, కథోపసంహారం, కావ్యోపసంహారం, ఆశ్వాసాంతపద్యాలు మొదలైన పూర్వమర్యాదలు మరుగునచేరినవి. కథావస్తువుకు చెందిన విషయాన్ని ప్రస్తరించే పద్యంతోనే సరాసరి ప్రారంభించడం జరుగుతున్నది. మానవాతీతవిషయాలనుగూర్చి వర్ణనలు కానుపించడం లేదు. మానవుని నిత్యజీవితంలో జరిగేవిషయాలనే తీసుకుని,ఏవిధంగా మానవుడొక్కొక్కసారి తప్పటడుగులు వేస్తున్నాడో, దానికి నచ్చే విధంగా, వాని హృదయాన్ని కదిలించే విధంగా, వానిలో పరివర్తన కలిగేవిధంగా నేడు కవులు ప్రయత్నిస్తున్నారు.

"భరతజనయిత్రి సుకృతతపఃఫలమ్ము
లన నుదయమైన యువజను లక్కటకట
అధమపౌరుష మనక కన్యల వరింప
శుల్కముల కాసజేసెడు శూరు లయిరె!

* * *

పశుసహజమైన పురుషస్వభావ మిటుల
బావనస్త్రీ కళాభాగపదవి నింత
నిరసనోన్మాదదృష్టి గణింపకున్న?
ఋషిమహాదర్శముల నన్వయింత్రె యిట్లు?

* * *

కన్నియను బెండ్లియాడునో? కన్నెతండ్రి
యర్పణముజేయు శుల్కదివ్యాప్సరసను
బెండ్లియాడునో యకట యీ పెండ్లికొడుకు!
అడుగరే యొక్కరయిన నీయార్యసుతులు!"

అని కట్నములపై కాంక్షగల యువకులను కవి ప్రశ్నిస్తున్నాడు. హృదయంగల ప్రతియువకుడును తన వివాహకాలంలో ఈ సందేశాన్ని మరచిపోగలుగునా? నేటి వాఙ్మయసందేశము అనితరతుల్యమైనదని నిరూపించడానికి ఈ ఒక్కవిషయం చాలదా?

ప్రార్థనపద్యాలలో ఈ నవయుగంలో చాలా మార్పు కనుపించుతున్నది. దశావతారప్రశంస, శతకములు మొదలైనవి మూలజేరినవి. ఏదో ఒక అవతారాన్ని నిర్ణయించుకొని, ఆ అవతారకాలంలో జరుపబడిన వీనుమిగిలిన విషయాలనుగూర్చి పద్యాలు వ్రాస్తూ, ప్రతిపద్యంచివరా ఆ అవతారాన్నిగూర్చి ప్రార్థనజరుపుతూఉన్న పద్ధతి నేడు కానరాదు. ప్రకృతికిని భగవంతునకును గల సన్నిహితసంబంధాన్ని, భగవంతుని లీలావికాసాలు ప్రకృతిలో ప్రతిఫలించే విషయాన్ని నేటి కవులు పూర్తిగా గ్రహించినారు. అందులకే

"ఘనఘనాఘనము చీకటిమేడ వెలిగించు
మెఱపుదివ్వెల నూనె తరుగలేదు,
పవలు రాతిరి తీరుబడి లేక ఘోషించు
తోయధీశుని గొంతు రాయలేదు,
ఇనబాలకుని దినమ్మును గర్భమున బూను
పొడుపుదిక్సతి కాన్పు లుడుగలేదు,
ఋతురాజు ధారుణీసతికి సొమ్ములు పెట్టి
కులికించుపని మానుకొనగలేదు,
విశ్వనిర్మాత చల్లని వీక్షణమున
నేటికిని గెంపుచార గన్పింపలేదు,
మూర్ఖలోకమ! దినమెల్ల ముగియలేదు,
దీప మున్నది. హృదయంబు దిద్దుకొనుము"

అని మానవలోకాన్ని కవి హెచ్చరిస్తూ ఉన్నాడు. ఒక విగ్రహాన్ని ఎదురుగా పెట్టుకుని, కండ్లుమూసుకొన్నంతమాత్రంలో భగవంతుడు సంతోషింపడు, మానవుని విధ్యుక్తధర్మం వేరే ఉన్నది అని తెలుపుతూ ఈక్రింది గేయ మెంత రసవంతంగాను, ఆలోచన రేపునదిగాను ఉన్నదో, చూడండి:

"ప్రతిమ నొక్కటి మలచినా నది
ప్రతిఫలించిన దంద మంతా
తనివి తీరగ విగ్రహంబు న
లంకరించితిని;

# ది సౌత్ ఇండియా కో-ఆపరేటివ్

## ఇన్ష్యూరెన్సు సొసైటీ లిమిటెడ్, మదరాసు.

(కో ఆపరేటివ్ సొసైటీస్ ఆక్టు ననుసరించి రిజిస్టరు)

ప్రెసిడెంటు: గౌ॥ శ్రీయుత వి. రామదాసుపంతులుగారు, బి. ఏ., బి. యల్.

---

### గర్వింపదగిన క్రొత్తవ్యాపారము రికార్డు

**(1939 కాలెండరు సం॥ 1-1-1939—31-12-1939)**

| | |
|---|---|
| సం॥లో చేరిన ప్రపోజల్సు | రు. 35,07,075 |
| సం॥లో జారీచేసిన పాలసీలు | రు. 28,25,000 |

మొదటినుండి చెల్లించిన వ్యాపారము (8 సం॥లకంటె తక్కువ సమయములో) ఒకకోటి మించినది.

పైఅంకెలు ప్రజలకు సహకారసంస్థలపై గల విశ్వాసమును ప్రకటించుచున్నవి.

**సౌత్ ఇండియా కో-ఆపరేటివ్ ఇన్ష్యూరెన్సు సొసైటీ** కేవలము పాలసీదారులసంస్థ. షేరు లేక డిబెంచరు మూలధనము అవసరము లేదు.

లాభమంతా పాలసీదారులకే చెందును. ఇది ప్రత్యేక విశేషము.

| | |
|---|---|
| సుస్థిరమైన ఇన్వెస్టుమెంటు: | గవర్నమెంటు సూపర్ విజన్: |
| మితవ్యయముతోకూడిన మేనేజిమెంటు: | తక్కువప్రిమియం రేట్లు: |
| హెచ్చులాభము: | ఎక్కువ లాభములతోకూడిన ... షరతులు: |

సమస్తములైన ... పాలసీలు ... రేట్లు

ఇవన్నియు ఈసంస్థ విశేషాంశములు.

ఈసొసైటీలో పాలసీ ఎక్కువ సంఖ్యలో చేకూర్చుచున్నది

ఏజన్సీ - ఎక్కువ గౌరవప్రదమైన ఉద్యోగము.

వి. వెంకటాచలం, యం. ఏ., బి. యల్.,
కార్యదర్శి.




# జండు
# అయొడైజ్డ్ సరసపరిల్లా

రక్తశుద్ధిని కలుగజేయు దివ్యౌషధము. సార్సా (సుగంధిపాల) యుండుటను, దాని వలన నచ్చు కీళ్ళ నొప్పులు, కీళ్ళవాపులు, చర్మము మందుట మొదలగువాటి యందును కడు శీఘ్రముగ గుణము నిచ్చును. సర్సపరిల్లా మందు అన్ని విధములగు సల్లనిమచ్చలను పోగొట్టును. అశుద్ధ రక్తమువలన సంభవించు వ్యాధు లన్నిటికిని నమ్మకమైన మందు. హిందూ దేశపు సుగంధిపాల వేళ్ళతో తయారుచేయబడినది. ప్రతి డ్రామునందును 2 గ్రెయినులు పొటాసియం అయొడైడ్ చేరియున్నది.

**సీసా రూ. 1-1-0.**

ముఖ్య ఏజంట్లు:—

| | | |
|---|---|---|
| బెజవాడ వంద్రము ఈశ్వర అండు కో. | [illegible] | విశాఖపట్టణం [illegible] అండు కో. |
| మచిలీపట్టణం [illegible] మాణిక్యరావు | [illegible] & [illegible] | అనకాపల్లి కె. యాం. స్టోర్సు. |
| నెల్లూరు మెడికల్ ఫార్మసీ. | [illegible] | వంగవోలు రాజా పద్దసుబ్బారాయుడు [illegible] |
| తెనాలి శ్రీకృష్ణా ఫార్మసీ స్టోర్సు. | [illegible] మెడికల్ స్టోర్సు. | రాజమండ్రి ఈశ్వరదాస్ అండు కో. |

లేనియెడల రాజధాని ఏజంట్లవద్ద దొరుకును.

**దామోదర్ అండు కో., 78, చైనాబజారు రోడ్డు, మదరాసు.**

---

# తుపాకులు, తోటాలు



ఒంటినల్లి, రెండునల్లి తోటాతుపాకులు, కేపుతుపాకులు, రివాల్వర్లు పిస్టోలులు సరసమైన ధరలకు తోటాలు సహా మావద్ద దొరకును.

అన్నివిధములగు తుపాకుల మరామత్తు (రిపేర్లు) చేయుదుము.

**యం. వి. రామానుజంశెట్టి అండు కంపెని,**
**12, బ్రాడ్వే, మద్రాసు.**

---

# ఆలెన్ అండ్ కో.,

(రిజిష్టర్డు)

**Allen & Co., (Regd.)**

కెమిస్టులు మరియు డ్రగ్గిస్టులు.

4/106, నైనప్పనాయక్ వీధి,
పి. టి. మదరాసు.

గవర్నమెంటు ఆసుపత్రులకు, మిషను ఆసుపత్రులకు, మునిసిపాలిటీలకు, ఎస్టేటులకు, [illegible] ఇండియా [illegible] [illegible] దారులు.

స్వాంత పరిశీలన చేసి [illegible] పంపబడును.

రేట్లు పోటీకి తగినవి. చార్జీలుసరసమైనది.

పూర్తి వివరములకు వ్రాయుడు.

టెలిఫోను నంబరు 3554.

మంచినగలూ, మంచిగంధము;
మంచి మంచి రకాల పూలూ
ప్రతిమ కుంచితి, హృదిని నిల్పితి,
తపము చేసితిని;
ప్రక్కనే పొంచున్న లోకపు
మాని సొక్కడు పెదవి విరిచెను
'ఎందుకో ఈ వ్యర్థ యత్నము
లెందుకో?' అనియెన్.

* * *

శిరము వంచితి, కనులు మూసితి
మౌనముద్రవహించియుంటిని
ప్రక్క మానిసి పలికె మళ్లీ
ప్రస్ఫుటముగాగన్:
'ఎందుకో ఈ మౌన మూనుట?
ఎందుకో ఈ మాంద్య మంతా?
పోయి సాంఘికసేవ చేస్తే
పుణ్య ముండునుగా.' "

భగవంతుని గూర్చి చేసే ప్రతి ఆలోచనా, ఖర్చుపెట్టే ధనం ఎన్నికకు రాకుండాపోతే భగవంతుడు సంతోషింపడు. బీదలను రక్షించడం, పరులకు సేవచేయటం భగవంతుని అలరించటానికి ముఖ్యమార్గా లని నేడు కవులు వివరించారు.

"కొడుకులు లేనివారలకు
గూరిమిబిడ్డవు, మాతృహీనులకొ
బుడుతల కెల్ల దల్లి వయి
పోషణ సేయుము, 'నా' యనంగ లే
కడలెడు దీనులన్ మనుపు,
మూర్తుల కాదరువై భజింపు, మీ
పుడమి దివమ్ము సల్పు మిదె
పో పరమార్థము బౌద్ధజాతికిన్."

అని ప్రబోధించినారు. అనుసరింపతగిన నవ్యాంధ్ర వాఙ్మయ సందేశ మిది.

కవులయొక్క దృక్పథంలోను, కూర్పునేర్పులోను ఈవిధంగా మార్పులు వచ్చినవి. తెనుగువాని ఆత్మ చచ్చిపోలేదు, తెనుగుభాషా వాహిని ఇంకా కాలంతోపాటు ప్రవహిస్తూనే ఉన్నది' అని సగర్వంగా చెప్పుకొనడానికి ఈమార్పులు, ఈకూర్పులు కోరతగినవిగా ఉన్నవి.

"కృష్ణాతరంగపంక్తిన్ త్రొక్కి త్రుళ్లింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాడు,
ఇంటింట దేశిసాహిత్యదీపములతో
నాంధ్రతేజస్సు రాపాడునాడు,
సుకుమారశిల్పవస్తుప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాడు,
సమదసేనావ్యూహ జయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాడు
చూచి, సంతోషమున తల లూచి, గర్వ
మూచి ఆంధ్రపుత్రీపుత్రు లందగలరు
శాంతి, నందాక లేదు విశ్రాంతి మనకు
కంకణవిసర్జనల కిది కాల మగునె?"

అను కవిపలుకులకు చెవియొగ్గి, ఆంధ్రభాషోద్ధరణమునకును, ఆంధ్రరాష్ట్రోద్యమానికిని తెలుగువారు నడుములు బిగించి ముందడుగు వేయుదురుగాక.



# చంద్రవదన-మోహియార్*

ఒక చారిత్రక చిత్రణ ::: ::: శ్రీ ఆదిభట్ల రామమూర్తి

అవియ మొహరముపండుగయందు ధ్వజాలు – పీర్ల పంజాల భక్తి నిల్పెడు దినాలు:
అవియ లాడీల ధరియించి హైందవాళి – ఐకమత్యమ్ము నెఱపు దివ్యక్షణాలు.

*　　　*　　　*　　　*　　　*

నాడు నృసింహదేవుతిరునాళ్లట, సందడిగా జనమ్ము లే
వాడను జూచినం గదిరిపట్టణవీథులు నిండినారు; మా
ర్వాడి తురుష్కవర్తకులు వందలు వేలును గుప్పతెప్ప లా
యేడు బజారు వెట్టిరి సమృద్ధముతో నవరత్నరాసులన్.

కేలను రాగిరింగులు, వికీర్ణములై జడగట్టు కేశముల్,
వ్రాలిన ప్రాయముల్, ముదురుబారిన దీర్ఘపు వింతవింత దా
డీలును, క్రొత్తక్రొత్త పగిడీలును, జానువులంటు గావి సె
ల్లాలును గల్గి జోహుకుములం బచరించి 'నమాజు' సేయు లుం
గీల మహమ్మదీయుల ఫకీర్లు మకాము లొనర్చి రాయెడన్.

అల్లదె, దగ్గరగా రే – పల్లెంగల రాజవీథిభవనములందున్
దెల్లంబయి, సుందరమయి – కళ్లంబడు భూరిమహలు గంటే! అచటన్.—

సన్నని పాలపొంగులఁ బసందుగఁ దోఁచెడు క్షీరఫేనపుం
జిన్నెలఁ దోఁచుఁ గ్రొందళుకు జీవము దాల్చెనో, లేసులాబి లే
క న్నవనీతకోమల వికాసతనుద్యుతి రూపుసెందెనో,
వెన్నెలవాకలం దొరలు ప్రేమతరంగము గడ్డకట్టెనో.

నా యలరున్ సొబంగులలనామణి, జవ్వని, షోడశాబ్దపుం
బ్రాయపుఁజుక్క యొత్తు పురపాలకు దేవిడిముందుఁ గాపలా
గాయుచునున్న సైనికుల కాజ్ఞ అదే, యొనరించె: "పూజకుం
బోయెద నిప్పుడే సకలముం జతగూర్పుఁడి సత్వరంబునన్"

*　　　*　　　*　　　*　　　*

---

* ఈపేరుగల గోరీనిగూర్చిన ఐతిహ్యానికి ఇది పద్యరూపం. అనంతపురమండలంలోని 'కదిరి' పట్టణపరిసరాల్లో ఈగోరీ నేటికిని కనబడుతుంది. పదిహేనవ శతాబ్దంలో, దేవరాయలకాలంనుండీ హిందూమహమ్మదీయ సామరస్యప్రయత్నాలు ప్రాచుర్యం వహించాయనుటకు ఇదే ప్రబలనిదర్శనం. ప్రచారంలో ఉండే ముఖ్యమైన ఐతిహ్యవస్తువుకు ప్రమాదంలేకుండా, మధ్యను కనబడే చిన్న కథాకల్పనమాత్రము కేవలం ఐచ్ఛికము.

ప్రక్క పేజీ చూడుడు

వాలుంజూపు మెఱుంగుటగ్గి సెగ గోవాళ్లెల్ల నీర్కాఁగఁ, బు
ష్పాలంభూషితమైన వాలుజడ సర్పభ్రాంతి దీపింప, అం
దాలందోగెడు క్రొమ్మెఱుంగుపస విన్నాణంబు లేజవ్వన
శ్రీలం దొందొణుకాడ మన్మథజయశ్రీ బావుటా యెత్తఁగన్.

పదునార్వన్నెపసిండిఛాయ నునులావణ్యంబు మిట్టాడ, నె
న్నుదుటం దిద్దిన చాదుబొట్టు బలువిందు ల్జేయఁగాఁ, జూపుఁకు
మ్మెదబారుల్ కుచపుష్పగుచ్ఛములకై మేలంబులాడన్ శుభా
స్పదమౌ నగ్గజయాన కంకణకణక్వాణానునాదంబులన్.

పూతపసిండిపల్లియరముం గొని, పుష్పము, లక్షతల్, సుహృ
ద్వ్రాతములైన తీయఫలముల్, బసుపున్, విడియమ్ము వెట్టి, హ్యా
జ్ఞాతుని దంతివోలెఁ, బరిచారిక లెల్లను వెంట రా, జగ
న్మాత భవానిఁ గొల్వఁ బయనంబయె మంగళవాద్యఘోషలన్.

* * * * *

ఈమె ఎవరోయి...సరిసరి-స్మృతికివచ్చె: - ప్రాంతరేపల్లెపట్టణప్రాంతమందు
ఘనత గాంచిన రంగనాయనికుమార్తె: - చంద్రవదనాఖ్య, విశ్రుతసార్థకాఖ్య.

## ౨

చేలఁ బసిండిజిల్గునగిషీలజరీల్ మిఱుమిట్లు గొల్పఁ, గెం
గేలున వజ్రపుంగ్రము జిగేలునఁ గాంతుల నీన, నూలుబ
స్త్రాలను రత్నరాసు లమితంబుగఁ బోసి, నృసింహునాలయ
శ్రీలను వన్నెకెక్కు నగరీకులదేవత ఆలయంపు మో
సాలఁ దురుష్కుఁ డొక్కఁడు బజారును బెట్టెను, దేశ మెద్దియో?

పచ్చని మైఛాయయు, గో - ర్వెచ్చని మీఁగడల వీథిఁ బెట్టెడు నవక
మ్మచ్చున లాగు శలాకల - మచ్చుం జిగి పారశీక మనఁదగియుండెన్.

అదిగో! చూడు మదేలకో అచటి బేహారిం బ్రశంసించుచు
న్నది, రంగాధిపుపుత్రిదాసి వినతాంబై యుండవచ్చున్, సరే,
మృదులంబైన గుసంగుసల్ వినఁగనయ్యెన్, గొంచె మాలింపు, మె
య్యదియో మంత్రరహస్య మయ్యదియ కౌనై యుండనోపుం జుమీ.

“ మొహియార్ ! వచ్చుచునుండె నీ వలచు సమ్మోహస్వరూపమ్ము; ప్ర
త్యహము న్నాచెలి నీదు రూప గుణవర్ణాళిన్ బ్రశంసించి, తం
డ్రిహయామ్ముం దలపోసి బెగ్గడిలుచుండెన్ సాహసింపంగఁ దా,
నహహా ! ఎట్టి యుపాయముం గలిసిరాదాయె న్నిమున్ గూర్పఁగన్.

కలనైనన్ విడు మా మెకేల్గొనెదు కాంక్షాకారణోద్యోగ ; మెం
దుల కీ ఆశలు ? అందరాని ఫలమున్ గోయంగఁ గార్యంబె అ

ప్రక్క పేజీ చూడుడు

ట్టిలు సాఁచన్ ? మతకర్షులన్ దినదినక్రోధంబులం బెంచు హిం
దుల ఇస్లాముల సామరస్యము లభించుం బండు గెడ్డో కదా!
వెలుఁగుం జీఁకటి వియ్యమందునె వణిగ్వరా, మొహియార్వరా!

మతి మానంగదరన్న! సాహసమున న్నా నెచ్చెలిం బట్టినన్
బ్రతుకే మోసము వచ్చు: ఆపయిని జీవాల్ వాయు నాతన్వి, దుః
ఖితమంబా కడగండ్లఁ బోవిడిచి 'నిక్కా' చేసుకోరాదె మీ
మతపుంగెంజిగురాకుబోఁడి నొకతెన్ ? మల్లింపు మీ మోహమున్,
బ్రతికున్నన్ బలుసాకు; సోపలుకులం బాటింపవే మోహియార్!"

*　　　*　　　*　　　*　　　*

వినతాంబపలుకులకు మన - మున నైరాశ్యమ్ము బలితపున్ వలపును క్రొ
న్ననలను విరియుచు సాహస - మునఁబండిన హృత్ప్రకోపమున మొహియ రనెన్:

"ప్రణయకీలల ఉడికిపోయిన హృదంత - రాళమున శాంతినిల్చునె ? రత్నమాల,
ఇదిగొ, నీ కంఠసీమ భూషించువాఁడ - ప్రేయసిం జూపు మదె పదివేలు నాకు.

బిగువుంగౌఁగిటఁ జేర్చి, ఆమెవలపుంబీయూషముం గ్రోలి, నె
మ్మొగపుంజందురులేఁతవెన్నెలల దోబూచు ల్తరంగించి, ప్రే
మగతిం జిల్లులువడ్డ నాహృదయపద్మమ్మున్ సనాళమ్ముగాఁ
దెగఁగోతున్; ప్రణయార్ద్రగీతికల నాదింపన్ వలన్గాక జీ
ర్ణగళాపశ్రుతులీను మావలపువీణాతంత్రులన్ భగ్నమం
దఁగఁజేతున్; వినతాంబ! చంద్రవదనన్ గన్పింపఁజేయంగదే!"

సాహసంబును వారింప శక్తిలేక - నీళ్లు నమలుచు వినతాంబ నిల్చె; చూడు,
మదిగొ! తుద కేదియో రహస్యమును దెల్పి - ఆమె అంతర్హితంబయ్యె, నంతలోన . . . .

రాగికమండలమ్మును, శిరంబునకుం బులితోలు, బెత్తముల్,
ఓగిరపుంగపాల, నిడు యోగపుఁబట్టెలు, భూతిపుండ్రముల్
యోగపుదండమున్, జపసరోల్లసనంబును గల్గి, అమ్మవా
గ్లోగిలిలోని మంటపుటరుంగునఁ బీఁఠముపైచె, క్రొత్తబై
రాగి యొకండు వింతరుదురాకలమాలలఁ జేతఁ ద్రిప్పుచున్.

## 3

అదిగో! పూజ సమాప్తమయ్యె నను ఘంటారావముల్; జూడు, మ
ల్లదె! రంగాధిపుపుత్రి; మేలిముసు గల్లాడంగ ఆవచ్చు చు
న్నదె దాసీ వినతాంబ; ఇర్వురకు వెన్కన్ బారులై తీర్చునై
న్యదళంబుల్, అదె! వచ్చినా రపుడె సింహద్వారమధ్యంబుకున్.

ఎందులకో జటధారియు - సందడిగాఁ జంద్రవదనసరసకుఁ జనె; గుం
డెం దీసిన సాహస! మా - సుందరిఁ గౌఁగింట మాయజోగి గరంచెన్!!

పక్క పేజీ చూడుడు

# I.E.W.

## ALTERNATING AND DIRECT CURRENT CEILING AND TABLE FANS



**ఇండియా - రోటాస్**
మరియు **భారత్** డి. సి. మరియు ఏ. సి. కర్రెంటులకు వేర్వేరుగా నిర్దుష్టమైన సీలింగ్ ఫ్యానులు దొరుకును. తృప్తికరముగ పనిచేయునట్లు అందముగా నుండునట్లు తయారుచేయబడినవి.



- తక్కువ కర్రెంటుతోను, తక్కువ ఖర్చుతోను పనిచేయును
- వంపుతిరిగిన, పేటెంటెడ్ బ్లేడ్లు కలిగినవి, గాలి బాగుగ వచ్చును. సంతోషకరముగ పనిచేయును.
- మొదటిరకముసామాను కలిగినది. అందుచే పూర్తిగ నమ్మకమైనది.
- కాలపరిమితి పరీక్షకు లోనైనది - అందుచే సగర్వమైన ప్రొడక్టు అని చెప్పవచ్చును.

మా తారా టేబిల్ ఫ్యానులు, క్యాబిన్ రకములు అందమైనవి.

**ఇండియాలో చేయుబడినది.**

ది ఇండియా ఎలెక్ట్రిక్ వర్క్సు, లిమిటెడ్,

12-ఏ, లింగచెట్టివీధి, మద్రాసు.


KUBERA PICTURES
Presents
డైరెక్టర్:
చిత్రపు
నారాయణ
మూర్తి,
బి. ఏ.
Mahi Ravana

వెఱబట్టు సాహసమునకు - వెఱగంది, యొకింత దేరి, ప్రియుఁడని యెద ను
క్కిరిబిక్కిరై సతీమణి - కరిగెన్ మొహియరుని బిగువుఁ గౌఁగిలిలోనన్.

* * * * *

జాతిమతభేద కులపిశాచమ్ములార! - ప్రేమహృదయాలఁ గబళింప రేగినారె!
వలపుఁదీపియెఱుంగని వట్టిఱాతి - గుండెలోకమ్మ! నిప్పులు కురియుచుండె!!!

* * * * *

అదిగో! ఆబాకుమొన మొహియరునివక్షు - ముం బెకల్చుచు హృద్భాండముం బగిల్చి,
ద్రావుచున్నది వెచ్చని రక్తధార; - అరరె, మరియొక బల్లె! మబ్బా!! విశీర్ణ
భగ్నహృదయం బెదో తొట్రుపాటుతోడ - ఎలుగు రాపడ నిట్లు వచించుచుండె:

"ప్రేయసీ! చంద్రవదన! సత్ప్రేమవహ్ని - కరిగిపోయిన హృచ్ఛలాకలు ద్రవించి,
శాంతి శీతల వాయు సంస్పర్శ గడ్డ- కట్టుశుష్కపుటడియాస కాలిపోవ,
రాగమెఱుఁగని వికృతిస్వరమ్ముతోడ - భావిప్రేమైకజీవుల ప్రణయగీతి
శుష్కమృతరోదనమ్మన శ్రుతిలయించి - పాడుకొందును నావల్లకాడునందు;

అమలప్రేమార్థ భ్రష్ట సింహాసనమ్ము - అధివసించి వియోగరాజ్యమ్ము నేల,
గాఢకుటిలనైరాశ్యాంధకారమందు - మృత్యుదేవతకోరల మెఱుగుదీప్తి
దారిఁ జూప, శ్మశానసౌధమ్ముఁ జేర - నరుగుచుంటిని బాష్పకణాళితోడ;

నీపవిత్ర పదాబ్జాల నిలుచు నిండు - చనవు నోసఁగితి వంతియేచాలు; ఈ వి
షాదయాత్రావిరాగమ్ము సమసిపోవ - ప్రేమనిండిన ఈశ్వరీగభీర
గర్భకుహరాల నే నిల్లు కట్టుకొందు;

రమ్ము ప్రేయసి నా శ్మశానమ్ముకడకు; - ప్రణయనిశ్వాసభర మంతవఱకు మోసి
ప్రేమసన్యాసినై నే నిరీక్షసేతు - నీకొఱకు; నీవు నాదుసన్నిధికి రాఁగ
బొమికకప్రపుమాల నిప్పులను ప్రేల్చి - బ్రమకుఁగంచాన వలపునివాళి యిత్తు;

శిథిలమై మాంసఖండాలు చివికిపోవ - కొయ్యబారిన ఎముకలగూడుఁ జేరి
కొఱుక నుంకించు చెదపురుగులకుఁ దేమ - నీయఁ గన్నీళ్లఁ జాగ్రత చేయుచుంటి;
గుండె చమురున భగభగమండిపోవు - ప్రేమదీపికరుచు లంతరించి, ఆరి
అంతులేనట్టి భయదశూన్యాలయంపు - గహ్వరమ్మునఁ గారుచీఁకట్లఁ గలియ,
వలపుటంధుండనై ప్రేమభరముతోడ - క్రుంగి, గిజగిజ కొట్టుకొనుచునుంటి;

అదె! శ్మశాన స్వస్తివాక్యమ్ము; అదె, అ - కాలమృత్యువు దంష్ట్రికరాళగర్జ,
అవిగో! నావ్యర్థజీవితాధ్యాయమందు - అంతిమాక్షరవికట విన్యాసదీప్తి;
ఏది . . కడసారి . . . . కౌఁ . . గి . . . లి . . . . . . . . "

## ౪

వాకిలి కడ్డముగా భయ - దాకృతిని బరున్న శవము నవలకుఁ ద్రోయం
గా కల సైనికవీరులు - చే కదిపిరి! కదల, దేమి చిత్రంబో కదా!

ప్రక్క పేజీ చూడుడు

తలవెంట్రుకవాసియును క - దలని శవమ్ముం గదల్ప దళీవాతుల ని
ష్ఫలయత్నముఁ గని, కనుపా - పల నీర్గ్రమ్మంగఁ జంద్రవదన వచించెన్.

"ప్రేమజీవులఁ బొట్టను పెట్టుకొన్న - పాడులోకమ్మ! నాదు నిర్భాగ్యశవము
మొహియరునిశవమునఁ గట్టి మోసుకొమ్మ - తృప్తియగు" నంచు వాడికత్తిఁ హృదబ్జ
మున బలిమిగ్రుచ్చుకొని, జీవములను బాసి - ధరణి వ్రాలెను చంద్రవదన బిరాన!!!

కొండభారంపుశవములు బెండులౌచు - తేలువింతను హృత్సీమలో లయించి
హైందవ మహమ్మదీయసఖ్యంబు విగ్ర - హమ్ముఁ దాల్చిన ప్రేమజీవాళిఁ జేతు
లార, సంఘమ్ము, తప్తఖేదాశ్రువులను - మట్టిగల్పు పవిత్రసమాధి అదిగొ!

అదె, అనశ్రుత హిందూ మహమ్మదీయ - జన సుహృద్దీప్తి కరుడుగట్టిన మశీదు!
అదియ 'కాఫరు' 'తురక' దయ్యాలపోరు - బొగ్గులై సఖ్య మేర్పడ్డ పుణ్యభూమి!

ఆకడ ధూళిరేణువుల నైక్యము చెందెను ప్రేమగీతికా
నీకసుహృత్కణాళి; శయనించె పవిత్రహృదంతరాళ హిం
దూకలనావిభూతికలతో శ్రుతిఁ గల్పు మహమ్మదీయ శౌ
ర్యాకృతి; వియ్యమందెను పరస్పర ఘూర్ణ మతప్రబోధముల్.



# ధార్మికతవల్లమనదేశానికివచ్చినహాని

> నానావిధ వాఙ్మయాలయొక్క అనువాదాలు మనకు అమితంగా, అత్యవసరంగా కావలసి ఉన్నాయి

> అట్లని తెలుగులో ఇప్పుడు జరుగుతున్నరీతి అత్యాచారం చేయడం మాత్రం సహింపరానిది



'విషనాగు'

హిందూస్థానం ధర్మప్రాణదేశ మంటారు. ఇదే మన కొంపదీసింది. అతిగా బెల్లం తింటే ఏమవుతుంది? మధుమేహ మేగా! అలాగే మితిమించిన ధార్మికతవల్ల మన దేశానికి గొప్ప హాని కలిగింది. ఆర్యులు మధ్యఏషియానుంచి వచ్చినప్పుడు అనార్యులతో సంఘర్షణ జరిగినప్పటికీ భారత ప్రాకృతికసమృద్ధి ఇహాన్ని మరిపించింది. మనగడ్డ ప్రాకృతంగా పాడిపంటలకు, ప్రకృతిసౌందర్యానికి 'రత్నగర్భ' అయినందువల్ల కడుపులో ఎలుకలు పరుగెత్తేవి కాదు, చూడ్డానికి కన్నులపండువగా వుండేది. అందుచే మన పూర్వులు నిశ్చింతగా 'పరం' ను గురించి ఆలోచిస్తుండే వారు. బ్రతుకుతెరువును గురించి ఆలోచించే అవసరమే వారికి కలుగలేదు. కాని ఇదే రాను రాను రూఢిలోకి దిగింది. 'పరం' అనే మరీచిక వేపుకు పరుగెత్తడం మొదలెట్టారు. రూఢిబలిసింది. విచిత్రమయిన సాంఘికవర్గాలు, నియమాలు ఏర్పడ్డాయి. జ్ఞానసంపత్తి (విద్య) ఒకేవర్గవిశేషానికి వంశానుక్రమపిత్రుసంపత్తిగా మారింది. అందువల్ల సంఘంలో యీ వర్గానికి ప్రథమగౌరవస్థానం లభించింది. బుద్ధిజీవులకు గౌరవం లభించడం స్వాభావికమేగా! కాని యీ వర్గవిశేషంలో అకర్మణ్యత హెచ్చింది. 'పర' మనే ఎండమావుల్ని చూస్తుండడంవల్ల కళ్లుంటూకూడా గుడ్డివాళ్లయ్యారు. మూఢత్వం పెరిగింది. ఇటు చూడండి: దేశం ఇంగ్లీషువాళ్ల అధీనమయిపోయింది (పోతోందిగూడాను). పరతంత్రబేడీలు తయారవుతూ ఒక్కొక్క భారతీయుడికీ తగిలించబడుతున్నాయి. కాని మన శిక్షిత సమాజం కళ్లు తెరవనేలేదు! వారింకా తమ పవిత్రప్రపంచంలోనే వున్నారు. సర్ విలియమ్ జోన్స్(**Sir William Jones**)సంస్కృతం చదువుకొందామంటే పాపం పేగులు తెగినయ్యి. సంస్కృతంనేర్పే పండితుడే దొరకలేదు. పండితులందరూ 'బాయికాటు'చేశారట![1] ఎంత దేశభక్తి? దేశం పరాధీనమవనీకాని జిహ్వోద్యుతమయిన మృతభాష పరదేశీయులు నేర్చుకొంటే మయిలపడిపోతుందట! చూచారా, మన శిక్షితసమాజంమూఢతను! నేటి మన పరాధీనతకు కారణం సంఘానికి ఆయువుపట్టుఅయిన వర్గవిశేషశిక్షితసమాజమేకాని నోరులేని కర్షకకార్మికసమాజం కాజాలదు. అస్తు.

ఇతిహాసకాలం మన అనుభవప్రపంచానికి దూరమై, కేవల శబ్దప్రపంచంలోనే విరాజిల్లుతూ వున్నందువల్ల గొప్పగా కనిపించవచ్చు. అసలు 'శబ్దం'లో అతులితసౌందర్యం వుంది. అందుచే మనపూర్వులచరిత్ర మనకు గొప్పగానూ, సౌందర్యంగానూ కనిపిస్తుంది. పూర్వులఔన్నత్యంమీద, చరిత్రమీద గర్వపడడం ప్రతిజాతికీ సహజమే! కాని మనం కేవలం పూర్వుల యితిహాసంమీద గర్వపడక అనుభవ దృక్కులతో ప్రాచీన యితిహాసాన్ని పరిశీలిస్తే మనపతనం (నైతికంగా కాదు) క్రమక్రమాగతంగా ఎలా అవుతూ వచ్చిందీ కనిపించగలదు. దీనివల్ల మనవున్నతికిగూడ ముందుదోవ కనిపించుతుంది. మన పూర్వుల యితిహాస గౌరవ ప్రతిష్ఠలమీద నాకూ గర్వమే! ప్రపంచానికి సభ్యతను ప్రదానంచేసింది మనపూర్వులేగదా అని నా ఒళ్లు కూడ ఒక్కొక్కప్పుడు పులకరిస్తూంటుంది. కాని మన కీ శనిగ్రహం

---

1. ఆఖరుకి ఒక పండితవరుడు దొరికాడట—ఎన్నో షరతులమీద: అధ్యాపనమందిరం (రూము) వేరుగా వుండాలి; గురువులుగారు వచ్చేటప్పటికి రూము నీళ్లతో కడిగి శుచిచేయాలి; శిష్యుడు (విలియమ్) చదువుకోను వచ్చేప్పుడు కట్టుపంచె-వలెవాటు వేసుకరావాలి; ఆది నిబంధనలు. పాపం, పూజ్య విలియమ్‌కు చెప్పరానికష్టాలు పడవలసివచ్చింది సంస్కృతం చదవడానికి! ఆఖరికి ఎలాగైతేనేం, కర్మణ్యబుద్ధివల్ల సంస్కృతాన్ని సాధించారు. వీరి ప్రయత్నంవల్లనే 'బెంగాల్ ఏషియాటిక్ సొసయిటీ' (కలకత్తాలో) స్థాపించబడింది. అప్పటినుంచే మన ప్రాచీనసాహిత్యం — ఇతిహాసం వెలుగులోకి వచ్చాయి.

ఎప్పుడుపడితే నేటి కిట్టిదశకు వచ్చామో తెలుసుకోవద్దూ? ఇంగ్లీషు వాళ్లు పాదంపెట్టడంతోనే మన కీగతి కలుగలేదుగదా? అదివర కెన్నో బలహీనతలు మనజాతిలో వుండబట్టే అది యింతత్వరగా చితికిపోయింది!

ప్రథమం ప్రాచీనార్యులు అకర్మణ్యులు గారు. జీవితసమస్యను వారు మరిచిపోలేదు. వైదికవాఙ్మయంలో అణువు అణువునందును వీరి కర్మణ్యత, సూక్ష్మబుద్ధి కనిపిస్తోంది. ఇతిహాసాన్ని తిరగెయ్యండి: సముద్రంమీద విదేశయాత్రలు – వర్తకవ్యాపారం – వలసరాజ్య స్థాపనలు ఇత్యాదులు మనపూర్వుల కర్మణ్యతను, శ్రమశీలత్వాన్ని బోధిస్తున్నాయి. వైదికదర్శనవాఙ్మయాన్ని మించింది యింతవరకు ప్రపంచంలో మరొకటి లేదు. నేటి వైజ్ఞానికయుగంలోగూడ పాణినీయ వ్యాకరణాన్ని భాషావైజ్ఞానికులు(**Philologists**)ప్రబల ప్రమాణంగా తీసుకొంటున్నారు. పక్కా సనాతనుల్ని 'బ్రహ్మ' ప్రసాదించా డని చెప్పనీయండికాని వైదిక ఆయుర్వేదవాఙ్మయం మన పూర్వుల అన్వేషణశక్తిని వేనోళ్ల చాటుతోంది. ఎంత పరిశ్రమ—ఎంత ఎక్స్పెరిమెంటు (**Experiment**) చేస్తే నేడు వైజ్ఞానిక యుగంలో తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోగలిగిందో ఆలోచించండి!

అయితే రెండున్నరవేల ఏండ్లకిందటే నేటి వైజ్ఞానికగ్రంథాల్ని...ఎంతో వున్నతిపొందిన నేటి భాషావిజ్ఞానశాస్త్రాన్ని తలదన్నగలిగినటువంటి 'అష్టాధ్యాయి'ని వ్రాయగలిగిన మెదడు ఇప్పుడు లేదే? మరెప్పుడు మన కీ పతనం ప్రారంభించింది?

ఆర్యసంస్కృతిలో వర్ణభేదం ఏర్పడి, జ్ఞానసంపత్తి (విద్య) వర్గవిశేషానికి చెందిన రోజునే మనజాతిపతనం2 బీజారోపణ చేయబడింది. జాతిబుద్ధివికాసమార్గం సంకీర్ణ మయింది. జ్ఞానసంపత్తిని మానవ వికాసానికి వ్యక్తిగతంగా వుంచక ఒకేజాతికి అంటగట్టేప్పటికి అకర్మణ్యతకు తావుగలిగింది. రానురాను జాతిలో దౌర్బల్యం ఏర్పడింది. కాని బౌద్ధధర్మానికి పూర్వం ఆర్యుల్లో (మనజాతిలో) అలసత్వం రాలేదు. ఆర్యులదృష్టి 'పరం' వైపుకు (ఉపనిషత్తుల్ని చూడండి) వున్నప్పటికీ వారు జీవితరహస్యాన్ని మరచిపోలేదు. ప్రపంచాన్ని మరిచిపోకుండ కర్మజగత్తుమీదనే ఆధారపడి బ్రదుకు తెరువుమీదకూడ ఒకకన్ను వేసి వుండేవారు. అంటే భౌతిక జీవితాన్ని మరిచిపోలేదు. వారి ధార్మికత చాలా ఉదారంగా వుండేది. కాని బౌద్ధధర్మోత్పత్తితో భారతీయ భౌతికజీవితంలో క్షతి ఏర్పడింది. అసలు మనపతనారంభం ఇప్పటినుంచే! లోకజీవనంమీద గొప్ప నిరాశాభావం జనించింది. ఇదివరకు ఆర్యుల ఉదారధార్మికత— ఆచారవిచారాల్లో నిబిడమైవున్న దౌర్బల్యపతన బీజాన్ని నీళ్లు పోసి పెంచి పెద్దదాన్నిచేసింది బుద్ధధర్మమే! బౌద్ధదర్శన వాఙ్మయం గొప్పది కావచ్చును. దీన్ని కాదని నేను వాదించను. అయినా ఈ 'దర్శనం' లోకజీవనాన్ని వృద్ధిచేసేది కాదు. సంఘం (మనజాతి) లోకజీవనాన్ని విస్మరించింది. బుద్ధుని విచారాలు అప్పటి సంఘంలో విప్లవకరంగా వున్నప్పటికీ— అవి వ్యావహారికరూపం ధరించేప్పటికి మన పతనానికి కారణ మయినాయి. బౌద్ధకాలీన విచారభావాల్ని తెలుసుకోవడానికి యీ వుదాహరణ చూడండి: 'రాజగృహం'లో 'ఉపాలి' తల్లిదండ్రులు ఆలోచించారు—పిల్లాడికి ఏం నేర్పించాలా అని. ఆఖరికి వారు నిశ్చయించుకొన్నారు—లేఖ, గణన, రూపం నేర్పించినందువల్ల భవిష్యత్తులో వాడికి చాలా లాభమే కాని యీ మూటివల్ల క్రమంగా వేలికి, హృదయానికి, కళ్లకు క్లేశం కలుగుతుంది. కాబట్టి బౌద్ధ భిక్షువు (శ్రమణుడు)గా చేయడమే మంచిది. ఎందుకంటే శ్రమణులు చాలా సదాచారంగా వుంటారు. తినడానికి చాలా బాగా జరుగుతుంది. ఇంకా పండుకోవడానికి మంచి పాన్పులు గూడ దొరుకుతాయి.3 అప్పటి విచార వాతావరణాన్ని తెలుసుకోవడానికి జాతకకథల్లోని యీ ఒక్క వుదాహరణ చాలదా? తరువాత బౌద్ధధర్మం యిక్కణ్నుంచి లేచిపోయినప్పటికీ నవీన హిందూధర్మం దీనికన్నా ముందుకు మూడడుగులు ఎక్కువగానే నడిచింది—శిక్షితసమాజం లౌకికజీవనాన్ని పూర్తిగా త్యజించి ఆధ్యాత్మికం వేపుకు పరుగెత్తింది. మళ్లీ లోకజీవనంవేపుకు కన్నెత్తి చూడలేదు.

ప్రకృతిసౌందర్యసమృద్ధితో ఏర్పడిన ఉదారధార్మికత బౌద్ధధర్మోత్పత్తితో లోకజీవనాన్ని మరిపించి కట్టరధార్మికతగా ఏర్పడింది. లోకజీవనానికిపరే తన లోకాన్ని నిర్మించుకొంది. సంఘానికి హృదయమయిన శిక్షితసమాజం ధార్మికలోకానికి దాసురాలైంది.

ఈ మితిమీరిన ధార్మికత భౌతికవిషయాల్ని విస్మరింపజేసింది. ఒకవిధంగా 'జీవనం' ధర్మంకొరకేనేమో ననిపించింది!

బౌద్ధకాలంనుంచీ మన సాహిత్యాన్ని పరిశీలిస్తే ఇదంతా స్పష్టంగా కనిపించడంలేదూ?

పురాతత్వదృష్టితో చూస్తే మన (భారతీయ) ప్రాచీన సాహిత్యం గొప్ప విలువగలదే! అసలు పురాతత్వానికి చిన్ని యిటుకముక్కగూడ రత్నంలాంటిది. కాని వర్తమానం మన జీవితోపయోగంతో తూచి చూస్తే ప్రాచీనసాహిత్యం చాలా నిస్సారంగా— పిప్పిలాగా కనిపించగలదు. అందులోంచి చాలా తక్కువ రత్నాలే తేలుతాయి. బౌద్ధకాలంనంచీ ఏర్పడ్డ సాహిత్యంలో మరీని!

2. ఈ వ్యాసంలో 'పతనం'ను అంతటా 'భౌతికపతనం' అనేఅర్థంలోనే వుపయోగించాను. 3. మహావగ్గ ౧, ౪౯; భిక్షుపాచిత్తియ ౬౫, ౧.


పూర్ణాయుర్దా
-యమును
పొందుము
అతడు జీవిత సౌఖ్యమును పొందు దున్నాడు. ఎప్పుడు మనోధైర్యము కలిగి యున్నాడు. జీవితకష్టములను తృణప్రాయముగ నెదుర్కొనుచున్నాడు.
మీరుకూడ జీవితమునందు విజయమును పొందగలరు. మీరు మొదట ఆరోగ్యమును సంపాదించుకొనవలెను. ఆరోగ్యమును చేకూర్చుటకు వాటర్‌బరీస్ కాంపౌండు వలె మరొకటి పనిచేయదు. దానిలో లివర్, మాల్టు సారములు, లోహము, తామ్రము, పుష్టినికలిగించు యితర ఖనిజములు చేరియున్నవి.
వాటర్‌బరీస్ కాంపౌండును పదిహేనుదినములు వాడి దాని అద్భుతగుణమును తెలిసికొనుము.
మామూలుధరలకే దొరకును.
Waterbury's Compound
వాటర్‌బరీస్ కాంపౌండు
ఆరోగ్యమును కలిగించును.
Y24



## ఈ ఋతువులో

ఇండియాలోని వర్సైలీస్ సందర్శించుడు
బృందావన్ మైసూరు

## బృందావనమునకు వచ్చి మకాము చేయుడు.

భారతదేశములోని వర్సైలీస్ అని ప్రఖ్యాతి వహించిన బృందావనము గర్వమైన ఉన్నతమైన తోటలు, 150 అడుగుల ఎత్తునకుగూడ నీరు పైకివచ్చు ఊటలనేకము, గుబురుగా ఉండే పూలమొక్కలు, మనోహరమైన పచ్చికబయళ్లు, అద్భుతభవనముగా ప్రకాశించుచుండును.
అత్యధిక శోభతో కూడిన ఈ ప్రాంతమునకు ఎదురుగానున్న క్రొత్త హోటలు కృష్ణరాజసాగరు మైసూరుకు విచ్చేసిన అతిథికి అన్ని విధముల సౌకర్యములను చేకూర్చు నివాసగృహము.—దివ్యమైనవంట, విశాలమైనగదులు, నవనాగరిక సౌకర్యములు. మైసూరునుండి మోటారు కారులో అరగంట సేపు ప్రయాణము.



హోటలు కృష్ణరాజసాగరు

## బృందావనము సందర్శించి కృష్ణరాజ సాగరు హోటలులో మకాము చేయుడు.

పూర్తి వివరములకు ఈదిగువ ఎడ్రెసుకు వ్రాయుడు

యుగ్జిక్యూటివు ఇంజనీరు,
కృష్ణరాజసాగరు డివిజన్, కృష్ణరాజసాగరు.

భౌతికవిషయాలమీద విచారించడమే లేకపోయినప్పుడు వాటిమీద గ్రంథాలు ఎక్కడినుంచి తయారవుతాయి? పిండి లేకుండా రొట్టె తయారవుతుందీ?

నేడు మనం ఎంత పతనావస్థలో వున్నామో కొంచెం తల పైకెత్తి మాస్తున్నారూ పాఠకులు?

ముందుగానే ఏనుగులాగ 'భారతజాతి' గోతిలో పడివుండబట్టే ఇంగ్లీషువాళ్లు త్వరగా చేజిక్కించుకొన్నారు.

ప్రథమం ముసల్మానులుగూడ భారతజాతి ధార్మికపతనం[4]లో వుండబట్టే యిక్కడికి రాగలిగారు. ప్రత్యక్షంగా కార్యరూపేణ కనిపించే 'సోమనాథమందిరకాండం' ఉదాహరణకు చాలదూ?

ప్రాచీనార్యుల్లో వున్న దేశప్రేమ — జాతిభక్తి తరువాతి ఆర్యుల్లో, లేక భారతజాతిలో లేదనడం అతిశయోక్తి గాదు. ధర్మమూఢత అన్నిటినీ మరిపించింది.

నేడు — యీ రాష్ట్రజాగృతికాలంలోగూడ మనల్ని యీ ధర్మమూఢతే వెనక్కి లాక్కుపోతూంది!

* * * *

నేడు మన మొక రాజకీయదాస్యమే కాదు అనుభవించేది! అన్నివిధాలా మనం బందీలమే. ఎటు కదలబోయినా కాళ్లకు బంధాలు పడుతున్నాయి! ఒక రాజకీయదాస్యమే అయితే యింత అధఃగతిపాలయ్యేవాళ్లం గాదు!

మనల్ని పీడించేది భాషాదాస్యం!

భాషకూ, మానవుని ఆత్మకూ అవినాభావసంబంధం వుంది. మానవునిలో సోదరభావమును — నికటసంబంధాన్ని కలిగించేవి భాషా, భోజనం.

అటువంటప్పుడు మన (భారతీయ) భాషాదాస్యాన్ని ఆత్మికదాస్యం, లేక భావదాస్యం అనొచ్చుగాదూ!

ఈ భావదాస్యానికి చాలావరకు మనపూర్వులే కారణ మని వ్రాసుకొచ్చాను. బుద్ధుని తరువాతనుంచీ వచ్చిన మూఢధార్మికత మాత్రమే దీనికి ప్రబలకారణమని మళ్లా రాయిగుద్ది చెప్పగలను.

అయితే మరేమిటి చేసేది?

భారతీయభాషల్లో చదివేది ఏమిటి? నఖశిఖవర్ణన - నాయికాభేదం! 'నఖశిఖవర్ణన'ను తలుచుకొంటే తలవంచుకోవలసివస్తోంది. ఇంతకన్నా ఏముంది?

పోనీ, ఉత్తమసాహిత్యమే వుం దనుకోండి. దానివల్ల మనజీవితం గడవదుగదా! ప్లేటో (Plato) చెప్పినట్టుగా కల్పనాసంభూతమయిన సాహిత్యభావపుంజంలో పడి రాజకీయదాస్యంతోపాటు జీవితం మరీ అధోగతి పొందగలదు. అకర్మణ్యత ఎచ్చుతుంది. నేడు శృంగారసాహిత్యం చదివే విద్యార్థుల్లో దీన్ని స్పష్టంగా మాస్తున్నాం. సాహిత్యం మనోరంజనతోపాటు మానవీయ భావధారలో విప్లవం తీసుకరాగలశక్తి కలిగివున్నప్పటికీ మన లోకజీవనానికి పనికిరాదు. ఎన్ని పరిణామాలు (మార్పులు)పొంది రొట్టె మనముందుకు తినడానికి వచ్చిందో సాహిత్యం చెప్పలేదు.

నేడు మనభాషల్లో 'విజ్ఞానం'కు సంబంధించిన ఉత్తమ మౌలికగ్రంథాలు లేవనే చెప్పొచ్చు. అసలు మనతెలుగులో లేవనే చెప్పాలి. ప్రాచీన భారతదేశంలో విజ్ఞానోన్నతి చిన్హాలు కనిపిస్తున్నప్పటికిని మూఢధర్మప్రధానతవల్ల రానురాను వున్నతి పొందజాలకపోయింది.

భారతీయ దర్శనవాఙ్మయం గొప్పదైనప్పటికీ వర్తమాన దేశభాషల్లో — విస్తృతవిమర్శలతో — స్వతంత్రవ్యాఖ్యలతో — తెలియబరిచే పుస్తకాలు లేనేలేవు. హిందీమొదలగు వున్నతభాషల్ని వదిలేసెయ్యండి. మనతెలుగులో భారతీయదర్శనవాఙ్మయానికి సంబంధించిన గ్రంథా లెన్ని వున్నాయి?

వినయాశ్రమంవారు నాలుగువేదాల్నీ తెలుగులో అనువదించి ప్రకటిస్తున్నందుకు అభివందనాలు!

ఈ విధంగా వైదికవాఙ్మయం యావత్తూ వరుసగా — గ్రంథమాలగా ప్రకటించబడడం అతి ఆవశ్యకం.

వైదికవాఙ్మయాన్నిగురించిన్నీ, మన పురాతత్త్వాది ఇతిహాసవిషయాల్నిగురించిన్నీ ఇంగ్లీషు మొదలగు పాశ్చాత్యభాషల్లో వున్నన్ని పుస్తకాలు సంపూర్ణభారతీయభాషల్లో లేనేలేవు. ఎంత లజ్జాకరవిషయం! మన ఇంట్లో సొత్తు పొరుగింటివాళ్లు సర్దడమా? ఇంగ్లీషువాళ్లు తమ స్వార్థానికి మనల్ని రాజకీయదాస్యంలో చేజిక్కించుకొన్నప్పటికీ పాశ్చాత్యవిద్వానులకు భారతదేశం సదా ఋణపడివుండగలదు. పాశ్చాత్యవిద్వానుల పరిశ్రమవల్లనే మనదేశ ఇతిహాసం వెలుగులోకి వచ్చింది.

వీరు పరిశ్రమచేయకపోతే మన వైదికవాఙ్మయం ఎప్పుడో చదలునాకిపోయేది! మనం (భారతీయులం) గూడ ఆఫ్రికా నివాసుల్లాగ అసభ్యు లనిపించుకొనేవాళ్లం.

అదివరకు పాశ్చాత్యవిద్వాంసుల్లో ఇండియనులు అసభ్యు లని ఒకభావన ఏర్పడివుండేది. కాని మహాకవికాళిదాసుశాకుంతల నాటకం ఇంగ్లీషులోకి అనువాదం కావడంతోనే అందరూ కళ్లు తెరిచారు. "అరే, ఇంత ఉత్తమసాహిత్యం కలిగివున్నజాతి అసభ్యమెలాగవుతుందా" అని అశ్చెరువందారు!

4. రూఢిధర్మంతోనే అని నా అభిప్రాయం.

ప్రభుత్వం నడుపుతున్న శిక్షణపద్ధతి నపుంసకమయినా మన మూడోనేత్రం ఇక్కణ్నుంచే తెరువబడింది. అదివరకు మనచదువు రూఢిబద్ధధర్మమూఢతవల్ల అంధకారంలో......కూపస్థమండూకం లాగా వుండేది. ఇప్పుడు మనచదువు పొట్టకూటికి అంధకారంగా వున్నప్పటికీ వెలుగులోకి వచ్చాము. అన్నిదిశలూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. మన పూర్వయితిహాసం స్పష్టంఅయినందువల్ల మనం వెలుగులోకి వచ్చినట్టుంది.

అమరావతి, నాగార్జునకొండశిల్పాలు బయటపడి ఆంధ్రుల్ని ఎంత వెలుగులోకి తీసుకొచ్చాయో పాఠకులు ఎరుగరూ ?

కాని యింత వెలుగుండీ ఏం లాభం ?

'దియేతలే అంధేరా [5]'

పాశ్చాత్యవిద్వాంసుల జ్ఞానపిపాస, సాటిలేని పరిశ్రమలవల్ల భారతీయుల్లోగూడ ధురంధరవిద్వాంసులు వుదయించారు. నేడు భారతీయ విద్వాంసులు (పురాతత్వ, ఇతిహాసవేత్తలు) పాశ్చాత్య విద్వాంసులు చేసిన పరిశ్రమకు మెరుగుపెట్టుకొస్తున్నారు. అంటే పాశ్చాత్యవిద్వాంసులు ఎంత గొప్పపాండిత్యం కలవారయినప్పటికీ ఇచ్చటి సభ్యత-వాతావరణంతో అపరిచితులయినందున వారు చేసిన పరిశ్రమలో (అన్వేషణలో) అనేక తప్పొప్పులు—భ్రమలు—వుండొచ్చును. వాటిని దిద్దగల శక్తిగలవారే మన యితిహాసవేత్తలు !

అయితే ఏం ?

దేశీయభాషలు ఒక్క కలంపోటుకుకూడ నోచుకోలేదు !

నేడు దేశీయభాషల్లో ఉచ్చశిక్ష పొందుదామంటే ఏముంది? తెలుగులో 'విద్వాన్' ప్యాసుగావడమే ఉచ్చశిక్ష కాదుగదా ! మనజాతిని గురించిన పుస్తకాలే లేనప్పుడు ఉచ్చశిక్ష (**Higher education**) దాకా పోవడం ఎందుకు ?

జవాహరుపండితుడు ఒకప్పుడు ప్యారిసునగరంలో ఏదో లైబ్రరీలో కూర్చొని 'ఇక్కడ ఒకవిషయంమీద వున్నన్ని గ్రంథాలు మనభాషలో (హిందీలో) మొత్తంమీద లేవుగదా' అని కన్నీరు విడిచాడట !

ఈ భాషాదాస్యానికి ప్రథమం మనపూర్వులే కారణమయినప్పటికీ నేడు వెలుగులోకి వచ్చినతరువాత మన ప్రభుత్వం ప్రబల కారణంగా వుంది. మనల్ని ఇప్పుడీ భాషాదాస్యంలో వుంచేది మన ప్రభుత్వమే. మన భాషలకు ప్రభుత్వపోషణగాని, ప్రోత్సాహంగాని లేదు. ఒక జాతిని తనవలలో ఎక్కువరోజులు వుంచుకోవాలంటే ముందాజాతిభాషను-సాహిత్యాన్ని నాశనంచెయ్యాలి. ఈ నీతి ప్రపంచంలో చాలారోజులనుంచీ నడుస్తోంది ! నేడది మనపాలగూడా పడింది. అందుచే భారతీయవిద్వాంసులుగూడ ఇంగ్లీషు శరణు పొందాలిసి వస్తోంది !

ప్రతిభాషకూ ప్రభుత్వపోషణ వుండాలి. కాని ఈ ఇంగ్లీషు ప్రభుత్వముండగా మన కారాత పట్టలేదు ! అయితే అందాకా ఏంచేద్దాం ? కాళ్లుముడుచుకు కూర్చోవడం భావ్యమా ?

ఇంగ్లీషువాళ్ల ప్రవేశంనుంచి మనం పరతంత్రులంగా వున్నప్పటికీ ఈయుగాన్ని 'వెలుగుయుగం' అనాలి. ఈ 'వెలుగుయుగం'ను మనం చక్కగా వుపయోగించుకోవాలి. ఇదే మన ప్రస్తుతకర్తవ్యం.

ఇంతకూ నేను రాసుకొచ్చినదాని సారాంశం ఏమిటి ? ... మనకు అనువాదాలు కావాలి.

మనతెలుగులో మనకు సంబంధించిన ఎన్ని యితిహాస గ్రంథాలు వున్నయ్యో వేలుపెట్టి చూపించండి. స్వర్గీయ చిలుకూరి వీరభద్రరావుగారు చేసిన పరిశ్రమ శ్లాఘనీయం. కాని వారి 'ఆంధ్రుల చరిత్ర'లో చాలా ప్రాథమికవిషయా లున్నాయి.

ఇతిహాసికసాహిత్యంలేని జాతి త్వరగా ఉన్నతిపొందజాలదు. ఇతిహాసమే జాతిఉన్నతికి ముందుదారి చూపిస్తుంది. కావున ఈ 'ఇతిహాసిక సాహిత్యం' పండితుల పొత్తాల్లో వున్నందువల్ల లాభం లేదు. జాతిల్లో అంతటా—ఇంటింటా వ్యాపించాలి. ఇందుకుగాను దేశీయభాషలే శరణ్యం.

ఇప్పుడు మన చారిత్రకసాహిత్యం బోలెడంత ఇంగ్లీషులో పడివుంది. కాని దానివల్ల ఏంలాభం ? అందని ద్రాక్షపళ్లు పుల్లగా వుంటాయిగాదూ !

దేశభాషలకు రాజాదరణగాని, ప్రజాపోషణగాని ప్రస్తుతం లేనిమాట నిజమే ! కాని ప్రజాపోషణ ముందు వుండదనడం పొరపాటు. ప్రయత్నించేస్తేగదా పని కొనసాగేది? ముందుగానే, కాదని అకర్మణ్యతను చూపిస్తే ఎలా ?

మనప్రజలో గంభీరవిషయాల్ని చదివేరుచి లేనిమాట నిజమే. కాని రుచిపుట్టించే కర్తవ్యం మనది. 'ఆంధ్రులచరిత్ర'ను ఎంతో వుత్సాహంతో ఆంధ్రులు ఆహ్వానించలా ?

పాశ్చాత్యదేశాల్లోలాగ యీ దరిద్రభారతదేశంలో పుస్తక ప్రకటనవల్ల విశేషలాభం లేనిమాట నిజమే! కాని లాభం చూచుకొంటే ఎలా ? ఇంతమాత్రం త్యాగం వుండొద్దూ ! దీనికిగాను ధనవంతుల సహాయం కావాలి.

---

5. దీపం ఎంత ప్రకాశిస్తున్నప్పటికీ దానికింద చీకటిగానే వుంటుంది !

# ధార్మికతవల్ల మనదేశానికి వచ్చిన హాని

మాతృభాష — మాతృభూమి మానవునకు కన్నతల్లికన్నా అత్యంత ప్రియమయినవి. దీన్ని జీవంగల ప్రతిమానవుడూ ఒప్పుకొంటాడు.

మన ధనికులు, శ్రీమంతులగు మహారాజులు తిన్నగా మాతృభూమి సేవ చేయలేకపోయినప్పటికీ మాతృభాషా సేవ చేయకూడదూ? ధనికులపోషణ వున్నందున ఇటువంటి గంభీర విషయాల గ్రంథ ప్రకాశనవల్ల ప్రథమంలో లాభం లేకపోయినప్పటికీ నష్టంమాత్రం వుండదు. రుచిపడ్డమీదట ప్రజే పోషించుకోగలదు.

శ్రీమంతులగు పిఠాపురం మహారాజాగారు భాషావివాదాన్ని తీసుకొని ఆంధ్రసేవ చేసేకన్నా ఏదైనా 'ఐతిహాసికగ్రంథమాల' (Historical Series) ద్వారా తెలుగుతల్లిని అలంకరిస్తే బాగుండును.

భాషరూపును సంరక్షించడమే 'భాషాసేవ' అని ఒకపెద్ద భ్రామిక భావన ఆంధ్రుల్లో వ్యాపించివుంది. భాషరూపు మట్టిబొమ్మ ఆకారం లాంటిది. దానిలో జీవశక్తి పొయ్యాలి. అప్పుడే అది నిజమైన భాషాసేవ కాగలదు.

నవ్యసాహిత్యపరిషత్తు, ఆంధ్ర సాహిత్యపరిషత్తులు చేసిన సేవ ప్రశంసనీయమే! కాని యీవిధంగా 'భాషారూపు' వివాదాన్ని తీసుకొని వేరు వేరుగా స్థాపించబడడం తెలుగుకు చాలా అనర్థదాయకమే. ఈ రెండూ తమవివాదాన్ని మరిచిపోయి నిజమయిన తెలుగుసేవకు పూనుకోవాలి. లేదా రెండూ ఏకమై, 'తెలుగుసాహిత్యసమితి'గా ఏర్పడి, విషయాన్ని దృష్టిలోవుంచుకొని, జీవితభాషను పోషిస్తూ ఏ భాషనైనా (గ్రాంథికం గాని, గ్రామ్యంగాని) స్వీకరించి తెలుగు సేవ చేస్తే బాగుండును.

ఉగాదిపండుగ సంబరము

**3. క్రొత్తవస్త్రముల కొనుగోలు**

బీదసాదలుకూడా తమ యోగ్యతకు తగ్గట్టుగా నూతనవస్త్రాలను కొనితెచ్చుకొని పండుగనాడు విధిగా ధరిస్తూవుంటారు.



గంభీర విషయక పుస్తకాల్ని యిటువంటి సంఘటిత సంస్థలే ప్రకటించగలవు. లాభాన్ని చూచుకొనే ప్రకటనకర్తలవల్ల యీపని కాజాలదు.

ఆంధ్రయూనివర్సిటీగూడ యీవైపున కొంచెం దయయుంచాలి.

మన తెలుగుసంస్థలు యింతవరకు లలితసాహిత్యోన్నతికే ఎక్కువగా పాటుపడుచున్నట్లు కనిపిస్తోంది! దినదినం వృద్ధిపొందుచున్న లలితసాహిత్యోన్నతికి సంతోషించవలసిందే! కాని లలిత సాహిత్యం(కావ్యం, కథ, నవల మొదలగు మనోరంజన ప్రధానమయినవి) వల్ల జాతిలో జీవచలనంమాత్రమే కనిపిస్తుంది. జాతిభావనలో పాలపొంగులాంటి వాతావరణమాత్రం ఏర్పడుతుంది. విచారాత్మక గంభీరసాహిత్యంవల్ల జీవశక్తి వస్తుంది. నలువైపులా గంభీరత వ్యాపించినట్లుగా కనిపించగలదు. గంభీరసాహిత్యంగల జాతి ఉత్తుంగ హిమాలయశిఖరాల్లాగ ప్రపంచం ఎదుట గర్వంతో తలయెత్తి తిరుగగలదు. కావున విచారాత్మక గంభీరసాహిత్యం ఎంత ఆవశ్యకమో వేరే చెప్పాలా?

* * *

తెలుగు 'లిటరేచరు' ఎంత క్షీణంగా వుందో చెప్పాలా? నలువైపులా తేరిపార జూచి తెలుగువంక చూస్తే అది పగటిచుక్కలాగ కనిపించీ కనిపించకుండా వుంటోంది! ఇది నాభావదాస్యం అంటారేమో తెలుగుహిమాయితీలు! కొంతవరకు నిజమే కావచ్చును. కాని నాతెలంపు మాత్రం అసత్యం కాదు. ప్రపంచంలోవున్న ఉన్నతసాహిత్యాల్నే గాదు, హిందీ, బెంగాలీ, మరాఠీ మొదలగు అన్యభారతీయసాహిత్యాల్ని చూచి 'తెలుగుసాహితి'ని చూస్తే కూడా సూర్యుని ముందు దీపం వుంచినట్టుగా వుంటోంది! అన్యసాహిత్యాలముందు తెలుగును బలామూరు తిప్పేస్తున్నానని అనుకోబోకండి. జిలిబిలిపలుకుల ముద్దుతల్లి నాకెంత ప్రాణమో నా హృదయానికే తెలుసు! తల్లి తన బిడ్డను పాలులేని ఎండురొమ్ములకు అదుముకొన్నా పిల్లాడికి ఆకలితీరి ఆనందం కలుగుతుందిగదా!... తెలుగుసాహిత్యం అన్య భారతీయ సాహిత్యాలకన్నా తీసిపోదు. తనస్థానంలో చాలా గొప్పదే. కాని 'లిటరేచరు' అర్థంలో తెలుగుసాహిత్యం — పాశ్చాత్య సాహిత్యాల్ని వదిలెయ్యండి—హిందీ, బెంగాలీ, మరాఠీ సాహిత్యాలకన్నా తక్కువేనని కళ్లు మూసుకొని ఒప్పుకోవచ్చును.

తెలుగులో ఇతిహాసం, విజ్ఞానం, రాజకీయశాస్త్రం, మానవ చరిత్ర ఆది విషయాలమీద ఉత్తమసాహిత్యం—మౌలికంగాని, అనువాదంగాని—ఇంతవరకు ఏర్పడిందా ?

ప్రతిదీ వేలుపెట్టి చూపించాలా? ఎటుచూచినా అభావమే!

పురాతత్వ విషయకసాహిత్యం—భారతిలో వెలువడుతూ వచ్చిన రచనల్ని వదిలిపెడితే—లేదనే చెప్పాలి. 6 ఆంధ్రభాషా చరిత్రాన్ని వదిలిపెట్టి మరోగ్రంథం భాషావిజ్ఞానం (**Philology**) మీద వుందా? నేడు ప్రపంచంలో దినదినం వృద్ధిపొందుతున్న 'భాషావిజ్ఞానం'మీద తెలుగులో ఇంతవరకూ ఏగ్రంథం లేకపోవడం ఎంత విచారకరవిషయమో ఆలోచించండి.

తెలుగుభాషమీద, తెలుగుసాహిత్యంమీద గొప్ప పాండిత్యం సంపాయించవచ్చునుగాని, ప్రస్తుతస్థితిలో తెలుగుద్వారా సార్వభౌమికపాండిత్యం సంపాయించడం కలలోనిమాట. ఇట్టిస్థితిలో అన్యభాషల శరణు పొందాలిసిందేగదా! ముఖ్యంగా ఇంగ్లీషును ఆశ్రయించాలిసివస్తోంది.

విశ్వజ్ఞానంకొరకు అన్యభాషల్ని నేర్చుకోవడం మంచిదే. కాని తనభాషలో గతిలేక రెండోభాషను ఆశ్రయించడం లజ్జాకర విషయం. ఇంతకన్నా మరొక పరాధీనత వుండదు. ఈ పరాధీనతను త్వరగా రూపుమాపాలి. ఇందుకుగాను ప్రథమం అనువాదసాహిత్యమే లాభిస్తుంది. అనువాదాలవల్ల భాషలో-సాహిత్యంలో మౌలికత పోతుందంటారు మౌలికవాదులు. కాని ఇది వట్టిభ్రమ. భాషే మనసాహిత్యం; భాషలోనే మనసంస్కృతి వుంది. సంస్కృతి రక్షణకు సాహిత్యంకన్నా భాషనే ముందుగారక్షించాలి. మౌలికవాదుల తర్కం (వాదన) లలితసాహిత్యానువాదాలకే అనువదించి వుంటుంది.

భావాన్ని ఏ అచ్చులోకైనా పోస్తుండవచ్చును. కాన ఏ విదేశీయభావాన్నయినా అనువాదంద్వారా మనభాషలో-మన సంస్కృతిలో మార్చుకోవచ్చును. దీనివల్ల భాషకుగాని, సంస్కృతికిగాని ఏ మాత్రం హాని కలుగదు. అసలు విదేశీయరచనను మన భాషలో అనువదించేప్పటికి అది మన సంస్కృతికి అనుకూలంగా మారిపోతుంది!

ఎంత గొప్పసాహిత్యం అయినా అనువాదాలు లేకపోయేప్పటికి అపూర్ణం అనిపించుకొంటుంది. స్వతంత్రరచనలకన్నా అనువాదితరచనలవిలువ తక్కువ గాదు. ఎంత ఉన్నతి పొందిన సాహిత్యం (లిటరేచరు) అయినా అనువాదాలు లేకపోయేప్పటికి కూపస్థమండూకంలాగా వుంటుంది. అటువంటప్పుడు బలహీన సాహిత్యం గల భాషకు అనువాదాలు ఎంత ఆవశ్యకమో చెప్పడమెందుకు?

అనువాదసాహిత్యంవల్ల నలువైపులనుంచీ 'వెలుగు' అల్లుకుపోతుంది. ఈ 'వెలుగు'లో కొత్త రత్నాలు కనిపిస్తాయి. అంటే కొత్త విచారాలు, కొత్తభావాలు పుడతాయి. మౌలికరచనలకు తావు కలుగుతుంది. విచారసంఘర్షణవల్ల కొత్త విచారం (భావం) పుడుతుంది. కావున అనువాదాలవల్ల మౌలికరచనలు పుట్టగలవు. అందుకనేగా భావి వున్నతికి యితిహాసం చదవడం ఆవశ్యకమని పెద్ద లంటారు.

కావున ప్రస్తుతం తెలుగులో వున్న కొరతను తీర్చడానికి అనువాదసాహిత్యం కావాలి. దీనివల్ల ప్రజలో రుచిపుడుతుంది. ఈ రుచి ముందు మౌలికగంభీరసాహిత్యాన్ని కూడ పుట్టించగలదు. తెలుగువిద్వాను లింకా **Richards** మొదలగు పాశ్చాత్య విమర్శకుల రచనల్ని చవిచూచినట్టు కనిపించదు. అందుకనే తెలుగు విమర్శనాసాహిత్యం ఇంకా వెలుగులోకి రాలేదు. కావున పాశ్చాత్య విమర్శనాప్రణాళిగూడ తెలుసుకోవాలి. అప్పుడు మన విమర్శనా పద్ధతి కొంతవరకు పరిష్కృతం కాగలదు. అస్తు.

ఉత్తమగ్రంథానువాదాలవల్ల తెలుగులో నవజాగృతి కలుగగలదు. రక్తసంచారం కలుగుతుంది.

ముందు వైదికసాహిత్యాన్ని చక్కని అర్థసహితంగా ప్రకటించాలి. తరువాయి వైదికసాహిత్యానికి సంబంధించిన, ఇంగ్లీషులో పాశ్చాత్యవిద్వాంసులు కష్టించి వ్రాసిన సాహిత్యంలోని ప్రముఖ అంగాల్ని అనువదించాలి. ఇంకా మనజాతికి, దేశానికి సంబంధించిన యితిహాసాన్ని ఇంగ్లీషునుంచీ, ఇంకా యితర భాషలనుంచీ అనువాదం చేయాలి. ఇటుతరువాత పాశ్చాత్య భాషల్లోని ఉత్తమోత్తమ గ్రంథాల్ని—

ఏమేమి అనువదించాలో 'సూచి' యివ్వాలా?

ఈ యోజనను కార్యాన్వితం చేయడానికి శిక్షణ సంస్థలుకూడ తోడ్పడాలి. తెలుగుద్వారా ఉచ్చవిద్య నేర్పే సంస్థ లున్నప్పుడే జాతిలో ఎక్కువగా రుచి పుట్టగలదు. ఈసంస్థల్లో రెండేపుస్తకాలు ఖర్చయినప్పటికీ పాఠ్యగ్రంథాలుగా స్వీకరించేప్పటికి వీటిగౌరవం ఎచ్చుతుంది.

తెలుగువిద్వాంసులు తెలుగునుడికారాన్నే చూడక విస్తృత పాశ్చాత్య సాహిత్యాల్ని — మనకు సంబంధించిన యితిహాసపురాతత్వాది విషయకరచనల్ని — అధ్యయనం చేస్తూ నూతనయుగారంభం చేస్తారనే ఆశిస్తున్నాను.

## తెలుగులో అత్యాచారం

ఇంతవరకూ అనువాదాలు మన కెంత అవసరమో చూచుకొంటూ వచ్చాం. ఇక తెలుగులో నిత్యం వస్తూన్న అనువాదసాహిత్యాన్నిగూడ చూడండి. ప్రతిదినం అనువాదమగుచున్న కథానికల్ని చూచి సంతోషించవలసిందే. కాని జరుగుచున్న అత్యాచారాన్ని చూచి నెత్తికొట్టుకోవాలిసివస్తోంది! ఎంత లజ్జాకరవిషయం?

6. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి 18 వ ప్రచురణ.

శీతోష్ణస్థితుల ననుసరించి తయారుచేయబడినవి.

# ఫిల్కో 1940 ట్రాఫిక్

## రేడియో

చురుకైన గ్రహణశక్తి అన్ని ఋతువులలోను పనిచేయును.



40 - 710 C మాదిరి

**ధర రూ. 215.**

**గమనింపు:**—ఫిల్కో 40-710 C రేడియో చూచుటకు చిన్నది గాని పనిచేయుటలో పెద్దది. అఖిలభారత రేడియో కార్యక్రమములను, వార్తలు మొదలగునవి చక్కగా శ్రవణానందముగా వినబడును. లండను, జర్మని, జావా, అమెరికా, చైనా మొదలగు విదేశములనుండి కూడా అతిచురుకుగా రేడియో కార్యక్రమములను సునాయాసముగా విననగును. 110/220 Volts ఏ. సి. మరి డి. సి. కరెంట్లకుగాను వుపయోగబడును.

**ఆంధ్రదేశములలో ముఖ్యవ్యాపారులు కావలెను.**

వివరములకు:—

**మహ్మమదు ఇబ్రహీం అండు కంపెని,**

(ఘనత చెందిన గవర్నరుగారి సప్లయిదారులు.)

2/18 C, మౌంటురోడ్, మదరాసు. **రేడియో నిలయం, తెనాలి.**

---



ది ఏషియాటిక్ గవర్నమెంటు సెక్యూరిటీ
లైఫ్ ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

# THE ASIATIC
## Govt. Security Life Assurance Co. Ltd.,

(మైసూరులో ఇన్కార్పొరేటైనది.)

"వర్తమానకాలమున జీవితభీమా విశేషభోగము కాదు, అత్యవసరము."

హెడ్ ఆఫీసు:—**"ఏషియాటిక్ బిల్డింగ్సు"** బెంగుళూరు సిటీ.

### పాలకవర్గము

1. Dr. F. H. Noronha, M. B., Ch. B. (Edin), D. P. H. (Camb), Bangalore, (Chairman)
2. Col. Raja Jai Prithvi Bahadur Singh, Rajah of Bhajang, Bangalore.
3. Nawab Sajid Yar Jung Bahadur, Bangalore.
4. E. H. M. Bower Esq., B. A,, Ll. B., (Lond.), Madras.
5. Lady Banerji, Bangalore.
6. C. Jagannatha Mudaliar, Esq., Madras.
7. Capt. Rao Saheb A. Thangavelu Mudaliar, Bangalore.
8. Pingle Venkatarama Reddy, Esq., Hyderabad (Dn.)
9. Rao Bahadur B. L. Patil, Ll. B., Dharwar.
10. Dr. P. Rama Rao, D. M. R., (Vienna) Madras, (Policyholders' Director).

ఏజన్సీపరతులకు ఈదిగువ ఎడ్రెసుకు వ్రాయుడు:—**బ్రాంచి ఆఫీసు, 30, మౌంటురోడ్డు, మదరాసు.** లేదా,

పి. వి. కోటేశ్వరరావుగారు,
ఏజన్సీల ఇన్స్పెక్టరు,
బకింహాంపేట, బెజవాడ.

టి. సుబ్రహ్మణ్యంగారు,
ఆర్గనైజరు,
ఓల్డుటౌన్, అనంతపూరు.

శ్రీమతి బి. కోటమ్మగారు,
ఏజన్సీల ఇన్స్పెక్ట్రిస్,
కడప.

## ధార్మికతవల్ల మనదేశానికి వచ్చిన హాని

సాహిత్యం మహోజ్వలదర్పణంలాంటిది. అటువంటిదాన్ని మన అనువాదకులు కలుషితం చేస్తున్నారు! నలుగురిలో తలెత్తుకు తిరిగేది ఎలా?

చోరీలమాట అటుంచండి — ఈ విస్తృత కథాసాహిత్యంలో ఏమూల చోరీ జరిగిందో కనుక్కోవడం కష్టము; అసంభవంకూడా— మూలరచయితల పేరుగూడ యివ్వరు.

"ఇప్పుడే కొద్దిరోజులక్రితం ప్రేమచందుకథ 'సౌత్'(=సవతి) ను ఎవరో 'ప్రేమబలి' అని పేరిడి ఏదో పేపర్లో అనువదించారు. కథ చదివినమీదట సహసా నా నోటినుంచి వెలువడింది— 'ఇది ప్రేమచందు బలిగాని ప్రేమబలికాదు.' ఈ విధంగా ప్రేమచందు, సుదర్శను మొదలగువారి బలి అవుతోవుంది." 7

ఈవాక్యాలు యింతవరకూ నాగుండెల్లో కలకవేస్తున్నాయి! ఉత్తరహిందూస్థానంలో తిరుగుతున్నందువల్ల మరీని!! ఎవరన్నా అడిగితే ఏం సమాధానం చెప్పేది?

'హిందీనుండి' రోగం దినదినం హెచ్చుతున్నట్టు కనిపిస్తోంది. ఈ'నుండి' రోగం పెద్దపెద్ద పత్రికలవరకూ వ్యాపించింది. ఈ మాయరోగం అంతటా వుందనే చెప్పాలి.

నవంబరు '39 భారతిలోని 'విముక్తజీవనాన్వేషణము', డిశంబరు '39 భారతిలోని 'మార్గంలో' అనే రచనలు ఈ 'నుండి' రోగంనుంచి పుట్టినవే.

పేరుగల రచయితలకుగూడ యీ'నుండి' రోగం సోకింది!

మార్చి '38 కథాంజలిలో జి. కె. ఆచార్యగారు 'అభినేత్రి'ని 'హిందీనుండి' అన్నారు. దానిపక్కనే 'మగమహారాజు' అన్న కథని పేరులేకుండా యిచ్చారు. మరి దానికి ఎవరు రచయితలు? స్వతంత్రమౌలికరచన అనుకోనేది ఎలా? అదీ ఏ'నుండి' రోగాన్నుంచి పుట్టిందో!

మే'39 మహతిలో 'కథానిక' అని ఒక రచన వెలువడింది. రచయితలు వేమూరి ఆంజనేయశర్మగారు. రచన అంతా చదువుకన్నేప్పటికి ఆఖరికి కిందవుంది 'ప్రేమ చందు కథకు' అని. ఇదేమిటి? ముందుగానే ఆస్వర్గీయఆత్మ 'ప్రేమచందు' పేరిస్తే అనువాదకులకు నామోషీ కలుగుతుందా? అసలీ 'రచన' ను స్వర్గీయప్రేమచందు తన కథాసంపుటి 'మానసరోవర్' ప్రథమభాగంలో 'భూమిక'గా యిచ్చారు.

ఈ విధంగా 'నుండి' రోగపు మరణసంఖ్యల్నియిస్తే గ్రంథం వృథాగా పెరిగిపోతుంది.

ఈ 'నుండి' రోగపువృద్ధికి మన పత్రికాసంపాదకులే చాలావరకు కారణమని చెప్పొచ్చును. సంపాదకులు 'నుండి' రోగంతో వచ్చిన రచనల్ని వేరుగా వుంచి, అనువాదక మహోదయులకు ఒక కార్డుముక్కరాసి మూలరచయిత లెవరో కనుక్కుంటే అంతగా వ్యాపించేదికాదు. అసలు వ్యాపించేదేకాదు.

నేడు తెలుగులో నలువైపులనుంచీ అనువాదసాహిత్యం విజృంభిస్తోంది. ఒక్క కథానికలేగాదు, విచారాత్మక సాహిత్యంగూడ చరచర అనువాద మగుతోంది. కాని ఈ రోగంనుంచి ముక్తం కాలేదు! సాహిత్యంమీద బాధ్యతగల రచయితలు గూడ భ్రమలోనే వున్నారు! రచన అనువాద మని ఒప్పుకొంటూ గూడ అనువాదకులు తమను 'గ్రంథకర్త'లుగా ఘోషిస్తున్నారు. ఇంకా తెలుగుసాహిత్యం 17, 18 శతాబ్దాల్లోనే వుందా? 'గ్రంథకర్త' అంటే తెలుగులో ఏ అర్థాన్ని గ్రహిస్తున్నారు? నాకు తెలిసినంతవరకు 'రచయిత' అర్థంలోనే! అయితే అనువాదకులు 'గ్రంథకర్త'లుగా ఎలా అవుతారు? జగత్కథ, బ్రిటిషురాజ్యస్థాపన మొదలగు గ్రంథా లెన్నో అనువాదాలు. కాని అనువాదకులు వాటిని అనువాదాలని ఒప్పుకొంటూకూడ తమను గ్రంథకర్తలుగా రాసుకొన్నారు! ఈ ప్రవృత్తి చాలా ప్రాచీనకాలం నాటిది. ఈ 'వెలుగు' యుగంలో వుండతగింది కాదు.

'బ్రిటిషుమహాయుగాన్ని' అనువదించినందుకు మానికొండ సత్యనారాయణశాస్త్రిగారికీ, ఇటువంటి ఉత్తమ బృహత్ గ్రంథాన్ని చౌకలో అందజేసినందుకు సేవాశ్రమంవారికీ కోటి అభివందనాలు. ఆంధ్రులు వీరి సేవకు తగుమూల్య మిచ్చి ప్రోత్సహిస్తారనే ఆశయం. అయితే సత్యనారాయణగారు అనువాదకులా, గ్రంథకర్తలా? మొదటిపేజీ (టైటిల్ పేజీ) మీద 'మేజర్ బి. డి. బాసు, ఐ. ఎమ్. ఎస్. గారి **Rise of the Christian Power in India** అను గ్రంథము ననుసరించి' అన్నారు. ఆ తరువాత మా. సత్యనారాయణగారి సంతకం గ్రంథకర్త పేరుతో వుంది. గ్రంథకర్తృ నివేదనంలో సత్యనారాయణగారే 'ఈ గ్రంథమూలమును ఆంగ్లమున రచించినవారు కీ. శే. మేజర్ బి. డి. బాసుగారు.' అని ఒప్పుకొన్నారు. బాసుగారి చిత్రంక్రింద 'ఆంగ్లమున ఈ యుద్గ్రంథమును రచించిన వంగశేఖరుడు' అనివుంది. మళ్లీ సత్యనారాయణగారి ఫొటో క్రింద 'గ్రంథకర్త' అని. ఇంకా గ్రంథకర్తృనివేదనంలో 'నే నీగ్రంథమును రచించి' అని వుంది. దానికిందనే 'దానిని తెలుగులోకి అనువదించు భాగ్యము నాకు కలిగినందుకు ఉప్పొంగుచు' అన్నారు. రెండోసంపుటం పీఠికలో "ఈ 'బ్రిటిషుమహాయుగము' మేజరు బాసూ అను బంగాళీప్రముఖుడు ఇంగ్లీషులో వ్రాసిన గ్రంథమునకు అనువాద మైవున్నది. దీని ననువదించుటలో శాస్త్రిగారు ప్రాచీన ఆంధ్రకవుల సంప్రదాయము ననుసరించిరి.. "అని మామిడిపూడి వెంకటరంగయ్యగారు వ్రాశారు. అయితే శాస్త్రిగారు ఎంతవరకు

7. వ్రజనందనశర్మగారు, 'మాధురి' మార్చి'37.

స్వతంత్రించారు ? ఈ గ్రంథాన్ని రచించడంలో వీరి స్వతంత్రపరిశ్రమ ఎంతవరకు వుంది? తమ వక్తవ్యంలో ఎచ్చటా సూచించలేదే? తెలుగులో 'రచించుట', 'అనువదించుట' అనుపదాలకు ఒకే అర్థమా, లేక 'రచించుట'అంటే కలంపుచ్చుక రాసే క్రియకే చెల్లుతుందా ? అయితే యింతవిపరీతార్థంలో ఎలా వుపయోగిస్తున్నారు? వెంకటరంగయ్యగారుగూడ పీఠికలో 'రచించిరి — వెలిగించియున్నారు.'అని రెండుశబ్దాల్ని వాడారు. 'రచించుట'కు 'అనువదించుట'కు మధ్య కొండంత భేదంవుంది. భావంగూడ మౌలికమయినప్పుడే 'రచించు' శబ్దాన్ని వుపయోగించాలి. అసలెందుకీ గందరగోళం ? 'అనువాదకులు' అని రాస్తే పోయేదికదా !

అనువాదకు లని రాసుకొంటే తెలుగురచయితలకు చిన్నతనమా ? దినదినాభివృద్ధి గాంచుతున్న యీ ప్రవృత్తిని చూస్తే 'అనువాద'శబ్దాన్ని ఆంధ్రులు నీచంగా చూస్తున్నట్లే కనిపిస్తోంది. ఇది పట్టిభ్రమ. అనువాదాలుగూడ సాహిత్యానికి చాలా అవసరమే. మూలరచయితల కున్నంత గౌరవం అనువాదకర్తలకుగూడ ముందు సాహిత్య ఇతిహాసం యివ్వగలదు.

ఆంధ్ర విద్వాంసులు యీవైపు తగుశ్రద్ధ తీసుకొంటారనే నా ప్రార్థన. ఈప్రాచీనప్రవృత్తిని త్వరగా తొలిగించాలి. విషయం చిన్నదే. కాని పరిణామం భయంకరమయింది ! వాఙ్మయచరిత్రలో యీప్రవృత్తి చిరకాలంవరకు మచ్చగా ఏర్పడి వుండగలదు.

'నుండి' రోగాన్ని తొలగించడానికి పత్రికా సంపాదకులు తగుశ్రద్ధ తీసుకొంటారనే ఆశయంతో ముగిస్తున్నాను

ఈరచయిత పక్కా ఆంధ్రుడు. 'విషనాగు' అనేది వీరు పెట్టుకొన్న ఉపనామం. భారతి పత్రికాపాఠకులకు వీరి రచనలలోని విశిష్టత బాగా పరిచితమైయే ఉంటుంది. వీరు ఉత్తర హిందూస్థానంలో వుంటున్నందువల్ల రచనమీద హిందీ భాషాప్రభావం ఎక్కువగా ద్యోతకమవుతూవుంటుంది. అది ఒకరీతిగా సహజమేననికూడ అనిపిస్తుంది. కాబట్టి వీరిరచనలో తెలుగు నుడికారానికి భంగంకలిగినా భావప్రాబల్యాన్నిబట్టి అది క్షమార్హమే అవుతుంది.

# రక్తస్పర్శ

[కథానిక]

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

## 1

శివానికి చాలా చాతనవు — బడి ఎగగొట్టటమూ, బలవంతాన పంపించిన రోజున మేస్టరుకళ్ళల్లో కారంకొట్టి తప్పించుకు పారిపోవటమూ, మేస్టరు వెయ్యికళ్ళతో కనిపెట్టిఉండి, కడంపిల్లల జోక్యం మానేసి, వాడిచేత గంటసేపు ఒకేపారం చదివించినా ఒక్క ముక్క రాకుండా పరధ్యానంగా చదవటమూ, తన ఈడు పిల్లవా డెవడైనా ఒంటరిగా దొరికితే వాడితో ముందు పరిచయం చేసుకుని తరవాత పోట్లాడి ఆఖరుకు వాణ్ణి మెత్తగా తన్నటమూ, అది సాధ్యపడనప్పుడు చచ్చేటట్టు తన్నులుతిని ఎవరితోనూ చెప్పకుండా ఉండటమూ, వారానికొకసారి ఏదోఒకవిధంగా ప్రాణంమీదికి తెచ్చుకోవటమూ, సినిమాలకూ, నాటకాలకూ, సర్కసులకూ టిక్కట్టు లేకుండా వెళ్ళటమూ, బొగ్గుతో ఊళ్ళో గోడలమీద తన నోటికివచ్చిన దౌర్భాగ్యపు కూతలు రాయటమూ, సిగిరెట్లు (కానీకి అయిదురకం) కాల్చటమూ: ఇంకా ఎన్నో! కాని వాడికి ఆడపిల్లల దగ్గిర ఎట్లా ప్రవర్తించాలో చాతకాదు. వాడి కసలు ఆడపిల్లలంటే భయం. ఆభయం జాస్తిగా కలిగినప్పుడు వాళ్ళకు వైదొలిగి, తను పాతికేళ్ల మగవా డయినట్టూ, వాళ్ళు కాపరంచేసేవాళ్ళయినట్టూ ప్రవర్తించేవాడు. కాస్త ఉత్సాహం ఉండి, భయాన్ని కొంతవరకు జయించినప్పుడు తనూ, వాళ్ళూ చంటిపిల్లలయినట్టు ప్రవర్తించేవాడు. వాడి ఈప్రవర్తనే ఆడపిల్లలకు రోతగా ఉండేది.

ఇవాళ వాడు ఉత్సాహంతో ఉన్నాడు. మొదటి సంగతి: బడి ఎగగొట్టేశాడు. ఆ తరవాత: వాళ్లమ్మ గూట్లోపెట్టి మరిచిపోయిన అణాకాసొకటి కొట్టేశాడు. ఇంతేకాక వాడు ఎన్నడూఎరగని కిళ్ళీకొట్టుమీదికి వెళ్ళి "ఏమయ్యోయ్, ఒకబీడీ ఇవ్వు!" అని దబాయించి అడిగి ఆబీడీ సంపాదించాడు! ఈ ఉత్సాహంలో వాడు ఇంటికి వచ్చేటప్పటికి లక్ష్మి, పక్కింటివాళ్ల బాలాంబా కలిసి సొరెబొమ్మలకు గుడ్డపీలికలతో దుస్తులు కుట్టుకుంటున్నారు.

శివం కాసేపు కాళ్లెడంగాపెట్టి వాళ్ల కార్యక్రమం నిష్పక్షపాతబుద్ధితో గమనించి, ఆఖరుకు వొంగి ఒక చిన్న గుడ్డపీలిక తీసి లక్ష్మినెత్తిన వేసి, "ఒకమ్మాయిగారి నెత్తిన గోరంకి!" అని పాడాడు. బాలాంబ ఒకసారి వాడి వంక తీవ్రంగాచూసి వా డక్కడ లేనట్టే నటించింది.

లక్ష్మిమాత్రం వాడివంక రౌద్రంగా చూసి, "సి కాడపిల్లలతో ఏమాటలురా? అసలు నువు బళ్ళోకి వెళ్లక ఇక్కడున్నావేం? అమ్మతో చెప్పనా?" అని అంతకంతకూ గొంతు హెచ్చించసాగింది. వంటఇంటో ఉన్న తల్లికి వినపడాలని ఆపిల్ల తాత్పర్యం.

శివం తన నిర్లక్ష్యం ప్రకటించటానికి అసహ్యంగా నవ్వుతూ, మళ్ళీ వొంగి లక్ష్మి చేతిలో ఉన్న బొమ్మ లాక్కున్నాడు.

ఈసారి లక్ష్మి గట్టిగా అరుస్తూ "ఆబొమ్మ ఇచ్చెయ్యరా! నీకేం తెగులుట్రా?... అమ్మా, ఈ శివాయ్ చూడవే! మమ్మల్ని ఏడిపిస్తున్నాడూ! ... వెధవా!" అన్నది.

"నువ్వే వెధవముండవు!" అంటూ శివం లక్ష్మినెత్తిన ఆ బొమ్మతో ఒకటి పెట్టి, తృప్తిపడక మళ్ళీ ఇంకోటిపెట్టి, ఆబొమ్మ ఎత్తి నాపరాళ్లమీద పడేసి ఎటో అయిపులేకుండా వెళ్లిపోయినాడు.

రేపో ఎల్లుండో పెళ్ళికాబోతున్న లక్ష్మి, పైగా తన స్నేహితురాలిముందు: అసహాయత్వం ప్రకటించటానికిగాని, ఏడవటానికిగాని చాలా బిడియపడ్డది. బయటికి కక్కిన కోపంకంటె దిగమింగిన కోపం రెట్టింపు! లక్ష్మి పెదిమలుమాత్రం కదిలిస్తూ శివాన్ని లోలోపలే "వెధవ, వెధవ, వెధవ!" అని లెక్కపెట్టకుండా పదమూడుసార్లు తిట్టుకున్నది.

ఈసంఘటన లక్ష్మికీ, బాలాంబకూ ఎంతఅసహ్యకరంగా కనిపించిందో శివానికీ అంత అసహ్యకరంగానే తోచింది. కాని ఏంచేస్తాడూ? తను ఎంతో సదుద్దేశంతో ఏంచెయ్యబోయినా ఆఖరుకు అట్లా పరిణమిస్తుంది. ప్రపంచం అంతటా లక్ష్మివంటి దుర్మార్గు లుండటంవల్ల తనచేత లన్నీ ఇట్లా పరిణమించుతై. తనలోపం ఎన్నడూ ఉండదని శివం ఎప్పుడూ ఎరుగును! వాడికసలు అక్కమీద ఎంతో ఆపేక్షా, అభిమానమూ ఉన్నై (లక్ష్మిమీద చెయ్యిచేసుకున్న మరుక్షణం ఆసంగతి వాడికి ఎంత నమ్మకంగానో తెలిసేది). కాని ఏంలాభం? ఆ ఆపేక్ష చూపించేటందుకు తనకు అవకాశమే దొరకదుగా! తన ప్రారబ్ధం!

పశ్చాత్తాపం అందరికీ ఒకవిధంగా రాదు. ఇది శివం యొక్క పేటెంటువిధం. వాడు తనదృష్టిలో తాను హీనుడల్లే కినపడేకంటె తనవల్ల అపకారం పొందినవాళ్లని తన దృష్టిలో అధికం కానిచ్చేవాడు. ఇటువంటి సంఘటన—లక్ష్మిమీద చెయ్యిచేసుకోవలిసిన అత్యావశ్యకత—కనీసం రోజు కొకసారి అయినా కలుగుతూ ఉండేది కనక ఈపాటికి లక్ష్మి శివందృష్టిలో దాదాపూ ఒక దేవతంతగా అయిపోయింది. అయితే ఈ విషయం నిరూపించటానికి శివాని కింకా అవకాశం రాలేదు. ఈపరమరహస్యం ఇంకా శివం హృదయంలోనే బంధించిఉంది.

## 2

లక్ష్మి తమ్ముడికంటె సరిగ్గా ఒకసంవత్సరం పెద్ద. వాడికి పదోఏడు వచ్చింది—ఇంకా ఏ బీ సీ డీ లు రాకపోయినా. లక్ష్మికి పదకొండు వచ్చినయి. తమతండ్రిని ఇద్దరూ ఎరగరు. వాళ్లు బుద్ధి తెలిసినప్పటినించీ తల్లి శిక్షణకిందనే పెరిగారు.

ఆవిడకు పిల్లల్ని పెంచటం ఏమీ చాతకాదు. చాతకాదని ఆవిడకుగాని, ఆవిడని మెచ్చుకున్నవాళ్లకుగాని తెలీదుకూడాను. ఆవిడ తన ఇద్దరు పిల్లల్నీ ఒకరిమీద ఒకర్ని కాపలాపెట్టింది. వాళ్లిద్దరికీ సహజమైన వైరం ఉంటుందని ఆవిడవిశ్వాసం. (ఆవిశ్వాసానికి ఆధారాలేమిటో నాకయితే తెలీదు!) కాని వాళ్ల ప్రవర్తనను బట్టి ఆవిడవిశ్వాసం సరిఅయినదేనని ఎవరైనా భావించవచ్చును. యథార్థమేమిటంటే, వాళ్ల ఈ ప్రవర్తనకు ఆవిడవిశ్వాసమే కారణం. ఆ ఇల్లాలు తనపిల్లల్నిద్దర్నీ ఒకరిమీద ఒకరిని కాపలాపెట్టటమే కాక ఒకరినించి ఒకరిని సంరక్షించటంలో చాలా ప్రయాసలకు లోనయ్యేది. ఆ ఇద్దరిలోనూ ఏ ఒకరుగాని రెండోవారిమీద ఏనేరం మోపినా సరే, ముందూ వెనకా ఆలోచించకుండా శిక్షించేది. ఎవరివిషయంలో వారు నిజం చెప్పరని ఆవిడ కెంత విశ్వాసమో, రెండోవాళ్ల విషయం అబద్ధం చెప్పరనికూడా ఆవిడ కంతే విశ్వాసం.

ఎప్పటికన్నా ఈ ఇద్దరూ ఒక టవుతారని కాని, కావచ్చునని కాని ఆవిడకు తట్టలేదు. తమ్ముడికి అండగా నిలవాలనే భావం మొదట లక్ష్మికే కలిగింది. ఆపిల్ల తమ్ముడి దుష్ప్రవర్తన జాస్తి అవుతున్న కొద్దీ వాటిని తల్లిదగ్గిర బయటపెట్టటం తగ్గించింది—బయట పెడతానని తమ్ముణ్ణి బెదిరించటం జాస్తిచేసినా. శివం తనవిషయంలో అటువంటి ఔదార్యం ఇంకా పూనలేదనేవిషయంకూడా లక్ష్మిని బాధించలేదు.

లక్ష్మియొక్క ఈ మనస్తత్వానికి కారణాలు నిశ్చయించటం సులభంకాదు. దానికి కారణం స్త్రీలకు అధికంగా ఉండే సహనశక్తి కావచ్చు; లక్ష్మిలో త్వరగా వికసించిన మాతృత్వం కావచ్చు; ప్రతిఫలంకోరని సోదరీప్రేమ కావచ్చు; తల్లివల్ల తమ్మునికి కలిగే శిక్షలో ఉండే న్యాయంలో అవిశ్వాసం కావచ్చు! ఇవేవీ కాకపోతే, ఇందుమూలంగా తమ్ముడిమీద తనకు దినదినమూ జాస్తి అవుతున్న అధికారంమీది తీపి కావచ్చు.

కాని క్రియకు జరిగిందేమంటే, లక్ష్మికి తమ్ముడిమీది ప్రేమ రహస్యంగా వృద్ధికా సాగింది — ఆ ప్రేమకు శివం అనర్హుడవుతున్న కొద్దీ! మనం క్షమించ గలిగిన మనిషిని ఎప్పటికైనా ప్రేమించగలుగుతాం; శిక్షించే మనిషిని ఎప్పటికీ ప్రేమించలేం సరేకదా, మన శిక్ష ఎంత న్యాయమైనదైతే మనకు ప్రేమ అంత అసాధ్యమవుతుంది! ఈ రహస్యం తెలియక ఆ పిల్లలతల్లి తనసంతానాన్ని ఎప్పుడూ న్యాయంగానే శిక్షించేది! ఆవిడ తన పిల్లల్ని అన్యాయంగా శిక్షించినా పశ్చాత్తాపంద్వారా ప్రేమ సాధ్యమై ఉండును — వానికి రహస్యంగా అక్కమీద ప్రేమ ఉండినట్టు.



ఉగాదిపండుగ సంబరము

4. **ఇంటిముంగిట ముగ్గుల అలంకరణము**

పండుగనాటికి ముందురోజు సాయంత్రమైనా, లేదా పండుగనాటి తెల్లవారయినా ఇంటా, బయటా పిండిముగ్గులు పెట్టి గృహాలంకరణం చేయడం పరిపాటి.

## 3

లక్ష్మికి సంబంధం విచారిస్తున్నారు. అది ఏ క్షణాన పెద్దమనిషి అవుతుందోనని ఒకరికొకరు అవకాశం దొరికినప్పుడల్లా చెప్పుకోవటం ఫాషనుగా ఉంది వాళ్ల బంధువర్గంలో. నిజానికి లక్ష్మిలో అటువంటి లక్షణాలింకా ఏమీ లేవు. అది పదకొండేళ్ల పిల్ల అంటే ఎరగనివాళ్లు నమ్మటంకూడా కష్టమే. శివం అక్కకన్నా కనీసం రెండేళ్లు పెద్దవాడనిపిస్తాడు. కనక ఆభయం నిజంగా ఎక్కువమందికి లేదు. పైగా అటువంటి అపూర్వమైన సంఘటన జరిగితే ఏమవుతుందో తెలుసుకుందామని లోపల చాలామందికి ఉందికూడానూ.

“నీకు రావణాసురుడంటి మొగుడు రావల్లే! అప్పుడు గాని నువు చచ్చినట్టు పడి ఉండవు!” అనేవాడు శివం ఇంచుమించు ప్రతిరోజూ. పైకి అట్లా అంటూనే వాడు లోలోపల ఆశ్చర్యపొయ్యేవాడు తననోటికీ, తన హృదయానికీ ఉన్న వైరం చూసి. తనమనస్సును నోటితో దాస్తున్న సంగతి వాడెరగడు. వాడికంత ఆత్మజ్ఞానం లేదు.

లక్ష్మికి సంబంధం విచారిస్తున్నది దానిపినతండ్రి. ఆయనగారిని చూస్తే శివానికి మొదటినించీ పైకిభయమూ, లోపల కోపమూనూ. (వాడి చదువు విషయమూ, వాణ్ణి హద్దులో ఉంచాలనే విషయమూ మొదటినించీ ప్రచారంచేస్తూ వచ్చింది ఆ పెద్దమనిషే!)

ఆయన లక్ష్మిపెళ్ళిబరువంతా తనమెడమీదనే ఉన్నసంగతి ఏమాత్రమూ దాచకపోగా అప్పుడప్పుడూ “అబ్బబ్బ! సొంతపిల్లలకు సంబంధం వెతకటమే కష్టం! మరొకరి పిల్లలకు వెతకటంకంటె బాధుఖోపని ఇంకోటి ఉండబోదు!” అని ఆపసోపాలు పడేవాడు.

ఆయన ఆమాట అన్నప్పుడల్లా శివానికి శివమెత్తేది. తనఅక్కపెళ్ళిభారాన్ని తన పినతండ్రి సంతోషంతో భరించాలని వాడి అభిప్రాయం కావచ్చును! అంత అయిష్టంతో చేసే సహాయం స్వీకరించటానికి తనతల్లి కెట్లా సిగ్గులేదా అని వాడికి అనిపించేది. అది అట్లా ఉండగా ఆ పినతండ్రి సొంత అల్లుణ్ణి వెతకటానికయితే ఎంత శ్రమపడునో అందులో కొంతమాత్రమే

పడి లక్ష్మికి మొగుణ్ణి తీసుకురాబోతున్నాడని అస్పష్టంగా అర్థంచేసుకుని శివంమనస్సు అదోకవిధమైన ఆరాటంలో పడసాగింది. ఆ ఆరాటానికి తగినట్టే లక్ష్మిని చూడటానికివచ్చే ఒక్కొక్కవ్యక్తిని కళ్లారా చూస్తున్న కొద్దీ దానిపెళ్లి జరగవలిసినట్టు జరగదనే భయం శివానికి జాస్తి కాసాగింది.

ఇప్పటి మనస్థితిలో లక్ష్మిని పెళ్లాడటానికి సాక్షాత్తూ ఆ నిషధేశ్వరుడే వచ్చినప్పటికీ అతను శివంయొక్క తీవ్రవిమర్శకు గురికాకుండా తప్పేటట్టు లేదు — వాడి పినతండ్రి ఆశే కట్నం ఖర్చులేకుండా చూసి తెచ్చిన చవుకబారు సంబంధా లొకలెక్కా—?

ఆఖరుకు లక్ష్మివివాహం స్థిరమయింది. పిల్లను చూడటానికి వరుడు స్వయంగా రాలేదు; తనతల్లినీ, అక్కగారినీ తోడిచ్చి తండ్రిని పంపాడు. ఆ వచ్చిన వారి అందచందాలనుబట్టి వరుడిమీద శివానికి మంచి అభిప్రాయం కలగలేదు. (ఆ విషయం విచారించినవారు లేక పోవటం శోచనీయాంశం!) వచ్చినవారు పిల్లను చూసి, నిరభ్యంతరంగా మెచ్చుకున్నారు. ("మీ వెధవమె ప్పెవరికి కావాలి? మా అక్కయ్య మీ ప్రాణాలకి భూలోకరంభే!" అనుకున్నాడు శివం నిర్లక్ష్యంగా!)

వరుడు స్కూలుఫైనలుదాకా చదివి మానేశాడని విని లాగుముడి నమ్మకంగా విప్పుకోలేని శివం— స్కూలుఫైనలుదాకా చదువుదామనే ఆశగాని, ధైర్యం గాని లేని శివం—పెదిమ విరిచాడు.

వరుడికి బోలెడంత ఆస్తి ఉందని తెలిసి శివానికి మండిపోయింది. ఆ ఆస్తికి లక్ష్మిని బంధువు లంతా కలిసి విక్రయిస్తున్నారని శివం తన అంతరాత్మలో రూఢిచేసుకున్నాడు.

బంధువు లంతా కలిసి ఈ సంబంధం చాలా బాగుం దని ఒకరితో ఒకరు అనుకుంటున్నకొద్దీ శివానికి ఒంటరితనం దుర్భర మైపోయింది. తనపక్షం పలికేవాడు ఒక్కడన్నా లేడా? ఇంతమందీ కట్టుకట్టి తననూ, లక్ష్మినీ ముంచాలని చూస్తున్నారా? తన కింకా నాలుగేళ్లు — కనీసం మరో రెండేళ్లు — ఉన్నట్టయితే వీళ్ల ఆటలు సాగునా?

తనబాధ కంతా కారణం అసూయ అని శివం ఎరగడు. వాడి కెవరు చెబుతారు? అసలు వాడు బాధ పడుతున్న సంగతి ఎవ రెరుగుదురు—వాడిస్నేహితుడు హనుమంతాయితప్ప!

హనుమంతాయీ, తనూ చెరువుగట్టున కూర్చుని లక్ష్మిపెళ్లివిషయం చాలాసేపు చెప్పుకున్నారు — బీడీలు కాలుస్తూ! కనీసం తను చెబుతుంటే హనుమంతాయి సహృదయంతో విన్నాడు.

"వాడు వట్టి పల్లెటూరిగబ్బిలాయిరా!" అన్నాడు శివం—బీడీపొగ వదులుతూ, మొహంలో ఒకవిధమైన విచారమూ, బీడీఘాటూ కనబరుస్తూ. "డబ్బుంది వెధవకు! అయితే చదువులేదు వెధవకు! వెధవ కోతిమాదిరిగా ఉంటాడు!" (తను వరుణ్ణి చూడలేదన్న సంగతి హనుమంతాయితో చెప్పకపోతేనేం? రేపు రుజువయ్యే విషయమేగా!)

హనుమంతాయి కొత్తబీడీ పాతబీడీతో అంటిస్తూ, "ఈపెళ్లిళ్లు —!" అన్నాడు గంభీరంగా.

## 4

శివంబావమరిది కనకయ్యా తనబావమరిది అంటే మొదటినించీ ఒకవిధమైన వాత్సల్యం కనబరుస్తూ వచ్చాడు. ఈ వాత్సల్యం శివంహృదయంలో ఎటువంటిమంట పుట్టించిందీ కనకయ్యా ఎరగడు.

కనకయ్యను శివం ఏవిధంగానూ క్షమించలేక పోయినాడు. కనకయ్య అసలు ఎవడూ? తన్ను "ఒరేయ్" అని పిలవటానికీ, ఏవైనా పనులు చెప్పటానికీ వాడికి ఏమధికారం ఉంది? లక్ష్మి మొగుడై కూర్చోవటాని కేమధికారం ఉంది? వాడు (తనలో తను తన బావమరిదిని వా డనుకోవటానికికూడా శివానికి చాలా సాహసం కావలసివచ్చిందని పాఠకు లూహించాలి!) వాడు తను అనుకున్నంత కోతిగా ఉండకపోవటమేం? బావమరిది అయినందుకే తన కింతగా పనులు చెప్పి తనమీద అధికారం చలాయిస్తున్నవాడు రేపు లక్ష్మిమీద ఎంత అధికారం చలాయించడూ?

పెళ్లివైభవమూ, ఉత్సాహమూ తనని అంటకుండా ఉండేటందుకు శివం తనయీడుకు మించిన

అమానుషమైన ప్రయత్నం చేసి గెలిచాడు. ఆ అయిదు రోజులూ పెడపెడగా తిరిగాడు; వెలుతురుకూడా రాని మూలాల నక్కాడు; ఎవరికీ కనిపించలేదు; భోజనం కూడా సరిగా చెయ్యలేదు; కొత్తబట్టలైనా కట్టుకో లేదు. అయితే ప్రత్యేకించి శివంవిషయం గమనించిన వారు లేకపోయినారు.

పెళ్లికూతుర్ని చేసిన లక్ష్మి అందరికీ నేత్రపర్వంగా ఉంటే శివంకళ్లకి ఎవరోఅల్లే కనిపించింది. దానివంక చూసి వాడు, "ఇది నా అక్క!" అని అనుకోలేకపోయి నాడు; చూడలేకపోయినాడు కూడానూ! పెళ్లయిన నెల దాకా లక్ష్మి వాడిదృష్టిలో మామూలుమనిషి కాలేదు.

పెళ్లి అయిన రోజునించీ అక్కాతమ్ముళ్లకు కొత్త సంబంధం ఏర్పడ్డట్టయింది. ఇద్దరూ పరస్పరానురాగం వెనకటికన్నా స్వేచ్ఛగా చూపించసాగారు. ఈ విషయంలో శివానిది పరిపూర్ణమైన పరివర్తన. వాడు లక్ష్మివివాహం గురించి తన అభిప్రాయం స్పష్టంగా లక్ష్మికి తెలియచేశాడు. లక్ష్మి తమ్ముడి ఉద్రేకం అర్థం చేసుకోలేదుగాని వాణ్ణి మార్చటానికి ఏ ప్రయత్నమూ చెయ్యలేదు. శివం తనని గుచ్చిఅడిగినప్పుడుమాత్రం తన కేసంబంధమైనా ఒకటే నని తమ్ముణ్ణి నమ్మించింది. ఆ నమ్మకం శివంఆరాటాన్ని కొంతవరకు తగ్గించింది కాని సంతృప్తిమాత్రం కలిగించలేదు. తనకు సరిఅయిన భర్త రాలేదని లక్ష్మి ఎప్పటికైనా తెలుసుకుంటుం దని శివం లోలోపల భయపడుతూనే ఉన్నాడు.

శివానికి తన బావమరిదితో ప్రవర్తన ఎంత కాలానికీ గాడిలో పడలేదు—కుదరలేదు. దారుణమైన దురభిప్రాయంతోనూ, ఏవగింపుతోనూ ప్రారంభించి శివం తన్ను తను సంస్కరించుకునేప్రయత్నంలో కన కయ్యకు అతిమంచిగా పరిణమించాడు. మళ్లీ దాన్ని సంస్కరించుకునేప్రయత్నంలో అతిద్వేషం ప్రకటిం చాడు. శివంప్రకృతి కనకయ్యమీదిగా అటునించి ఇటూ, ఇటునించి అటూ ఉయ్యాల లూగసాగింది.

"మా బావమరిదితో ఎటు పోయినా చిక్కే. మర్నోనిమిషానికి వాడిబుద్ధి ఎట్లా ఉండేదీ తెలీదు. వాడికి మొత్తానికి చపలచిత్తమే." అని కనకయ్య నిర్ధారణ చేశాడు—శివంతో తగుమాత్రం అనుభవం అయిన మీదట.

ఒళ్లు పై తెలియకుండా తిరిగేవాడు ఒకదెబ్బ తిన్నమీదట కొంత నిషా దిగి, ఇంకా దెబ్బలు తగిలిన కొద్దీ మామూలుమనిషికింద మారి బాధ్యతగుర్తించటం నేర్చుకుంటాడు. లక్ష్మిపెళ్లి శివానికి దెబ్బగా పరిణ మించింది. వాడిపొగరు కనీసం సగమైనా చచ్చింది. చదువుమీద వాడికి కొంతధ్యానం పుట్టింది. ప్రశ్నలకు మరీ కొక్కిరాయిసమాధానా లివ్వటం చాలావరకు తగ్గించాడు.

## 5

లక్ష్మిపెళ్లికి ఇరవైఅయిదువందలు అప్పయింది. ఖర్చు అమితంగా అయిం దని విమర్శించినవాళ్లతో శివంపినతండ్రి తగూ పెట్టుకోలేదు. ఆయన ఏమాత్ర మూ చలించకుండా "ఇదే నాకూతురిపెళ్లి అయితే పదిహేనువందలపైన ఒక్కకానీ అయిఉండదు!" అనే శాడు. పరోపకారం చెయ్యటంలో ఉన్న కష్టసుఖాలు ఆ ఒక్కముక్కలోనే విదితమయినై — అర్థంచేసుకో గలవాళ్లకి.

ఈ పెళ్లిలో ఆపెద్దమనిషి కనీసం నాలుగైదు వందలు కొట్టేశాడని వదంతి ఒకటి పడింది. కాని ఈ మాట ఆయనతో ఎవరూ అనలేదు. అంటే తప్పక చక్కని భావగర్భితమైన సమాధానం ఇచ్చిఉండేవాడే.

జరిగిందేమో జరిగిపోయింది. ఈ బాకీ తీరేమార్గం కనిపించలేదు—ఉన్న ఏడెనిమి దెకరాలభూమిలో కొంత అమ్మటంతప్ప. అనాదిగా (అంటే పదిహేను సంవత్స రాలనించీ) వస్తున్న పొలంలో ఏడోవంతో ఎనిమిదో వంతో అమ్మటం అందరికీ కష్టంగానే ఉంది. కాని అమ్మకతప్పదని అంతా గ్రహించారు. అయితే ఇక్కడ మళ్లీ శివంపినతండ్రిగారి లౌక్యజ్ఞానం చాలా ఉప యోగపడింది.

"ఆ బాకీ దానంతట అదే చెల్లుబడిపోతుంది. శివం చదువుపూర్తిచేసి నాలుగు రాళ్లు సంపాదించి వాడిపొట్ట వాడు పోసుకోవటం మొదలుపెట్టగానే పొలంలోవచ్చేదీ

ముట్టుకో నవసరం ఉండదు. దానితో అప్పుకాస్తా తీర్చవచ్చు. ఈలోపల ఉండే ఏసాలు కాసాలు ధాన్యం అమ్మేసి బాకీలో చెల్లువేసేదీ, ఏ నెల కావలసింది ఆ నెల అప్పుచేస్తూ ఉండేదీ! బంగారంవంటి పొలం ఎందుకు పాడుచేస్తారు? మళ్లీ మనశివం సంపాయించబోయినాడా, పెట్టబోయినాడా?" అన్నా డా పెద్దమనిషి.

"నేను సంపాదించటమూ పెట్టటమూ లేకపోతే ఆ బాకీ తీరనే తీరదుగా! నేను సంపాయిస్తే ఈమాత్రం పొలం అప్పుడే కొనుక్కోవచ్చుగా!" అన్నాడు శివం తెలివిగా. ఆ ముక్కతో పినతండ్రిపడిన కంగారు వాడికి తనలో మూడోవంతు వయసులేని సత్యం, ప్లీడర్లుకూడా మాట్లాడలేని తనతో ఇట్లా మాట్లాడటం సహించలేక వాడిపినతండ్రి వెర్రివాడల్లే పేలాడు. ఆ పేలాపనయొక్క సారాంశం ఏమంటే: "శివం సంపాయించడని తన అనుమానమే కాని, సంపాయించకుండా ఉండాలని తన అభిప్రాయం కాదు; ఇప్పుడు రెండెకరాలు పోగొట్టుకుంటే ఈ రెండెకరాలే రమ్మంటే ఎప్పుడూ రావు!"

చిన్నపిల్లలుకూడా అర్థంఉన్న తెలివిని విమర్శించగలరు. కాని ఇటువంటి అర్థమూ, సందర్భమూ లేని అతితెలివిని విమర్శించలేరు. శివం మళ్లీ నోరెత్తలేదు.

శివంగారి కుటుంబానికి సంవత్సరానికి సుమారు అయిదువందల రాబడి. లక్ష్మిపెళ్లి కయిన అప్పుమీద వడ్డీ మూడువందలు. కనక రాబడి అప్పులో చెల్లు వెయ్యటంవల్ల అసలులో రెండువందలుమాత్రమే చెల్లు పడేది. పైగా ఈ కుటుంబానికి నెలకు ముప్పైఅయినా లేకుండా జరగదు. ఈ నాలుగువందలూ చిల్లర చిల్లరగా అప్పుతీసుకురావటంవల్ల వడ్డీద్వారా కలిసివచ్చేది ఉజ్జాయింపున సంవత్సరానికి పాతికరూపాయలుంటుంది. ఈ పాతికరూపాయల కోసం ఒక అప్పులవాడికి మరో ఏడెనిమిదిమంది చిల్లరబాకీదార్లు జత అయినారు. కాస్త ఆలస్యమై డబ్బు అనుకున్ననాటికి అందకపోతే ఇంటో బియ్యానికీ, ఉప్పుకీ, పప్పుకీ కూడా గిజగిజలాడుకోవలసివచ్చేది. చివరకు ఏవిధంగా పరిణమించిందంటే, పొలంమీదవచ్చేది సంవత్సరమల్లా చేసిన బాకీలు తీర్చటానికిమాత్రమే సరిపొయ్యేది. హాయిగా డబ్బు దగ్గిరపెట్టుకుని జీవించే కుటుంబం చేబదుళ్లమీద బతకవలిసివచ్చింది. పెద్దబాకీలో మొదటిసారి వేసిన అయిదువందల చెల్లు తప్ప మరో కానీ చెల్లుకూడా పడ్డ పాపాన పోలేదు! శివం పినతండ్రిగారి లౌక్యానికి ఫలితం ఇదీ.

పొదుపుగా జీవించటమంటే డబ్బుకోసం ఇబ్బంది పడుతూఉండటమే నని విశ్వసించే శివంతల్లి కీఏర్పాటు సమ్మతమయింది. శివానికిది ఏమాత్రమూ రుచించలేదు. వాడు ఒక కానీపెట్టి కొనుక్కుతినాలన్నా, ఒక అణాపెట్టి సినిమాచూడాలన్నా "అదుగో నువ్వు సంసారం దివాలాతీస్తున్నావు!" అనేది తల్లి. "వెనక జరిగినట్టు కాదోయ్! ఇప్పుడు కాస్త ఒళ్లుదగ్గిరపెట్టుకుని ఉండాలి!" అనేవాడు పినతండ్రి—లక్ష్మిపెళ్లినాటినించీ ప్రపంచానికొక కొత్తశకం ప్రారంభమైనట్టుగా.

"ఉన్న బాకీలన్నీ నేను ఖర్చుచేసే కాన్లతోనూ, అణాలతోనూ తీర్చేటట్టున్నారు!" అని శివం అంటే, పినతండ్రి "నాలుగుకాన్లు అణా! పదహారణాలు ఒక రూపాయి!" అని జ్ఞాపకంచేసేవాడు శివానికి. ఆయన ఆటే మాటలమనిషి కాడు!

## 6

1930 నడిమధ్యను ప్రపంచ ఆర్థికపరిస్థితులు తల్లకిందైనప్పుడు ధనాభావంవల్ల శివం తన ఇంటరు చదువు కట్టిపెట్టి కొంప చేరవలసివచ్చింది. అప్పటికి వాడి బాకీలు దాదాపు అయిదువేలకు చేరబడినయి. కుంగిపోయిన ధరలవల్ల ఆస్తివిలవకూడా అంతే అయింది. బాకీదార్లంతా తొందరపడుతున్నారు.

ఈ సమయంలో కనకయ్య శివానికి దేవుడల్లే అడ్డపడ్డాడు — కనీసం అంతా ఆమాట అన్నారు.

"నీబాకీలన్నీ నేను తీరుస్తాను. ఏదైనా వ్యాపారం చేసుకునేటందు కొక అయిదువంద లిస్తాను. నీపొలం యావత్తూ నాకు రాసివ్వు!" అన్నాడు కనకయ్య బావమరిదితో.

"ఏ ధరప్రకారం?" అన్నాడు శివం.

"అందరూ తీసుకునే ధరే!" అన్నాడు కనకయ్య.




విశిష్టమైన వజ్రములకు, కోరిననగలు, వెండిసామానులకు
సుప్రసిద్ధము, విశ్వసనీయమైన నిలయము.

శ్రీ బి. రామచంద్రారెడ్డి,
సి. బి. ఇ. గారు

మీ రిమధ్య తయారుచేసిన వజ్రాల హారము చాలా బాగుండేను. మీ పని తనమును, అవిలంబమును చాలా ప్రశం సిస్తున్నాను. వేరేచోట్ల విచారించి చూడగా మీ ధరలు కూడా చాలా సరసంగా వున్నవి.

దివాన్ బహద్దుర్
పి. సీతారామయ్య,
ఎం. ఏ. గారు

"నేను రత్నాలకమ్మలు, బంగారు గొలుసులు, వెండిసామాను మున్నగునవి చెయ్యమని మిమ్ము కోరివుంటిని. మీరు అవి నిర్వర్తించుటలో చూపిన అవిలంబము, పనితనము నాకు చాల సంతృప్తి నిచ్చినవి. మీకు శ్రేయము గల్గుగాక!"

# బాపాలాల్ అండు కో.,

వజ్రములవ్యాపారులు, నగలవర్తకులు,

రామకోటి బిల్డింగు,

రాటన్ బజారు, పార్కుటౌను, మద్రాస్.



---

మీ జీవితము, ఆస్థులకు సంపూర్ణమైన భీమాసంరక్షణ కావలనంటే
మమ్ము సంప్రతించుడు.

# నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,

స్థాపితము: 1906 :: ప్రధాన కార్యాలయము: కలకత్తా.

సబ్ ఆఫీసు:
171, న్యూ స్ట్రీటు,
మధుర.

మరియు

నేషనల్ ఫైర్ అండు జెనరల్
ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,
ప్రధాన కార్యాలయము: కలకత్తా.

సబ్ ఆఫీసు:
దేవాంగ బ్యాంకు బిల్డింగ్సు,
కెంపెగౌడా రోడ్డు,
బెంగుళూరు.

మద్రాసు బ్రాంచి:

# నేషనల్ ఇన్సూరెన్సు బిల్డింగ్సు,

362, చైనాబజారు రోడ్డు : : : ఎస్ప్లనేడ్, మద్రాసు



చిత్రాంగి - పావురము!



కాంగ్రెసు అధ్యక్షునికి మయూర వాహనమున ఊరేగింపు.

రామఘరులో నెలకొనియుండు రెండు ప్రాత దేవాలయములు.



"అందులో బావమరిదివై నువ్వు నాకు చేసే ఉపకారం ఏముందీ?"

"లోకులు తినేది నేనే తింటున్నానని నువ్వే సంతోషించరాదూ?" అన్నాడు కనకయ్య. "మరొకరి కంటె నా కింకా తక్కువకే ఇవ్వొచ్చునే. నే నేం తినగూడనివాణ్ణా?"

"నువ్వు తినగూడనివాడివికావు కాని నేను పెట్టలేనివాణ్ణి. మనబంధుత్వంలో కొంత లాభం పొందదగిన యోగ్యత మన ఇద్దరిలోకీ నాకే ఉంది. ఎవరినన్నా అడుగు" అన్నాడు శివం. వ్యవహారం మాటకారితనంలోకి దిగింది.

"ఈధరలు ఎప్పటికీ ఇట్లాగే ఉండిపోవు. ఎప్పటికైనా లేవవచ్చు. కనక నువ్వు నాకు ఉపకారం చెయ్యదలిస్తే ఒకపనిచెయ్యి. ఈ బాకీదార్లు ఆగరు. ఆ బాకీలన్నీ నువ్వే తీర్చు. నేను నీకు నోటు రాస్తాను. కావలిస్తే నా ఆస్తి యావత్తూ తనఖాపెడతాను. కాస్త ధరలు హెచ్చగానే నాఆస్తి బాకీ ఉన్నంతవరకు నువ్వే తీసుకుందువుగాని." అన్నాడు శివం ఆఖరుకు.

నిజానికి కనకయ్య కిది ఇష్టం లేదు. ఆయనఉద్దేశం బావమరిదిఆస్తి కలుపుకుందామనే. కాని ఆమాట పైకి ఎట్లా అంటాడు? శివం చెప్పినదాని కాయన సరేనన్నాడు.

సమయానికి బాకీదార్లలో ఒకాయన శివానికి మంచి సలహా ఇచ్చాడు: "ఆస్తిమాత్రం తనఖాపెట్టకు. నీకు కానీ పుట్టదు. చాలా బాధపడతావు. మీ బావమరిది వ్యవహారం తెలిసినవాడే. నీజుట్టు ఆయనచేతిలో చిక్కినతరవాత నీకు దమ్మిడీ కావాలన్నా ఆయన ఇస్తే కద్దు, లేకపోతే లేదు. జాగ్రత్తసుమా!" అని ఆయన శివంతో చాటుగా అన్నాడు.

కనకయ్య శివంబాకీ లన్నీ తీర్చి, వాడిచేత నోటు రాయించి తాకట్టుదస్తావేజు రాయటానికి స్టాంపులు కొనితెచ్చినతరువాత శివం పెడకట్టైతనంగా "నోటు చాల్లే. మళ్లీ ఇదికూడా దేనికి? డబ్బు దండగ!" అన్నాడు.

ఆశ్చర్యంతోనూ, కోపంతోనూ కనకయ్యనోట మాటరాలేదు. శివం ఆస్తి తాకట్టుపెట్టనని భీష్మించాడు. కనకయ్య విషం చాలావిధాల వెళ్లకక్కాడు. ఇందుకనే అయినవాళ్లలో లావాదేవీ పనికిరా దన్నాడు. మనిషిని నమ్మటానికి లేకపోయినతరవాత ఏం లాభమన్నాడు.

"తాకట్టుకోసం ఇంత ఆరాటపడటంలోనే నీకు నాలో నమ్మకం లేదని తెలుస్తున్నది. నేను తాకట్టు పెట్టననటంవల్ల ఏదో గ్రహించినట్టు నటిస్తా వేమిటి?" అన్నాడు శివం.

కనకయ్య తాకట్టు పెట్టితీరా లన్నాడు. లేకపోతే ముందుముందు శివం చాలా పశ్చాత్తాపపడవలసి రావచ్చునని కూడా సూచించాడు.

శివానికి మండిపోయింది. తనుపడే పశ్చాత్తాపానికీ, లక్ష్మికీ సంబంధం ఉంటుం దని వాడు గ్రహించగలిగాడు. కాని శివానికి భావాలను దాచగలశక్తి ఈ మధ్యకాలంలో అబ్బింది. వాడు నవ్వుతూ "పోనీ, ఇంకో ఆరునెల్లాగు, బావా! ఈలోపుగా ధరలు లేస్తే సరేసరి. లేకపోతే, మళ్లీ తాకట్లూ గీకట్లూ దేనికి, పొలమే రిజిస్టరుచేసి ఇస్తాను." అని ఉపాయంగా కనకయ్యను సమాధానపరిచాడు.

"నీయిష్టంవచ్చినట్టు ఏడుచుకో! చెబితే వినేవాడి క్షేమైనా చెప్పొచ్చుగాని —" అని తన సమ్మతి తెలియబరిచి కనకయ్య వెళ్లిపోయినాడు. దగ్గిరపడ్డ తండ్రిఆబ్దికంకోసం లక్ష్మిమాత్రం ఉండిపోయింది.

## 7

ఆరాత్రి అక్కా తమ్ముడూ ఒకరి హృదయాలొకరికి విప్పిచెప్పుకున్నారు. హృదయాలు విప్పుకోవటమనేది తెలుగుదేశపు మధ్యమతరగతి కుటుంబాల్లో ఏకోదరులకు కూడా రోజూ సాధ్యమయ్యే పని కాదు. లక్ష్మితో మాట్లాడుతున్నప్పుడే శివానికి తెలుసును— మళ్లా ఇటువంటి అవకాశం తనజీవితంలో లభించదని. మళ్లా రేపటినుంచీ తనూ, లక్ష్మీ మామూలు అక్కాతమ్ముళ్లే. కాని ఈరాత్రి అపూర్వమైనది. ఇటువంటిది

"......నేను చచ్చాననుకునే ఈపని చేశావా? ......నేను మళ్లీ ఇంకా నీమొహం చూస్తానా? . ... ఇంత ద్రోహంచేసి నువ్వు నాగడప తొక్కుతావా?... వెధవపని చేస్తావా ? నే నివ్వలేనని ఆమహారాజు కాళ్ల మీాద పడలేకపోయినావా ? నీ ముష్టినోటు చించి నీ మొహాన ఎన్నడో పారేసేవారుగా ! .... ఈ ముష్టి అయిదువేలు నీచేత గడ్డి తినిపించిందిగాని ఆయన కిదో లెఖ అనుకున్నావా?...."

అక్షరాలా కనకయ్యఅభిప్రాయాలు కావుగాని గొప్పమాటలు! కనకయ్య భార్యప్రవాహానికి అడ్డుపడ లేక చూస్తూ ఊరుకున్నాడు. తనకు అయిదువేలు లెఖ లేకేంగాని లక్ష్మిమాటలు వినటానికి మహాశ్రావ్యంగా ఉన్నై!

మౌనంగా అక్కగారి ఉపన్యాసం వింటున్న శివంచెవులకుకూడా అవి శ్రావ్యంగానే ఉన్నసంగతి, పాపం, కనకయ్య ఎరగడు!

తరవాత వారంరోజులకు చూసుకుంటే ఎంత వెతికినా శివంరాసిన నోటు కనిపించలేదు. అది పూర్తిగా అదృశ్యమయింది.

## 9

పదిసంవత్సరాలపాటు లక్ష్మి, శివం ఒకరి నొకరు చూసుకోలేదు. ఆఖరుకు లక్ష్మి మంచానపడి అవసాన దశలో ఉండగా భర్తను దగ్గిరికి పిలిచి "ఒక్కసారి మా తమ్ముడికి కబురుచెయ్యండి!" అన్నది.

"వాణ్ణా—?" అన్నాడు కనకయ్య ఆశ్చర్యంతో.

"పిలిపించండి ! ఇక నేను బతకను! " అని బతిమాలింది.

కనకయ్య సరే నన్నాడు. పదిసంవత్సరాలు తనను వంచించిన భార్యను ఒక్కసారి వంచించి కనకయ్య భగవంతుడిదృష్టిలో పతితుడై ఉంటాడు !

ఇంకో అయిదునిమిషాలకు ప్రాణంపోతుందనగా ఒళ్లుతెలిసి "వచ్చాడా?" అన్నది లక్ష్మి. శివం రాలేదని చెప్పారు.

"రాడు!—వాడు రాడు ! నేనే రావద్దన్నాను!" అని లక్ష్మి కళ్లుమూసుకుంది. ఆమెను వెంటనే మైకం కప్పేసింది. ఆమైకంలోనే ఆమెఆత్మ శరీరాన్ని వదిలింది!



"......నేను చచ్చాననుకునే ఈపని చేశావా? ......నేను మళ్లీ ఇంకా నీమొహం చూస్తానా? . ... ఇంత ద్రోహంచేసి నువ్వు నాగడప తొక్కుతావా?... వెధవపని చేస్తావా? నే నివ్వలేనని ఆమహారాజు కాళ్ల మీద పడలేకపోయినావా? నీ ముష్టినోటు చించి నీ మొహాన ఎన్నడో పారేసేవారుగా! .... ఈ ముష్టి అయిదువేలు నీచేత గడ్డి తినిపించిందిగాని ఆయన కిదో లెఖ్ఖ అనుకున్నావా?...."

అక్షరాలా కనకయ్యఅభిప్రాయాలు కావుగాని గొప్పమాటలు! కనకయ్య భార్యప్రవాహానికి అడ్డుపడ లేక చూస్తూ ఊరుకున్నాడు. తనకు అయిదువేలు లెఖ్ఖ లేకేంగాని లక్ష్మిమాటలు వినటానికి మహాశ్రావ్యంగా ఉన్నై!

మౌనంగా అక్కగారి ఉపన్యాసం వింటున్న శివంచెవులకుకూడా అవి శ్రావ్యంగానే ఉన్నసంగతి, పాపం, కనకయ్య ఎరగడు!

తరవాత వారంరోజులకు చూసుకుంటే ఎంత వెతికినా శివంరాసిన నోటు కనిపించలేదు. అది పూర్తిగా అదృశ్యమయింది.

## 9

పదిసంవత్సరాలపాటు లక్ష్మి, శివం ఒకరి నొకరు చూసుకోలేదు. ఆఖరుకు లక్ష్మి మంచానపడి అవసాన దశలో ఉండగా భర్తను దగ్గిరికి పిలిచి "ఒక్కసారి మా తమ్ముడికి కబురుచెయ్యండి!" అన్నది.

"వాణ్ణా—?" అన్నాడు కనకయ్య ఆశ్చర్యంతో.

"పిలిపించండి! ఇక నేను బతకను!" అని బతి మాలింది.

కనకయ్య సరే నన్నాడు. పదిసంవత్సరాలు తనను వంచించిన భార్యను ఒక్కసారి వంచించి కనకయ్య భగవంతుడిదృష్టిలో పతితుడై ఉంటాడు!

ఇంకో అయిదునిమిషాలకు ప్రాణంపోతుందనగా ఒళ్లు తెలిసి "వచ్చాడా?" అన్నది లక్ష్మి. శివం రాలేదని చెప్పారు.

"రాడు!—వాడు రాడు! నేనే రావద్దన్నాను!" అని లక్ష్మి కళ్లుమూసుకుంది. ఆమెను వెంటనే మైకం కప్పేసింది. ఆమైకంలోనే ఆమెఆత్మ శరీరాన్ని వదిలింది!





## పై "ఇంటర్నేషనల్" మల్టీవేవ్ రేడియో

ఇకమీద రేడియో అనుభవించేవారు 'దొరికితే విందాము' అనేమాట అనుకో అక్కర్లేదు. పైఇంటర్నేషనల్ మల్టీవేవ్ రేడియోలోని నూతన ఏర్పాట్ల సహాయంతో ఏ షార్టువేవ్ స్టేషన్ నైనా వెంటనే విననగును. షార్టువేవ్ స్టేషనులన్నీ వివరంగా తెలిసే నిమిత్తం 6 వేవ్ బాండ్లు కల్పింపబడి, ఉన్న 117 స్టేషన్లు విడివిడిగా గుర్తింపబడినవి.

**901 మోడల్ పై 'ఇంటర్నేషనల్' యొక్క ఆరు ముఖ్యలక్షణాలు**

● స్థానికస్టేషన్లు సులభంగా వినవచ్చును. ● షార్టువేవ్ స్టేషన్లుకూడా అంతే సులువుగా విననగును. ● అతివిపులమైన సంచారస్థలము. 8 వాట్ల ఔటుపుట్. ● సెలెక్టివ్ ఇన్వర్స్ ఫీడ్ బ్యాక్ వల్ల ఫైడెలిటీకి క్రొత్త ప్రమాణము. ● డ్యూయల్ టోన్ కాంపెన్సేటెడ్ వాల్యూము కంట్రోలు. ● అన్ని శీతోష్ణస్థితులకు పనికివచ్చు ఏర్పాట్లు.

**901 మోడల్ ఏ. సి.**
**రూ. 425**

**951 మోడల్ డి. సి.**
**6 వోల్టు**
బ్యాటరీతో పనిచేయును.
**రూ. 445**



805 మోడల్ రూ. 385

**805 మోడలు.** పైరిసీవర్లన్నింటివలెనే కడుశ్రద్ధతో తయారుచేయబడినది. ఉష్ణ శీతలములకు చాలకాలం నిల్వగలదు.

కాంపొనెంటుచుట్లు శ్రద్ధగా ఇన్సలేటు చేయబడినవి.

**803 మోడలు.** చౌకరేడియోలలో నిది చాల ప్రజామోదమును బడసినది. ఇండియన్ స్టేషన్లు, విదేశములుకూడా బాగా వినిపించును. 803 అంత తక్కువధరకు అంత మంచి రేడియో ఎప్పుడూ అమ్మబడలేదు.



803 మోడల్ రూ. 200

# స్పెన్సర్ అండ్ కో., లిమిటెడ్.
## ( రేడియో శాఖ )

# భాస్కరరామాయణ సమస్య

## కర్తృత్వ విభేదపరిశీలన

డా. నేలటూరి వెంకట రమణయ్య



తెనుగు రామాయణములన్నింటను భాస్కర రామాయణము ప్రాచీనతమము. ఆంధ్రమహాభారతమువలె నదియు బహుకర్తృకము. ఈ గ్రంథోత్పత్తిని దెలుపు నైతిహ్య మొకటి గలదు. దాని నిచ్చట సంగ్రహముగ వివరించెదను.

పూర్వ మొకరాజు కలడు. ఒకప్పు డతడు నిజబంధు డగు రంగనాథు డను కవిని రప్పించి రామాయణమును ద్విపదకావ్యముగా రచింపుమని యాజ్ఞాపించెను. దీని నెరిగి మత్సరగ్రస్తుడగు తదాస్థాన కవియగు భాస్కరుడు రాజుకడకు జని దా నొక రామాయణమును పద్యకావ్యముగా ఏలినవారి కంకితమొసగు తలపుతో విరచించు చుంటిననియు, దానిని బరిగ్రహింపవలె ననియు వేడుకొనెను. రాజందుల కంగీకరించి, తాను రంగనాథున కొసగిన యాజ్ఞను జ్ఞప్తి పరచి, రంగనాథభాస్కరులలో నెవరు గ్రంథమును ముందు రచించి తెచ్చిన వారిగ్రంథమును గొనెదనని చెప్పెను. రంగనాథునికంటె పూర్వమే గ్రంథమును వ్రాసి ముగించి రాజున కంకిత మొసగవలయు నని తలచి భాస్కరుడు తనపుత్రు డగు మల్లికార్జునభట్టును, శిష్యుడగు కుమారరుద్రదేవుని, మిత్రుడగు నయ్యలార్యుని సహాయులనుగా నేర్ప రచుకొని గ్రంథము నచిరకాలముననే సంపూర్తి యొనరించి రాజ సభకు గొనిపోయెను. కానియప్పటికే రంగనాథుడును స్వవిరచితద్విపద రామాయణమును రాజునకర్పింప గొనివచ్చెను. రాజు కవులిద్దరును నేక కాలమున వారిగ్రంథములను స్వసన్నిధానమునకు గొనివచ్చుట నెరింగి, రంగనాథునియెడ నించుక పక్షపాతము జూపి, యాతనిగ్రంథమును గొన కుడిచేతిని, భాస్కరునిగ్రంథమును గొన నెడమచేతిని జాచెను. ఆనూత్నమును దెలుసుకొని భాస్కరుడు కోపించి స్వవిరచితగ్రంథ మును రాజున కియ్య నంగీకరింపక, రాజు సేవయందున్న గుజ్జువా డగు మారున కంకిత మొనర్చెను. తత్కారణముననే సాహిణిమారుడు కృత్యాద్యంతములయందు సంబోధింపబడెను.

ఈకథయం దెంతసత్య మున్నదో తెలియదు. తెనుగున రంగనాథ రామాయణ మను నొక ద్విపదరామాయణము కలదు; తద్రచయిత రంగనాథుడుకాడు. కోన బుద్ధరాజను క్షత్రియుడా గ్రంథమును రచియించినట్లు అందు జెప్పబడియున్నది. మరియును గవిత్వరీతిని, గ్రంథాంతర్గతశబ్దజాలమును బట్టిచూడ రంగనాథరామాయణము భాస్కరరామాయణమునకంటె అర్వాచీనమైన గ్రంథ మని తోచు చున్నది. పై కథయందలి ఇతరవిషయముల నిజానిజముల నరయదగిన వెర వెద్దియును గానరాదు.

ఇక భాస్కరరామాయణసాక్ష్యమువల్ల తద్గ్రంథోత్పత్తి తెరగెరుంగ వీలగునేమో చూతము. ముద్రితప్రతియందు గ్రంథకర్తలను గూర్చి ఈ క్రింది విషయములు తెలియుచున్నవి.

ఆరంభకాండ యగు బాలకాండయందు కృత్యాద్యవతారిక లేదు. సామాన్యముగ నన్ని యాంధ్రగ్రంథములవలె గ్రంథారంభమున నుండు మంగళశ్లోకమేనియు లేదు. ఈ కొరత మాన్పుటకు, పాపము, వావిళ్లవా రెచ్చటనుండియో యొక పద్యమును దెచ్చి యతుకుపెట్టినారు. అది కాండాంతపద్యముల బోలి శివుని సంబోధించక వాల్మీకిని స్తోత్రముచేయుచున్నది. మల్లికార్జుని గ్రంథమును వ్రాతప్రతులబడి ముద్రించక ఈయసంగతపు టతుకు నేలపెట్టిరో తెలియదు.* 'రాముని శుభచరితంబును' అను కందపద్యముతోడనే గ్రంథమారంభమగుచున్నది. తెనుగున భాస్కర రామాయణ మొకటి దప్ప కృత్యాదిని మంగళశ్లోకాదులు లేని కావ్య మెచ్చటను గానరాదు. ఇది విచారణీయము. కాండాంతపద్యములను బట్టిచూడ బాలకాండ శివునికంకితము సేయబడినట్లు తెలియుచున్నది. గద్యయందు అష్టభాషాకవిమిత్రుడును,భాస్కరసత్కవి పుత్రుడునునగు మల్లికార్జునభట్టు విరచించినట్లు చెప్పియున్నది. ఇట్లే కిష్కింధకాండ శివాంకితముగ పైమల్లికార్జున భట్టుచేతనే వ్రాయబడినది. కాని కాండాంతపద్యములయం దొకటి సాహిణిమారుని, మరియొకటి పరమేశ్వరుడగు శివుని సంబోధించుచున్నవి. సుందరకాండయు పైరెండు కాండలవలె మల్లికార్జునభట్టుచేతనే రచింపబడినను కాండారంభమున సాహిణిమారుడును, కాండాంతమున ఈశ్వరుడును సంబోధింపబడి యున్నారు. అయోధ్యకాండను రచించిన కవి శారదాముఖముకు రాయమాణుడును, సారస్వత భట్టబాణుడును, వీరమారయ కుమారుడును నగు కుమారరుద్రదేవు డని కాండాంతగద్యము తెలుపుచున్నది. కాండా ద్యంతపద్యములు బుద్ధయకును, కాచమాంబకును పుత్రుడగు సాహిణిమారుని సంబోధించుచున్నవి. ఇతరకాండలవలె గాక

* మఱియు 1930-వ సంవత్సరమున ముద్రించిన ప్రతియందు సంగ్రహరామాయణ మను నొక చిన్నగ్రంథమును జేర్చియున్నారు. ఇది యత్కృతమో తెలియదు. భాస్కరరామాయణమును యథామాతృకముగా ముద్రించక నూతనగ్రంథముల నం దేల చొప్పించిరో?

అరణ్యకాండ రెండాశ్వాసములుగ విభజింపబడియున్నది. ప్రథమాశ్వాసమునందలి మొదటిపద్యము సాహిణిమారుని సంబోధించుచున్నది; ఆశ్వాసాంతపద్యములు తక్కిన కాండలయందలి పద్యములవలె గృతిపతిని సంబోధింపక ప్రథమావిభక్త్యంతములగు వాక్యములచే నతని గుణములను వర్ణించుచున్నవి. కవి భాస్కరుడని ఆశ్వాసాంతమునందలి గద్య తెలుపుచున్నది. ద్వితీయాశ్వాసారంభపద్యము కృతిపతిని సంబోధించక హరిభక్తుడును, సాహిణీతిలకమును నగు మారయధరణీరమణుని ప్రథమాంత వాక్యములచేత ప్రశంసించుచున్నది. ఆశ్వాసాంత పద్యములు మూడును ద్వితీయావిభక్త్యంతములు. రెండాశ్వాసములయందును ఆశ్వాసారంభపద్యములు కృతిపతిని పేర్కొనుచున్నను ఆశ్వాసాంతములవల్ల నతడెవ్వడో కనుగొనుటకు సాధ్యము గాదు. రెండవయాశ్వాసమును రచించిన కవియు భాస్కరుడే. యుద్ధకాండయందలి మొదటి పద్యమున సాహిణిమారుడు సంబోధింపబడియున్నాడు. ఆశ్వాసాంత పద్యములయందు శివుడు సంబోధింపబడియున్నాడు. ఇతర కాండలవలెగాక యుద్ధకాండను రచియించిన కవు లిరువురు. మొదట కొంత భాగమును హుళక్కి భాస్కరమహాకవి రచించెనట. తరువాతి భాగమును నయ్యలార్యుడు సంపూర్తి యొనర్చెనట. ఇట్లు భాస్కర రామాయణమును అయిదుగురు వ్రాసినట్లు తెలియుచున్నది.

మల్లికార్జునభట్టు బాలకిష్కింధసుందరకాండలను, కుమార రుద్రదేవుడు అయోధ్యకాండను, భాస్కరుడు అరణ్యకాండను, హుళక్కి భాస్కర అయ్యలార్యులు యుద్ధకాండను వ్రాసిరని ముద్రిత భాస్కరరామాయణ ప్రతివలన దెలియుచున్నది. ఇది పైనుదాహృతమైన భాస్కరరామాయణ రచనావిధానమును దెల్పు నైతిహ్యమునకు గొంచె మించుమించుగా సరిపోవుచున్నను ఈకవు లందరును సమకాలికులో కారో, మరియు వారియం దొండొరుల కెద్దియేనియు సంబంధముకలదో లేదో విచారించవలసియున్నది. భాస్కర రామాయణమును రచించిన కవు లందరియందును నయ్యలార్యుడొక్కడే స్వవిషయమును కొంత తెలిపియున్నాడు. తాను శాకల్య మల్లకవిపౌత్రుడ ననియు, వీర(లేక, రామ) నరసింహుని తమ్ముడగు అప్పలార్యుని పుత్రుడ ననియు యుద్ధకాండాంతగద్యయందు తన తాతతండ్రులను పేర్కొనియున్నాడు. శాకల్యమల్లకవి కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థానమున నుండెనని సోమదేవరాజీయమునందును, నప్పకవీయమునందును వ్రాయబడియున్నది. ఈశాకల్య మల్లుడు గొప్పకవి; సంస్కృతమునం దుదారరాఘవాదికావ్యములను పెక్కింటిని రచించెను. ఇతడు విజయనగర చక్రవర్తియగు హరిహరరాయల కాలమున నుండెనని ప్రసంగరత్నావళియం దుదాహృతమైన యొకశ్లోకమువలన దెలియుచున్నది.

విజయనగర చక్రవర్తులయందు హరిహరనామాంకితు లిరువురు కలరు. అందొక్కడు సంగమరాయలపుత్రుడు. ఇతని కాలముననే విద్యారణ్యయతీంద్రుడు విద్యానగరమును నిర్మించెను. ఇతడు క్రీ. శ. 1336 మొదలు 1355 వరకును రాజ్యపరిపాలనము నొనర్చెను. రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1378 మొదలు 1404 వరకును ప్రభుత్వము సల్పెను. శాకల్యమల్లుడు ఓరుగంటిప్రతాపరుద్రుని యాస్థానమున నుండెననుట నిక్కమేని యాతడు మొదటి హరిహరరాయల కాలమువాడే కావలయును. ఈ యూహ సరియైనదనుటకొక నిదర్శనము గలదు. యుద్ధకాండప్రతులలో కొన్నిటియందు "ఉ. ఇంక బలీముఖుల్ బలిసి రెక్కడిరావణు డేటిలంక" యనుపద్యమునకు దరువాత ఈ క్రింది వాక్యములు గనుపించుచున్నవి: "ఇందాకా భాస్కరుడు చెప్పిన రామాయణం. యిటుమీద వేదగిరి నాయనింగారు అయ్యలుభట్లచేత చెప్పించిన రామాయణము యుద్ధకాండ శేషము."1 మరి కొన్నిటియందు "యింతపర్యంతం భాస్కరుని సన్మార్గఘటన. ఇకమీంది కథ వేదగిరినాయనింగారు శాకల్యమల్లనార్యుని మనుమడు అయ్యలుభట్లచే రచనచేయించిన యుద్ధకాండ శేషము."2 ఒకానొక ప్రతియందు మాత్రము "యిందాకా భాస్కరుడు చెప్పిన కవిత్వం. యిటమీద శాకల్యమల్లుభట్లు చెప్పిన కవిత్వం" అని యున్నది. 3 ఈ వాక్యములయందు పేర్కొన్న వేదగిరి నాయనింగారు దేవరకొండ నేలిన వెలమప్రభువు. రసార్ణవ సుధాకరగ్రంథకర్త యగు రావు సింగమనేనికి పినతండ్రియగు మాదానేనిపుత్రుడు. ఇతడు తండ్రియనంతరము సింహాసనము నధిష్ఠించి క్రీ. శ. 15 వ శతాబ్దారంభమున దేవరకొండయందు రాజ్యమొనర్చెను. ఇతనియనుచరులశాసనములు క్రీ.శ. 1405, 1407 సంవత్సరములనాటివి సింహాచలమునందును, శ్రీకూర్మమునందును గాన్పించుచున్నవి. 4 కావున వేదగిరినాయడు క్రీ.శ. 1400, 1410 ల మధ్య రాజ్యము సల్పుచుండెనని నిశ్చయమగుచున్నది. ఈ రాజాజ్ఞచే యుద్ధకాండను సంపూర్తి యొనర్చిన అయ్యలార్యుడును నప్పటివాడే కావలయును. అయ్యలార్యుని తాతయగు శాకల్యమల్లుభట్లు క్రీ. శ. 1404 లో మృతినందిన రెండవ హరిహరరాయల కాలమువాడనుటకన్న క్రీ. శ. 1336, 1355 ల మధ్య రాజ్య మొనర్చిన మొదటి హరిహరరాయలకు సమకాలీనుడనుట సమంజసము. ఇతని మనుమడగు అయ్యలార్యుడు క్రీ.శ. 15 వ శతాబ్దారంభమున నుండెననుట యథార్థమునకు విరోధము కాజాలదు.5

---

1. Madras Govt. Ori. Mss. Library 10-1-12 leaf 229 b. 2. Madras University Mss. Collection T/416 leaf 119 a. 3. Madras Govt. Ori. Mss. Library 10-18-2 (D 138) leaf 199. a. 4. S. I. I. V 1242, VI 1100

5. కందుకూరి వీరేశలింగంపంతులుగారు అయ్యలార్యుడును, హుళక్కి భాస్కరుడును నేకకాలమువారను తమవాదమును నిర్వ

ఇందువల్ల హుళక్కి భాస్కరుడు అయ్యలార్యుని సమకాలీనుడు కాడనియు, పూర్వుడనియు దేలుచున్నది. ఇక నీభాస్కరు డెప్పటివాడో తెలిసికొందము. సోమదేవరాజీయమున గాకతీయ ప్రతాపరుద్రదేవుని యాస్థానమున నితడున్నట్లు చెప్పియున్నది. కాని ఇది యెంత నిశ్చయమో తెలియదు. అయ్యలార్యు డీతడు యుద్ధకాండయందు మొదటినుండి కొంత గ్రంథమును రచించె నని చెప్పియున్నాడుగదా. ఆ యుద్ధకాండ సాహిణిమారున కంకిత మిచ్చినట్లు అందలి మొదటిపద్యమువల్ల దెలియుచున్నది. సాహిణిమారుని కాలమును గనుగొనగల్గితిమేని భాస్కరుని కాలమును దెలియవచ్చును. సాహిణిమారునిగూర్చి కవులచరిత్రయందు వీరేశలింగంపంతులుగా రిట్లు వ్రాసియున్నారు: "సాహిణి మారన్న ద్వితీయ ప్రతాపరుద్రునికాలములో నాతని యశ్వసేనాధ్యక్షుడుగా నుండి, తద్రాజ్యము తురుష్కాక్రాంతమైనయనంతరమున స్వతంత్రుడై యొక దేశపాలకు డయ్యెను. భాస్కరరామాయణ మా కాలమునందే రచియింపబడి 1330-వ సంవత్సర ప్రాంతమునం దీ సాహిణిమారుని కంకిత మొనర్పబడియుండును." (కవులచరిత్ర, ప్రథమభాగము, పుట 304) ప్రతాపరుద్రుని కాలమున నాతని కొలువునం దొకమారయ సాహిణి యుండెనని శాసనములవల్ల దెలియుచున్నది. అత డశ్వసేనాధ్యక్షుడుగా నుండె ననుట సంశయాస్పదము. అత డశ్వసాహిణియో, గజసాహిణియో, లేక రాయపట్టసాహిణియో నిర్ధారించి చెప్పుటకు దగిన సాక్ష్యమేమియు గానరాదు. మఱియు నాతడు ప్రతాపరుద్రుని రాజ్యము తురుష్కాక్రాంతమైన పిమ్మట స్వతంత్రుడై, యొక దేశపాలకుడై, హుళక్కి భాస్కరునిచేత రామాయణము గృతిగొనెననుట నిరాధారమైన వ్రాత; పంతులుగారిచే కల్పితము. హుళక్కి భాస్కరునిచే సాహిణిమారుడు కృతిని గొన్నది వాస్తవమగునేని యది ప్రతాపరుద్రుని కాలముననే, అనగా క్రీ. శ. 1323 నకు పూర్వమే జరిగియుండవలయును. కాని హుళక్కి భాస్కరునికిని అరణ్యకాండను రచియించిన భాస్కరునికిని గల పరస్పర సంబంధ మెట్టిదో తెలిసికొనినగాని ఈ విషయమును నిర్ధారించి చెప్పుటకు సాధ్యముగాదు.

హుళక్కి భాస్కరుడే యరణ్యకాండరచయిత యని వాఙ్మయ చరిత్రకారు లందరును అభిప్రాయపడుచున్నారు. వీరి ననుసరించి చరిత్రజ్ఞానములేని యాంధ్రపండితులు వారికంటె దృఢముగా అరణ్యయుద్ధకాండలను రచించిన భాస్కరు డొక్కడే యని వాదించుచున్నారు. కాని వాస్తవమును విచారించగా నిది సంశయగ్రస్తముగ గన్పట్టుచున్నదీ.

కృత్యాద్యంతములు ఆంధ్రకావ్యములయందు రెండుతెరగులు గానవచ్చుచున్నవి: (1) కృత్యాద్యంతములందు కృతిపతిని సంబోధించు పద్యములు గలవి, (2) అట్లు సంబోధనలు గాక ప్రథమద్వితీ

---

హించుకొనుటకై వేదగిరినాయనితో నయ్యలార్యునికి గల సంబంధము కల్పిత మని నిరసించిరి. ఈ విషయమై తమ కవులచరిత్రమున పంతులుగారు ఇట్లు వ్రాసియున్నారు "అయ్యలార్య డెట్లయినను భాస్కరకవికి సమకాలీనుడే. ప్రతాపరుద్రుని యాస్థానములో శాకల్యమల్లుభట్టు పండితుడుగాను, భాస్కరుడు కవిగాను ఉండినందున శాకల్యమల్లుకవి తమ్మునికొడుకైన యయ్యలార్యుడు మల్లికార్జునకుమార రుద్రదేవులతోడియీడువాడై యుండును. కవి చెప్పినదానికి ప్రత్యక్షవిరోధముగా నెవ్వడో లేఖకు డెప్పుడో వేదగిరినాయనింగారు చెప్పించిరని వ్రాసినమాట పాటింపదగినదిగాదు." (కవులచరిత్రము, ప్రథమభాగము, పుట 319) పంతులుగారివాదములో రెండువిషయములు పరామర్శింపదగియున్నవి. మొదటిది. అయ్యలార్యుడు శాకల్యమల్లునిపుత్రు డనుట. ఇది తప్పు. వ్రాతప్రతు లన్నిటియందును "శాకల్యమల్లకవివర రామ (వీర)నరసింహావరజాప్పలార్యనందన... అయ్యలార్యవిరచితంబైన" అనియే యున్నది. దీనికి పంతులుగారు శాకల్యమల్లునియొక్కయు, రామనృసింహునియొక్కయు తమ్ముడైన యప్పలార్యునిపుత్రు డని వివరణము వ్రాసిరి. కాని "శాకల్య మల్లకవివర రామ (వీర)నరసింహ" యను వాక్యమునకు శాకల్యమల్లుని పుత్రుడైన రామ(వీర)నరసింహు డని యర్థము చేసుకొనుట సమంజసము. కొమ్మయతిక్కడు, ప్రోలయవేముడు, కుండయనారసింహుడు, నరసింహకృష్ణ రాయడు ఇందుకు తార్కాణ. కావున అయ్యలార్యుని వంశవృక్షము ఈక్రిందిరీతిగ నుండవలయును.

శాకల్యమల్లుభట్టు (?1315–1350?)

రామ(వీర)నరసింహుడు. — అప్పలార్యుడు

అప్పలార్యుడు → అయ్యలార్యుడు (1400–1410)

రెండవది · అయ్యలార్యుడు హుళక్కి భాస్కరునికి సమకాలీనుడు కాడు. అట్లని యాత డెచ్చటను జెప్పియుండలేదు. వేదగిరినాయనింగారు చెప్పించి రని లేఖకుడు వ్రాసినది "కవి చెప్పినదానికి ప్రత్యక్షవిరోధము" కాదు. "చ. అమరహుళక్కి భాస్కరమహాకవి చెప్పగనున్న యుద్ధకాండము తరువాయి" అను పద్యపాదము పంతులుగా రభిప్రాయపడినట్లు అయ్యలార్య హుళక్కి భాస్కరుల సమకాలీనతను నిరూపింపజాలదు. హుళక్కి భాస్కరుడు యుద్ధకాండము కొంతవరకు జెప్పెను. అసమగ్రముగా నిలిచియున్న భాగమును అయ్యలార్యుడు రచించె ననిమాత్రము తెలియుచున్నది. భాస్కరుడే అప్పటికి సజీవుడై యుండిన అయ్యలార్యుడు దానిని సంపూర్తిచేయవలసిన యవసర ముండదు. కావున హుళక్కి భాస్కరు డేకారణముచేతనో యుద్ధకాండను అసంపూర్తిగా విడిచియుండగా తరువాత దానిని అయ్యలార్యుడు సంపూర్తి యొనర్చె ననుట యొప్పును.

యాది విభక్త్యంతములగు పదములచేగాని, వాక్యములచేగాని కృతిపతిని గీర్తించుపద్యములు గలవి. భాస్కరరామాయణము ముద్రిత ప్రతిబడి అరణ్యకాండము దప్ప తక్కినకాండ లన్నియు మొదటి తరగతికి జేరినవి. వీరేశలింగముగా రన్నట్లు అరణ్యకాండమునందలి ప్రథమ ద్వితీయాశ్వాసాంతపద్యములు కృతిపతినిగూర్చి సంబోధనలు గాక వరుసగా ప్రథమ ద్వితీయాంతములుగా నున్నను నది పైజెప్పిన రెండు తెగల కావ్యములలో దేనియందును జేరదు. ఏలనగా, విభక్త్యంతములచే గృతిపతులను గీర్తించిన కవులు పాటించిన నియమ మందు పాటించలేదు.

ఆంధ్రగ్రంథములలో విభక్త్యంతముల నాశ్వాసాద్యంతముల బ్రయోగించినకవులు ముగ్గురు: నన్నెచోడుడు, తిక్కన, కేతన. వీరు పాటించిన నియమములను శ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిలవా రిట్లు వివరించి యున్నారు· "మంగళ శ్లోకములతోగూడిన కృత్యాదిని విడిచి ద్వితీయాది ప్రత్యాశ్వాసాదియందును మొట్టమొదటి పద మేవిభక్తితో నుండునో యావిభక్తి జేర్చిన పదములతో దదాశ్వాసాదియందును, దత్పూర్వాశ్వాసాంతమునను గల కృతిపతిస్తుతిపద్యములను రచించిరి. కొన్నియెడల నాశ్వాసాంతపద్యము ననుసరించి తదాశ్వాసాంతమునందును, దరువాతియాశ్వాసారంభమునను గల కృతిపతిస్తుతి పద్యములను వ్రాసిరి. మఱియు నాశ్వాసాది పదము ననుసరించక యాశ్వాసాదిపద్యమునగాని, గద్యమునగాని గల యీశ్వరవాచకము ననుసరించి కృతిపతిస్తుతిని రచించుటయు గలదు. కొన్నిపట్ల వాక్యమధ్యమున నాశ్వాసము ముగిసినపుడు తరువాతి యాశ్వాసారంభమునందలి మొదటిపదము ననుసరించుటయు గలదు."

అరణ్య కాండాదియందలి సాహిణిమారుని సంబోధించు కృతిపతిస్తుతి పైనియమములకు వ్యతిరేకముగ గానవచ్చుచున్నది. మరియు నీ పద్యమునకే పాఠాంతరము కొన్ని వ్రాతప్రతులయందు గానవచ్చుచున్నది.[2] ఇంకను ద్వితీయాశ్వాసారంభమునందలి కృతిపతిస్తుతి యచ్చు

**ఉగాదిపండుగ సంబరము**

**5. తలంటు స్నానము**

ఉగాదిపండుగనాడు తప్పనిసరిగా ఆచరించవలసిన విధులలో ఈ తలంటు స్నానమొకటి. చిన్నా, పెద్దా తారతమ్యాలులేక ఇంటిల్లిపాదీ ఆరోజు తలంటుస్నానం పోసుకొని తీరవలసిందే. అది మంగళస్నానం.



పుస్తకమున ప్రథమాంతముగ నున్నను కొన్నివ్రాతప్రతులలో కించిద్భేదముతో సంబోధనతో గూడియున్నది.

అచ్చు·

"క. శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవత్స హరిచరణసరో
జారాధ్యుడు మారయధర
ణీరమణోత్తముడుసాహిణీతిలకమిలన్"

వ్రాత:

"క. శ్రీరామా కుచయుగళీ
హారిద్రోల్లసితవక్ష హరిచరణసరో
జారాధ్యబుద్ధవిభుసుత
సారసహితతేజ ధీర సాహిణిమారా."

ఈపద్యమును వావిళ్లవారుబాలకాండమున రామాయణకథానుక్రమణికకును నయోధ్యాపురవర్ణనకును మధ్య జొప్పించిరి. గ్రంథమధ్యమున గృతిపతిని సంబోధించుపద్యము నేల నిరికించిరో తెలియదు. వీరిపరిష్కారపద్ధతి కొన్నియెడల దుర్గ్రాహ్యముగ నున్నది.[3]

మరియు కొన్ని వ్రాతప్రతులయందు అరణ్యకాండకు రెండారంభములు గలవు.[4] ఇంతేకాదు; రెండరణ్యకాండలును గలవు. వావిళ్లవారు తమ ముద్రితప్రతియం దంగీకరించినపాఠ మొకటి. ఈ పాఠముగల ప్రతులు అరుదు. నాచే బరిశోధితమైన 35 తాళపత్ర ప్రతులలోను ఈపాఠ మెందును గానరాలేదు. అధోజ్ఞాపికగ వా రంగీకరించిన పాఠము రెండవది. ఈ యధోజ్ఞాపిక పెక్కుప్రతులయందు గల యధికపాఠముల సంకలనమని పాఠకులు భ్రమపడవచ్చును. పరిష్కర్త లట్టితలపున కెడమిచ్చియున్నారు. ఏకాండముగ తాళపత్ర ప్రతులయందు పెక్కింట సామాన్యముగ గానవచ్చెడి పాఠము. ఏయే వ్రాతప్రతులనుండి యేయేభాగమును గొనిరో శాస్త్రీయపరిష్కారపద్ధతి ననుసరించి సూచించియుండెరేని పాఠకులకేగాక వాఙ్మయపరిశోధకులకు సైతము వీరిప్రతి యుపకరించియుండెడిది. ఈ విషయముల నన్నిటిని ఆలోడనసేయగా భాస్కరుడు రచియించిన అరణ్యకాండను ప్రాచీను లెవ్వరో

1. కుమారసంభవవిమర్శనము, పుటలు 136-7. 2. Madras University Mss. Collection, T 40. 3. వావిళ్లముద్రిత భాస్కరరామాయణము, 1930 సం. ప్రతి, పుట 4. 4. Madras University Mss. Collection. T 119.

తారుమారుచేసినట్లు తోచుచున్నది. అట్లు మార్చి తిరుగ వ్రాసినవా రెవ్వ రని పరిశోధింపగా వారిలో కుమారరుద్రదేవు డొక్క డని తెలియుచున్నది.

ముద్రితప్రతియందును, కొన్ని వ్రాతప్రతులందును అయోధ్యా కాండమును కుమారరుద్రదేవుడు రచియించినట్లు చెప్పియున్నది. కాని పెక్కుతాళపత్రప్రతులవల్ల భాస్కరుడే తద్రచయిత యని తెలియుచున్నది. ఈ ప్రతులయం దయోధ్యకాండతుదను భాస్కరునిగద్య యుండుటయేగాక అరణ్యకాండయందువలె విభక్త్యంత ములతో గూడిన యాశ్వాసాంతపద్యములు గలవు. ఆ పద్యము లపరిచితము లగుటచే వాని నిచ్చట నుదాహరించుచున్నాను.

శా. మందారద్రుమసామ్యదానఘ(ఖ?)నియుస్మాదాంధవిద్వేషిరాట్
సందోహప్రకటోగ్రశౌర్యహరణోత్సాహస్ఫురద్బాహు డా
నందాపాదిత భూసురప్రకరనా(నా?)స్తోత్రపాత్రుండు కుం
దేందుప్రఖ్యముఖారవిందుడు గుణాతీతుండు ధీరుం డిలన్.

క. బాలాలాలితనవపాం
చాలుడు సుకవిజననికరసంస్తుతమృదువా
చాలుడు సుఖ భరితయ
శోలలితుడు వైరిహృదయశూలుడు పేర్మిన్.

మాలిని:
భువనభరితకీర్తిస్ఫూర్తిధారోరు (శ?)త్రుం
డవిహితసుమశౌర్యాదస్ఫురచ్ఛత్రుజైత్రుం
డు వితరణరణోగ్రాటోపసప్తాశ్వపుత్రుం
డు విబుధజనరక్షోద్యుండు సన్మిత్రు డుర్విన్.

ఇంకొక కారణముగూడ గలదు. భాస్కరుడు రచించిన రామాయణమున ప్రతికాండాంతమునను ఫలశ్రుతిని దెల్పు సీసపద్య మొండు గానవచ్చెడిని. అరణ్యకాండాంతమందలి పద్యము వావిళ్ల వారు 1930 వ సంవత్సరమున ముద్రించిన ప్రతియందు 226 వ పుటక్రింది యధోజ్ఞాపికయందు ముద్రించి యున్నారు. ఈ పద్య మనేకతాళపత్రప్రతులయందు గానవచ్చుచున్నది. ఇట్టిపద్యమే యయోధ్యా కాండతుదను గలదు. చూడుడు:

*సీ. అంత నక్కడ రాము డచటికి భరతుండు
గ్రమ్మర వచ్చి సామ్రాజ్యమునకు
తన్ను రమ్మనుచు బ్రార్థనసేయునో యని
చింతించి యప్పుడు చిత్రకూట
మున గల్గు మునిజనంబుల వీడుకొని మార్గ
తరువీథులంబుల గరము వేడ్క
మిగులగా సీతాసుమిత్రాత్మజయుతుడై
లలి దండకావనస్థలికి నరిగె
ననగ మహి నయోధ్యాకాండ మభినుతముగ(?)
వినిన జదివిన వ్రాసిన విస్తరించి
చెప్పినను వారలకు సుఖసిద్ధి యొసగు
సంపదాయురారోగ్యముల్ సంభవించు.

ఆశ్వాసాంతములవల్లను, ఫలశ్రుతి సీసములవల్లను అయోధ్యా రణ్యకాండలు భాస్కరుడు రచియించినట్లు తెలియవచ్చుచున్నది. ఫలశ్రుతిని తెల్పు పద్యములు బాలకిష్కింధాకాండల యంతమం దొండు రెండు తాళపత్రప్రతులయందు గానవచ్చెడిని. వీనినిబట్టి చూడగా భాస్కరుడు రచించిన రామాయణమున జాలభాగము ఖిలమైపోగా ఖిలమైనభాగములను కుమారరుద్రదేవాదులు పూర్తి చేసి, యట్లు తాము పూర్తిచేసిన కాండలను దమ పేర్ల బ్రకటించుకొనిరని తోచుచున్నది. అచ్చుప్రతియందలి యయోధ్యాకాండాంత గద్యమునుబట్టి కుమారరుద్రదేవుని తండ్రి మారయ యని తెలియుచున్నది. ఈ మారయయే భాస్కరరామాయణమును గృతిగొన్న సాహిణిమారు డని వీరేశలింగముగా రనియున్నారు. కావచ్చును. అగునేని సాహిణిమారుని కాలమునకే భాస్కరుని రామాయణము శిథిలమైనట్లు చెప్పవలసివచ్చును. ఇదియే నిశ్చయమగునేని అరణ్యాయోధ్యా కాండలను రచించిన భాస్కరుడు సాహిణిమారుని సమకాలీనుడు గాజాలడు; పూర్వీకుడు గావలయును. ఆతడు సాహిణిమారుని కెంత పూర్వముండెనో కనుగొనుటకు సాధనము లెవ్వియు గానరావు.

ఇక హుళక్కిభాస్కరుడే యయోధ్యారణ్యకాండల రచయిత యగునేమో విచారింతము. అతడు శాకల్యమల్లునితోపాటు కాకతిప్రతాపరుద్రుని యాస్థానమున నుండెనని సోమదేవరాజీయము వల్ల తెలియుచున్నది. మారయసాహిణి యను నొకదొర ప్రతాపరుద్రుని కొలువున నుండె నని శాసనములవల్ల దెలియుచున్నది. కావున హుళక్కిభాస్కరుడు ప్రతాపరుద్రునియాస్థానకవి యగుట నిక్కమైనచో నాతడు మారయసాహిణికి సమకాలీను డగుట నిస్సంశయము. ఈ సిద్ధాంతము అంగీకృతమేని హుళక్కిభాస్కరుడు అయోధ్యారణ్యకాండల రచయితయగు భాస్కరుడు కాజాలడు; అన్యు డగును. పైచర్చవలన దేలిన సారాంశమేమనగా, రామాయణ రచయితలగు భాస్కరు లిరువు రని. ఒకడు అయోధ్యారణ్యకాండలను రచియించిన భాస్కరుడు; రెండవవాడు యుద్ధకాండమున కొంతభాగమును వ్రాసిన హుళక్కిభాస్కరుడు.

ఈ సిద్ధాంతమునకు బ్రతికూలముగ గన్పట్టువిషయ మొకటి దాని నిచ్చట బేర్కొనవలసియున్నది. అరణ్యకాండము సాహిణి మారుని కంకిత మొనర్చినట్లు అందలి యాశ్వాసాదిపద్యములు

* Madras University Mss. Collection T 519, Madras Govt. Ori. Mss. Library 10-18-3 (D 139)

డెల్పుచున్నవి. తద్రచయితయగు భాస్కరుడు సాహిణిమారుని సమకాలీనుడు గానిచో నాతని కంకిత మిచ్చుట యెట్లు పొసగును? ఈ యాక్షేపము పై సిద్ధాంతమునకు బ్రతిబంధము కాదు. ఆశ్వాసాంతపద్యములయందు సాహిణిమారుని బేర్కొనున వేవియు గానరావు. మొత్తము తొమ్మిదిపద్యములుగలవు. అయోధ్యాకాండయందు మూడు; అరణ్యాకాండయం దారు. వీనియం దెచ్చటను గృతిపతి పేరునుగాని, జననీజనకులనుగాని, యతనివంశమునుగాని తెలిపియుండలేదు. అత డెవరో శత్రుమర్దను డగు రా జనిమాత్రము సూచింపబడి యున్నది. ఆశ్వాసాది పద్యములు భాస్కరునిచే రచింపబడినవి గావు. మొదటియాశ్వాసారంభ పద్యమునకు పాఠాంతరములు మూడు గానవచ్చుచున్నవి.

అచ్చుప్రతియందు —

క. శ్రీహిత నయవిలసిత వా
ణీహిత మృదువచన ధారుణీహిత సం
దోహ త్రివిక్రమ విక్రమ
సాహస నగధైర్యసార సాహిణిమారా.

ఇది గాక వ్రాతప్రతులయందు ఇక రెం డగపడుచున్నవి.

క. శ్రీరమణీరమణ కృపా
ధార సముద్యత్కటాక్ష దరహాస ముఖాం
భోరుహ వితరణకర్ణవి
శారద బుద్ధయకుమార సాహిణిమారా.

క. శ్రీరమ్యస్థితివదన ప
యోరుహశుండాల గండ యుగళిత విగళ
ద్దారాశ దానధారా
సారప్లుత భవనహార సాహిణిమారా.

ఈమూటియం దెద్దియు భాస్కరకృతము కాదు. ఏలన, విభక్త్యంతములతో ఆశ్వాసాద్యంతములను రచించిన భాస్కరుడు తన్నియమము ననుసరించి అరణ్యాకాండారంభమునందలి కృతిపతి స్తుతిపద్యమును ప్రథమాంతములతో రచింపవలసియుండెను. ఆ నియమమును దిగవిడచి సాహిణిమారుని సంబోధించు నీ పద్యములను రచించి యుండడు. ఇతరు లెవ్వరో భాస్కరుని పద్యమును మార్చియో, లేక ప్రతిపద్యమునల్లియో యిందు కూర్చి రని తోచుచున్నది. ద్వితీయాశ్వాసారంభ పద్యమునకును పాఠాంతరము గలదు. ఇది యీవ్యాసమున నింతకుపూర్వ ముదాహరింపబడినది. ఇం దచ్చుప్రతియందలి పద్యము విభక్త్యంతములతో గూర్పబడినది. దీనిపాఠాంతరము సంబోధనలతో గానవచ్చుచున్నది. కావున నీ యాశ్వాసాది పద్యములు పెక్కుమార్పుల నందినవనుట తెల్లము. ఇవి భాస్కరవిరచితములు గావు. కుమారరుద్రదేవుడుగాని, లేక హుళక్కి భాస్కరుడు గాని రచించి భాస్కరుని పద్యములకు మారు వీనిని చొప్పించిరని తలచెదను. మల్లికార్జునభట్టకృతమగు మూడు కాండలును వీరే యరణ్యాదికాండాది పద్యముల రచయిత లని సూచించుచున్నవి.

మల్లికార్జునభట్టు స్వవిరచిత రామాయణ త్రికాండలను శివుని కంకిత మొనర్చినట్లు తత్కాండాద్యంత పద్యములు ఘంటారవముగ చాటుచున్నను తద్విరోధముగ సాహిణిమారుని ప్రస్తావన యందు చేయబడియున్నది. కిష్కింధాకాండాంతమున 'లాటీచందన' యను శార్దూలవిక్రీడితమును, సుందరకాండప్రారంభమున 'శ్రీరమణీహృదయేశ్వర' యను కందపద్యమును సాహిణిమారుని సంబోధించుచున్నవి. ఈపద్యములు రెండును మల్లికార్జునభట్టువి గావు. ఏలన, బాలకిష్కింధా సుందరకాండలు మూడును శివాంకితములు. మరియు 'లాటీచందన' యన్న పద్యము ఎచ్చటనో ఒకటి రెంటియందే తప్ప వ్రాతప్రతులయందు సామాన్యముగా గాన్పించదు. ఇంతే కాదు. మల్లికార్జునభట్టొనర్చిన యాశ్వాసాంత పద్యరచనా విధానమున కది ప్రతిఘటించుచున్నది. ఇతరకాండలందువలెగాక పైకాండలయందు మూటియందును నాశ్వాసాంతమున రెండుపద్యములే గానవచ్చుచున్నవి. బాలకాండాంతమున నొక కందమును, నొక మాలినియు గలవు. అట్లే సుందర కాండాంతమునను కందమును,మాలినియు గానవచ్చుచున్నవి.కిష్కింధాకాండాంతమున మాత్రము యథావిధి మాలినియున్నను కందపద్యమునకు బదులు 'లాటీచందన'యను సాహిణిమారుని సంబోధించు శార్దూలవిక్రీడితము గానవచ్చుచున్నది. దీని తరువాతి మాలిని శివుని సంబోధించుచున్నది. అట్లే కాండాదియందును శివసంబోధన కలదు. కాబట్టి మల్లికార్జునభట్టు తా ననుసరించిన మార్గముచొప్పున నిచ్చటను శివుని నొక కందపద్యముననే సంబోధించియుండె ననుట నిశ్చయము. మరి 'లాటీచందన'ను కిష్కింధాకాండాంతమున మల్లికార్జున భట్టవిరచిత కందమును దొలగించి తత్స్థానమున గూర్చినవా రెవ్వరు? సాహిణిమారుని కుమారుడగు కుమార రుద్రదేవుడైనను గావలయును; కాదేని తదాశ్రితుడగు హుళక్కి భాస్కరుడేనియు గావలయును; లేక సాహిణిమారునికి భాస్కరుడు స్వవిరచితరామాయణము నంకిత మిచ్చె నన్నగాథ యుత్పత్తియైనపిమ్మట తదనుసారము బుద్ధిమంతులగు వ్రాయసకాండ్రేనియు వ్రాసి చేర్చియుండవలయును. ఇట్లు వ్రాయసకాండ్రచే చేర్చబడిన యన్యకవికృతములగు పద్యము లీభాస్కర రామాయణమున నెన్నియో గలవు. వ్రాతప్రతుల నన్నిటిని ముందుపైచుకొని వాని నన్నిటిని బరిశోధించి పరిష్కరించ నోపికగల పండిత ప్రకాండులును, వారికి గ్రాసవాసంబులపై జింత కలుగనీయక తదేకదృష్టితో బరిష్కరింపించు వాఙ్మయాభిమానులగు లక్ష్మీపుత్రులును గలిగిరేని యవి యన్నియు వ్యక్తములు కాగలవు. కిష్కింధాకాండాద్యంతములను మార్చినవారే తక్కిన యయోధ్యాది కాండాద్యంతములను మార్చియుందురు.

## భాస్కరరామాయణ సమస్య

ఈ చర్చవలన దేలిన విషయము లేవి యనగా—

1. వ్యాసారంభమున నుదాహృతమైన రామాయణ రచనా విధానమును దెల్పుకథయందు జెప్పినట్లు తద్రచయితలంద రేకకాలము వారుగారు.

2. అయ్యలార్యుడు దేవరకొండప్రభు వగు పెదవేదగిరి నాయనిగారి యాస్థానకవి. ఇతడు క్రీ. శ. 15 వ శతాబ్దారంభమున నుండెను.

3. హుళక్కి భాస్కరుడు అయ్యలార్యుని సమకాలీనుడు గాడు. అత డయ్యలార్యుని తాతయగు శాకల్యమల్లునికిని, భాస్కర రామాయణమున గొన్ని కాండలకు గృతిపతియు గాకతిప్రతాపరుద్రుని సేనాధ్యక్షులయం దొక్కడునునగు మారయసాహిణికిని సమకాలీనుడు గావచ్చును.

4. అరణ్యకాండను రచించిన భాస్కరుడు హుళక్కి భాస్కరుడు గాడు. అతడు ప్రాచీనుడు. అతడే యయోధ్యాకాండను రచించెను. అతడే బాల కిష్కింధాకాండలనుగూడ రచియించె నను తలంపున కెడము గలదు. అతడు రచించిన రామాయణము శిథిల మగుడు, అందలి నష్టభాగములను సంపూర్తి యొనర్చి కుమారరుద్రదేవాదులు ఆయాకాండలను దమ నామముల బ్రకటించుకొనిరి.

5. వీరే కాండాద్యంతములను మార్చి సాహిణిమారాంకితములుగ జేసిరి.

---

### దక్షిణాదిలోగల వార్కళా అను క్షేత్రమునందలి జనార్దనస్వామి దేవాలయము



# నిరుక్తము



శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

అనుకొనకే, మనోభవుని యాయుధవాహనసంచయంబు మో
సిన శకటంబువోలెఁ గడుఁ జేరువగాఁ జనుచుండి, కోస దే
లిన తుదికంటివెల్గువిదలింపులు నన్నును దాఁకనీయ కుం
డిన దయలేని నీనడక నిన్నును నీవుగ మెచ్చుకోవలెన్.

తమదగు నందమెల్ల వనితాజనతాస్పృహణీయమంచు గ
ర్వముగల యౌవనోదయ ధురాపరినర్తితభావు లున్న మా
ర్గమున నె కన్నువ్రాల్పకయ గర్వపురేఖను మొక్కవోని మేల్
గమనము పోవు నీవు ననుగాని యపాంగములందుఁ బట్టవున్.

వాలును లేకయే స్పృహయుఁబట్టక కారణమౌచు నెప్పుడో
యేలనొ తోఁచనట్టు లుదయించిన మన్మథుఁడైన కాంత లే
పోలనికన్నులన్ మలఁగిచూడరు చూచినవెంటనే కనుల్
వ్రాలుతు రట్టి నాయెడ నిరాదృతి నీయది విడ్డూరంబకే.

ముక్కిడియైన కోఁతియును మోమును నద్దమునందుఁ గాంచి బల్
చక్కనిదాన నంచుఁ దలఁచంగల యాత్మగతాభిమానమే
గ్రుక్కిలి నాదునందమును గూర్చి వచింపఁ దలంపఁజాలనే
మిక్కిలి నీవు నాయెడ రమించుటకై యెదురైనఁ జూడనే.

నినుఁ గనుఁగోవటం చనను నిద్దురపోవలదా! పగంటఁ జూ
చినఁ గలలోనవత్తును నిశిన్, గనుఁగో వనుచున్ జివుక్కు మం
చనినది గుండె, దాని ననుమంటిన! నాకటువంటియూహ కీ
జనువునఁ బొత్తులేదను నిజమ్ము నెఱుంగనొ నన్నెఱుంగనో.

ఇన్నియుఁ జెప్పి నీ కనుల నెత్తి ననుం గనుఁగోవటంచు నే
నన్నది యేమిన్యాయ మని యాడెదవో నిను నాడు మంటినో
యెన్నితలంపులైన నుదయించు లయించు దరిద్రునందు, నా
యెన్నియునేని పుట్టుట లయించుటయే పరమార్థమౌఁగదా!

నావలపోఁత నీదు శ్రవణంబుల చేరద, యంత యేటికో
నావలపోఁత యేరి శ్రవణంబులచేరద, యంత యేటికో
నావలపోఁత వాక్త్వకలనంబును పొందద, భావరూపమై
భావముకూడ లోయెదకుఁ బట్టిన జబ్బుగనై గతించెడున్.

చేయక చేసినట్లు శ్రుతిచేసిన యూహలు మేనుగల్గు దీ
ర్ఘాయు లదృష్టజన్ము లగునట్టిరు నాదగు మూర్తి చూచియే
పాయుదు రింక నాదయిన భావ మెఱింగిరయేని నన్ను గో
మాయువు స్వర్గబుద్ధి యగుమాదిరి వెట్టరె వెక్కిరింపులన్?

లేని మనోంతరాంతరవిలీనవిగాఢవిషాదగీతికా
నూననిరుక్తభావ మిది, నొవ్వినవో వ్వెఱుఁగంగరాని ప్రా
ణానికి లోతులోని చలనంబును, సర్వజగచ్ఛ్రిహో మనః
ప్రాణసుదూరవర్తియగు భావము కానుకగాని కాన్కయా.

ఈ జగతీపరిభ్రమణహేలకు వేలకు వేలు లక్షకో
ట్లై జరుగున్ మహాణువులయందున నేయణుగర్భమందునో
రాఁజినకోర్కిమంటలభరం బితరాణు లెఱుంగకుండ లో
రాఁజి తనంతటన్ పొనుగురాయఁగరా దటవే! ననుంబలెన్.



# స్వర్గీయ రామమూర్తి పంతులుగారు

## జీవితచరిత్రలోని చిత్రవిచిత్ర ఘట్టాలు

వ్యావహారిక భాషాప్రచారంకోసం గిడుగు రామమూర్తి పంతులు గారు గావించిన అఖండమైన సేవ అందరూ ఎరిగిందే. కాని కొండ జాతుల్లో ఒకటై, అనాగరకతకు ఆలవాలమైన సవరజాతికి చదువు సంధ్యలు నేర్పడానికిని, వారినికూడ ఒక 'మనుష్యులు'గా తయారు చేయడానికిని పాటుపడ్డ మహాప్రయత్నంలో పంతులుగారు సవర నిఘంటువు, సవరభాషావ్యాకరణము రచించి ఇతరులకు స్వప్నేపి అలవికాని పనిని నిర్వహించి అజరామరమైన కీర్తి నార్జించారు.

**శ్రీ గిడుగు సీతాపతి**



మా తండ్రిగారి జీవితచరిత్ర నా కంటె తక్కినవారెవరైనా వ్రాయడం మంచిదేమో అని నా అభిప్రాయము. నేనే వ్రాయడం మంచి దని కొందరున్ను, నేనుకూడా వ్రాయడం అవసరమని కొందరున్ను కోరినందున నేను కూడా వ్రాయడానికి పూనుకొన్నాను. ఇందుకు నాకుగల అర్హత ఏమిటంటే: మాతండ్రిగారికిన్ని నాకున్ను గల సంబంధం కేవలము తండ్రీకొడుకుల సంబంధమే కాదు. 28-జనవరి 1885 లో నేను పుట్టినది మొదలు 22-జనవరి 1940 లో వీరు స్వర్గస్థు లయినవరకున్ను వీరికీ నాకూ గల గురుశిష్యుల సంబంధము తండ్రీకొడుకుల సంబంధంకంటె ఎక్కువగా పరిణమించినది. వీరి నలుగురు కొడుకులలోను మొదటివాడ నయినందుకు నేనే వీరి శిక్షణకు పూర్తిగా లోబడి ఎక్కువగా దెబ్బలు తిన్నవాడను; వీరి వాత్సల్యము సైతము ఎక్కువగా అనుభవించినవాడనూ నేనే; వీరు పూను కొన్న ఉద్యమము లన్నిటిలోను వీరి వెంట నుండి వీరికి తోడుగా పనిచేసిన వాడనూ నేనే; వీరి కడపటిదినములలో వీరి ఆర్థికదుస్థితికి కూడా నేనే — లేదా, నా దౌర్భాగ్యమే కారణము; తుదకు 22-జనవరి '40 సోమవారం ఉదయం నేను వీరిప్రక్కను కూర్చుండి ఉపచారం చేస్తూఉండగా వీరు తమ భౌతిక దేహము విడిచిపెట్టడం సంభవించినది.

మా తండ్రిగారి దైనికవృత్త పుస్తకములూ, వీరికి బంధుమిత్రులు వ్రాసిన ఉత్తరములూ మొదలయిన పరికరములు పర్లాకిమిడిలో ఉండిపోయినవి. వీరి బాల్యమిత్రులు, సమకాలీనులు అయినవారు కొందరు సజీవులయి ఉన్నారు. వీరి జీవిత విషయములు కొన్ని వారి నడిగి తెలుసుకోవలసి యున్నది. గనుక వీరి జీవితచరిత్ర పూర్తిగా నేనిప్పుడు వ్రాయలేను. నా అనుభవములో ఉన్న విషయములున్ను, నేనిదివరకు తెలుసుకొన్న విషయములున్ను సంగ్రహించి తెలియజేస్తున్నాను.

### మా తాత ముత్తాతల వృత్తాంతము

మాపూర్వులు ఏడుతరములనుండి గోదావరిజిల్లా, అమలాపురంతాలూకా, ఇందుపల్లిలో ఉండినవారు. అంతకుపూర్వము ఎక్కడ ఉండేవారో తెలియదు. మా కింకా ఇందుపల్లిలో కొద్దిగా కొబ్బరితోట లున్నవి. మా గిడుగువారు గోదావరీకృష్ణాజిల్లాలలో చెదిరి ఉన్నారు. గోదావరి కాలువలు పడకమునుపు పంటలభాగ్యము లేని కరవుకాలములో మా తాతగారు గిడుగు వీరరాజుగారు విశాఖపట్టణంజిల్లాకువచ్చి విజయనగరసంస్థానములో సముద్దారుగా పనిచేసినారు. ముఖలింగమునకు నైరృతి దిక్కున సుమారు రెండు మైళ్లదూరమందు గల పర్వతాలపేట అనే గ్రామము విజయనగరసంస్థానంవారి ఉత్తర మండలపుసముద్దారు లుండవలసిన ఠాణా గనుక, ఆ గ్రామమందు మా తాతగారు పండ్రెండుసంవత్సరము లుండిరి. ఆకాలంలో— 1863-వ సంవత్సరంలో మా తండ్రిగారు ఆగ్రామమందు జన్మించినారు. 1906 లో నేను బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడనై ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించిన కొద్ది కాలములోనే వారు నన్ను ముఖలింగమునకు తీసుకొనిపోయి, అక్కడి దేవాలయమందలి చిత్రములు, శాసనములు చూపించి, పిమ్మట పర్వతాలపేటకు తీసుకొనిపోయి, తమ తండ్రిగారుండిన గృహమున్ను, తాము పుట్టిన గదిన్ని చూపించి, తాము పుట్టిన స్థలమునకు సాష్టాంగనమస్కారములు చేసినారు.

మా తాతగారు పర్వతాలపేటలో ఉన్న కాలములోనే ప్రస్తుతం జయపుర సంస్థానాధిపతులయిఉన్న శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి తండ్రిగారు నగరికటకమనే గ్రామంలో ఉండేవారు. ఈరెండు గ్రామములున్ను వంశధారానదికి చేరియొక ఒడ్డున నుండేవి. వారి తండ్రిగారున్ను, వీరితండ్రిగారున్ను మిత్రులు. అందుచేత వీరిరువు

రున్ను కలిసిమెలసి ఆడుకొంటూ ఉండే వారు. బాల్యమం దంకురించిన మైత్రి అంత కంత కెక్కువయినది. గ్రాంథిక వ్యావహారిక భాషావాదములో ఇద్దరును ఏకీభవించకపోయినా వీరి పరస్పరమైత్రి అణుమాత్రమైనా చెడలేదు సరిగదా, మహా రాజావారికి మా తండ్రిగారి యెడల ఆదర మూ, వీరినిబట్టి నాయెడల వాత్సల్యమూ ఎక్కువయినవి. వారి యనుగ్రహమే మా కుటుంబమునకు బహుధా శరణమైనది.

## మాతండ్రిగారి విద్యాభ్యాసం

పర్వతాలపేటలోనే మా తండ్రిగారికి అక్షరాభ్యాసము, ప్రారంభవిద్య సాగినవి. ఆకాలములో అక్కడ బడిలేదు. కీ. శే. వారణాసి సున్నయ్య శాస్త్రిగారు వీరికి వ్రాయడం, చదవడం నేర్పినారు. తీరుబడి ఉన్నప్పుడు మా తాతగారే వీరిని తమ దగ్గర కూర్చుండబెట్టుకొని భారతం, భాగవతం లోనివి కొన్ని పద్యాలు, బాలరామాయణం లోనివి కొన్నిశ్లోకాలు చదివిస్తూ ఉండే వారట. మా తండ్రిగారి ఉపనయనం వీరి 8 వ యేటను విజయనగరములో జరిగినది. అప్పుడు వీరిచేతను మా తాతగారు యథా విధిగా "మాధుకర" భిక్ష దీక్షాదినములలో ఎత్తించినారట. ఒకనాడు మాతండ్రిగారు వేళకు సరిగా సంధ్యావందనము చేయలేదని వీరిని మా తాతగారు కఠినంగా దండించి నారట.



స్వర్గీయ
రావుసాహెబ్, కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ
గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు

## మాతాతగారి మరణము మానాయనమ్మ పాట్లు

పాపం, మా తండ్రిగారు పండ్రెండేండ్ల బాలుడుగా ఉన్నప్పుడే మాతాతగారు చని పోయినారు. 17-1-1940 నాడు మాతండ్రి గారు వ్యాధిగ్రస్తులైయుండిన్నీ తమతండ్రి గారి ఆబ్దికం జరపవలసివచ్చినది. అప్పుడు వీరు నన్ను పిలిచి, నన్నుకూడా స్నానంచేసి తమ చెంత నుండవలసినదని చెప్పగా నే నట్లే చేసినాను. "66 వ సారి మా తండ్రిగారి తద్దినం పెడుతున్నాను. ఇదే కడపటిసారి కాబోలును!" అని వీరు నాతో అన్నప్పుడు నేను దుఃఖ మాపుకోలేక ఏదో నెపమున పై కొకసారి వచ్చి కండ్లు తుడుచుకొని మరల పోయి కూర్చున్నాను. ఇక నీపని నాకు ప్రారంభముకాబోలు నన్న సూచన పొడ గట్టినది.

మాతండ్రిగారికి ఇద్దరు చెల్లెండ్లు తప్ప అన్నదమ్ములు లేరు. ఈ ముగ్గురుబిడ్డలను పోషించడము మానాయనమ్మకు చాలా కష్టంగా ఉండేది. ఇందుపల్లితోటలనుండి రావలసిన ఆయ మత్యల్పము; అదైనా సరిగా వచ్చేదికాదు. మాతాతగారు పర్వ తాలపేటలో పనిచేస్తూ ఉండిన కాలంలో వారు సంస్థానంవారికిలాభంచూపిస్తూ రయితు లకు, భూస్వాములకు ఉపయోగకరములైన పనులుచేయించుటచేత, ఆప్రాంతమందు గల సిద్ధాంతందొరలు వారికి అక్కడకు చేరువగా ఉన్న మతలబుపేట ఇనాముభూమి ఒకటి సంస్థానంవారిఅనుమతి పొంది దానంచేసి నారు; కాని అదిఅప్పటికిసాగులోనికిరాలేదు. అంతేకాక ఆ దానంసంగతి మా నాయన

మ్మకు తెలియనే తెలియదు. అందుచేత ఆమె విజయనగరంలో తన యొడలిపైనున్న ఆభరణము లమ్ముతూ పొందికగా కాలక్షేపము చేసినది. ఇప్పుడు పచ్చయ్యప్పకాలేజీలో కెమిస్ట్రీ ప్రొఫెసరుగా ఉన్న కొల్లూరి సూర్యనారాయణగారి తండ్రిగారైన విశ్వనాథముగారు బంధువులున్ను, మిత్రులున్ను అయి పొరుగున ఉండడంచేత వారి వద్దను మా తండ్రిగారు ఇంగ్లీషు అభ్యసించినారు. మహారాజావారి కళాశాలలో వీరు ప్రవేశించి చదువుకొన్న దంతా నాలుగుక్లాసుల చదువుమాత్రమే—లోవర్ ఫోర్తు, అప్పర్ ఫోర్తు, ఫిఫ్తు, మెట్రిక్యులేషను. వీరి బడిచదు వంతా ఇంతే. అప్పడు కాలేజీప్రిన్సిపలుగాగు చంద్రశేఖరశాస్త్రిగారు. వారికి వీరు ప్రియశిష్యగణములో చేరినవారు. వీరి సహాధ్యాయులలో వీరికి పరమమిత్రులుగా ఉండి, వీరితో కలిసి మెలిసి ఆడుకొంటూ ఉన్నవారు గురుజాడ అప్పారావుపంతులుగారు. వీరికంటె కొంచెము చిన్నవారున్ను, క్రిందితరగతులలో ఉన్నవారున్ను అయినా వీరితో ఆడుకొంటూఉండేవారు శ్రీయుత కేసరి కామేశ్వరరావుగారు. వీరు సజీవులై ఉన్నారు. మరియొకరు బుర్రా పార్వతీశం పంతులుగారు — శేషగిరిరావుగారి పినతండ్రిగారు. ఆకాలపు చదువులు, ఉపాధ్యాయుల పాండిత్యము, విద్యార్థుల నడవడి మొదలయిన విషయములనుగురించి మాతండ్రిగారు పెక్కుసార్లు నాతో ముచ్చటించినారు. ఈనాటి చదువులలో కొన్ని లోపములున్ను, ఆనాటిచదువులలో కొన్ని సుగుణములున్ను ఉన్నా, మొత్తముమీద ఆనాటి విద్యావిధానముకంటె ఈనాటి విద్యావిధానము ఎక్కువ మేలయినదనిన్నీ, పరీక్షలకోసం చదివేశ్రద్ధ నాటి విద్యార్థులకంటె నేటి విద్యార్థులకు సాధారణంగా తగ్గిపోయినా, నేటివిద్యార్థులకు సామాన్యంగా ఉండే విశాలదృష్టి, అవేక్షణము, ప్రపంచజ్ఞానము నాటి విద్యార్థులకే కాదు ఉపాధ్యాయులకైనా లేదనీ వీరున్ను, గురుజాడ అప్పారావుగారున్ను ముచ్చటించుకొంటూ ఉండేవారు.

## చదువు చాలింపు, ఉద్యోగప్రయత్నాలు

మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయిన తర్వాత గురుజాడ అప్పారావుపంతులుగారు కాలేజీలో ఉన్నతవిద్య సాగించ గలిగినారు; మరి మా తండ్రిగారు సాగించ లేకపోయినారు. "ఏదైనా ఒక ఉద్యోగం చూచుకోవలసినదే కాని మరి నేను నీకు చదువు చెప్పించలే"నని మా నాయనమ్మ చెప్పడంచేత మా తండ్రిగారు విశాఖపట్టణం కలెక్టరుకచేరీలో ఆరుమాసములు గుమస్తాపనికోసం వాలంటరీ చేశారు. ఈలోగా వీరికి వివాహమైనది. మా తల్లి తండ్రిగారు కందికొండ రామదాసుపంతులుగారు; భీమునిపట్టణంలో ఒక చిన్నవాటాదారుగా ఓడవర్తకం సాగిస్తూ ఉండేవారు.

ఇట్లుండగా 1880 లో మా తండ్రిగారికి రెండు ఉద్యోగములలో ఏది కావలెనని స్కూల్సు ఇన్స్పెక్టరుగా రడిగినారు— విజయనగరమునకు సమీపముగా ఉన్న కోనాడగ్రామములో 25 రూపాయల ఉపాధ్యాయపదవి కావలెనా? లేక పర్లాకిమిడి రాజుగారి పాఠశాలలో 30 రూపాయల పని కావలెనా? అని అడిగినప్పుడు స్వగ్రామమునకు దూరముగా మన్యప్రదేశములో ఉన్నా పర్లాకిమిడిలో అయిదురూపాయ లెక్కువ దొరుకుననన్న ఉద్దేశంతో ఆ పనే కావలె నన్నారు. అది మొదలు 1936వ సం|| వరకు వీరు 56 సంవత్సరములు పర్లాకిమిడిలోనే నివాసు మేర్పరచుకొని ఉండిరి.

## ఉద్యోగంచేస్తూనే ఉన్నత పరీక్షలు ప్యాసయ్యారు

ఉన్నత విద్య వీరు కాలేజీలో అభ్యసించడానికి అవకాశము లేకపోయినా, ఉద్యోగంచేస్తూ చదువుకొని ఎఫ్. ఏ. పరీక్షలోను, బి. ఏ. ఇంగ్లీషు, సంస్కృతం భాగముల పరీక్షలోను క్రమంగా వెంట వెంటనే నెగ్గినారు. ఇంతలో వీరిబుద్ధిని రెండు విషయము లాకర్షించినవి. పర్లాకిమిడిచుట్టును కొండలలో నివసించే సవరలు విద్యావాసన లేక పశుప్రాయులై ఉన్నారు గనుక, వాండ్లకోసము వాండ్లకొండలలోనే బడులు పెట్టించి, వాండ్లకు చదువు చెప్పించవలెనన్న కోరికపుట్టి వీరు తమ ఆశయం నెరవేర్చుకొనుటకు ఉపక్రమసాధనంగా 1892 లో సవరభాష నేర్చుకొనుటకు ప్రారంభించారు. తమ జన్మస్థానమునకు ఈశాన్యదిక్కున రెండుమైళ్లు దూరంగాను, పర్లాకిమిడికి దక్షిణాన సుమారు 20 మైళ్లు దూరంగాను ఉన్న ముఖలింగం ఆలయమూ, ఆలయములో గోడలపై నున్న శాసనములూ చూస్తూ ఉండడంచేత ఆశాసనముల లిపి నేర్చుకొని శాసనములు చదివి పురాతన చరిత్రవిషయములు పరిశీలించవలెనన్న కోరిక పుట్టినది. ఈ రెండు పనులున్ను వీరు స్వయముగా స్వశక్తీ, స్వబుద్ధీ వినియోగించి చేయవలసినదే కాని ఆకాలంలో ఆ మారుమూలప్రదేశంలో వీరికి తోడుపడి మార్గము చూపించగల గ్రంథములూ లేవు, విద్యావంతులూ లేరు; మరి యేసాధనములూ లేవు. అందుచేత వీరు స్వశక్తిమీదనే ఆధారపడి, కొంచెంకొంచెంగా అయినా రెండు పనులున్ను పట్టుదలతో సాగిస్తూ వచ్చారు.

## తలవనితలంపుగా తప్పిపోయిన ప్లీడరీచదువుప్రయత్నాలు

ఇంతలో వీరిజీవితచరిత్ర పూర్తిగా మార్చివేయగల సందిగ్ధావస్థ వచ్చినది. 1884 లో మాతల్లి 'కాపరా'నికి వచ్చినది 1887లో వీరు ఎఫ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణు లయి సబ్ రెజిస్ట్రారుపనికి దరఖాస్తు పంపించారు. ఆపని అయినట్టు ఉత్తరువు వచ్చింది; గాని, అది మా నాయనమ్మ కిష్టము కాకపోవుటచేత విడిచిపెట్టుకొన్నారు. మరి కొద్దికాలమునకు మా నాయనమ్మ చనిపోయినది. 1892లో వీరిని స్కూలునుండి రాజావారి తమ్మునికి

# స్వర్గీయ రామమూర్తి పంతులుగారు

(ఇప్పటి మహారాజావారి పినతండ్రికి) ట్యూటరుగా బదలాయించారు. అప్పటికి వీరు బి.ఏ. ఇంగ్లీషు, సంస్కృతం భాగముల పరీక్షలో ఉత్తీర్ణు లయినారు. వీరిస్థానే ఆ కళాశాల ప్రధానోపాధ్యాయుల తమ్ముడు గారిని నియమించారు. ఆ సంవత్సరమే శ్యామసుందర రాజగురువు అనే ఓఢ్రులు బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణు లయి వచ్చుటచేత వారిని ట్యూటరుగా నియమించి మాతండ్రిగారిని మరల స్కూలుకు పంపించారు. అప్పుడు వీరున్ను, వీరిస్థానే ఉన్న వారున్ను పనిచేయుటకు అవకాశ మున్నందున, వీరిస్థానే ఉన్న వారు బి. ఏ. పూర్తిగా అయినవా రన్న కారణం చేత వారు అనుభవమూ సార్వీసూ లేనివారయినా వారిని మీదిఉపాధ్యాయులుగాను, వీరు 12 ఏండ్ల సార్వీసూ అనుభవమూ ఉన్నవారయినా పూర్తిగా బి. ఏ. కారన్న కారణంచేత వీరిని క్రింది ఉపాధ్యాయులుగాను నియమించవలె నని ప్రధానోపాధ్యాయులుగారు శిఫార్సుచేశారు. అది చూచి, మా తండ్రిగారు తమకు అన్యాయం జరుగుతూ ఉన్నందుకు ఖేదపడి, అంతవరకున్ను పరమమిత్రులుగా ఉన్న ప్రధానోపాధ్యాయులు తమ తమ్మునికోసం చేసిన శిఫార్సుకు విరుద్ధముగా అధికారులతో నివేదించుకొనుటకు ఇష్టపడక, "ప్లీడరీ చదువుకొనుటకు చెన్నపట్టణం వెళ్లదలచినాను గనుక ఒక సంవత్సరము జీతంనష్టముపైని సెలవు ఇప్పించవలసిన" దని కోరుతూ దరఖాస్తు పంపించుకొన్నారు. వీరు చెన్నపట్టణం ప్రయాణం చేయడానికి కావలసిన ఏర్పాట్లు అన్నీ చేసుకొన్నారు. అప్పట్లో మాతల్లి పుట్టింటికి వచ్చుటచేత, ఆమెతో నేనూ, నాతమ్ములూ (అప్పటికి ముగ్గురము సోదరులము) భీమునిపట్టణంలో ఉన్నాము. "నేను సంవత్సరం సెలవు పెట్టి ప్లీడరీ చదువుకోడానికి చెన్నపట్టణం వెళ్తున్నాను. నీవూ పిల్లలూ మీపుట్టింటనే ఉండవలసినది. సామాన్లు అన్నీ పంపిస్తున్నాను" అని ఉత్తరం వచ్చింది. మరి పదిదినములకు ఈ ప్రయత్నమంతా విడిచిపెట్టుకొన్నట్లు తెలియజేస్తూ మేము పర్లాకిమిడి రావలసినదని తంతివార్త వచ్చినది. ఏమిటో పైపరీక్ష్యమనుకొన్నారు మావాండ్లు. స్కూలు ప్రధానోపాధ్యాయులు తమ శిఫార్సు రద్దుచేసుకొన్నారు. వారితమ్ములు ప్లీడరీచదువుకోడానికి చెన్నపట్టణం వెళ్లినారు. మాతండ్రిగారికి అన్యాయం మరి జరగలేదు. ప్లీడ రయి ఉంటే మాతండ్రిగారు ఎక్కువగా ధనమార్జించి ఉందురేమో కాని వీరు సవరభాషావిషయమై చేసిన పని మరి కాకపోవును. ముఖలింగం-పురాతన చరిత్రవిషయములు ఇటీవలి చారిత్రకపరిశోధకులు పరిశీలించగలుగుదురు గాని ఈపనిఅంతవేగముగా కాకపోవును.

## సంఘసంస్కరణసన్నాహాలు, తత్ఫలితంగా సంఘబహిష్కారము

పైని చెప్పిన రెండుపనులున్ను మందముగానే సాగుతూఉండడానికి చాలా కారణాలున్నవి. ఆకాలంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారి సంఘసంస్కరణ ప్రాభవం ఆంధ్రదేశమందు ఎక్కువగా వ్యాపించియుండేది. అది మాతండ్రిగారిని సైతము లోబరచుకొన్నది. బాలవితంతువులకు పునర్వివాహము కావలెనన్న ఆశయము వీరికి నచ్చినది. అప్పుడు పండితుల ఆక్షేపమును ఖండించుటకు స్మృతులు చదువుకొని ఉపన్యసిస్తూ ఉండేవారు. పర్లాకిమిడిలో రీడింగ్ రూమ్ అనే పేర నొకసమాజముండేది. దానికి వీరు చాలాకాలము కార్యదర్శిగా ఉండేవారు. ఒకసారి పర్లాకిమిడిలో ఒక బాలవితంతువుకు పునర్వివాహము చేయించుటకు వీరు తగిన ఏర్పాట్లన్నీ చేసి వీరేశలింగం పంతులుగారికి జాబు వ్రాశారు. అది తెలిసికొన్న వీరిమిత్రులలో పెద్దవా రొకరు వీరి ఉద్యమము కొనసాగకుండా చేయుటచేతను, వీరి ననేకవిధముల నిరుత్సాహపరచుటచేతను, సంఘసంస్కరోద్యమమునకు పూనుకొన్నయెడల తాము అంతకుముందుగా ప్రారంభించిన పనులు (సవరభాషకున్ను, చరిత్ర పరిశోధనలకున్ను సంబంధించిన పనులు) నిలిచిపోవునన్న భీతిచేతను సంఘసంస్కారమునకు సంబంధించిన పనులు వీరు మరి తలపెట్టలేదు; గాని, నాటనుండి చనిపోవువరకున్ను సంఘసంస్కార ప్రియులుగానే ఉండిరి. శ్రీయుత బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు బాలవితంతువైన తమకూతురికి వివాహము చేసినప్పుడున్ను, అన్యమతమును స్వీకరించి పశ్చాత్తప్తులయి మరల హిందూమతమందు ప్రవేశింపదలచిన యొక బ్రాహ్మణ యువకునికి తోడుగా శ్రీవాసా సూర్యనారాయణశాస్త్రిగారుఉద్యమించినప్పుడున్ను, శారదా వివాహచట్టమునకు అనుకూలముగా ఈ యిద్దరు శాస్త్రులవారున్ను పనిచేసినప్పుడున్ను వారికి వీరు తోడుగా ఉండి తగిన ప్రోత్సాహము కలిగించినారు. హరిజనుల నంటరాదను పూర్వాచారమును తొలగించి హరిజనుల పురోభివృద్ధికి పూనుకొన్న ఉద్యమమునకు వీరును యథాశక్తి తోడుపడినవారే. ఈ ఉద్యమము వెలయకపూర్వము 40 సంవత్సరముల క్రిందటనే వీరు సవరలను, సవరభాష తెలిసిన పైడి (పానో) వాండ్లను ఇంటనుంచుకొని, తమకు దగ్గరగానే కూర్చుండబెట్టుకొని, సవరభాష నేర్చుకొంటూ ఉండేవారు. హరిజనులకోసము పెట్టిన బడులలోనికి బడిపని పరీక్షించుటకు తమతోడి ఉపాధ్యాయులు నిరాకరించినప్పుడు వీరుమాత్రము సంతోషముతో వెళ్లుతూఉండేవారు. 1908 లో వీరిశిష్యులలో ఒకరు కీ. శే. కన్నేపల్లి వేంకటనరసింహం పంతులుగారు బారిష్టరయి ఇంగ్లండునుండి మన దేశమునకు వచ్చి, మా తండ్రిగారినీ తక్కిన మిత్రులనూ చూద్దామని పర్లాకిమిడి వచ్చినప్పుడు మాయింట బసచేసినారు. వారియెడల తమకు గల వాత్సల్యముచేతను, గౌరవముచేతను వీరు ఒకరాత్రి విందుచేసి పదిమంది మిత్రులను ఆహ్వానించారు. ముగ్గురు తప్ప తక్కినవారు రాలేదు; సరిగదా, ఆ మరునాటనుండిన్నీ మాకు ఊరిలో వెలిపెట్టినారు. ఇంట వంటపని చేసే వంటలక్క మరి మాయింటికి రాలే

నన్నది. మంచినీళ్లు తెచ్చిపోసే బ్రాహ్మణుడు మరి మాకు కనబడలేదు. ఊరిపెద్దలు కొందరు-మాకు పరమమిత్రులే - వనసంతర్పణ తలపెట్టి భోజనాలకు పూర్వము కాశీగంగ 'తీర్థము' పుచ్చుకొనుటకు సమ్మతించినయెడల మమ్ము ఆహ్వానించి వెలితీసివేయుదు మన్నారు. "మరియొకనాడు కావలసినయెడల నూరుసారులు తీర్థము పుచ్చుకొందును గాని ఈ నాడు మాత్రము ఒక్క చుక్కయినా పుచ్చుకో"నని వీరు నిరాకరించారు. కొందరు మిత్రులు మా తండ్రిగారిని వెలిలో ఉంచడానికి మనసొప్పకను, కలుపుకోడానికి సాహసములేకను సభ ఏర్పరచి సముద్రయానము చేసినవారు ప్రాయశ్చిత్తము చేసుకోవలెనా, అక్కరలేదా అనే విషయము చర్చకు తీసుకొనివచ్చారు. ఈ వెలి కొద్దికాలములో దానంతట అదే అంతరించినదిగాని మాతండ్రిగారు సనాతనులకు కొంచెమైనా లొంగలేదు. వీరు మొదటనుండిన్నీ సబబులేని అధికారమునకు గాని, అట్టి అధికారమువహించే వ్యక్తులకు గాని లొంగక తమ పట్టుదల విడవక పనిచేస్తూవచ్చారు. ఉద్యోగ మూడిపోయినా సరే అనిష్టమైన పని చేయనన్న సంకల్పము మొదటనుండిన్నీ వీరికి బలంగా ఉండేది. ఇందుకు తార్కాణంగా 1892 లో వీరు పర్లాకిమిడి కుమార రాజుకు ట్యూటరుగా ఉన్నప్పుడు ఒక ముచ్చట జరిగినది. భోగీసంక్రమణను తర్వాత కనుమునాడు పశువులపండుగ చేసి పశువులకేకాక మనుష్యులకు సైతము చురకలు వేసే ఆచారము పర్లాకిమిడిలో ఆకాలమందు బలంగా ఉండేది. అందుచేత, వీరు కుమారరాజుకు పాఠము చెప్పతూఉన్న సమయంలో రాజావారి సేవకులు నిప్పు కుంపటీ, చురకలువేసే పరికరములూ పట్టుకొనివచ్చి "మీకున్ను కడుపుపైని రెండుచురకలు వేయవలసినదని రాజావారి ఆజ్ఞ" అని మాతండ్రిగారికి తెలియజేయగా వీరు కోపము పట్టలేక "ఇక్కడి రాజుల మర్యాద చక్కగానే ఉన్నది; తక్కిన సంస్థానాలలో పండితులకూ, ఉద్యోగస్థులకూ పండుగనాడు పంచెలచాపులో, పట్టుబట్టలో బహుమతిగా ఇస్తూఉంటే, ఈ సంస్థానంలో వాతపెట్టడం సంప్రదాయంగా ఉన్నది; సెబాస్! చాలు మీమర్యాద." అన్నారు. అప్పటా కుమారరాజు సేవకులను మందలించి వెడలిపొమ్మన్నాడట.

## వీరు తలపెట్టిన సవరలవిద్యాభివృద్ధి, గవర్నరుగారితోడ్పాటుకు అడ్డుపుల్ల

1894 లో గవర్నరుగారు పర్లాకిమిడికి వచ్చినప్పుడు, రీడింగ్‌రూమ్ సభవారొక సన్మానపత్రిక సమర్పిస్తూ సవరల విద్యాభివృద్ధికోసం ప్రభుత్వంవారు సవరదేశంలో బడులు పెట్టించవలసినదనిన్ని, అందుకు సవరభాష నేర్చిన మాతండ్రిగారు తోడుపడగలరనిన్ని తెలియజేసినారు. అందుకు గవర్నరుగారు సంతసించి మాతండ్రిగారితో సవరలవిషయమై కొంతసేపు ప్రసంగించినారు. గాని, అప్పుడు జిల్లాకలెక్టరుగా ఉన్న మెక్కార్టీదొరగారికి సవరలకు చదువు చెప్పించడము ఇష్టముకాకపోయినది. కట్టెలుకొట్టి జీవించే కొండవాండ్లకు చదు వెందుకని వారి అభిప్రాయమట! అందుచేత గవర్నరుగారితో భోజనముచేస్తూ ఉన్న సమయమున మాతండ్రిగారి ప్రస్తావన వచ్చినప్పుడు ఆ కలెక్టరుగారు "రామమూర్తిపంతులు పిచ్చివాడు. నెమ్మదిగా జీవిస్తూ ఉన్న సవరలకు లేనిపోని ఆశలు కలిగించి ప్రశాంతమైన సవరదేశంలో విప్లవం పుట్టించ దలచినాడు, అతడు సవరదేశమునకు పోరాదని శాసించ దలచినాను" అని చెప్పి గవర్నరుగారికి మాతండ్రిగారి యెడల దురభిప్రాయము కలిగించారట. అందుచేత, సవరల విద్యాభివృద్ధికోసం మా తండ్రిగారు చేసిన ప్రయత్నం అప్పట్లో నెరవేర లేదు.

## అమితంగా క్వైనైను సేవించుటవల్ల వీరికి చెవుడుపట్టుకొన్నది

సవరభాష, సవరపాటలు, సవరదేశం తిరిగి నేర్చుకొందామని వేసవి సెలవులలో ఒకసారి వీరు కొండలలో తిరిగిరాగానే వీరికి మలేరియా జ్వరము పట్టుకొని మూడు మాసములు పీడించింది. అప్పుడు పోస్టాఫీసులలో అమ్మే క్వినీనుగుండ దినానికి 10 గ్రెయినులు చొప్పున 40 దినములు పుచ్చుకొనేసరికి వీరికి చెవుడు పట్టుకొన్నది. ఎన్ని మందులుతిన్నా అది అంతకంతకు ఎక్కువయినదిగాని తగ్గలేదు.

వీరి చారిత్రక పరిశోధన కృషిమాత్రము కొంతవరకు ఫలించినది. స్వయంకృషివల్లనే శాసనములలోని ప్రాచీన నాగరకర్ణాటాంధ్ర లిపివర్ణములు చదువుట నేర్చుకొని ముఖలింగేశ్వరాలయములోని రాతిగోడలపై చెక్కియున్న శాసనములున్ను, రాగిరేకులపై చెక్కిన దానశాసనములున్ను చదివి ప్రాచీన కళింగ రాజ్యమునకు — ఎనిమిదవ శతాబ్దము నుండి పండ్రెండవ శతాబ్దమువరకున్ను ముఖలింగము రాజధాని అనిన్ని, నగరకటకము (అనగా శ్రీవిక్రమ దేవవర్మగారు బాల్యమందున్న గ్రామము) సైనికస్థానమనిన్ని, కళింగపట్టణము రాజుల రేవుపట్టణమనిన్ని తెలుసుకొన్నారు. తాము తెలుసుకొన్న విషయములన్నీ చేర్చి "ఆంటిక్విటీజ్ ఆవ్ ముఖలింగం" అనేపేరను ఇంగ్లీషులో ఒక వ్యాసము వ్రాసి మద్రాస్ లిటరేచర్ అండ్ సయిన్సు సొసైటీ మాసపత్రికలో 1895లో ప్రకటించారు. కళింగ గంగవంశపురాజుల దానపట్టాశాసనములు సంపాదించి ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రకటించారు. ముఖలింగము ప్రాచీన కళింగ గంగరాజ్యమునకు రాజధానినగర మన్న విషయం వీరి వ్రాతల నాధారంగా "గైకొన్నట్లు సూచిస్తూ విన్‌సెంట్‌స్మిత్‌గారు తమ హిందూదేశ చరిత్రలో చేర్చుకొన్నారు.

## పరిశోధనలును కొంతకాలంపట్టు ఆగాయి

అంతట్లో సవరభాషాకృషికి, చరిత్ర పరిశోధనలకు సంబంధించిన పనులు మా తండ్రిగారు కొంతకాలము నిలిపివేయవలసివచ్చినది. అందుకు కారణమే

మంటే, 1895 లో అదివరకు హైస్కూలు మాత్రముగానే ఉన్న కళాశాల సెకండ్ గ్రేడ్ కాలేజీగా అభివృద్ధిపరచుటకు పర్లాకిమిడి రాజావారు సంకల్పించి అందుకు తగిన యేర్పాట్లు చేశారు. మా తండ్రిగారప్పటికి బి. ఏ. పూర్తిచేయలేదు. ఇంగ్లీషు, సంస్కృతభాగములందలి పరీక్షలలోమాత్రమే ఉత్తీర్ణులై ఉండడంచేత, మెట్రిక్యులేషన్ తరగతివరకు పాఠములు చెప్పడానికి మాత్రమే అర్హులై ఉండిరి. ఫోర్తుఫారముకు ఇంగ్లీషున్ను, హైస్కూలు తరగతులకు చరిత్రపాఠములున్ను చెప్పతూ ఉండేవారు. చరిత్రాధ్యయనములో వీరికి అభిమానమూ, కృషీ ఎక్కువగా ఉండడంచేత కాలేజీలో చరిత్రాధ్యాపకపదవికి అర్హులు కాగోరి, బి.ఏ. పూర్తి అయితేనేకాని ఆ పదవి తమకు రాదు గనుక సవరభాషకున్ను, చరిత్ర పరిశోధనలకున్ను సంబంధించిన కృషి కట్టిపెట్టి బి. ఏ. చరిత్రభాగపరీక్షకు చదివి 1896 లో జరిగిన పరీక్షయందు మొదటితరగతిలో ఉత్తీర్ణులై, ఆ సంవత్సరం ఉత్తీర్ణులైనవారిలో రెండవవారుగా నిల్చినారు. ఏ కాలేజీలోను ప్రవేశించి చదవకుండా ప్రైవేటువిద్యార్థిగా పరీక్షకు వెళ్లి ఇంత ఎక్కువగా ఉత్తీర్ణులు కావడము చాలా మెచ్చుకోవలసిన విషయముగనుక, పర్లాకిమిడిలో కాలేజీ పెట్టగానే వీరిని రాజావారు చరిత్రోపన్యాసకులుగా నియమించినారు. ఆరంభములో క్రొత్తగా చెప్పవలసినవిషయము తాము పెద్దపుస్తకములు చదివి నేర్చుకోవలసి ఉండడంచేత నాలుగైదు సంవత్సరములవరకున్ను సవరభాషకూ, ప్రాచీనహిందూదేశచరిత్రపరిశోధనలకూ సంబంధించిన కృషి సాగలేదు.

### తెలుగు-సవర నిఘంటు రచన

ఆపిమ్మట సవరభాషకృషి సాగించి తెలుగు—సవరనిఘంటు వొకటి రచించారు. సవరపాటలు, సవరకథలు కొన్ని సవరభాషలోనే వ్రాసిపెట్టుకొన్నారు. సవరభాషకు వ్యాకరణం రచించడానికి పునాది వేసినారు. ఈ పనిలో వీరికి వీరి మిత్రులొకరు మామిడన్నము కుమారస్వామి పంతులుగారు తోడుగా ఉండేవారు. వీరికి మొదటనుండిన్ని సవరభాష నేర్పినవాడు 'తౌడు' అనే పేరు గల ఒక పైడి (పాణో) వాడు. వాడికి ఓఢ్రము, తెలుగు, సవరభాషలు వచ్చిఉండడంచేత వాణ్ణి గురువుగా పెట్టుకొన్నారు కొంతకాలానికి ఆ పైడివాడు చెప్పిన సవరభాష స్వచ్ఛమైన సవరభాష కాదనిన్ని, స్వచ్ఛమైన సవరభాష నేర్చుకోవలెనంటే స్వచ్ఛమైన సవరల నడిగి తెలుసుకోవలసినదే అనిన్ని మాతండ్రిగారికి బోధపడినది. అది సులభసాధ్యమైన పని కాదు. అందుచేత, అప్పుడప్పుడు స్వచ్ఛమైన సవరలను రప్పించి వారికి అన్నం పెడుతూ, బట్టలిస్తూ, డబ్బిస్తూ ఇంటివద్ద నుంచుకొని కృషిచేశారు. ఏమిచేసి ఎంతశ్రమపడి సవరభాష నేర్చుకొని సవరల విద్యాభివృద్ధికోసం వీరు ప్రయత్నించినా, వీరి ఉద్యమం కొనసాగడానికి రాజావారి తోడుపాటుగాని, ప్రభుత్వంవారి తోడుపాటుగాని లేకపోయినది. వీరు రచించిన గ్రంథము అచ్చుపడడానికి ఆధారం కనబడలేదు; సవరలకోసం బడులు పెట్టించడానికి సాహాయ్యం దొరకలేదు. అప్పటికీ ఊరుకోలేక వీరు తమ సొంతధనం వెచ్చించి. పర్లాకిమిడికి చేరువనున్న సవరపల్లెలలో గ్రాంటుబడులు పెట్టి గ్రాంటుకోసం ప్రయత్నించారు. కొన్నాళ్లకు—అనగా, 1905-6 లో వీరి కృషీ, ఉత్సాహమూ, పట్టుదలా మెచ్చుకొన్న ఉద్యోగస్థులు జిల్లాలో ఉండడంచేత వీరు పెట్టిన బడులు కొద్దిగా వృద్ధిలోనికి వచ్చినవి. సవరల విద్యాభివృద్ధికి ఎక్కడెక్కడ ప్రభుత్వమువారు బడులు పెట్టవలెను, విద్యావిధాన మెట్లుండవలెను అనే విషయములు చర్చకు వచ్చినవి. ఆ చర్చలు గంజాంజిల్లా కలెక్టర్లు ఛత్రపురంలో జరిపిస్తూ కొంద రుద్యోగస్థులతో పాటు మా తండ్రిగారినిసైతము ఆహ్వానిస్తూ ఉండేవారు.

### సవరభాషాభ్యాసానికి ఒకదొరగారు వీరివద్ద శిష్యరికం చేశారు

1908 లో వెల్ష్ మన్ అనే ఒక ఫారెస్టు ఉద్యోగస్థుడు సవరదేశములో పనిచేయవలసి వచ్చుటచేత అతనికి సవరభాష నేర్చుకోవలెనన్న కోరిక పుట్టినది. "కొద్దిగా పారితోషికం ఇస్తూఉంటాను; నాకు మాయింటివద్దను సవరభాష నేర్పుతారా ?" అని ఆదొర మాతండ్రిగారిని అడిగినాడు. "మీరు నాకేమీ పారితోషికం ఇవ్వనక్కరలేదు. నేను మీయింటికి వచ్చి సవరభాష నేర్పడానికి నాకు వీలుండదు. మీరు మా కాలేజీకి మధ్యాహ్నం మావిశ్రాంతివేళ వస్తే మీకొక గంట సవరభాషాపాఠములు చెప్పగలను"అని వీరు తెలియజేశారు. ఆదొర వీరు కోరినట్లు వీరివద్దకే వచ్చి సవరభాష నేర్చుకొన్నాడు. మొట్టమొదట ఆదొర పెద్ద ఉద్యోగస్థుడననే గర్వంతో అధికారభావంతో మా తండ్రిగారిని చూచేవాడట; గాని, కొద్దిదినములలో వీరి పాండిత్యగరిమ తెలుసుకొని వీరిని గురుభావంతో చూస్తూఉండేవాడు. అప్పటికి నేను రాజమహేంద్రవరం ట్రెయినింగ్ కాలేజీలో (1907 లో) ట్రెయినింగయి పర్లాకిమిడి కాలేజీలోనే హైస్కూలు తరగతులకు చరిత్రాధ్యాపకుడుగా పనిచేస్తూఉండేవాడను. అందుచేత, నేనుకూడా ఆ దొరతో కలిసి సవరభాష నేర్చుకోవలసి ఉండెను. గాని, అప్పుడు స్కూళ్ల ఇన్స్పెక్టరుగా ఉన్న యేట్సు దొరగారు ఫొనెటిక్స్‌లిపిని, డైరెక్ట్ మెథడ్ అనే పద్ధతిని అనుసరించి చిన్నపిల్లలకు ఇంగ్లీషునేర్పడం మంచిదనే క్రొత్తవిధానం తెచ్చిపెట్టి ఆ పనికి మాతండ్రిగారున్ను, నేనున్ను తగినవార మని ఎంచి శిఫార్సు చేయడంచేతను మేమాపని ప్రారంభించాము. క్రొత్తపద్ధతుల ననుసరించి పాఠములను చెప్పేవాడను నేను; నాకు సలహాలిస్తూ మార్గం చూపిస్తూ నాపని పరిశీలిస్తూ ఉండేవారు మాతండ్రిగారు.

ఇంతలో యేట్సుదొరగారి మూలాన్నే వ్యావహారికభాషావాదం ప్రారంభమయినది.

1910 జూలైమాసంలో నేను జయపురం స్కూలుకు హెడ్‌మాస్టరుగా వెళ్లినాను; గనుక అప్పట్లో సవరభాష నేర్చుకోవలెనన్న నాసంకల్పం నెరవేరలేదు.

మా తండ్రిగారివద్ద సవరభాష నేర్చుకొన్న వెల్షమన్ దొర పలుకుబడిగలవాడు గనుక వీరివిషయం జిల్లాకలెక్టరుగారికి చెప్పి, వీరు రచించిపెట్టుకొన్న తెలుగు-సవర నిఘంటు, సవరకథలు, సవరపాటలు ప్రభుత్వంవారు అచ్చువేయించేటట్లు గట్టిగా శిఫార్సుచేయవలసినదని ఉద్యోగిరీతిగాను, స్నేహధర్మంగాను చెప్పడంచేత అప్పటి జిల్లాకలెక్టరయిన మాక్ మైకేల్ దొరగారు ప్రభుత్వమువారికి వ్రాసి అనుమతి తెప్పించారు.

## ఉద్యోగవిరమణము, రావుసాహెబు బిరుదప్రాప్తి

ఇంతలో మా తండ్రిగారికి కాలేజీ పని నుండి 'రిటైర్' అయి విశ్రాంతి పొందుదామన్న కోరిక పుట్టినది. వయస్సుకు 48 సంవత్సరములవారే అయినా 1880 నుండి 30 సంవత్సరములు పనిచేసినవారు గనుక, వీరు రిటైర్ కావడానికి కాలేజీ అధికారులు అనుమతిచ్చారు. 1911 లో వీరు రిటైర్ అయినారు. ఆపని నాకు ప్రాప్తించడంచేత, జయపురం హైస్కూల్ హెడ్‌మాస్టరుపని విడిచిపెట్టి, నేను పర్లాకిమిడి చేరుకొన్నాను. అచ్చుగుతూ ఉన్న సవరపుస్తకాల ప్రూఫులు దిద్దడం తప్ప మరి యేసాహాయ్యమూ నేను వీరికి చేయలేకపోయినాను. "ఈ పుస్తకాలు నీవు రచించినందుకు నీకేమి పారితోషికము కావలె" నని ప్రభుత్వంవారు అడిగినప్పుడు "నాకేమీ అక్కరలే"దని వీరు తెలియజేశారు. ఎట్లయినా వీరిని గౌరవించడం తమవిధి యని ప్రభుత్వంవారు గ్రహించి, 1911 లో జార్జి చక్రవర్తి రాజ్యాభిషేక సంబంధమైన ఉత్సవం జరిగినప్పుడు వీరికి "సెర్టిఫికెట్ ఆవ్ మెరి"ట్టున్ను, 1913 లో రావుసాహెబ్ అనే బిరుదున్ను ప్రభుత్వంవారు వీరి కిచ్చారు.

ఆ బిరుదు వచ్చేసరికి వీరు విజయనగరంలో నివసించవలసి వచ్చినది. అది యొక చిత్రమైన సన్నివేశము. విజయనగరం మహారాజావారి పిల్లలలో మొదటివారు (అనగా రెండేండ్లక్రిందట చెన్నపురిలో మృతినొందినవారు) ఆ జీమ్రరులో చదువుకొంటూ ఉండేవారు. వారి చెల్లెలున్ను, తమ్ముడున్ను (అనగా క్రికెట్ బంతి ఆటలో ప్రసిద్ధి పొందినవారు) విజయనగరంలో ఉండేవారు. వారికి ట్యూటరు కావలసి ఉండెను. ఆ పని నాకిప్పించడానికి కీ॥ శే॥ గురుజాడ అప్పారావుపంతులుగారు సంకల్పించుకొని నన్నడిగినారు. పర్లాకిమిడి కాలేజీలో నేను చేస్తూఉన్నపని ఇంతకంటె ఎక్కువ శాశ్వతమైనపని అన్న ఉద్దేశంతో ఆ పని చేయడానికి నేను సమ్మతించక, మా తండ్రిగారు రిటైర్ అయినా 50 సంవత్సరములు ఈడుగలవారే కనుక, వీరి కాపని ఇప్పించిన యెడల మా కుటుంబమునకు సహాయంగా ఉంటుం దన్నాను. అందుచేత వీరు 1913 లో విజయనగరవాస్తవ్యు లయినారు. అప్పుడు వీరూ, గురుజాడ అప్పారావుగారూ, బుర్రా శేషగిరిరావుగారూ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులుగారూ వ్యావహారికభాషావాదమునకు కావలసిన కృషీ, చర్చలూ చేస్తూఉండేవారు. అయితే, ఈ ట్యూటర్ పని ఒక్క సంవత్సరం కంటె ఎక్కువ చేయలేదు.

1914 లో వీరు పర్లాకిమిడికి తిరిగీ వచ్చి ఆంధ్రభాషాకృషి తీవ్రంగా చేయడానికి మొదలుపెట్టినారు. ఈ వ్యావహారిక భాషావాదపరిణామము వేరే ఒక వ్యాసంగా రచించవలసినది గనుక, దానితో సంబంధించిన వీరి జీవితచరిత్ర మరి ఎక్కువగా ఇక్కడ వ్రాయదలచుకోలేదు.

## సవరభాషనుగురించిన వీరిగ్రంథములకు ప్రభుత్వమువారి తోడ్పాటు

'లింగ్విస్టిక్ సర్వే ఆవ్ ఇండియా' అనే గ్రంథాలలో సవరభాషను గురించి వ్రాస్తూ "దీనికి సంబంధించిన నిఘంటువు, కథలు, పాటలు రావుసాహెబు జి. వి. రామమూర్తిపంతులుగారు రచించినారు; ప్రభుత్వమువారు అచ్చువేసి ప్రకటించినారు; గాని, ఇవి తెలుగులిపిలో తెలుగు తర్జుమాతో ఉన్నందున, ఇవి తెలుగు తెలిసినవారికే కాని ఇతరులకు ఉపకరించవు; ఆంగ్లభాషలో రచితములై ఉండిన యెడల భాషాతత్వవేత్తల కుపకరించి ఉండును" అని గ్రియర్సన్ దొరగారు వ్రాశారు. అందుచేత మా తండ్రిగారికిన్ని, ప్రభుత్వోద్యోగస్థులకున్ను, కొండలలో సవరదేశమందు పనిచేస్తూఉన్న మిషనరీలకున్ను, అస్సాం తేయాకు తోటలకు సవరలను సైతము కూలీలుగా తీసుకొనిపోతూ ఉండిన సంఘంవారికిన్ని సవరభాషకు సంబంధించిన పుస్తకములు ఇంగ్లీషుభాషలో కావలెనన్న కోరిక పుట్టినది. అవి రచించగలశక్తి మా తండ్రిగారికితప్ప మరియెవరికిని లేకుండేది. సవరభాష నేర్చుకొన్న వెల్షమన్ దొరగారు 1917 లో చనిపోయినారు. 1928 లో మిస్‌మన్రో అనే మిషనరీ దొరసానిగారు సవరకొండలలో పనిచేయవలసి వచ్చినందున సవరభాష నేర్చుకొనుటకు మొదలుపెట్టినారు. ఆంధ్రభాషాకృషిలోను, వ్యావహారిక భాషావాదములలోను నేను మా తండ్రిగారికి తోడుపడి పనిచేయవలసి వచ్చినందున నేను సవరభాష నేర్చుకొనుటకప్పటివరకున్ను అవకాశము లేకపోయినది. అప్పుడు మా తండ్రిగారు నన్నొకసారి పిలిచి "నీవు సవరభాష నేర్చుకోక తప్ప"దన్నారు. "సరే మంచి" దన్నాను. 30 సంవత్సరములు వారు శ్రమపడి నేర్చుకొన్న సవరభాష అంతా నాకు ఆరుమాసాలలో పట్టుపడేటట్లు నేర్పారు. అంతలో ప్రభుత్వంవారు ఇంగ్లీషుభాషలో సవర-ఇంగ్లీషు, ఇంగ్లీషు-సవర నిఘంటువులున్ను, సవర వ్యాకరణము, సవరకథలున్ను రచించవలసినదని కోరుతూ మా తండ్రిగారికి తెలియజేశారు. నేను సవరభాష నేర్చుకొని ఉండడంచేత

ఈ పనిలో సైతము నేను మా తండ్రిగారికి తోడుపడ గలిగినాను. 1931–1936 లలో ఈ గ్రంథములు రచితము లయినవి. ప్రభుత్వము వారు వీటిని ప్రకటించారు. ఈపని జరుగుతూ ఉన్న కాలంలో 1934-వ సంవత్సరమందు వీరికి కైజర్-ఇ-హింద్ సువర్ణ పతకమును ప్రభుత్వమువారు బహుమతిగా ఇచ్చారు.

## ఆంధ్రోత్కళ సంక్షోభంలో జోక్యం

ఈపని జరుగుతూ ఉన్న కాలంలోనే ఆంధ్రోత్కళసమస్య, ఉత్కళరాష్ట్రనిర్మాణం, ఆంధ్రదేశభాగములే అయినా పర్లాకిమిడి, బరంపురం మొదలయినభాగములు ఉత్కళరాష్ట్రంలో కలపడం మొదలయిన సంక్షోభం కలిగింది.

ఇందులో మా తండ్రిగారున్ను, వీరితో పాటు నేనున్ను జోక్యం కలుగజేసుకోక తప్పింది కాదు. 1931 లో పర్లాకిమిడి రాజులచరిత్ర, గంగవంశపురాజులు ఓఢ్రులు కారన్నవిషయం చర్చకు వచ్చినప్పుడున్ను, ఒడొనెల్ కమిటీవారి యెదుట ఆంధ్రులతరఫున ఆంధ్రులకోర్కెలు నివేదించవలసివచ్చినప్పుడున్ను ఈ విషయం బాగుగా తెలిసినవారిలో పెద్దలు మాతండ్రిగారు కావడంవల్లను వీరిని ముందుగా పెట్టుకొని ఆంధ్రులు పనిచేయవలసివచ్చినది. ఇదంతా పర్లాకిమిడిరాజుగారి కోపానికి కారణమైనది. అయితే, రాజావారు వీరి నేమిచేయగలరు? వారికాలేజీలో పనిచేసినవారే అయినా వీరు 1911 లో ఎస్టేటు కోర్టు ఆవ్ వార్డ్సువారి పెత్తనంలో ఉన్నప్పుడు గ్రాట్యుఇటీ పుచ్చుకొని రిటైరయినారు. అందుచేతను వీరిమీద తమకు గల కోపం, నేను వారికొలువులో ఉన్నవాణ్ణి గనుక, నామీద చూపించారు. ఏదో ఒక సాకు చూచి నన్ను 4-2-1932 లో ఉద్యోగం నుండి తొలగించారు. నాటనుండిన్ని మా కుటుంబము ఆర్థికంగా చాలా చిక్కులు పడవలసివచ్చింది. అయినా మా తండ్రిగారు చలించలేదు; నన్ను చలించ నివ్వలేదు.

1932-33లో పర్లాకిమిడి తాలూకాబోర్డు కొత్తగా ఏర్పడింది. అదివరకు పర్లాకిమిడిలో ఉన్న మ్యూనిసిపల్ కౌన్సిలును తమకు వశ్యం చేసుకొని పర్లాకిమిడిరాజావారు పర్లాకిమిడి ఒరిస్సాలోచేర్చవలసినదనే తీర్మానంకావించుకొని ఉండడంవల్ల రాబోయే తాలూకా బోర్డుకూడా తమకు వశ్యమయితే దానిలో కూడా ఈతీర్మానం నెగ్గించుకొని పర్లాకిమిడితాలూకా ప్రజలంతా ఒరిస్సాలో చేరగాని కిష్టపడుతున్నట్లు ప్రభుత్వంవారికి తెలియజేస్తారన్న భీతిచేతను తాలూకాలోని ఆంధ్రు లందరూ తాలూకాబోర్డుమెంబర్ల ఎన్నికలవిషయంలో ఉషారుగా ఉండిరి. ప్రతిఫిర్కాలోను రాజుగారు నిలబెట్టిన అభ్యర్థికిన్ని, తెలుగువారు నిలబెట్టినఅభ్యర్థికిన్ని తీవ్రమైనపోటీ జరిగింది. రాజుగారితో తాలూకా రైతులు బహిరంగంగా పోటీలో నిలవడానికి ఇదే ప్రారంభం. రాజుగారి మనుష్యులు ఎన్నికలవిషయంలో 'రైతుబిడ్డ'సినీమాలో చేసిన చర్యలు ఇంచుమించుగా అన్నీ చేసినవారే. అయినా, తెలుగువారి ప్రతినిధులసంఖ్యే ఎక్కువయినది; నేనే అధ్యక్షుడ నయినాను. ఈ విషయంలో మాతండ్రిగారు తెలుగువారి పక్షముననిల్చి వృద్ధులయినా యువకులవలెనే పని చేసి మాకు జయము కలిగించారు. పర్లాకిమిడి తాలూకాలో నూటికి 60 మంది పైగా తెలుగుమాటలాడేవారు కలరు గనుక ఇది ఒరిస్సాలో చేర్చకూడదన్న తీర్మానము నెగ్గింది. ఒడొనెల్ కమిటీవారి నివేదికలో ఇద్దరుసభ్యులు పర్లాకిమిడికూడా ఒరిస్సాలో చేర్చవలసినదని శిఫార్సుచేసినా, వారి అభిప్రాయమును ఖండిస్తూ అధ్యక్షులయిన ఒడొనెల్ గారు పర్లాకిమిడి తెలుగువారిదే కనుక ఒరిస్సాలో చేర్చగూడ దన్నారు. దాని ననుసరించి వైట్ పేపర్లోకూడా అదే నిశ్చితమైనది. అయినా, ఈ విషయము జాయింట్ పార్లమెంటుకమిటీవారు ఆమోదిస్తేనేకాని తేలనిది గనుక, వారి యెదటను ఎవరిపక్షము వారు మనవిచేసుకోడానికి లండన్ వెళ్లవలసివచ్చింది. తెలుగువారి పక్షమున బయలుదేరినవారిలో పర్లాకిమిడి ఒరిస్సాలో కలపరాదని వాదించడానికి నన్ను మా తాలూకా ఆంధ్రులు పంపించారు. ఈ పనిలో సైతము మా తండ్రిగారు శ్రమపడి అనేక విధముల మాకు మార్గదర్శకులుగా ఉండేవారు. ఈ ఉద్యమంలో నేను జోక్యం కలుగజేసుకోకుండా ఉండేటట్టు చేయడానికి కొన్ని మాయోపాయములూ, తంత్రములూ జరిగినవి. "ఆంధ్రుల యెడలనుగాని, నిన్నునమ్మి తమకు ప్రతినిధిగా నిన్ను లండన్ పంపినవారియెడలను గాని నీవు ద్రోహివి కానేరవన్న నమ్మకం నాకు లేకపోలేదు. అయినా చెప్తున్నాను: నీవు పరుల మాయమాటలకు మోసపోవద్దు. జాగ్రత్త" అని నేను 1933 లో లండన్ వెళ్లినప్పుడు మా తండ్రిగారు నాకు చేసిన ఉపదేశవాక్యాలు నేనెన్నటికీ మరవలేను.అసలు నాకు ద్రోహచింత పుట్టనేలేదు. అందులో మా తండ్రిగారి హెచ్చరిక నన్ను మరింత జాగరూకుని చేసినది; దొంగమాటలకు లొంగిపోకుండా కాపాడినది. నాకు విహితమైనపని నేను నెరవేర్చుకొన్నాను. పర్లాకిమిడి ఒరిస్సాలో చేర్చకూడ దనడానికి నేను చెప్పిన కారణాలు సెక్రటరీఆవ్ స్టేట్ ఫర్ ఇండియాకున్ను, వారికి తోడుగాఉన్న కమిటీవారికిన్ని నచ్చినవి. 1934 జనవరి సరికి పర్లాకిమిడి ఒరిస్సాలో కలపకుండా ఉంచుటకే జాయంటు పార్లమెంటరీ కమిటీ వారు నిశ్చయించుకొన్నా రన్నవదంతి పుట్టినది. అప్పుడు పర్లాకిమిడిరాజావారు మరల లండన్ పోయి పర్లాకిమిడితాలూకా అంతా కాకపోయినా,పట్టణమున్ను దానికి చేరువగా ఉన్న కొన్ని గ్రామములున్ను అయినా ఒరిస్సాలో చేర్చవలసినదని కోరి విశేషంగా ధనం కర్చుపెట్టి పలుకుబడి ఎక్కువ చేసుకొని కృతార్థు లయినారు. పర్లాకిమిడిన్ని, తాలూకాలో మూడవవంతు భాగమున్ను ఒరిస్సాలో కలిసినవి. 1936 లో ఏనాడు

ఒరిస్సారాష్ట్ర మేర్పడి పర్లాకిమిడి అందులో చేరినదో ఆనాడే మాతండ్రిగారు అక్కడ నుండి వెడలి నా కడపటి తమ్మునివద్ద నుండడానికి నిశ్చయించుకొని రాజమహేంద్రవరం వచ్చారు. అక్కడ మా తమ్ముని కొడుకులను చేరదీసి ఇంగ్లీషు, సంస్కృతము, తెలుగు నేర్పడానికి పూనుకొన్నారు.

## వీరి విద్యాబోధన పద్ధతులు

బడులలో చెప్పే చదువుకంటె ఎక్కువగా సులభమైన పద్ధతులలో చదువు చెప్పవలెనన్న కోరిక వీరికి చిన్నప్పటినుండినీ ఉండేది. 50 ఏండ్లక్రిందటనే రెండుతరగతుల చదువు ఒక్కసంవత్సరంలో ఎందుకు చెప్పకూడదన్న పట్టుదలతో ఆరంభించి నన్ను బడిలో ప్రవేశపెట్టక ఇంటివద్దనే కూర్చుండబెట్టుకొని చదువుచెప్తూ ఉండేవారు. ప్రైమరీపరీక్ష గవర్నమెంటుపరీక్షగా ఉండేది. అది నేను నా 7-వ ఏటను నెగ్గేటట్టు తర్ఫీతు చేశారు. ఆ కాలంబడులలో పాఠములు చెప్పే పద్ధతులకంటె ఎక్కువ మంచిపద్ధతులనే అనుసరించి వీరు పాఠములు చెప్తూ ఉండేవారు. అయినా వీరిపద్ధతులు నేటి విద్యాబోధకుల దృష్టికి కూడనివిగానే ఉండేవి. ఇది ఇటీవల వీరు ఒప్పుకొన్న విషయమే. పిల్లల బుద్ధికి, గ్రహణశక్తికి మించిన మాటలూ, వాక్యాలూ, అర్థాలూ వల్లనవేయిస్తూఉండేవారు. అన్నప్రాశననునాడే ఆవకాయ తినిపించారన్నట్లు వీరు నాకు ఇంగ్లీషు చెప్పడానికి ఆరంభించిన మూడునెలలకే వ్యాకరణసూత్రాలు చెప్పి అప్పజెప్పుకొనేవారు. అన్నిటికంటే పెద్దలోపమేమంటే కోపము. ఒక్కసారిచెప్పించి రాకపోయినా, మరునాడు మరచిపోయినా చేతికి వచ్చినట్టు కొట్టేవారు. బడిలో పెద్దతరగతుల పిల్లలను చిన్నతరగతుల పిల్లలను, ఎఫ్.ఏ.క్లాసు విద్యార్థులను సైతము గట్టిగా కొట్టేవారు. వీరినెవరున్ను మందలించేవారు కారు. కళాశాలలోని ప్రిన్సిపల్‌గారు కూడా వీరికి ఒదిగి ఉండేవారు. అధికారం చెలాయించడమేకాని అధికారానికి లోబడి ఉండడం వీరి కెన్నడూ అలవాటు కాలేదు. ఈకోపం వీరికి తగ్గిపోవడానికి కొంతవరకు నేనేకారణం. ఫొనెటిక్ లిపి ననుసరించి, డైరెక్టుమెథడ్ ప్రకారం 1908 లో పిల్లలకు ఇంగ్లీషు నేర్పుతూ ఉన్నప్పుడు ఒకనాడు నేను పాఠం చెప్తున్నాను. అప్పుడు వీరుకూడా నా చెంత నుండి క్రొత్తవిషయాలు, క్రొత్తమాటలు చెప్తున్నారు. ఒకటి రెండుసార్లు చెప్పినా పిల్లలకు పట్టుపడలేదు. వీరు అడిగిన ప్రశ్నలకు పిల్లలు తప్పుచెప్తున్నారు. వీరు కోపం పట్టలేకచికాకుపడుతూ పిల్లలందరినీ గట్టిగా కొడుతున్నారు. ఒకసారి వాణ్ణీ వీణ్ణీ కొట్టవలసిన దని నాతో చెప్పారు. నేను కొట్టనన్నాను నామీద కోపం వచ్చి వెళ్లిపోయినారు. పిమ్మట కొంతసేపు పోయినతర్వాత శాంతంగా రెండుసార్లు మూడుసార్లు బోధపరచి చెప్పగా మా తండ్రిగారు బోధపరచి చెప్పదలచుకొన్న విషయములు పిల్లలకు చక్కగా బోధపడినవి. ఆ దినమే నాకూ, మా తండ్రిగారికి ఇంటివద్దను పిల్లలను కొట్టడం గురించి పెద్దవాదం జరిగింది. పిల్లలు అల్లరిచేసినా, నడవడి చెడ్డదయినా వారిని దండించవచ్చునేమోకాని చెప్పిన విషయం వారికి బోధపడకపోతే మరియొకసారి చెప్పవలసినదేకాని దండించడం తప్పు అనిన్ని, దానివల్ల లాభంలేదనిన్ని నేను వాదించాను. ఈ ఆశయాన్ని పెట్టుకొనే నేను ఉపాధ్యాయవృత్తి నడుపుకొంటూ నన్నాను. ఈ వాదం జరిగినతర్వాత ఈ విషయంలో వీరి దృష్టి మారినది. మరి మూడేండ్లకే వీరు రిటైరయినారు. అప్పటికి మా కడపటి తమ్ముడు (గిడుగు సూర్యనారాయణ ఎం.ఏ. ఎల్. టి.) 8 ఏండ్లవాడు. వాణ్ణి, మరి ఇద్దరు పిల్లలను ఇంటివద్దను చదువుచెప్పి రెండేండ్లలో వాండ్లు 4 వ ఫారములో చదువుటకు అర్హులయినట్లు తర్ఫీతుచేశారు. వీండ్లను సాధారణంగా కొట్టేవారుకారు. వీండ్ల ఇంగ్లీషు నిర్దుష్టంగాఉండేది. లాంగ్ ఫెలోజ్ హియవాథా అర్థంచేసుకోగలిగారు. పిమ్మట గ్రాంథిక వ్యావహారిక భాషావాదంలో పనిచేయవలసి వచ్చుటచేత పిల్లల చదువులపై వీరి దృష్టి తగ్గిపోయినది. రాజమహేంద్రవరం రాకముందే మాతమ్ముని పెద్దకుమారుణ్ణి తర్ఫీతుచేయడానికి పూనుకొన్నారు. ఒక్క సంవత్సరంలో ఆ అబ్బాయి తెలుగు చదవడం, వ్రాయడం నేర్చుకొని చింతాదీక్షితులుగారు వ్రాసిన కథలు ధారాళంగా చదవగలిగాడు. మరి రెండు సంవత్సరాలలో సుమారు రెండువేల సంస్కృత శ్లోకాలు అర్థజ్ఞానంతో నేర్చుకోగలిగి సంస్కృతమున కొద్దిగా సంభాషిస్తూ ఉండేవాడు. ఆ అబ్బాయి ఇప్పుడు 13 ఏండ్లవాడు; స్కూల్ ఫైనల్ పరీక్షకు వెళ్తున్నాడు. వాడి తరువాతివాడు అట్టే ఆరోగ్యం గలవాడు కాడని వాణ్ణి విడిచిపెట్టి వాడితర్వాతి అబ్బాయిని తర్ఫీతు చేయడానికి పూనుకొన్నారు. వీడు తొమ్మిదేండ్లవాడు; సంవత్సరమయినది సంస్కృత మారంభించి. వేయి శ్లోకములు అర్థజ్ఞానంతో చదివాడు. సాధారణ ధాతువులకు అన్ని లకారములలోను తిఙంత రూపములు చెప్పగలడు. ఈ అబ్బాయి మా తండ్రిగారితో చెన్నపట్టణం వచ్చాడు. ఈ అబ్బాయికోసం మా తండ్రిగారు సంస్కృత కథలపుస్తకం, వెల్జ్ రచించిన ప్రపంచ చరిత్ర కొనుమన్నారు. రెండు దినాలకు మరణ మాసన్న మగుననగా వీరు ఈ అబ్బాయిని దగ్గర కూర్చుండబెట్టుకొని "మరి నేను నీకు చదువుచెప్పడం జరగదు; బుద్ధిగా చదువుకో" అని జాలిగా చెప్పారు.

పిల్లలకే కానీ, పెద్దలకే కానీ తమకు తెలిసిన చదువు ఇతరులకు చెప్పడమంటే వీరికి గల ఆసక్తి, ఓపిక సాధారణంగా మరియొకరియం దుండవు. నేను కాలేజీలో పనిచేస్తున్న దినాలలో ఉదయం వీరు ఆలస్యంగా పక్కనుండి లేస్తూ ఉండడంచేతను, 10 గంటలనుండి సాయంకాలంవరకూ నేను కాలేజీలోనే ఉండడంచేతను రాత్రి భోజనాల సమయంలోనే ఇద్దరం కలుస్తూఉండేవారము. ఆ దినము

వీరు తెలుగుభాషవిషయంలోగానీ, మరి యొక విషయంలోగానీ కొత్తగా నేర్చుకొన్నవన్నీ నాతో చెప్పేవారు. ఏదైనా ఒకవిషయం పరిశోధించి తెలుసుకోవలసి ఉంటే, కాలేజీలో నన్ను పుస్తకాలు పరిశోధించి తెలుసుకొని రమ్మనేవారు. మేము నిత్యం మాట్లాడుకొనే మాటలలో గృహకృత్యాల విషయం ఒకపాలు, చదువు విషయాలు తొంభైతొమ్మిదిపాళ్లు.

## పత్రికారచయితలకు కడపటి సందేశం

చెన్నపట్టణం చికిత్సకోసం వచ్చినప్పుడు వీరు పత్రికారచయితలకు తమ కట్టకడపటి సందేశం తెలియజేయగోరి అందుకు "ఎక్కడయినా ఒకసభ ఏర్పాటు చేయిస్తావా? ఉపన్యసిస్తాను" అని నాతో ప్రసంగించారు. వీరి దేహస్థితి చూచినవారెవరూ అందుకు సమ్మతించరు. అయితే, వీరి ఉత్సాహము, పట్టుదల ఎరిగినవాడను గనుక వీరికి ఉపన్యాసమిచ్చే శ్రమ కలిగించడంవల్ల కలిగే హాని కంటె ఉపన్యాసం ఇవ్వకుండా చేయడం వల్ల కలిగే దుఃఖము వీరి నెక్కువ బాధిస్తుందని గుర్తించి, చెన్నపురి ఆంధ్రమహాసభ వారితోను, శ్రీ రామబ్రహ్మం గారితోను మాటలాడాను. పెద్దసభలో ఉపన్యసింపజేస్తే వీరికి ఎక్కువ ఆయాసంగా ఉంటుందని రామబ్రహ్మంగారు తమ ప్రజామిత్ర ఆఫీసువద్దను 15-1-40 నాడు సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో వీరు వ్యావహారిక భాష గ్రంథస్థం చేయించడానికి చేసిన కృషిని గురించి సంగ్రహంగా ముచ్చటించారు; తామింక ఈ లోకమునుండి వెడలిపోయేకాల మాసన్నమైనది గనుక తమ కట్టకడపటి సందేశము తెలుగుపత్రికల సంపాదకులు, రచయితలు వినవలసిన దని కోరారు.

వీరివాదంలోను, సందేశములోను ముఖ్యంగా గుర్తించవలసినవిషయములు సంగ్రహించి తెలియజేస్తున్నాను:

"జీవంతో ఉన్న ప్రతివస్తువూ మారుతూ ఉండడం సహజం. అన్ని జీవద్భాషలున్ను మారుతూ వచ్చినవి. మన తెలుగుభాష సైతము జీవద్భాష గనుక మారుతూ ఉంది. 'చేసితివేనిఙ్' 'చేస్తే' కావడం భాషలో కలిగిన పరిణామాన్ని చూపిస్తుంది గాని నాశనము చూపించదు. నన్నయనాటి తెలుగుభాషే నేటికిన్ని ఏమార్పూ లేకుండా ఉన్న దనడం అబద్ధం; ఉండా లనుకోవడం అవివేకం. నన్నయనాటి గోదావరే ఈనాడూ ప్రవహిస్తూంది గాని ఆనాటిజలం ఈనాటిది కాదు. అందుచేతనే 'నిత్యా ప్రవాహినీ దేశ్యా' అన్నారు.

"భాషలో ఎప్పటి కేరూపములు వాడుకలోనుండి పోయినవో అవి విడిచి, ఏవి వాడుకలోనికి వచ్చినవో అవి ప్రయోగిస్తూ గ్రంథాలు రచించడము సత్సంప్రదాయం. అందుచేతనే వేదకాలంనాటి వైదికరూపాలు భాషలో ఆర్షము లనీ, వాటిని సంస్కృత భాషాగ్రంథాలలో ప్రయోగించరాదనీ నిషేధించారు.

"ఇంగ్లీషువారు తమ గ్రంథాలలో ఆధునికప్రయోగాలే చేస్తారు. చాసర్, షేక్‌స్పియర్, మిల్టన్ మొదలయిన మహాకవులు రచించినగ్రంథాలు చదువుకొంటారు గాని వాటిలో ఉన్నభాష తమనాటి వ్యవహారంలో లేకపోతే వాడరు. అలాగే తెలుగు వారుకూడా తమనాటి వ్యావహారిక భాషలో గ్రంథరచన సాగించవలెను.

"ఆంధ్రసారస్వతచరిత్ర పరిశీలించి చూడగా పద్యరచన కొక సంప్రదాయమున్ను, గద్యరచన కొక సంప్రదాయమున్ను ఉన్నట్లు కనబడుతుంది.

"పద్యరచన విషయంలో ప్రతికవిన్ని తన పూర్వులు రచించిన కావ్యాలలోనిభాషనే ఆదర్శంగా పెట్టుకొని తనకాలమందు శిష్టవ్యవహారమం దున్న కొత్తమాటలే కాక కొత్తగా పరిణమించియున్న సుబంత, తిజంతాదిరూపములున్ను జతపరచి ప్రయోగిస్తూ వచ్చాడు.

"ఈకొత్త పాతలసమ్మేళనము కొద్దికొద్దిగా సాగుతూ రావడంవల్ల కావ్యాలలోని భాష వ్యావహారిక భాషకు దూరమగుతూ ఉన్నా దాని మార్గాననే నడుస్తూఉంది. అందుచేతనే, లాక్షణికులు ఎప్పటికప్పుడు కవిప్రయోగాల ననుసరించి లక్షణం సరిపెట్టుకొంటూ వచ్చారు. ఆంధ్రశబ్దచింతామణి సూత్రాలనుబట్టి తప్పు లనదగినవి అప్పకవి తననాటివరకున్ను గల కవిప్రయోగాలు చూపించి ఒప్పులుగా వప్పుకొన్నాడు. అప్పకవిలక్షణంబట్టి తప్పు లనదగిన ప్రయోగాలు కూచిమంచి తిమ్మకవి తనకాలంవరకున్ను గల కవి ప్రయోగాలు చూపించి సాధువు లన్నాడు. పిమ్మట అడిదం సూరకవి ఆధునిక ప్రయోగాలు అదివరలో తప్పు లనదగినవి కవిప్రయోగాలు చూపించి సమర్థించాడు. (ఈసంప్రదాయం తెలియజేస్తూ మాతండ్రిగారు తమ బాలకవిశరణ్యము రచించారు) చిన్నయసూరి ఆధునిక కవి ప్రయోగా లెత్తుకోకుండా లక్ష్యాలు చూపించడం పనిపెట్టుకోకుండా తనకుతోచినట్లు వ్యాకరణసూత్రాలుకల్పించి అదివరకు కావ్యరచనకు మాత్రమే కవులు ప్రయోగించిన కావ్యభాషాప్రయోగాలు వచనరచనకు సైతము గ్రహించి వచనరచన విషయంలో కొత్త సంప్రదాయం తెచ్చిపెట్టినాడు.

"చిన్నయకుపూర్వం ఆంధ్రసారస్వతంలో వచనరచన లేదనుకోడం పొరపాటు. వందలకొలది గ్రంథాలు వచనాలతో ఉన్నవి కనబడినవి. అవి అన్నీ వాడుకభాషలో ఉన్నవి. ఇవి అచ్చు పడకపోవడంచేతను, దేశంలోనికి అచ్చుయంత్రాలు వచ్చి గ్రంథాలు అచ్చుకావడం ఆరంభమయేటప్పటికి చిన్నయసూరిగారి నీతిచంద్రిక అచ్చుపడి వారి ఉద్యోగప్రాభవమువల్ల వారి బాలవ్యాకరణమున్ను, నీతిచంద్రికయున్ను బడులలో పాఠ్యగ్రంథాలు కావడంచేతను ఈగ్రంథాలు చదువుకొన్నవారికీ, వారి శిష్యులకూ గద్యరచనవిషయంలో ఈకొత్తసంప్రదాయమే కాని అంతకుపూర్వమున్న సంప్రదాయం

తెలియకుండా పోయినది. చిన్నయసూరి ప్రౌఢవము శల్యగతమై ఉన్నవారికి మావాదము అతి కటువుగా తోచింది.

మా తండ్రిగారు తెలుసుకొన్న ఈ సంప్రదాయ విషయములు గ్రంథాలతో సైతము చూపించగా చూపించగా వారివాదం అంగీకరించడానికి మార్గమేర్పడినది. వ్యావహారిక భాషలో గ్రంథాలు (పద్యకావ్యాలు కాకపోతే పోనీ, గద్య రచనలు అయినా) రచించండని వారు చెప్పినప్పుడు వారు క్రొత్తగా ఏ సంప్రదాయమూ కల్పించి చెప్పడంలేదు; చిన్నయకు పూర్వమున్న సంప్రదాయమే మరల ఉద్ధరించండన్నారు. వారు తమ కడపటి సందేశంలో—

"నా శ్రమ వృథా కాలేదు. మొట్టమొదట నలుగురయిదుగురు మాత్రమే ఆమోదించినా నా వాదము వేలకొలది విద్యాధికులు, విద్యార్థులు, కవులు, రచయితలు ఆమోదించారు. ఏవో ఒకటి రెండుతప్ప తక్కిన పత్రికలన్నీ తమసంపాదకీయ వ్యాసములూ, తక్కిన వ్యాసములూ వ్యావహారిక భాషలోనే ప్రకటిస్తున్నవి. ఇంతవరకు నేను కృతార్థుడను.

"యూనివెర్సిటీలున్ను, ప్రభుత్వవిద్యాశాఖవారున్ను మాత్రం ఇంకా అనుగ్రహించలేదు. 25 సంవత్సరముల క్రిందట ఈరెండు సంస్థలవారున్ను వాడుక భాషను గ్రహించవలెనని చూచినప్పుడు నావాదం తెలుగువారు గ్రహించకపోవడంచేతను అలజడి ఎక్కువయినది. అందుచేత, ఆసంస్థలవారు దానిని గ్రహించలేదు. ఇప్పుడు తెలుగువారు నావాదం గ్రహించినవారు గనుక, ఆసంస్థలవారు గ్రహించి ఆమోదించేటట్లున్ను, ఆచరణలో పెట్టేటట్లున్ను చేయవలసిన భారం మీది. ఈపని మీకు అప్పగించి నేను విరమిస్తున్నాను—సెలవు." అన్నారు.

'కట్టకడపటి సందేశ'మని మా తండ్రిగారు అన్నట్లుగానే ఇది వాస్తవముగా వీరి కట్టకడపటిసందేశమే అయినది.



# వెస్టరన్ ఇండియా లైఫ్

కావలెను.

ప్రతినిధులు లేని జిల్లాలలో ధారాళమైన ఏజన్సీషరతులపై తక్కువ గ్యారంటీ వ్యాపారము చేయుగలవారు ప్రతి జిల్లాకు ఆర్గనైజర్లు కావలెను.

**"25** సంవత్సరములపైనుండి భారతీయకుటుంబముల సంరక్షణకర్త"

—: స్త్రీలకు—పురుషులకు—పిల్లలకు :—

పూర్తిగ నవీనమైన పద్ధతులమీద జీవితభీమా సౌకర్యములు గలవు

జిల్లా ఆర్గనైజర్లు

**1.** వి. ఎస్. ఆర్. కృష్ణ (కృష్ణ, గుంటూరు జిల్లాలు), విసెంటు రోడ్డు, గవర్నరుపేట, బెజవాడ.

**2.** వై. యస్. అవధాని (తూర్పు గోదావరి, విశాఖపట్టణం జిల్లాలు), రాజమండ్రి.

ఇతర జిల్లాల వివరములకు:

మెస్సర్స్ కొవ్వూరెడ్డి బ్రదర్స్,
చీఫ్ ఆర్గనైజర్స్,
FOR ఆంధ్ర డిస్ట్రిక్టు, ఏలూరు.

లేక

*Manager,*
**WESTERN INDIA LIFE**
**INSURANCE CO., LTD.,**
**SATARA CITY.**

## "శ్రీవిస్ ఆమ్ల" తలనూనె




ఇయ్యది ఆయుర్వేద శాస్త్ర నిబంధనలననుసరించి తయారుచేయబడిన తలనూనె. దీనిని తయారు చేయుటలో అరుదైన వన మూలికలు, పుష్పరసములు, సువాసన ద్రవ్యములు, మెదడుకుచలువచేసి శిరోజములనువృద్ధిచేయుపలువిధ ఔషధ సంబంధమగు వస్తువులు చేరుటచే దీనికింకొకటిసాటిలేదని చెప్పగలము. ఇందు సువాసన, సుగుణము, రెండును గలవు.

SRIVIS PERFUMERY WORKS,
Sole Proprietors.—ఎస్. విశ్వనాథం అండ్ కంపెని,
44, బందరు వీధి, మద్రాసు.

## "ఖస్‌రాజ్" సబ్బు




అతిపరిశుద్ధమైన పదార్థములతోను, ప్రకృతి ప్రసాదిత సుగంధ కుసుమ రసములతోను తయారైనది. ఔషధముగా పనిచేసి అలసట దీర్చును. శరీరమును శుభ్రపరచిపట్టుకుచ్చువలె మృదువు గావించును.

సోల్ ఏజంట్లు:

ఎస్. విశ్వనాథం అండు కో,
44, బందరు వీధి, మద్రాసు.



నీలాలనింగిలో నిత్యప్రయాణము
చిత్రకారుడు :
శ్రీ తోట వెంకటేశ్వరరావు.

# సుప్రయోగానది ఏది?

## అది ఏ నామాంతరముతో నేడు వ్యవహరింపబడుచున్నది?

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

సుప్రయోగ అనునది 'భగవదజ్జుక' మను ప్రహసనము[1]న ఒక ప్రసిద్ధనదిగ చెప్పబడినది. 'భగవదజ్జుక' కర్త పల్లవవంశజుడయిన మహేంద్రవర్మయని యూహించుచున్నారు. మహేంద్రవర్మ క్రీస్తుశకము ఏడవశతాబ్ది ఆరంభమున కాంచీపురము నేలిన పల్లవరాజు. ఇతడు సంగీత, సాహిత్యములందు చతురుడని ప్రతీతి. 'మత్తవిలాస' మన్నదికూడ ఇతడు వ్రాసిన మరియొక ప్రహసన మని పరిశోధకపండితు లూహించుచున్నారు. మహేంద్రవర్మ కుడిమియామలై శాసనమువలన ఆ మహారాజునకు సంగీతశాస్త్రమునందుగల ప్రావీణ్యము విశద మగుచున్నది. మహేంద్రవర్మయే గుహాలయనిర్మాణమును దక్షిణదేశమున మొదలుపెట్టించె నని తెలియుచున్నది. ఈ గుహాలయనిర్మాణవిద్య నీతడు ఆంధ్రదేశమునుండియే గ్రహించె ననియు, ఈతడు ప్రాయికముగ మొదట ఆంధ్రదేశీయుడో, లేక ఆంధ్రదేశముతో సంబంధముగలవాడో అయియుండవలె ననియు పరిశోధకపండితులు కొందర యభిప్రాయము. ఈ మహారాజు దని అనుమానింపబడుచున్న, నిర్ధరింపబడుచున్న భగవదజ్జుకప్రహసనమున సుప్రయోగానది పేర్కొనబడినది. యమపురుషుడు వేశ్యయైన అజ్జుకప్రాణము లను పాశములకు దగిలించి లంకాభిముఖుడై పోవుచు ముందు గంగానదిని, తరువాత వింధ్యపర్వతములను, పిదప నర్మదానదిని, అటువెనుక సహ్యపర్వతములను, ఆవెనుక గోలేయి (గోదావరి), కృష్ణవెణ్ణానదులను, అటుతరువాత పశుపతిభవనమును, ఆతరువాత సుప్రయోగను, అనంతరము కాంచీపురమును, పిమ్మట కావేరీ, తామ్రపర్ణినదులను, మలయపర్వతమును గడచి వెళ్లినట్లు భగవదజ్జుకమున తెలుపబడినది. ఈపైని చెప్పబడినవాటిలో మన కంత ఎక్కువగ పరిచయములేనిది ఒక్క సుప్రయోగానదియే. అది ఇప్పు డెక్కడ నున్నదో మనకు దెలియుట లేదు. పశుపతిభవన మన్నది శ్రీశైల మని స్పష్ట మగుచున్నది. పైన చెప్పిన వన్నియు సరిగా ఉత్తరముననుండి దక్షిణమునకు వచ్చు త్రోవలో ఒకదానితరువాత నొకటిగ నున్నవని వానివరుసనుబట్టియే తెలియుచున్నది. గోదావరీ కృష్ణానదుల తరువాతను, కాంచీపురమునకు పూర్వముననుు పశుపతిభవనము చెప్పబడుటచేత అది శైవక్షేత్రమయిన శ్రీశైల మనుటకు సందియము లేదు. శ్రీశైలము దాటి దక్షిణమునకు కాంచీపురమునకు వచ్చువో మధ్యమార్గములో తగులు నది సుప్రయోగానది. కాంచీ, శ్రీశైలములకు మధ్య నదులు—చిన్నవైననేమి పెద్దవైననేమి— అనేకములు కలవు. వీనిలో సుప్రయోగ ఏది?

> భగవదజ్జుకము, భారతము, రామాయణము మొదలైన ప్రాచీనగ్రంథములలో పెక్కుంట తెలుగుదేశపు నదులతోపాటు పేర్కొనబడిన ఈ 'సుప్రయోగ' పెన్నయే యని నిరూఢములైన చారిత్రకోపపత్తులతో, సయుక్తికముగా శ్రీ శర్మగారు ఈవ్యాసములో నిరూపించియున్నారు.

సుప్రయోగపేరు మన కిప్పు డపరిచితమయినను అది కొత్తదిగ గన్పట్టదు. పురాణములందును, మహాభారతమునందునుగూడ ఇది పేర్కొనబడినది. మార్కండేయపురాణమున

1. భగవదజ్జుకమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్రీకరించియున్నారు. చూడుడు: భారతి, ౧౯౨౮, సంచికలు ౯,౧౦,౧౧.

"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యా తథాపరా, తుంగభద్రా సుప్రయోగా వాహ్యా కావే ర్యథాపగా,
సహ్యాపాదా ద్వినిష్క్రాంతా ఇ త్యేతాః సరిదుత్తమాః"

అని కలదు. మారన మార్కండేయపురాణమున భారతవర్షీయనదులను పేర్కొనుచు ఈ విషయ మునే వచనమున నిట్లు వెల్లడించెను:

"సువాహిని పయోష్ణి నిర్వింధ్య నిషధావతి వైతరణి సినీవాలి కుముద్వతి మహాగౌరి దుర్గ యంతశ్శిర యను మహా వాహినులు వింధ్యంబునం బుట్టె గోదావరి భీమరథి కృష్ణవేణి తుంగభద్ర సుప్రయోగ కావేరి యనునదులు సహ్యపర్వ తంబున నుద్భవించె."

భారతవర్షవర్ణనము సందర్భమున నదులను వర్ణించునపుడు పురాణము లన్నియు కొంచె మించు మించుగ నీ రీతినే సహ్యమున బుట్టు నదులను పేర్కొన్నవి; చూడుడు:

"గోదావరీ భీమరథీ కృష్ణవే ణాథ వంజులా, తుంగభద్రా సుప్రయోగా బాహ్యా కావే ర్యథాపి చ,
దక్షిణప్రవహా నద్యః సహ్యపాదా ద్వినిఃసృతాః."
—బ్రహ్మాండపురాణము.

"గోదావరీ భీమరథీ కృష్ణవే ణాథ వంజులా, తుంగభద్రా సుప్రయోగా కావేరీ చ తథాపగా,
దక్షిణాపథనద్య స్తు సహ్యపాదా ద్వినిఃసృతాః."
—వాయుపురాణము.

"గోదావరీ భీమరథీ కృష్ణవేణా చ వశ్యతా, తుంగభద్రా సుప్రయోగా కావేరీ చ ద్విజోత్తమాః."
—కూర్మపురాణము.

"గోదావరీ భీమరథీ కృష్ణవేణా చ వంజులా, తుంగభద్రా సుప్రయోగా వాహ్యా కవేరీ చైవతు,
దక్షిణాపథనద్య స్తాః సహ్యపాదా ద్వినిఃసృతాః."
—మత్స్యపురాణము.

కాని విష్ణుధర్మోత్తరమునమాత్రము 'సుప్రయోగ'కు 'సుప్రకార' అని యిట్లు కలదు:

"తుంగభద్రా సుప్రకారా వాహ్యా కావేరికా తథా"

మహాభారతము వనపర్వమునను, భీష్మపర్వమునను వేణా, కృష్ణవేణానదులతోపాటు సుప్రయోగ కూడ పేర్కొనబడినది; చూడుడు:

"తమసా నర్మదా చైవ నదీ గోదావరీ తథా, వేణోపవేణా భీమా చ వడవా చైవ భారత.
భారతీ సుప్రయోగా చ కావేరీ ముర్మురా తథా, తుంగవేణా కృష్ణవేణా కపిలా శోణఏవ చ.
ఏతా నద్యస్తు ధిష్ణయానాం మాతరో యాః ప్రకీర్తితాః."
—వనపర్వము, అధ్యా. 222, శ్లో. 24-26

"గోదావరీం నర్మదాం చ బాహుదాం చ మహానదీమ్, శతద్రూం చంద్రభాగాం చ యమునాం చ మహానదీమ్.
నదీం వేత్రవతీం చైవ కృష్ణవేణాం చ నిమ్నగామ్, ఇరావతీం వితస్తాం చ పయోష్ణీం దేవికా మపి.
శరావతీం పయోష్ణీం చ వేగాం భీమరథీ మపి, కావేరీం చులుకాం చాపి వాణీం శతబలా మపి.
నీవారామహితాం చాపి సుప్రయోగాం జనాధిప, పవిత్రాం కుండలీం సింధు రాజనీం పురమాలినీమ్."
—భీష్మపర్వము, అధ్యా. 9, శ్లో. 14-21.

ఈపైశ్లోకములవలన మన కెన్నియో నదులు తెలియవచ్చుచున్నవి. వీనిలో బాహుద (చెయ్యేరు)వంటి చిన్ననదులుకూడ చేర్పబడినవి. సుప్రయోగమాత్రమేకాక గోదావరి, తుంగభద్ర, కృష్ణ వేణ్ణలవంటి ప్రసిద్ధాంధ్రదేశ నదులుకూడ ఎన్నియో పేర్కొనబడినవి. వేణ, వెణ్ణ పేరులతో నొప్పునదులు కృష్ణవేణ, వేణ, ఉపవేణ, తుంగవేణలు. కృష్ణా, గోదావరీ, తుంగభద్రలతో గలిపి సుప్రయోగను పేర్కొనుటవలన ఇది ఆంధ్రదేశమునందలి నదియే యని తోచును. పురాణములలో నదులను పేర్కొను

సందర్భమున ఇది తుంగభద్రా కావేరులకు నడుమ చెప్పబడుటవలన ఆరెంటికి నడుమనున్న పెద్దనది పెన్నయే సుప్రయోగ యగునేమో యని సంశయము జనించుట సహజము. అందునను అది పశుపతిభవనమునకును, కాంచీపురమునకును నడుమ నున్నట్లు భగవదజ్జుకమున చెప్పబడుటయు దాని కుపబలకమే కాని పూర్వోక్తము లయిన వెణ్ణలలో కృష్ణవేణ కృష్ణానదిగను, ఒకవేణ — తుంగవేణ తుంగభద్రగను, ఉపవేణ వైనగంగ (Wain ganga) గను, గుర్తించినవో ఇంకను ఒకవేణ మిగులును. కాని పురాణ, భారతాదులయందలి భారతవర్షీయవర్ణనమునుగూర్చి ప్రత్యేకముగ ఇంతవరకు పరిశ్రమచేసినవారు కాన్పింపరు. ఈ నదులపేర్లు సరియైనవో కావో, అవి యేప్రాంతపువో, వాటిని గుర్తింప వీలగునో కాదో అట్టిపరిశ్రమ చేసినకాని తెలియదు. అదియునుగాక ఇట్టి విషయమును తేల్చవలసివచ్చినప్పుడు వేరువేరు కూర్పులలోని, ప్రతులలోని పాఠములనుగూడ పరిశీలింపవలసిన యవసరము కలదు. ఒకప్రతిలోని పేరు మరియొకదానిలో మరొకవిధమున నుండుటయు కలదు.[2] నేను పైనిచ్చిన పాఠములు కుంభకోణము ప్రతిలోనివి. అయితే, పైని చెప్పినట్లు మిగిలిపోయిన ఒకవెణ్ణను పెన్నా నదియేయని, దానిని సుప్రయోగగా గుర్తింతమన్న ఒకచిక్కు కలదు. ఈ వేణ-వెణ్ణ-లతోపాటు సుప్రయోగయు చెప్పబడినది. అందువల్ల సుప్రయోగ ఏది అను విషయమును నిర్ధరించుటలో పురాణ, భారతాదులను విడిచి అన్యసాధనము నాశ్రయించుట అవసరము.

ఈ సుప్రయోగానది తెలుగుదేశమున గానవచ్చిన ప్రాచీనశాసనములలోకూడ పేర్కొనబడినది. పూర్వము యువమహారాజ విష్ణుగోపు డని ఒక పల్లవరా జుండెను. ఆతడు ముండరాష్ట్రములోని ఉరుపుపల్లి అను గ్రామమును దానము చేసెను. ఈ యువమహారాజు క్రీస్తుశకము అయిదవశతాబ్ది ఉత్తరార్ధమున నున్నవాడు. దాన మిచ్చిన ఉరుపుపల్లి గ్రామమునకు తూర్పు, దక్షిణపు సరిహద్దుల సుప్రయోగానది ప్రవహించుచున్నట్లు చెప్పబడినది. ఈ యొక్క శాసనమున నేకాక కడపమండలప్రాంతము నేలిన తెలుగుచోళులకు చెందిన పుణ్యకుమారభూపతి మాలెపాడుశాసనమునగూడ సుప్రయోగ పేర్కొనబడినది. పుణ్యకుమారమహారాజు హిరణ్యరాష్ట్రములోని బిరిపాడు (విరిపాడు ?)ను దానముచేసెను. ఈ విషయమును దెలుపునదే మాలెపాడు శాసనము. దాన మిచ్చిన బిరిపాడుగ్రామము సుప్రయోగానదిదక్షిణతటమున నున్నట్లు శాసనమున చెప్పబడినది. దీనిని బట్టి సుప్రయోగానది ఉత్తరతటమున ముండరాష్ట్రమును, దక్షిణతటమున హిరణ్యరాష్ట్రమును ఉండినట్లు స్పష్ట మగుచున్నది. బిరిపా డన్నది ఇప్పు డెచ్చట నున్నదో తెలియకపోవుటవల్ల హిరణ్యరాష్ట్రము ఇప్పటి యే ప్రదేశమునకు వర్తించునో తెలియరాకున్నది. హిరణ్యరాష్ట్ర మనుపేరే తరువాతి కాలమున హొన్నవాడిగ మారినది. 'వాడి' అన్నది మధ్యయుగపు శాసనములలో దేశవాచకముగ ప్రయుక్తమయినది. ఉదాహరణము : నొళంబవాడి, రట్టవాడి, గంగవాడి మొదలైనవి. హొన్న అనగా హిరణ్యము ; అందువల్ల హిరణ్యరాష్ట్రమును, హొన్నవాడియు ఒక్క దేశవిభాగమునకే పే రనుటలో సంశయింపబనిలేదు. హొన్నవాడి రాష్ట్రకూటరాజయిన కృష్ణకణ్ణరదేవుని శాసనమున పేర్కొనబడినది. అందు ములికినాడు హొన్నవాడిలోనిదిగ దెలుపబడినది. పుష్పగిరి, చినమాసపల్లి మొదలైన గ్రామములు—కడప

---

2. పురాణ, భారతాదులకుగల వేరువేరు ప్రతులలో వేణనదికి ఈ పాఠాంతరము లున్నవి :

వేణ (వరాహము) | వైణి (వాయు) | వేణ్ణా (భాగవతము)
వర్ణ (కూర్మము) | వీణా (మహాభార., భీష్మప.)

పర్గిటరు వేణను పెన్ననదిగ గుర్తించినాడు (చూడుడు : మార్కండేయపురాణము, నోట్సు, పుట. 303) బిమలచరణలా గారు దీనిని తుంగభద్రగా గ్రహించినారు కాని యిది పొరపాటు.

జిల్లాలోనివి—ములికినాటిలోనివి. అందువలన హిరణ్యవాడి ఒకప్పుడు కడపవరకును వ్యాపించియుండినట్లు విదితము కాగలదు.

హిరణ్యవాడిపేరు విన్నంతనే మనకు దానితో పోలికగల మరియొకపేరు స్ఫురణకువచ్చును. అది అరోర్ణాయ్. టాలెమీ యను భూస్వరూప శాస్త్రజ్ఞుడు ఈ అరోర్ణాయ్‌ని తన భూస్వరూపశాస్త్రమున (geography) పేర్కొనినాడు. ప్రాక్సముద్రతీరస్థము లయిన రేవుపట్టణములను పేర్కొనుసందర్భమున దీని ప్రస్తావము వచ్చును. 'పొదుకె' అను రేవుపట్టణము అరోర్ణాయ్ సమీపమున నున్నట్లు టాలెమీ తెలిపినాడు. ఇతడు క్రీస్తుశకము రెండవశతాబ్దినాటివాడు. ఇంతవరకు 'పొదుకె' అనురేవుపట్టణము ఎటనున్నదో గుర్తింపగాలేదు. అరోర్ణాయ్‌కూడ ఇంతవరకును గుర్తింపబడలేదు. 'పొదుకె' అన్నదానిని కొందరు పరిశోధకులు పుదుచ్చేరి (Pondichcheri) యే యని గుర్తించినారు. కాని యిది అంత సంగతముగ కన్పట్టదు పుదుచ్చేరి అన్నమాటయే అది క్రొత్తగా (పుదు అన క్రొత్తయని యర్థము) వెలసిన గ్రామమని స్ఫురింపజేయుచున్నది. పుదుచ్చేరి యంత ప్రాచీనకాలమునుండి యున్నదనుటకును ఆధారములు లేవు. అందువలన 'పొదుకె' పుదుచ్చేరి యనుటకు తగిన బలమయిన ఆధారమేమియు లేదు. 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సీ' (Periplus of the Erythrean Sea) అను మొదటిశతాబ్దినాటి మరియొక గ్రంథమున ఈ రేవుపట్టణమే 'పొదుక' యనుపేర పేర్కొనబడినది. దీని ననుసరించి ఈ'పొదుక' లేక 'పొదుకె' క్రీస్తుశకము మొదటి శతాబ్దినాటినుంచియు ప్రసిద్ధమయిన సముద్రతీరస్థనగరము (రేవుపట్టణములను పూర్వము 'కరపట్టణము' లని వ్యవహరించువారు. కర యనగా ఒడ్డు; గట్టు. చాల ఎత్తయిన గట్టుకు 'కరకట్ట' యనియు వ్యవహారము. కట్టు రూపాంతరమే కట్టు, — గట్టు. శాసనములలో వచ్చు 'కట్ట' యనునది 'కట్టు'యొక్క సప్తమీవిభక్తిరూపము; గట్టుమీద, గట్టున అని యర్థము — 'గంగకఋత' లేక 'గంగకట్ట'—'గంగకర్త'సముద్రతీరమున నున్నపట్టణము లగుటచే రేవుపట్టణములకు 'కరపట్టణము' లని వ్యవహారము పూర్వము.)

స్వర్ణ-సొన్న, కర్మ-కమ్మ, ధర్మ-ధమ్మ అయినట్లే 'అరోర్ణాయ్' 'అరోణ్ణాయ్'—'అరోణ్ణ' యగును. 'వేణ్య' 'వేణ్ణ', 'పళ్యెర' 'పళ్లెర' అయినట్లే 'హిరణ్య' 'హిరణ్ణ' యగును. 'హిరణ్ణ'యే విదేశీయుల నోళ్లలో బడి 'అరోణ్ణ' మైన దని నా యుద్దేశము. అందువల్ల టాలెమీయొక్క 'అరోర్ణాయి' 'హిరణ్ణ' 'హిరణ్య' రాష్ట్రమే యని నేను గుర్తించుచున్నాను. ఈ 'అరోర్ణాయి' దేశము ఉత్తరముగ 'మైసోలియా'వరకు వ్యాపించియున్న దనియు, 'మైసోలస్'నది దిగువభాగమున దానినీళ్ల చేత తడుపబడుప్రదేశము 'మైసోలియా' యనియు టాలెమీ వ్రాసియున్నాడు. మెట్టను చాలదూరము వ్యాపించియున్న దేశమునందలి సముద్రతీర ప్రదేశమగు 'మాసాలియా'కు 'పొదుకె' రేవుపట్టణము చేరువనె ఉన్నదని 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి' అనుగ్రంథమున చెప్పబడినది. 'మైసోలియా', 'మాసాలియా' అనుపేరుగల దేశ మేదో తెలిసినప్పుడు కాని హిరణ్యరాష్ట్రము ఉత్తరమున ఎంతవరకు వ్యాపించియున్నదో తెలియదు ఈ 'మాసాలియా'యందు సన్నని 'మస్లిను'లు అతివిస్తారముగ తయారగునని 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్ సి' అనుగ్రంథమున గలదు. వీటినిబట్టి (౧) మైసోలియా లేక మాసాలియా అనునది 'పొదుక' లేక 'పొదుకె' అను రేవుపట్టణమునకు అనతిదూరముననే ఉన్న దనియు, (౨) అది 'మస్లిను'లకు ప్రసిద్ధికెక్కిన దనియు, (౩) అది మెట్టను చాల దూరము వ్యాపించిన దనియు తెలియగలదు. నాయుద్దేశమున 'మైసోలియా'నుబట్టియే 'మస్లిను'పదము ఏర్పడినది. దేశముపేరు మైసోలియా, లేక మసోలియా, లేక మాసాలియా; ఆదేశముగుండా ప్రవహించు నదిపేరు మైసోలస్; ఆదేశమున తయారగు సన్నని నూలుబట్టలకు మస్లిను (మైసోలిన్, లేక మసోలిన్ పద రూపాంతరమే మస్లిను) లని పేరు.

కాని ఇంతవరకు మస్లినుపదము మెసొపొటేమియాయందలి టైగ్రిస్‌నదీతీరమున నున్న మోసల్ (మూసల్, మూసిల్ అనిరూపాంతరములు) పట్టణమునుబట్టి వచ్చినదని విశ్వసింపబడుచున్నది. 'ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా'లో ఇట్లే చెప్పబడినది. యూల్ తన 'హాబ్సన్-జాబ్సన్' అను నిఘంటువునందుకూడ 'మోసల్' నుండియే 'మస్లిన్' వచ్చినదని చెప్పినాడు. కాని ఆశ్చర్య మేమన, అతడు మస్లినుపదమునకు 'ఫుట్ నోట్' ఇచ్చియున్నాడు. అందు ఇట్లని వ్రాసినాడు:

"మస్లినుపదము మైసోలియానుండి వచ్చిన దను ప్రతిభాత్మకమైన సూచనను ఎక్కడనో చదివినాము. మైసోలియా ప్రాచీన కాలముననుండియు సన్నని నూలుబట్టలకు ప్రసిద్ధికెక్కినది. (టాలెమీ వ్రాసినదాని ననుసరించి మైసోలియా యన్నది మచిలీపట్నము చుట్టుపట్లనున్న దేశము పేరు.)"

మైసోలియానుంచి మస్లిను వచ్చిన దను సిద్ధాంతమున ఆదరము లేకపోవుటచేత నే యూల్ ఈ విషయమును 'ఫుట్ నోట్'లో ఇచ్చినాడు. కాని సత్య మదే యని నా నమ్మకము. పదుమూడవశతాబ్దినాటి మార్కొపోలో అను విదేశయాత్రికుడుకూడ యూల్ చెప్పిన అభిప్రాయము నే వెల్లడించినాడు. టైగ్రిస్‌నది మీది మూసల్‌నుగురించి వ్రాయుచు 'మసొలిన్స్ అను పేరుగల బంగారు, పట్టుబట్టలు అక్కడ తయారగు' నని మార్కొపోలో చెప్పినాడు. ఇందరు చెప్పినను ఇది సరియైన యభిప్రాయము కాదనియే నాయూహ. క్రీస్తుశకము మొదటిశతాబ్దులలో మోసల్, లేక మూసల్ అనుపట్టణము ప్రసిద్ధమయినది కాదు. క్రీస్తుశకము అయిదారుశతాబ్దులలోనే దానికి ప్రాముఖ్యము వచ్చినది (చూడుడు: 'ఎన్‌సైక్లోపేడియా మొస్లామికా'లో 'మోసల్'పదము). క్రీస్తుశకము మొదటిశతాబ్దులలో అది 'మస్లిను'లకు ప్రసిద్ధికెక్కినట్లు ఎక్కడను చెప్పియుండలేదు. 'మస్లిను' అన్నది 'మోసల్'నుంచి వచ్చినదని మొట్టమొదట చెప్పినవాడు అరబ్బీచరిత్రకారుడును, యాత్రికుడును అయిన మసూదీ. ఇతని పూర్తిపేరు అబుల్ హాసన్ అలీ ఇబన్ హాసన్ ఇబన్ అలీ ఉల్ మసూదీ. ఇతడు క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్ది అంతిమభాగమున బాగ్దాదుపట్టణమున జన్మించెను. తొమ్మిదవశతాబ్దికి పిదప మోసల్ 'మస్లిను'లకు ప్రసిద్ధికెక్కిన దన్నను మైసోలియానుండి మస్లిను వచ్చిన దన్న మనవాదమునకు భంగము కలుగదు. ఈ కారణములవలన మైసోలియానుండియే మస్లిను వచ్చినదని నేను నమ్ముచున్నాను.

మస్లినుమాట ఎట్లున్నను మైసోలియా ఎక్కడనున్నదో, మైసోలస్‌నది యన్న దేదో ఇంతవరకును తేలలేదు. 'మైసోలస్' ఏది అన్నవిషయమున పరిశోధకపండితులలో భేదాభిప్రాయములు గలవు. కొందరు మైసోలస్ గోదావరి యన్నారు; మరికొందరు కృష్ణానది యన్నారు. మైసోలస్ కృష్ణ యనుటకు గల కారణ మిది: (౧) మైసోలస్‌కు మచిలీపట్టణము (మసులీపటమ్)నకు గల పోలిక; (౨) కృష్ణానదీముఖద్వారప్రాంతపు దేశము మస్లినులకు ప్రసిద్ధికెక్కుట. కాని ఈ రెండునుకూడ నిలిచే ప్రమాణములు కావు. మచిలీపట్టణము అంత ప్రాచీనమైన రేవుపట్టణము కాదు. గోలకొండ కుతుబుశాహి సుల్తానుల రాజ్యారంభకాలమున పదునైదవశతాబ్దిలో ఏర్పడిన రేవుపట్టణ మది. అందువలన మచిలీపట్టణప్రాంతమే టాలెమీనాటి మైసోలియా యని చెప్పుటకు వీలులేదు. ఇక మస్లినులకా, విదేశయాత్రికుల వృత్తాంతములను బరిశీలించినచో ఒక్క కృష్ణాతీరప్రాంతమేకాక నెల్లూరుప్రాంతముకూడ ప్రాచీనకాలమునుండియు మస్లినులకు (సన్నని నూలుబట్టలకు) ప్రసిద్ధిగాంచినదే. చూడుడు, ఒక విదేశయాత్రికుడు ఏమని వ్రాసియున్నాడో:

"Policate is to the north of St. Thomas and the factory (which the Dutch have established there) is one of the best they have in the Indies, by reason of the cotton cloths, of which they have great warehouses full there."

అందువలన కృష్ణాతీరముననుండి పులికాట్‌వరకును గల ప్రాంతమంతయు చక్కని నూలుబట్టలకు (మస్లినులకు) ప్రసిద్ధికెక్కినదే. ఈ కారణమున మచిలీపట్టణప్రాంతము మైసోలియా యనుటకు కుదురదు.

మైసోలస్ కృష్ణ యనుటకయినను ఈమాత్రముకారణములు కలవుకాని గోదావరియనుటకు అసలే లేవు. అట్లయిన మైసోలస్ ఏది, మైసోలియా ఏది ?

హిరణ్యరాష్ట్రమును, టాలెమీ-అరోర్ణాయియు ఒక్కటేయని తెలిసికొంటిమి. అరోర్ణాయ్ మైసోలియావరకు ఉత్తరమున వ్యాపించియున్న దనుటచే హిరణ్యరాష్ట్ర మంతవరకును వ్యాపించిన దన్నమాటే ; అనగా హిరణ్యరాష్ట్ర ముత్తరదిశను మైసోలియాయందలి మైసోలస్‌నదివరకును వ్యాపించియుండవలెను. శాసనముల ననుసరించి హిరణ్యరాష్ట్ర ముత్తరమున సుప్రయోగానదివరకును వ్యాపించియుండినట్లు విదితమయినది. అందువలన మైసోలస్‌నదియు, సుప్రయోగయు ఒక్కటేయని తేలుచున్నది. ఇన్ని తిరుగుళ్లుపడినను మైసోలస్‌ను గురించి మన కెంత తెలిసినదో సుప్రయోగనుగురించియు అంతే తెలిసినది. హిరణ్యరాష్ట్రమును బట్టుకొన్న సుప్రయోగవిషయము తేలలేదు. సుప్రయోగ హిరణ్యరాష్ట్ర, ముండరాష్ట్రములకు నడుమ బ్రవహించుచుండుటవలన ముండరాష్ట్రమును బట్టుకొన్న ఈ విషయము తేలునేమో చూతము.

ముండరాష్ట్రము ఎక్కడిదో పరిశీలింతము. ప్రాచీన పల్లవ, చాళుక్యశాసనములను బరిశీలించినచో చాళుక్యరాజ్యమునందలి దేశవిభాగములకు విషయము లనియు, పల్లవరాజ్యమునందలి దేశవిభాగములకు రాష్ట్రము లనియు పే రుండినట్లు తెలియగలదు. చాళుక్యులకు పల్లవరాజ్య మంతయు వశమయిపోయినపిదప రాష్ట్ర మన్నది అంతరించి విషయమే మిగిలిపోయినది. ఈ 'విషయము' మధ్యయుగమునాటి శాసనములలో 'నాడు'గ మారిపోయినది. ఉదా : వేంగీవిషయము - వేగినాడు; కమ్మరాష్ట్రము - కమ్మనాడు మొదలయినవి.

| శాసనమున్న గ్రామము | ముండనాటిలోని గ్రామము | ముండనాటిలోనిదిగ చెప్పబడిన గ్రామము ఇప్పటి ఏగ్రామ మగును? ఏతాలూకాలోనిది? | |
|---|---|---|---|
| గండవరము | కంఠనారాయణపురము అను కులోత్తుంగచోళపురము | కంఠనారాయణపురమే కంఠపురము లేక కంఠాపురమై ఇప్పటి గండవరమైనది. | కోవూరు తాలూకా |
| కొడవలూరు | కొడవలూరు | కొడవలూరు | కోవూరు |
| నెల్లూరు | తామరైమడువు అను చిత్రమేళినల్లూరు | దామరమడుగు | కోవూరు |
| ,, | మావడికుంటై | మోడేగుంట | కోవూరు |
| వేగూరు | వేలూరు | ముండనాటిలోనిదని చెప్పబడిన గ్రామము ఒకశాసనమున వేగూరని, మరియొకదానిలో వేలూరని యున్నది. శాసన మున్నది వేగూ రగుటచే వేలూరు పొరబాటనియు, అది వేగూరై యుండు ననియు నానమ్మకము. | కోవూరు |
| ,, | వేగూరు | | |
| నెల్లూరు | అలంగాడు | అలగానిపాడు ? | కోవూరు |
| చీకవోలు | తక్కలం | (తెలియదు) | |
| బాపట్ల | [వె]లుకలూరు | (తెలియదు) | |

క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు, పదుమూడుశతాబ్దులనాటి నెల్లూరుమండలశాసనములలో ముండనాడు, లేక ముండైనాడు అన్న దేశవిభాగము ఒకటి తెలియవచ్చును. ఇది ప్రాచీనపల్లవశాసనములలో పేర్కొనబడిన ముండరాష్ట్రమే యనుటకు సందియములేదు. ముండ, లేక ముండైనాడులోనివిగ చెప్పబడిన గ్రామములను గుర్తింప గుదిరినచో ముండనాడు, లేక రాష్ట్ర మెచ్చటిదో సుకరముగ దెలియగలదు. ముండ

నాడును పేర్కొను శాసనములు ఏ గ్రామముల నున్నవో, 'ముండనాడు'నందలివిగ చెప్పిన గ్రామములు ఇప్పుడు ఏ గ్రామములుగ గుర్తింప వీలగునో, అవి యెచ్చటివో 82వ పుటలోని పట్టికలో తెలుపబడినది. ముండనాడును పేర్కొనుశాసనము లన్నియు నెల్లూరుమండలముననే యుండుటచేత ముండనాడు లేక ముండరాష్ట్రము నెల్లూరిలోని దని వేర నుడువనక్కర లేదు.

ఈకడపటి మూడుగ్రామములును (అలంగాడు, తక్కులం, [వె]లుకలూరు) తక్క ముండనాటిలోని విగ చెప్పబడిన మిగిలిన గ్రామము లన్నియు కోవూరుతాలూకాలో నున్నవి. దీని ననుసరించి చూచినచో పూర్వపు ముండరాష్ట్రము ఇప్పటి కోవూరుతాలూకా కనువర్తించునని చెప్పవచ్చును. కోవూరుతాలూకాకు దక్షిణపు సరిహద్దు పెన్ననది. ముండరాష్ట్రమునకు దక్షిణపుసరిహద్దు సుప్రయోగానది యగుటచేత పెన్న నదియే సుప్రయోగ యనుటకు సంశయ మక్కర లేదు; అనగా పూర్వపు ముండరాష్ట్రము ఇప్పటి కోవూరు, ఆత్మకూరుతాలూకాలమీదుగ పెన్న కుత్తరమున వ్యాపించియుండినట్లు విశదము కాగలదు.

సుప్రయోగకు దక్షిణతీరమున నున్నది హిరణ్యరాష్ట్రము — టాలెమీయొక్క 'అరోర్ణాయ్'— తరువాతికాలపు హొన్నవాడి. పైన తెలిసదాని ననుసరించి సుప్రయోగ — పెన్నయే మైసోలస్ అని రూఢ మగుచున్నది. మైసోలియాగుండా ప్రవహించు నది మైసోలస్. చోళదేశమునకు సోలియరట్ట మని (చోళరాష్ట్ర మని), సోలి యని వ్యవహారము గలదు. చోళ, చోడ, చోట్రి, శోట్రి, శోట్రియ, సోలియ, సోళియ పదములు పర్యాయవాచకములు. యువాన్‌చాంగ్ అను చీనాదేశ బౌద్ధయాత్రికుడు—ఏడవశతాబ్దివాడు— కడపప్రాంత దేశమును చులియె (సోలియ — చోళ) అని వ్యవహరించియున్నాడు. కడపప్రాంతమును తెలుగుచోళులు ఏడవశతాబ్దినుండియు పాలించుచుండిరి. వీరు నెల్లూరివరకును వ్యాపించిరి. కాంచీపురము మొదలు కృష్ణవరకు ఒకప్పుడు వీరిపరిపాలనము సాగినది. తెలుగుచోళులకుగల కాంచీపురవరేశ్వరబిరుదమే వీరు కాంచినిగూడ పాలించినవా రని తెలుపుచున్నది. కడపమండలములోని పొత్తపి, నెల్లూరుమండలములోని నెల్లూరు (విక్రమ సింహపురము) వీరికి రాజధానులు. అందువలన ఈతెలుగుచోళుల దేశమే మైసోలియా, లేక మాసోలియా (మహాచోళ, లేక మధ్యచోళదేశము) అని నానమ్మకము. ఈచోళదేశముగుండా ప్రవహించుటచేతనే పెన్నకు మైసోలస్ అని పేరు కలిగినది. ఈదేశమున తయారయిన కారణముననే నూలుబట్టకు మైసోలిన్, లేక మాసో లిన్, లేక మస్లిన్ అని ప్రసిద్ధి ఏర్పడినది. టాలెమీనాటికి, ఇప్పటికికూడ కడపప్రాంతదేశము ప్రత్తిపంటకు ప్రసిద్ధమయిన నల్లరేగడభూమి. ఇది ప్రాచీనకాలమునుండి నూలుబట్టలకు ప్రసిద్ధిగన్నదన్న ఆశ్చర్యము లేదు. రాష్ట్రకూటులకాలమున మైసోలియా హొన్నవాడిలో — హిరణ్యరాష్ట్రములోని అంతర్భాగ మయినది.[3]

---

3. పొదుకె లేక పొదుక యన్నదియు, ప్రాచీన పల్లవశాసనములలో వచ్చు పలక్కడ, పద్దుక్కర యనునదియు, సముద్ర గుప్తుని అలహాబాదుశాసనమున పేర్కొనబడిన పాలక్కకయు ఒక్క నగరముపేరులే యనియు, ఒక్కపేరు వికృతులే యనియు నా నమ్మకము. నా యభిప్రాయమున ఈ పట్టణము ఇప్పుడు 'పులికట్' అనుపేర వ్యవహరింపబడుచున్నది. 'పులికట్' పూర్వపు యూరోపియనుయాత్రికుల వృత్తాంతములలో ఇట్లు పలువిధముల వ్రాయబడినది:

**Palicatta** (పలికట్ట) **Palicata** (పలికట) **Paliacatta** (పల్యకట్ట-పల్లకట్ట [పల్య-పల్ల-వేణ్య-వెణ్ణవలె]) **Pallecat** (పల్లికట్) **Paliacatte** (పల్యకట్టె) **Policat** (పొలికట్) **Pulicat** [పులికట్ అని వ్యవహారము; కాని ఇది నిజమునకు పలికట్ కాని పులికట్ కాదు. **Pu** ను **Pun** (పన్)లో వలెను, **Purchase** (పర్‌ఛేజ్)లో వలెను 'ప' గనే పలుకవలెను. **Palicata** (పలికట)నే **Pulicat** గ వ్యవహరించుచున్నారు.]

• 'ట' 'డ' గను, 'ద' 'డ' గను మారుట ప్రసిద్ధమే. ఉదా: తటాకము-తడాగము; నాదెండ్ల-నాడెండ్ల; అంద్రు-అండ్రు ల, డలకు అభేదము. కాగా, పలక్కడ, పలకడ, పద్దుక్కర, పద్దుక్కడలు రూపాంతరము లగుచున్నవి.

# విక్రమాంధ్రులు

శ్రీ గుఱ్ఱప్పడియు ఆంజనేయులు

★

జగ మెల్లఁ జయవెట్ట; విక్రమకళా
చైతన్య ముప్పొంగి లేఁ
జిగురై మొగ్గలు విప్పుచున్నది మధు
స్నిగ్ధప్రకాండమ్ములన్;
దగు మూర్తం బిది; యింక నైన జననీ
దాస్యంబు మాయింపఁగా
నెగుచూపుం దిగుచూపుల న్నిలుపు
మోయీ! నాయకగ్రామణీ!

వేదబుక్కలతోడ వియ్యమందినపలుకు
చిన్నారిపూదేనెఁ జిలుకుచోట,
అపరాంబుజాసనుఁడైన కౌశికముని
గోత్రసౌధము కట్టుకొన్నచోట,
కఱుకుకత్తుల నిప్పుకలు కుప్పలై రాలి,
యరికోటితో బూది యైనచోట,
లావణ్యజలరాసులను దాఁటి, చనుదెంచి
యిందిరారమణి కాలిడినచోట,
దీనతకు జీవనాడులు తెగినచోట,
దేవతలు కర్మభూమికి దిగినచోట
పున్నెములు పూచి ఫలియించి పుట్టినావు
సలుపఁగదవయ్య! జన్మను సార్థకంబు.

తీఱని వంతలో మునిఁగి
తేలుచుఁ గొన్నిదినాలనుండి చ
ల్లారిన గుండె, శౌర్యకిర
ణావళి తాఁకున వెచ్చనై, మహః
పూరము రక్తనాళములఁ
బుక్కిలి బంటిగ నిండ, రత్నసం
భారముఁ జూచుచున్ దిరిగి
వత్తము రమ్ము పురాణవీథులన్.

ఆశామదేభకుంభాభోగసీమల
ముత్తియంబుల నారఁబోసినపుడు,
శరపరంపరలు వర్షానఘశ్యామలై
విజయగర్జనలఁ గావించినపుడు,
నెలవుముంగలఁ బితానీరాజభోగంబు
లలఁతిపోకకుఁ బుట్టెఁ డమ్మినపుడు,
కవిగంటముల గణంగణలు కర్ణము లానఁ
బృథివీపతులు పుల్కరించినపుడు
చైత్రభానుప్రభా చైత్రశాలి యగుచు
వెలిఁగిపోయిన లోకైకవిక్రమంబు
తల్లి దాఁచిన సొమ్ము నీతరమునందు
కానిపింపదు లవమైన; కత మదేమొ?

గీతాగమోక్తసూక్తిని రిత్తగానీక
యవతారమందిన యఖిలగురుఁడు
తెలుఁగుపొలాన జాతీయకేదారంబు
మొలకలెత్తించిన మొదటికాఁపు
మానవాదనిశుంభదానవారణ్యంబు
నిడునాల్క సాఁచి మ్రింగినదవాగ్ని
జనులఁ గన్నులఁ గప్పుకొని కన్నతండ్రియై
సామ్రాజ్యమేలిన చక్రవర్తి
ఆతఁడు సమస్తశక్తుల కాశ్రయంబు
సత్యగంభీరపీయూషజలధిశాయి
ఆదివిష్ణువు, శ్రీకాకుళాంధ్రవిభుఁడు
తొలఁగి చన్నాఁడె మనుమల తలఁపునుండి?

పొముల కగ్గమై యెచటఁ
బాడకెఱో! గుఱుతైన లేక; ని
స్సీమభుజాబలప్రతిభ
చేఁ దొలి పువ్వుల మాతృదేవికిన్
గోమలకంఠహారమును
గూర్చిన ధార్మికశూరశేఖరున్,
శ్రీముఖసార్వభౌముని వ
రించిన రాజ్యరమాప్రగల్భములో.

చిరదాస్యపంకరాశిని గ్రుంగిపోయిన
తన జన్మభూమికై తల్లడిల్లి
కృష్ణవేణీతీర్థకేళీపవిత్రుఁడై
యమరేశ్వరస్వామి నాశ్రయించి
భారతీయపరాక్రమారుణజ్వాలికా
సంచయమ్ములఁ బుక్కిలించి యుమిసి,
మగధసేనారక్తమాంసోపహారంబు
దుర్దాంత కరవాలదుర్గ కొసఁగి,
పాటలీపుత్రగోపురోపరితలాన
లోక మగ్గింపఁ దెలుఁగుపతాక నాటి
శకముఁ జాటిన మేటి శ్రీ శాతకర్ణి
స్మృతిపథమునుండి జాఱిపోయెనె వయస్య!

ధాత్రిని గ్రుంకె వజ్రములు
దాపినగద్దియతోడ మౌక్తిక
చ్ఛత్రము; పైఁడియూపములు
సాగరమగ్నము లయ్యె; నైన ధృ
జ్మాత్రముఁ దీసిపోవక జ
గానఁ బచారొనరించు; గౌతమీ
పుత్రుని కీర్తివల్లికలు
పూచిన పువ్వులతావి నేఁటికిన్.

ఆశ్రితామరభూజ మను వాసి కెవ్వాఁడు
పుంభావమందిన పుట్టినిల్లు?
ధర్మార్థకామసాధనకుఁ దారకమైన
పంచమామ్నాయ మెవ్వాని వలచె?
కందకం బయ్యె దుర్గమున కెవ్వనిపీట
ధరను బేర్వడ్డ గౌతమునిబిడ్డ?
తులఁదూగెఁ బాఁడిపంటలతోడ నేఁతని
విజయధ్వజమునీడ వేఁగినాడు?
అష్టభాషానుశాసనార్చాభిరతుఁడు
ద్రవిడ కర్ణాట రాజాధిదైవ మతఁడు

# విక్రమాంధ్రులు

విష్ణువర్ధన భూలోకవిబుధభర్త
శశ్వదాత్మోదు గా కెందుఁ జనియె నేఁడు ?

వెనుమూపి మనువుతీపిని జేరమెత్తిన
యాదవేంద్రుని గాచినట్టి కరుణ
కాంచికాకటకభాగ్యములు భోగ్యములుగా
సాధించుకొన్న దీక్షానిరూఢి
మూర్ధాభిషిక్తుల మొగసాల ప్రోలను
రావింపనేర్చిన రాజసంబు
దేశాభిమానమాధ్వీకధారలఁ దేల్చి
ధరణిఁ బాలించిన దాతృగరిమ
కలసి మూర్తిభవించిన కల్పవల్లి
రాణి రుద్రమదేవి యొర్గంటియందు
గాదెలకుఁ బోసినది శౌర్యకలమరాశి
పంచుకొనుపోయి! మిత్రి! కావలసినంత.

గాండీవనిర్ముక్తకాండమ్ములై వ్రాలి
కవినూత్న లహితులఁ గలఁచునాఁడు
భద్రసింధురకర్ణపవనదారితములై
శకధూమరేఖలు సమయునాఁడు
మిన్నందుకొను కీర్తిమేడలై యందందు
గెలుపుకంబము లింపుగొలుపునాఁడు
పొలిమేర కవలిభూపులు పాదచారులై
పవలింటి దివ్వెటీల్ పట్టునాఁడు
మూరురాయరగండ భేరీరవంబు
మలయ వింధ్యాద్రులను జీల్చి మరలునాఁడు
తాండవించిన విక్రమాంధ్రప్రశస్తి
మఱువఁదరమౌనె వేయిజన్మములకైన ?

ఖడ్గతిక్కనకు సర్కసుగుడారంబైన
పాలేటి పంచలింగాల గట్టు,
రెడ్డిమన్నీల దోర్వీర్యపాకమునకుఁ
దాలింపువెట్టిన ధరణికోట,
సొమ్మసిల్లిన కమ్మజోదుల కెమ్మోవి
మొనపంట నొక్కిన యనుమకొండ,
పులికోఱలై పరాసులఁ బరాసుల సల్పి
పొలిఁగొన్న వీరబొబ్బిలిబయళ్లు,
పౌరుషము పెచ్చుపెరుఁగ ధూపములు నింపి
తనువు నూఁగింపఁగలవు పందలకునైన;
పుణ్యానిలయమ్ము; లటు చూడఁబోయి రమ్ము!
నిర్భరోత్సాహరోచులు నిను భజించు.

ఏపతి విశ్వవిశ్వము ల
యించినఁ దా విలయించుఁగాక! నా
గాపగపొంత భైరవమ
హాయుధకాళికి జీవితార్పణల్
దీపము లిచ్చి, గుచ్ఛధర
ణీధరధీరగుహావిహారు తా
మా పలనాటిగండులకు
మాత్రము లేవు జరావినాశముల్.

వెలయించె నొకరాజు వేల్పులకక్కజమందఁ
దెలుఁగుతల్లికి వన్నె లొలుకు నగరు,
కరియించె నొక ఱేఁడు పురమునందొకనాఁడు
పసుపునిగ్గులనీను పసిఁడివాన,
అమరించె నొకయోగి యాపన్నులను బ్రోవ
యవనవాహినికి సేతువు నొకండు,
కరఁగించె నొకమంత్రి ఘనమనీషాగ్నిచే
ఢిల్లీమహేంద్రుగుండియల క్రొవ్వు
కరడుగట్టిన తెనుఁగురక్తమునఁ బుట్టి
మెఱసి నిదురించి రెందఱో మేల్మిదొరలు;
త్రవ్వుకొను మింక నారసత్వమును జూపి
మట్టిపాలైన తత్కథా మణిగణమ్ము.

అలవేళఁ గన్న బిరుదుల
కలనాదం బడఁగెఁ గాలకర్పరపీడన్;
దెలివెలుఁగు వలుపు సేయఁగఁ
బులికడుపునఁ జలిదిచీమ పుట్టలు వెడలెన్.

ఎడమోము పెడమోము నిడి చప్పరించునే
గుండె కొల్పోక జెట్లండు ప్రభుఁడు ?
వేమాఱు లెక్కించునే మీన మేషాలు
చాతుర్యధాని రాజాప్రధాని ?
రాయబారాల నీరములపాల్గావించి
యుల్లసం బాడునే వల్లభాయి ?
పంచాంగమును గట్టిపై చూచునే యొక మూలఁ
బట్టి రాధాకృష్ణపండితుండు ?
పసిఁడిపువ్వుల పూజకుఁ బ్రతిఫలమ్ము
విసపుఁజూపుల నిడునె కొంగెసుభవాని ?
తెలుఁగురాష్ట్రింపుఁ దల్పులఁ దెఱవఁబోక,
నాఁటిశూరుల నొకరైన నేఁటికున్న ?

గురుపదవందనా"లఱవ
గోడును దంబళగోడునై" చనెన్;
తతిగిరి కాలుచేతులను
డాపునఁ గాపురమున్న దానవుల్;
పౌరువులు మించిపోయినవి
పుత్రులు; కాంధ్రమహీపురంధ్రికిన్
దరుణము వేచి "లగ్నశని"
దాపురమయ్యెనయో! వియోగినై.

చిల్లిగవ్వలేని చెల్లెండ్రు పల్వుర
సుస్వతంత్రలగుచు సొక్కిసోల,
మన త్రిలింగలక్ష్మి మసిపాతలను గట్టి
దాని యౌనె సుతులు తలలు వంప?

ఇరుకోట్లపై లక్ష లేఁబది యున్నవి
దేశమ్ము వీడని తెనుఁగుతలలు,
ఎనుబదివేల మైళ్లను మీఱియున్నది
తెగిపోక నిలిచిన తెనుఁగుపొలము,
కలవు కోటానకోటులు దొంగపాల్గాక
తెలలోన దాఁగిన తెనుఁగుసిరులు,
కనువిప్పి వివిధనాకల నోముచున్నది
తేజంబుఁ గోల్పోని తెనుఁగురేవు
సర్వసంపన్నయగు తెన్గుజనని కేల
స్వీయరాష్ట్రోపలబ్ధికిఁ జిక్కవెచ్చె?
కన్నబిడ్డలు మత్తిల్లుకతనఁగాదె?
కొదువ నిపుడైన సవరించుకొనుము తండ్రి!

మఱవంగూడునఁటయ్య! గర్తపురకుం
భన్మానినీసంసదం
తరవేదిన్ వినువీథి ముట్టిన కళా
ధ్వానంబు; దైన్యాంబుధిన్
బరపాదాహతిఁ గ్రుంగు దేశమును గా
వంబోక, జాతీయ సం
గరసీమన్ వెను జూపెదేని కులకాం
తల్ గాజు లందీయరే?

ధట్టీల బిగియించి పట్టుకొన్నారులే
రాచ పెత్తనపుమద్రాసుబురుజు,
విశ్వవిద్యాశాల వెలయించినారులే
ఆత్మభాషాయోష కగ్రపీఠి,
కదనపంచాస్యులై కవ్వుకొన్నారులే
యొడ్డెరకక్కసి మెక్కుచున్న కండ,
సిగపట్టు వదలించి సృష్టించినారులే
తుంగభద్రాసరిత్తోయవసతి,

"తెగువ కుత్తరు" లీరని మొగము పుణికి
వెక్కిరించుచు నున్నారు వీరు వారు;
"భగ్న"మని మండదే మనఃపంకజంబు ?
దుముదుము! బిరాన కార్యరంగమున కాంధ్ర!

దక్షప్రౌఢి గడించి, తల్లి కిడుమల్
దప్పింప సన్నాహివై
దీక్షం బూనుటయే కొఱంత; సుఫలా
ప్తిం గూర్చ నున్నారు ది
వ్యక్షోణిం గొలువున్న పెద్దలు స్వకీ
యాంశమ్ముల న్నీ యెదన్

నిక్షేపించి; నిమిత్తమాత్రము భవ
న్నిష్ఠాపటిష్ఠ క్రియల్.

పశుబలాధీనమై పరఖండముల రేగు
యుద్ధంపు గొడవల కూరుకొనక,
ఆశ్రయాశనులైన యయవారిబాకాల
రొదలు గింగురుమన్న బెదరిపోక,
పెరటిచెట్టున గూడు పెట్టి, టెక్కులఁగొట్టు
శకునపక్షికి నిరుత్సాహపడక,
అన్నదమ్ములు కీచులాడి, లగ్నమునకు
విసువెత్తి, వాయిదాల్ వేసికోక,

గాఢసంకల్ప గరిమఁ గంకణముఁ గట్టి,
అంబకు స్వకీయరాష్ట్రలాభంబుఁ గూర్చి,
శీఘ్ర మొనరింపు పట్టాభిషేచనంబుఁ,
గామితార్థంబు లరుదెంచు గడియలోన.

మాతృకోటీరపరివేషమండలముగ
విక్రమాంధ్రప్రతాప మావిర్భవింప;
గారవమున నదృష్టచక్రమును ద్రిప్పి
విక్రమాబ్దమ! సార్థకాభిఖ్య వగుము !



# మైనారిటీల సమస్య

- దాని స్వరూప స్వభావ విచారము
- ముస్లిములీగు కోరికలు
- దాని పరిష్కారములోని సాధక బాధకాలు

శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

మైనారటీలసమస్య క్లిష్టతర మగుచుండుటచేతను, దాని మూలంగా హిందూమహమ్మదీయసఖ్యతకు భంగము కలుగుచుండుటచేతను, మహమ్మదీయులవలె తాముకూడ మైనారటీల మని చెప్పకొను హరిజనులు, క్రైస్తవులు మొదలగువారిలో ఆందోళనము చేయుచుండువారి వాదము పెరుగుచుండుటచేతను స్వరాజ్యసమరము ముందునడుచుటకు బదులు వెనుకకు నడుచుచున్న దేమో అను సందేహము కలుగుచున్నది. ఈ మైనారటీల సమస్యయొక్క నిజస్వభావ మేమో తెలుసుకొనుట స్వరాజ్యవాంఛితు లందరికీ అత్యవసరము. బ్రిటిషుప్రముఖులలో అనేకులు "స్వరాజ్య మేమో మీరు కోరుతున్నారు; మీకు దానిని అనుభవించుటకు హక్కు కలదు; కాని మీలోమీరు పోరాడుచున్నంతకాలము స్వరాజ్యమును అనుభవింపలేరనియు, మీ కది దక్కదనియు మాకు భయముగానున్నది. ఇట్టిపరిస్థితులలో మేము మా అధికారమును వదలుకొనుటమాత్రమే సంభవించును గాని, మేము వదలుకొనిన అధికారమును మీరు కాపాడుకొనలేకపోవుటచేత మూడవవారు మరెవరైనా వచ్చి దానిని లాగుకొనిపోయెదరేమో అను అనుమానము మాకు కలదు. మీరు కోరు స్వరాజ్యవరమును మేము ప్రసాదింపకుండుటకు మీలో మీకు — ముఖ్యంగా హిందువులకు, మహమ్మదీయులకు — సఖ్యత లేకపోవుటయే కారణము గాని మా స్వలాభప్రియత్వము గాదు" అని చెప్పచున్నారు. మనవారిలో అనేకులు ఈ మాటలను నమ్మకపోవచ్చును. ఏలనగా, ప్రపంచంలో ఏ కాలంలోగాని, ఏ దేశంలోగాని అధికారంలో ఉన్నట్టివారు తమంతట తాము అధికారాన్ని వదలుకొనియుండలేదు. అది మనుష్యస్వభావానికి విరుద్ధం. వారిచేతినుండి అధికారాన్ని లాగుకొనుటకు ప్రయత్నిస్తుండేవారిమూలంగా దుర్భరమైన వొత్తిడి కలిగినగాని అధికారాన్ని వదలుట సంభవింపదు. బ్రిటిషువారికి మనదేశంలో ఇంకా అలాటివొత్తిడి కలుగలేదు. ఎప్పుడైతే అది కలుగుతుందో ఆ నిమిషంలో వారు, మార్గాంతరం లేక, అధికారాన్ని వదలుకొంటారు. ఎవరైతే అలాటివొత్తిడి వారికి కలిగిస్తారో వారిచేతిలోకి అధికారం వస్తుంది. రాజకీయపరిణామంలో మనకు కనిపించే న్యాయం-ధర్మం ఇదే.

## బ్రిటిషువారు ఇప్పటికి వదలుకొన్న కాస్త అధికారం

1935 లో బ్రిటిషుపార్లమెంటువారు చేసిన శాసనం మూలంగా కొంత అధికారాన్ని వారు వదలుకొన్నారు. అంతకు పూర్వం మహాత్మాగాంధిగారి నాయకత్వంక్రింద కాంగ్రెసు సంస్థలోనివారు రెండుపర్యాయాలు సత్యాగ్రహం ప్రదర్శించి, బ్రిటిషు వారికి కలిగించిన వొత్తిడియే దీనికి కారణము. దానిమూలంగా రాష్ట్రప్రభుత్వవిషయాలలో వారు కొంత పట్టును వదలివేసుకొనవలసి వచ్చినది. ఆ వదలివేయడానికి కారణం రాష్ట్రాలలో ఉండే అధికసంఖ్యాకులకును, అల్పసంఖ్యాకులకును పొత్తు కుదిరిందనిగాని, రాష్ట్రపరిపాలనంలో అల్పసంఖ్యాకుల సమస్య లేదనిగాని వారు నమ్మడం కాదు. సత్యాగ్రహంమూలంగా వారికి కలిగిన చిక్కులే దీనికి కారణం. అందుచేత అనవసరా లని వారికి తోచిన అధికారాల నన్నిటిని వారు వదలుకొని, వారికి ఏయేవి అవసరాలో — సైన్యం, విదేశవ్యవహారాలు, యూరోపియన్ వర్తకరక్షణము — అట్టి అధికారాలనుమాత్రం చేతులో పెట్టుకొన్నారు. స్వరాజ్యానికి పోరుతుండేవారు చేసేది సత్య, అహింసలతోకూడిన ధర్మయుద్ధమైనా, వారు చేస్తుండేది యుద్ధం కాని స్నేహం కాదు. యుద్ధంలో ఎదటిపక్షంవారు లొంగడానికి కారణం శత్రువువలన అతనికి కలిగే కష్టనష్టాలు. ఇవి దుర్భరమైనపుడు అతడు యుద్ధరంగాన్ని వదలి సంధి చేసుకొంటాడు. అవి దుర్భరం కాకపోవుటచేతనే బ్రిటిషువారు అధికారాన్ని పూర్తిగా వదలవలసిన అవసరం లేకపోయింది.

## అంతకంటె ఎక్కువగా వారు సళ్లకపోవడానికి కారణం

స్వరాజ్యవాంఛితులమూలంగా బ్రిటిషువారికి కలిగిన వొత్తిడి దుర్భరం కాకపోవడానికి ఎన్నో కారణా లున్నవి. కాని వాటి అన్నిటిలో ప్రధానమైనది మనదేశంలోను, మనవారిలోను స్వరాజ్యమందు విముఖులుగా ఉండేవారి బలం సుముఖులుగా ఉండేవారి బలంకంటె అధికంగా ఉండడం.

## స్వరాజ్య విముఖులలో తరగతులు

స్వరాజ్యవిషయంలో విముఖులుగా ఉండేవారిని రెండు తరగతులుగా విభాగం చేయవచ్చు. స్వరాజ్యం అక్కరేలేదనిన్ని, దానిమూలంగా దేశానికి నష్టమేకాని లాభం ఏమాత్రం లేదనిన్ని చెప్పేవారు మొదటితరగతిలోనివారు. సంస్థానాధీశులు, యూరోపియనులు, ఆంగ్లోఇండియన్లు ఈతరగతిలో చేరిఉన్నారు. బ్రిటిషుప్రభుత్వంమూలంగా వీరు ఎన్నోలాభాలను అనుభవిస్తున్నారు. అధికారం, ఐశ్వర్యం, గౌరవం వీరిసొమ్ము. భారతీయులలో మరెవ్వరికికూడా ఇంతటి ఉత్కృష్టత లేదు. కాని దీనికంతా బ్రిటిషువారి అధికారమే ప్రధానకారణం. అది తొలగితే ఈ సదుపాయాలు కూడా తొలగిపోతవి. గనుక వీ రెన్నడూకూడా బుద్ధిపూర్వకంగా స్వరాజ్యాని కంగీకరించరు. స్వరాజ్యం అక్కరలేదని చెప్పే వీరికిన్నీ స్వరాజ్యం మాజన్మహక్కు అని చెప్పేవారికిన్నీ రాజీ కుదిరితే స్వరాజ్యం ప్రసాదిస్తామని బ్రిటిషువారు చెప్తున్నారు. కాని ఇది ఎన్నటికీ కుదిరేదికాదు. ప్రస్తుతంలో వీరిసంఖ్య చాలా తక్కువైనా వీరికి గల అధికారబలం, ద్రవ్యబలం చాలా ఎక్కువ. రైల్వేలు, పోస్టు, టెలిగ్రాఫు, ఐచ్ఛికసైన్యం మొదలైన ప్రభుత్వశాఖలలో చాలాభాగం ఆంగ్లోఇండియ న్లున్నారు; వ్యాపారంలో చాలాభాగం యూరోపియన్ వర్తకులదే; సంస్థానాధీశుల నిరంకుశాధికారాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. సంస్థానాలలో ఉండే ప్రజలు రాజకీయవిషయాలలో ఎక్కువ శ్రద్ధవహించి, పరిపాలకుల నిరంకుశత్వాన్ని తొలగించినప్పుడు తప్ప వీరిబలం తగ్గదు. అంటే బ్రిటిషు రాష్ట్రాలలోని ప్రజలలో ఉండే స్వరాజ్యాభిమానం సంస్థానముల లోని ప్రజలలోకూడా ప్రాకవలసిఉంది. అది ఇంకా జరగలేదు.

స్వరాజ్యవిషయంలో విముఖులుగా ఉండేవారిలో అల్పసంఖ్యాకులు (మైనారటీలు) రెండవతరగతిలో చేరిఉన్నారు. మహమ్మదీయులు, శిక్కులు, క్రైస్తవులు, పార్శీలు, హరిజనులు—వీరిని అల్పసంఖ్యాకులలో గణించడం జరుగుతున్నది. వీరందరూ స్వరాజ్యవిముఖు లని చెప్పడం పొరబాటు. శిక్కులలో అందరూ కూడా సుముఖులుగానే ఉన్నారు. కాని తక్కినవారిలో ఇట్టి సుముఖత్వం పూర్తిగా కనుపించుటలేదు. వీరిలో ఎక్కువమంది విముఖులా, సుముఖులా అనేప్రశ్నకు నిశ్చితమైన జబాబు ఎవ్వరూ చెప్పలేరు. ఇంటింటికీ వెళ్లి జనాభాలెక్కను తయారుచేసినట్లు ఈ విషయమై ఎవరూ లెక్కపెట్టినదిలేదు. కాని ఈ వర్గములవారి నాయకులు కొందరు వ్యక్తపరుస్తుండే అభిప్రాయాలనుబట్టి మహమ్మదీయులలో విముఖత్వం ప్రబలంగా ఉన్నదనీ, హరిజనులలోను క్రైస్తవులలోను కొంతవరకు విముఖత్వం ఉన్నదనీ సాహసించి చెప్పడానికి అవకాశాలు ఉన్నవి. పార్శీలలోకూడ ఇట్టి అభిప్రాయభేదాలు కలవు. దక్షిణఇండియాలో జస్టిసుపార్టీనాయకులలో అనేకులు—అల్పసంఖ్యాకవర్గంలో చేరకపోయినా—ఇట్టి విముఖత్వాన్నే చూపిస్తున్నారని చెప్పవచ్చును.

కాని అల్పసంఖ్యాకుల విముఖత్వానికీ, మొదటితరగతిలో చేరిన సంస్థానాధీశులు లోనగువారి విముఖత్వానికీ ఒక గొప్ప భేదం ఉంది. సంస్థానాధీశుల విముఖత్వం శాశ్వతమైనది. అల్పసంఖ్యాకుల విముఖత్వం కొన్నిసందర్భాలను అనుసరించి ఉన్నది. స్వరాజ్య సమరంలో తాము పూర్తిగా చేరడంలేదని వారు చెప్పడంలేదు. వారు విధించే సూత్రాలను తక్కినస్వరాజ్యవాదులు అంగీకరిస్తే తాము కూడా వారితో కలిసి బ్రిటిషువారి అధికారాన్ని తొలగించడానికి సిద్ధంగా ఉన్నట్లు చెప్తున్నారు. ఆసూత్రాలను అంగీకరించకుంటే తాము స్వరాజ్యోద్యమాన్ని నిరోధించి, బ్రిటిషుపక్షానికి సహాయం చేసేటట్లు ప్రకటిస్తున్నారు. వారికి ప్రధానం ఈసూత్రాలు కాని స్వరాజ్యం కాదు. ఎవరిమూలంగా ఈసూత్రాల విషయంలో వారికి అనుకూలం కలుగుతుందో వారిపక్షం వహించడమే వారి ఉద్దేశం.

## మహమ్మదీయ సమస్యయొక్క ప్రత్యేకత్వం

పైన ఉదాహరించిన అల్పసంఖ్యాకు లందరిలోను మహమ్మదీయులది యొక ఎత్తు; తక్కినవా రందరిదీ మరియొక యెత్తు. వారి ప్రధానసూత్రానికీ, తక్కిన అల్పసంఖ్యాకుల సూత్రాలకూ చాలా భేదం ఉంది. తక్కినవారు మహమ్మదీయుల ప్రధానసూత్రానికి అంగీకరింపరనికూడా చెప్పవచ్చును. గనుక మైనారటీల సమస్యను వివరించడంలో మహమ్మదీయసమస్యను ప్రత్యేకించడం మంచిది.

## ముస్లిములీగు-జిన్నాల షరత్తులు

మహమ్మదీయనాయకులలో అగ్రగణ్యుడు జిన్నా. వారి సంస్థలలో అగ్రగణ్యమైనది ముస్లింలీగు. దీనికి జిన్నా అధ్యక్షుడు. మహమ్మదీయప్రముఖులలో అనేకులు ఇందులో చేరియున్నారు. స్వరాజ్యవిముఖులుగా ఉండే మహమ్మదీయుల అభిప్రాయం తెలుసుకోడానికి జిన్నాయొక్క అభిప్రాయాలు తెలుసుకుంటే చాలును. సామ్రాజ్యతత్వం జిన్నాకు రుచించదు. అతడుకూడా స్వరాజ్యాన్ని కోరేవాడే. కాని అతడు కోరే స్వరాజ్యానికీ, అతనిని అనుసరించని మహమ్మదీయులు కాంగ్రెసుపక్షంవారు తదితరులు కోరే స్వరాజ్యానికీ ఒక గొప్ప భేదం ఉంది. అది ఏలాటి రాజీకీ లొంగనట్టి భేదం. జిన్నాగారివాదం ఏమిటంటే—"ఇండియా అనేది ఒక దేశం కాదు; ఇది ఒక ఖండం. ఒక దేశమైతే ఒక కేంద్రప్రభుత్వానికి లోబడడం సహజం గాని, అనేకదేశాలతో కూడుకొన్న ఖండం ఒకేప్రభుత్వంక్రింద ఉండడం స్వభావవిరుద్ధం. ఖండం అనే భూభాగంలో అనేక కేంద్రప్రభుత్వా లుండడమే సబబు. అందు స్వతంత్రించిన రాజ్యా లనేకా లుండవలెను; ఒకొక్క

# మైనారిటీల సమస్య

> **అల్పసంఖ్యాకవర్గాల అనవసరాందోళనను, వారి వాదంలోని బలహీనతను, స్వరాజ్యోద్యమనాయకుల అకలంకదీక్షను, ముస్లిములీగుపక్షాన జిన్నాగారు గావిస్తున్న వితండవాదనను అతివివరంగా పాఠకమహాశయులు ఈ వ్యాసంలో గ్రహింపవచ్చును. ఈ సమస్య యొక్క పుట్టుపూర్వోత్తరాలన్నీ ఇందులో సింహావలోకనం చేయబడినవి.**

రాజ్యాన్ని స్వతంత్రించిన ప్రభుత్వం ఒకటి ఏలుతుండవలెను. ఇంతేగాకుండా హిందూదేశంలో ఒకజాతివారు (Nation) లేరు; అనేకజాతులవారున్నారు. వీటిలో ముఖ్యములైనవి హిందూజాతి, మహమ్మదీయజాతి. వీరిద్దరికీ ఒక్క మతంలోనే కాదు భేదం: ఆచారాలలో, సంప్రదాయాలలో, భాషలో, సాంఘికవ్యవస్థలలో —మానవ జీవితంలో ప్రధానమైన ప్రతివిషయంలోకూడా భేదాలున్నవి. ఇంతటిభేదాలున్నప్పుడు వీరిద్దరూ కలిసి ఒకేరాజ్యంలో పౌరులుగా ఉండడం అసంభవం. బ్రిటిషువారు అధికారాన్నుండి తొలగిపోవడం మంచిదే; కాని వారు తొలగిపోయిన తర్వాత హిందూదేశంలో ఒకప్రభుత్వం ఉండకూడదు. దేశంలో పంపకం జరగవలసిఉంటుంది. కొంతభాగం మహమ్మదీయుల స్వాధీనంలోను, తక్కినభాగం హిందువులస్వాధీనంలోను ఉండవలెను. హిందూదేశాన్ని ఈవిధంగా రెండుముక్కలు చేయడానికి స్వరాజ్యవాదులు అంగీకరిస్తే నేనుకూడ వారిలో చేరి స్వరాజ్యసమరాన్ని జయప్రదంగా సాగిస్తాను. అట్టివిభజనకు అంగీకరించనిపక్షాన నేనుగాని, నన్ను అనుసరిస్తుండే తొమ్మిదికోట్ల మహమ్మదీయులుకాని స్వరాజ్యసంస్థాపనాన్ని మాసర్వశక్తులతోను నిరోధిస్తాము." జిన్నా విధించే షరత్తు ఈవిభాగమే. దీనికి అంగీకరిస్తే స్వరాజ్యం; లేకుంటే బ్రిటిషుసామ్రాజ్యం.

జిన్నా మొదలగు మహమ్మదీయ నాయకులనేకులు ఈవిధంగా వాదించడానికి కారణాలు మనం గ్రహించవలసి ఉన్నది. "హిందూదేశంలో నలభైకోట్ల ప్రజలున్నారు. అందులో ముప్పైకోట్లమంది హిందువులు. మహమ్మదీయుల సంఖ్య తొమ్మిదికోట్లు మాత్రమే. బ్రిటిషువారి అధికారం తొలగిపోయి స్వరాజ్యమేవస్తే అధికసంఖ్యాకులుగా ఉండే హిందువులదే అధికారం అవుతుందికాని అల్పసంఖ్యాకులగు మహమ్మదీయులకు ఏలాటిఅధికారం ఉండదు. హిందువులకు లోబడిఉండడానికి మహమ్మదీయులెన్నడూ అంగీకరించజాలరు. అది అవమానకరం; సమస్తబాధలకూ కారణభూతం. ఒకప్పుడు హిందూదేశంలో చాలభాగానికి ప్రభువులుగా ఉండి హిందువులపై రాజ్యంచేసిన మహమ్మదీయులు ఈనాటికి హిందువులకు లోబడి ఉండడానికంటె గౌరవభంగమైన విషయం మరొకటికలదా? ఇంతేకాకుండా మహమ్మదీయులంటే మ్లేచ్ఛులనేభావం హిందువులలో ఉన్నది. అలాటివారిని హిందువులు ఆదరిస్తారా? మరొక విశేషంకూడా ఈసందర్భంలో మనం జ్ఞాపకంఉంచుకోవలెను. మహమ్మదీయ పరిపాలనకాలంలో మహమ్మదీయప్రభువులనేకులు తెలిసియో తెలియకనో హిందువులవిషయంలో అనేక అపచారాలు చేసినట్లూ, వారి దేవాలయాలను నాశనంచేసినట్లూ, వారి ఉత్సవాలను నిరోధించినట్లూ, వారికి ఉన్నతోద్యోగాలను ఇయ్యనట్లూ చరిత్రగ్రంథాలు చాటుతున్నవి. ఆగ్రంథాలలోని విషయాలను ఈకాలపు హిందువులు నమ్మడంచేత మహమ్మదీయులపట్ల వారికి విరోధభావం ఉన్నది. స్వరాజ్యమే వస్తే అట్టి మహమ్మదీయులపై పగతీర్చుకోడానికి హిందువులు ప్రయత్నించడం తప్పదు. అది మనుష్యస్వభావం. మహమ్మదీయుల మసీదులు, పవిత్రగ్రంథాలు, ఉత్సవాలు, సంప్రదాయాలు — వీటి అన్నిటికీ తప్పక ప్రమాదం సంభవిస్తుంది. గనుక హిందూదేశాన్ని రెండుభాగాలు చేయడం, మహమ్మదీయరాష్ట్రాలు ఒకభాగంలో ఉండడం, హిందూరాష్ట్రాలు మరియొకభాగంలో ఉండడం అత్యవసరం. రాజకీయంగా ఈ రెండుజాతులవారికీ పరస్పరసంబంధం ఏర్పడదు; సఖ్యత కుదురదు. ఒకే రాజ్యంలో వీరిద్దరూ ఉంటే మతకలహాలు, సంఘర్షణలు తప్పవు. గనుక దేశాన్ని పంచుకోవడమే నిజమైన స్వరాజ్యం". ఈ పంపకం ఏమోస్తరుగా జరుగవలెనో, ఏయేభాగాలు మహమ్మదీయులకు చెందవలెనో, ఏవి హిందువులకు చెందవలెనో వ్యక్తపరుస్తూ మహమ్మదీయనాయకులు కొందరు అయిదారు ప్రణాళికలను ఇదివరకే తయారుచేసియున్నారు.

ఈపంపకమే వాంఛితమని మహమ్మదీయనాయకులు పట్టుపడ్తే వారికిని, స్వరాజ్యానికై ఇదివరకు ప్రయత్నిస్తున్న కాంగ్రెసు మొదలగు సంస్థలలోనివారికిని రాజీ కుదరనేరదు. ఈ షరత్తుననుసరించి రాజీచేసుకోవడం రోగంకుదరడానికి చావుతప్ప వేరొక మందు లేదని చెప్పడంవంటిది.

## ఆషరతులలోని బేసబబు

స్వరాజ్యానికై పోరాడుతుండేవారి ఉద్దేశం మనదేశాన్నుండి బ్రిటిషువారి అధికారాన్ని తొలగించడంమాత్రం కాదు. దాని స్థానంలో భారతీయుల అధికారం స్థాపించడం, అలాగు స్థాపించిన అధికారాన్ని అపాయం రాకుండా నిలబెట్టుకోవడం — ఇవే వారి ఉద్దేశాలు (గతసంవత్సరం సంవత్సరాదిసంచికలో నేను వ్రాసిన వ్యాసం ఈసందర్భంలో చదువవలసిందని కోరుచున్నాను). ఈలాగు స్థాపించి నిలబెట్టుకోవడం జరుగుతుందనే ధైర్యం మనకు ఉండి, దానికి తగిన ఏర్పాటులు మనంచేసుకోగలిగినప్పుడే మనకు నిజమైన స్వరాజ్యం లభ్యమవుతుంది. అట్లు మనం చేయలేనినాడు స్వరాజ్యం

దౌశనం వదలుకొని ఉన్న పరిస్థితులే ఉత్తమములని నమ్ముట మంచిది. దేశాన్ని రెండువిభాగాలు చేసి మనం అనుభవించే స్వరాజ్యం స్వప్నంలోని సౌభాగ్యంవంటిది. దానిని మనం ఒకనిమిషంకూడా కాపాడుకోలేము.

దీనికి రెండు మూడుకారణా లున్నవి. పంపకంలోని మహమ్మదీయరాష్ట్రాలలో చాలాభాగం మనదేశపు వాయవ్యప్రాంతాలలో ఉంటవి. కాశ్మీరము,పంజాబు, సరిహద్దురాష్ట్రము, సింధురాష్ట్రము, బెలూచిస్థానము — ఇవన్నీ మహమ్మదీయ ప్రభుత్వాలక్రింద స్వతంత్రంగా ఉంటవి. ఇవన్నీ ఇండియాఆవలనుండి మహమ్మదీయ రాజ్యాలను ఆనుకొని ఉన్నవి. ఈపంపకం వాంఛనీయమని వాదించేవారందరూకూడా అఖిలమహమ్మదీయ సమ్మేళనోద్యమాభిమానులు (**Pan - Islamic movement**). ఈ ఉద్యమంయొక్క ఉద్దేశం జిబ్రాల్టరు మొదలు బంగాళాఖాతంవరకు వ్యాపించిన మహమ్మదీయరాష్ట్రము లన్నిటినీ ఒకసమ్మేళనంగా ఏర్పాటుచేసి, దానిద్వారా మహమ్మదీయుల ప్రాచీనగౌరవాన్ని, ప్రతిభను పునరుద్ధారణ చేయడం. ఇండియాను పంచుకోవడం అనే ఉద్దేశం ఈ పునరుద్ధారణలోని ఒక అంతర్భాగం. సమ్మిళితమైన ఈ మహమ్మదీయ సామ్రాజ్యంలో ఇరువదికోట్ల ప్రజ లుంటారు. ప్రాచీనకాలమందుండి ఇటీవలివరకు మనదేశానికీ, మన స్వాతంత్ర్యానికీ వాయవ్యభాగమందుండి వచ్చిన పరాయిదేశస్థులే భంగం కలిగించారు. అలాటి ప్రమాదం తిరిగీ కలగడం, దానిమూలంగా హిందూరాష్ట్రాలకు వినాశం సంభవించడం, బ్రిటిషుసామ్రాజ్యానికి బదులు మహమ్మదీయసామ్రాజ్యం స్థాపితం కావడం సంభవిస్తుంది. పరాధీనమునుండి విముక్తి పొందడానికి ప్రయత్నిస్తుండే మనము ఆఫ్గన్‌స్థానము, పర్షియా, ఐరాక్, ఈజిప్టులోనగు దేశాలలోని మహమ్మదీయులకు వశం కావడం జరుగుతుంది.

ఈలాటి ప్రమాదం రాకపోయినా సామ్రాజ్యకాంక్ష గల జపాను, రషియా, జర్మనీ మొదలగు దేశాలనుండి మనదేశానికి ప్రమాదం సంభవిస్తుంది. మనదేశం అంతా ఒకే ప్రభుత్వానికి లోబడి ఉంటే అట్టి ప్రమాదాన్నుండి దేశాన్ని రక్షించుకోవడం సులభం కాని కొంతభాగం హిందువులక్రింద, కొంతభాగం మహమ్మదీయుల క్రింద విభాగమైనప్పుడు పరాయివారు తిరిగీ మనదేశాన్ని జయించుకోవడం సులభం. ఇట్టి విభాగంవల్ల హిందువులకే గాక మహమ్మదీయులకుకూడా తప్పకుండా నష్టం కలుగుతుంది. ప్రస్తుతం స్వరాజ్యానికై మనవారు చేస్తుండే త్యాగమంతా వ్యర్థమైపోతుంది. ప్రస్తుతం స్వరాజ్యానికై మనవారు చేస్తుండే త్యాగమంతా వ్యర్థమైపోతుంది. పూర్వకాలంలోను, మధ్యయుగంలోనూ మనదేశంలో ఇదేవిధంగా స్వతంత్రించిన రాష్ట్రాలెన్నో ఉండబట్టి మహమ్మదీయులు, బ్రిటిషువారు వారి సామ్రాజ్యాన్ని స్థాపించుకోగలిగిరి. పద్ధెనిమిదో శతాబ్దంలో రాజ్యాలు అనేకం మనదేశంలో ఉండడంచేత దేశం అనాథయై పరాయివారికి లోబడవలసివచ్చిం దనే మాటను మనం ఎన్నటికీ మరవకూడదు. నాథు లనేకు లుండడమున్నా, అనాథగా ఉండడమున్నా ఒక్కటే.

మైనారటీల సమస్య పరిష్కారం కావడానికిన్ని, అల్పసంఖ్యాకులూ అధికసంఖ్యాకులూ కలసి స్వరాజ్యానికి పోరాడడానికిన్ని జిన్నా సూచించిన పంపకమే మార్గం అయ్యేపక్షాన ఈమార్గం అవలంబించడం ఆత్మహత్యచేసుకొన్నట్లే. దీనిమూలంగా ఎన్నడూ ఈసమస్య పరిష్కారం కాజాలదు—కాగూడదు.

## జిన్నాగారి పాటకు తాళంవేసే ప్రముఖులు

ఈ పంపకం అనే సూచన ఎంతవరకూ ప్రాకిందో, ఎందరి మనస్సులను ఆకర్షిస్తున్నదో, దానిమూలంగా కలుగబోయే ప్రమాదాలు ఎంతటి ఘోరములో గ్రహించనివా రెందరున్నారో మరి కొన్ని నిదర్శనాలవల్ల స్పష్టం అవుతుంది. ద్రవిడదేశంలోని జస్టిసు పార్టీనాయకుడగు ఇ. వి. రామస్వామినాయకర్ ఈ పంపకవాదానికి చేయూతఇస్తూ ద్రవిడులు ఆర్యులకంటె భిన్నులనిన్నీ, తమిళరాష్ట్రంలోని ప్రజలలో బ్రాహ్మణులు తప్ప తక్కినవారందరూ ద్రవిడులనిన్నీ, ద్రవిడులకు స్వరాజ్యం రావలెనంటే ద్రవిడదేశం తక్కిన భారతదేశంతో సంబంధంలేకుండా ప్రత్యేకస్వతంత్ర రాజ్యంగా ఏర్పడవలెననిన్నీ వాదిస్తుండడం అందరూ ఎరుగుదురు. ద్రవిడులను బానిసలనుగా చేస్తుండేవారు ఆర్యులును, ఆర్యులసంతతివారగు బ్రాహ్మణులేగాని బ్రిటిషువారుకారని వీరి అభిప్రాయం. ఇదేవిధంగా హైదరాబాదుసంస్థానంలోని ప్రముఖులు కొందరు ఉత్తరసర్కారులు, రాయలసీమ మొదలగు ప్రదేశాలన్నీ నిజాంరాష్ట్రంలో కలిసిపోవలసినదనిన్నీ, ఇట్లేర్పడిన నిజాంరాష్ట్రం స్వతంత్రరాజ్యం కావలసిందనిన్నీ వాదిస్తున్నారు. దేశాన్ని పంచుకొందాం మని చెప్పేవారు అక్కడక్కడ బయలుదేరుతున్నారన్నమాట దీనినిబట్టి స్పష్టం అవుతున్నది. జిన్నాగారు పాడే పాటకు వెనుకనిలబడి తాళంవేసే ప్రముఖులు చాలామంది ఉన్నారు.

## రాజీకి ఒక్కటే ఉపాయం

మైనారటీలకు (అల్పసంఖ్యాకులకు) మెజారటీలకు (అధికసంఖ్యాకులకు) రాజీకుదరడానికి ఈ పంపకసూత్రం పనికిరాదు. వీరందరూ భారతీయులనిన్నీ, ఒక్క తల్లికడుపునపుట్టి పెరిగినవారనిన్నీ, హిందూదేశముయొక్క ఐక్యతను రక్షించడానికి సిద్ధపడినవారనిన్నీ, ఈ ఏకత్వంలేని స్వరాజ్యం మిథ్యాస్వరాజ్యమనిన్నీ ఎప్పుడైతే ఈరెండు పక్షాలవారూ అంగీకరిస్తారో అప్పుడే రాజీ కుదురవలసిఉంటుంది. రాజీకంతా ఇదే పునాది. దీనిని ఆధారం చేసుకొంటేనేగాని మైనారటీలసమస్య ఎన్నటికీ పరిష్కారంకాదు.

# మైనారిటీల సమస్య

## హిందువులు పరమతావలంబకులను ఎన్నటికీ హింసించరు

స్వరాజ్యం వచ్చినతర్వాత అధికసంఖ్యాకులైన హిందువులు అల్పసంఖ్యాకులైన మహమ్మదీయులను, తదితరులను బాధిస్తారనే వాదం నిరాధారమైనది.

౧. పరమతావలంబకులను హింసించడం హిందువుల స్వభావానికి విరుద్ధం. ఏకాలంలోకాని హిందూరాజులు ఈవిధంగా చేసినారని చెప్పటకు చరిత్రగ్రంథాలలో ఎట్టినిదర్శనాలూ లేవు. హిందూదేశచరిత్రానికీ, ఇతరదేశాల చరిత్రానికీ ఏదైనా భేదంఉంటే ఆభేదం ఈవిషయంలోనే కనిపిస్తుంది. హిందూరాజులు చూపినంత మతసహనం మరెవ్వరూ చూపియుండలేదు. ఇతరదేశాలలో తాము పడుచుండిన బాధలను అనుభవింపలేక మనదేశానికి పారివచ్చిన పారసీకులు, యూదులు, క్రైస్తవులు మొదలగు వారిని హిందూరాజులు చేరదీసి పోషించిరి. వ్యాపారమునకును, మరికొన్ని ఉద్దేశములతోడను హిందూరాజ్యాలలో కాపురం చేయడానికి వచ్చిన మహమ్మదీయులనుకూడా హిందూరాజులు ఎన్నడూ హింసపెట్టినది లేదు. ఇంతేకాకుండా, వారికి కావలసిన మతసౌకర్యాలనుకూడా కల్పించినట్లు తెలియవస్తున్నది. హిందూమతము ఇతరములతో పోటీకిదిగేది కాదు. ఇతరమతములను అవలంబించిన వారిని నిర్బంధించి స్వమతంలో చేర్చుకోవడం హిందూసాంప్రదాయంకాదు. స్వధర్మము ననుసరించడమే ప్రతిమానవునికీ ధర్మం అన్నదే హిందూతత్వానికి మూలం. ఈలాటిహిందువులు సంప్రదాయవిరుద్ధంగా మహమ్మదీయులను, క్రైస్తవులను స్వరాజ్యం వచ్చినతర్వాత బాధిస్తారని అనుకొనడానికంటె పొరబాటు మరియొకటి లేదు.

౨. ఇదిగాక ప్రస్తుతకాలంలో రాజకీయవిషయాలను చర్చచేస్తూ, స్వరాజ్యసమరంలో దిగి స్వార్థత్యాగంచేసిన నాయకులుగాని, వారి అనుచరులుగాని చాలామట్టుకు మతమందు విముఖత్వం చూపుతుండేవారని చెప్పవలసివస్తున్నది. జహ్వార్‌లాల్ నెహ్రూ, సుభాస్ చంద్రబోసు మొదలైనవారు దేశంలోని దారిద్ర్యం తొలగించి, ప్రజలనందరిని ఐశ్వర్యవంతులనుచేయడమే ప్రధానోద్దేశంగా పెట్టుకొనియున్నారు. ప్రజలనందరినీ ఆర్థికంగా బాగుచేయడమే స్వరాజ్యానికి ఫలితమని వారి నమ్మకం. హిందూమతాన్ని ఉద్ధరించవలెననిగాని, ఇతర మతాలను ఖండించి నాశనంచేయవలెననిగాని వారీ సమరంలో దిగినవారుకారు. వారిదృష్టిలో మతం అప్రధానం. ఎవరేమతం అనుసరిస్తున్నారో తెలుసుకోవడంకూడా ప్రభుత్వంచేసేవారికి విధి కాదనేదే వారినమ్మకం. స్వరాజ్యోద్యమనాయకులలో చాలమంది సాంఘికవాదులు (Socia lists). మతవిషయాలలో వారు జోక్యంకలుగచేసుకోరన్నదానికి ఇది యొకటే తార్కాణం.

3. మహమ్మదీయులొకప్పుడు హిందువులను బాధపెట్టినట్లు చరిత్రగ్రంథాలలో ఉన్నది గనుక స్వరాజ్యంవచ్చినతర్వాత హిందువులు వారిపై పగతీర్చుకొంటారని చెప్పడంకూడా హాస్యాస్పదం. మన చరిత్రగ్రంథాలు సత్యం చెప్పడం లేదనిన్నీ, స్వార్థపరులగు యూరోపియనులు కల్పించిన కథలనేకాలు వానిలో ఉన్నవనిన్నీ జాతీయవాదులూ, స్వరాజ్యోద్యమమందు పనిచేయుచుండేవారూ ప్రకటిస్తున్నారు. హిందూమహమ్మదీయ సమ్మేళనం కోరే నాయకులు ఈవిధంగా అల్పసంఖ్యాకులను బాధించుట ఎన్నటికీ సంభవించదు.

ఇంతకూ లోపం ఎక్కడ ఉన్నదంటే ఈ మోస్తరుగా వాదించేవారందరూ వెనుకవైపున చూస్తూ ముందువైపున ఏమిజరుగుతుందో నిర్ణయించడానికి ప్రయత్నంచేస్తున్నారు. మన కిప్పుడు కావలసింది ముందుచూపు గాని వెనుకచూపుకాదు. హరిజననాయకులు కొందరిలో ఉండే లోపంకూడా ఇదే. అగ్రజులు ఇదివరకు అంత్యజులను నిరాదరిస్తూ ఉండుటచేత ఇకమీదట వారట్లే చేస్తారని వీరిభ్రమ. ప్రస్తుతం మనదేశంలో జరుగుతుండే విషయాలను వీరెవరూ చక్కగా గమనించడంలేదు. హరిజనులను అనాదరించువారి సంఖ్య తగ్గుచుండడం, అట్టి అనాదరణాన్ని సమర్థించేవారెవ్వరూ లేకపోవడం వీరు మరిచిపోతున్నారు. ఇదివరలో హరిజనులపట్ల తక్కినవారు అపచారం చేసినందుకు ఇప్పుడు పశ్చాత్తాపపడ్తున్నారు. అస్పృశ్యులు స్పృశ్యులు కావలెననీ, వారికి దేవాలయప్రవేశం ఉండవలెననీ, వారి ఆర్థికపరిస్థితులు చక్కబడవలెననీ, హిందూసంఘంలో వారికి తగిన మర్యాదాగౌరవములు ఉండవలెననీ మాటలపూర్వకంగా కాకుండా క్రియారూపంగాకూడా అగ్రజులలో అనేకులు చూపుచుండడం అందరికీ విదితమైన విషయమే. ఈవిషయంలో హిందువుల మనోభావం చాలవరకు మారినది; ఇంకా మారుతుంది. ఇంతకూ అస్పృశ్యతను పోగొట్టడానికి మధ్యయుగంలో పాలించిన మహమ్మదీయులుగాని, ఇప్పుడు పాలిస్తుండే బ్రిటిషువారుగాని చేసిన ఘనకార్యాలేవైనా ఉన్నవా? హరిజనుల స్థితిగతులు ఇప్పుడు బాగుపడుచుండుటకు బ్రిటిషువారి ఔదార్యం కారణం కాదు. హిందూసంస్కర్తల పట్టుదలయే కారణమని చెప్పవలసి ఉన్నది. పిఠాపురం మహారాజావారివంటి సామంతులు, వెంకటరత్నంనాయుడుగారివంటి మహర్షులు, రానడే, గోఖలే మొదలగు దూరదృష్టిగల మహాశయులు, మహాత్మాగాంధీగారు హరిజనోద్ధరణానికి పూనుకొని పనిచేయడం సర్వవిదితం. స్వరాజ్యసంస్థాపనానంతరం ఈ ఉద్ధరణము ఇప్పటికంటెకూడా జయప్రదంగా జరుగుతుంది గాని మరొకటి కాదు.

## మతాలకూ రాజకీయపక్షాలకూ సంబంధం కల్పిస్తున్న జిన్నాగారి భ్రమ

ఈ సందర్భంలో మరియొక విషయంకూడా మనం గమనించవలసి ఉంది. దానిని గమనించనందుననే మహమ్మదీయులు మొద

లగు అల్పసంఖ్యాకులు హిందువులవలన తమకు బాధకలుగుతుందని భ్రమించడం సంభవిస్తున్నది. మతాన్నిబట్టి హిందువులంతా ఒకటి గనుక రాజకీయవిషయాలలోకూడా వారందరూ ఒకే అభిప్రాయం కలవారై, ఒకేపక్షంగా ఏర్పడి, అల్పసంఖ్యాకులకు నష్టకరమైన శాసనాలు చేసి, వారికి నష్టంవచ్చేటట్లు ఆశాసనాలను అమలులో పెడ్తారని జిన్నా మొదలయినవారు వాదిస్తున్నారు. ఈ వాదం సత్యానికీ, అనుభవానికీ ఎంతోదూరంగా ఉంది. మతాన్నిబట్టి హిందువులంతా ఒక్కరైనా, రాజకీయాలలో వారియందు పరస్పరభేదాలెన్నో కనిపిస్తున్నాయి. వారిలో కొందరు కాంగ్రెసుపక్షం; కొందరు జస్టిసుపక్షం; కొందరు లిబరల్‌పక్షం; కొందరు బ్రిటిషుపక్షం; కొందరు సనాతనులు; కొందరు హిందూమహాసభాభిమానులు. కొందరిది ధనికపక్షం, కొందరిది రైతులపక్షం. ఈ విధంగా వారిలో ఎన్నోకక్షలు ఏర్పడి ఉన్నవి. ఈభేదాలు ఎల్లప్పుడూ ఉంటవి. జస్టిసుపక్షంవారు, సనాతనులు ఈమధ్యను జిన్నాతో కలిసిపనిచేయడానికి ఉద్యుక్తులైనట్లు మనకు తెలుస్తున్నది. సింధురాష్ట్రం, పంజాబు, బంగాళాము మొదలగు రాష్ట్రాలలో మహమ్మదీయులు అధికసంఖ్యాకులు; హిందువులు అల్పసంఖ్యాకులు. అయినప్పటికీ ఆరాష్ట్రాలలోని శాసనసభలలోని హిందూసభ్యులు ఒకేపక్షంలో లేరు; రాజకీయవిషయాలలో రెండుమూడు పక్షాలుగా విభాగమై ఉన్నారు. మహమ్మదీయులు హిందూదేశంపై దండెత్తి దేశాన్ని జయించడానికి వచ్చిన కాలంలోనూ, అలాగు జయిస్తున్న కాలంలోనూ హిందువులంతా కలిసి వారి నెదుర్కొనకపోవడంచేతనేగదా దేశం పరాధీనం కావలసివచ్చింది? ఇదేవిధంగా బ్రిటిషువారు మన దేశాన్ని జయిస్తున్నకాలంలో హిందువులలో ఐకమత్యం లేకపోవడం, కొందరు హిందువులు తక్కిన హిందువులతో కలియక బ్రిటిషువారికి సహాయంచేయడం, కొన్నిసందర్భాలలో కొందరు హిందువులు,మహమ్మదీయులు కలిసి బ్రిటిషువారికి తోడ్పడడం జరిగిందికదా! వీటినిబట్టి ఏమి తేల్తుందంటే మతాన్నిబట్టి ఒక్కరే అయినా రాజకీయవిషయాలలో వారు భిన్నులుగా ఉండవచ్చుననేది. ఇట్టిసందర్భంలో హిందువు లంతా కలిసి, ఒకేరాజకీయపక్షంగా ఏర్పడి అల్పసంఖ్యాకులను హింసిస్తారనడం వట్టిభ్రమ. ప్రస్తుతకాలంలో ప్రతిదేశమందు కూడా ఆర్థికపరిస్థితులనుబట్టి రాజకీయపక్షాలు ఏర్పడుతున్నవే కాని మతపరిస్థితులను బట్టి అది జరగడంలేదు.

ఈవిషయంలో మహమ్మదీయనాయకులు, వారిపద్ధతి నామోదించు తక్కిన అల్పసంఖ్యాకులనాయకులు మరియొక గొప్ప పొరబాటును చేస్తున్నారు. మతమునుబట్టి మహమ్మదీయులంతా ఒకరే కాబట్టి, రాజకీయవిషయాలలో కూడా వారందరూ ఒకరుగానే ఉండి ఒకేపక్షంగా ఏర్పడి, మహమ్మదీయులు కానివారికి భిన్నంగా ప్రవర్తించవలసిందని చాటుతున్నారు. ఇదే న్యాయమార్గం అని సామాన్యులనేకులు నాయకులమాటలను అనుసరిస్తున్నారు. కాని ఈలాగు చేయడం నిర్బంధంగానూ, మనుష్యస్వభావానికి విరుద్ధంగాను ఉంది. మహమ్మదీయులలో మాత్రం కొందరు పెట్టుబడిదార్లుగానూ, కొందరు కూలివాండ్రుగానూ, కొందరు జమీందార్లుగాను, కొందరు వారిక్రింద రైతులుగాను లేరా? వారిలో మాత్రం ఆర్థికంగా అధోగతిపాలైన నిమ్నజాతులవారు లేరా? జమీందారులమూలాన కలుగు బాధలనుండి విముక్తిని కోరు మహమ్మదీయరైతులు హిందూరైతులతో కలిసి ఒకపక్షంగా ఏర్పడి తమస్థితిగతులను బాగుచేసుకొనుటకు ప్రయత్నించడంలో తప్పేమైనా ఉందా? అది తప్పని చెప్పడం మతధర్మాలకు అపార్థం కల్పించడం కాదా? మహమ్మదీయ జమీందార్లు పెట్టేబాధ ఓర్వతగిందనిన్నీ, వారిని విరోధించకూడదనిన్నీ, జమీందారు హిందువైనప్పుడు అట్టి విరోధం తప్పకుండా సాధించవలసిందనిన్నీ ప్రబోధం చేయడంలో సబబేమైనా ఉన్నదా? ఇది అనవసరంగా వైమనస్యాన్ని వృద్ధిచేయడంకాదా? ఐకమత్యం అవసరమే. కాని ఎప్పుడు, ఎందుకు ఐకమత్యం అవసరమో, ఏయేసందర్భాలలో మనం ఎవరెవరితో ఐకమత్యం పొందిఉండవలెనో వివక్షచేయకపోవడంవల్లనే మైనారటీలసమస్య రోజురోజుకూ క్లిష్టతర మవుతున్నది.

ఒకేభాషనుమాట్లాడేవారు భిన్నమతాలను అవలంబించడంలో తప్పేమైనా ఉన్నదా? ఆంధ్రభాషను మాట్లాడేవారిలో కొందరు హిందువులుగను, కొందరు మహమ్మదీయులుగను, కొందరు క్రైస్తవులుగను ఉంటున్నారుగదా! ఇది అనుచితమా? దీనిమూలంగా ఆంధ్రభాషకు నష్టమా? మతాలకేమైనా నష్టమా? "క్రైస్తవమతంలో నమ్మకం కుదిరి, ఆమతంలో చేరవలెనని అనుకొన్నవా డెవ్వడూ ఆంధ్రభాష మాట్లాడకూడదు, ఇంగ్లీషుభాషనే మాట్లాడవలెను" అని అంటే, క్రైస్తవమతంలో నిజమైన అభిమానం కలవారనేకులు ఆమతంలో చేరడానికి వీలులేకపోవును కదా! క్రైస్తవులు ఆంధ్రభాషను మాట్లాడటంచేత ఆభాష కేమైనా న్యూనత కలుగుతుందా? భాషకూ మతానికీ ముడిపెట్టడం ఎంత అనుచితమో మతానికీ రాజకీయాభిప్రాయాలకూ ముడిపెట్టడంకూడా అంతఅనుచితమే. ఈముడిపెట్టడానికి అల్పసంఖ్యాకనాయకులలో కొందరు ప్రయత్నిస్తుండడంచేత స్వరాజ్యసంపాదన కష్టతరం అవుతున్నది. "స్వేచ్ఛ", "నిర్బంధం" అనే మాటలను సాధారణంగా మనం వాడుతుంటాం. ఈలాగు ముడిపెట్టడమే నిర్బంధం; ఈలాటిముడులను త్రెంచివేయడమే స్వేచ్ఛ.

### అల్పసంఖ్యాకనాయకుల ఈ ప్రవర్తనకు గల కారణం

నాయకు లీ విధంగా ప్రవర్తించడానికి ప్రధానకారణం వారి స్వాధికారాభిలాష. "మతంలో మహమ్మదీయులు వేరే, హిందువులు వేరే; గనుక రాజకీయవిషయాలలో కూడా వారు వేరుగాను, వీరు వేరుగాను ఉండవలెను" అనే సిద్ధాంతం బయలుదేరడంవల్ల లాభం నాయకత్వం కోరేవాడికి గాని జనసామాన్యానికి కలుగదు. రాజకీయాలలోకూడా వారు వేరు, వీరు వేరు అనే నిర్ణ



VAUHINI
presents
KUMARI
MALATHI
GIRI . . .
IN
SUMANGALI
a B.N. REDDI - RAMNOTH - SEKAR produc
with
NAGIAH . . .
DORASWAMI
GOURIPATHI .
LINGAMOORTHI · SUBBA RAO · SESHAMAMBA · PARVATHI BAI · RAJARATNA
& OTHER VAUHINI ARTISTES
SEKAR


ప్రతిమానవుడు విశ్వజగత్తులో పౌరుడు. విశ్వశ్రేయస్సుకోసం ప్రతివ్యక్తి
స్వచ్ఛంద భావనతో, నిర్నిరోధ కార్యాచరణంతో జీవించి స్వతంత్రమానవ
జీవన వికాసానికి తోడుపడాలి. ఇది ధర్మవేత్తల నిర్వచనం.
కాని - ప్రతిప్రభుత్వం, ప్రతి సంఘం, ప్రతి వ్యక్తీ ఆ స్వచ్ఛందజీవనాన్ని
అరికట్టుతున్నయి. ఇది వ్యక్తిగతంగానూ, సమూహిగానూ సాగుతున్న
స్వాధికారప్రతిష్ఠ; దోపిడి.
ఈ దోపిడికి తరతరాలుగా తిరుగుబాటు జరుగుతోంది.
ఆ ధార్మిక విప్లవస్వరూపమే వాహినీవారి
సుమంగళి
ఆమె నిత్యయౌవనవైన కళామూర్తి. రక్తపాతంకోరని విప్లవకాంక్షి
ఆనందమయి. ఆనందదాయిని. ఆనందచాపల్యంతో అలరిస్తుంది. వలపు తలపు
లతో మనసు చూరలాడుతుంది. వేడికన్నీటి మడుగులలో ముంచుతుంది. రక్త
పిపాసతో వణికిస్తుంది. పరమశాంతంతో వుస్తరిస్తుంది. త్యాగకంఠంతో
ముక్తిగీతం పాడుతుంది. ఆమె నిర్బద్ధ. ముక్తజీవి. విశ్వశ్రేయస్సు
వినిపించే మూర్తీభవించిన దివ్యవాణి.
వాహినీ వారి



**సుమంగళి**—మానవ జీవనానికి ప్రతిచ్ఛాయమాత్రమేకాదు
ఫిలింపరిశ్రమ కన్న సుందర సుఖస్వప్నం! వచ్చినచిత్రాలకు
శిరోమణి. వచ్చేచిత్రాలకు మార్గదర్శిని. ఆమె వలపుటూయె
లలో ఊగండి. కన్నీటివెల్లువలో కరిగిపోండి. కడుపు చెక్క
లయ్యేలాగు నవ్వండి. అభినవ ఆత్మబోధంతో ఆనందించండి.

**సుమంగళిలో**—చిత్రకారుడు తెలుగుతనాన్ని ముక్కారుగా పండించి
దిద్దితీర్చినాడు.
కెమేరామెన్ వెలుగునీడలతో నవజీవాలుపోసి అందం
చందాలు గుప్పినాడు.
దర్శకుడు హావభావాలలో - ఆటపాటలలో
పొంకమూ, బింకమూ కూర్చినాడు.
తెలుగుపాటలో తీపీ - ఊపూ చూపినాడు
సంగీతాచార్యుడు.
కవికలం తెలుగుతనంతో గంతులువేసింది.



**వందేమాతరం**—1939 లోని చిత్రాలలో అగ్రతాంబూలం
అందుకుంది. ఆకళాకుశలుర మరోకళాసృష్టి సుమంగళి
దానికి ఒజ్జబంతి సుమంగళీదర్శనం శుభదాయకం.
ఆమెకోసం నిరీక్షించి తీరాలి. ఆమెను
దర్శించితీరాలి.

★



ఆశా

నిరాశా

ఆనందం

విచారం

అధికారుల విజృంభణ.

అస్వతంత్రుల తిరుగుబాటు

మొదలైన జీవిత సన్నివేశాలు సంపుటీకరించి తయారుచేసిన మానవజీవన నాటకం

# సుమంగళి

మొహమాటాలులేని ఘాటైన కథ. రసగుంఫితమైన రచన. అసమాన అభినయం. అతిసహజ పాత్రచిత్రణం.

నటీనటు లందరు పాత్రలకుతగినట్టు తూచితెచ్చిన ఆణిముత్యాలు. తెలుగు చిత్రాల వెలుగులు తెలుసుకునేగీటురాయి

వాహినీ వారి

# సుమంగళి





యం జరిగినవెంటనే ఇద్దరికీ కలిసి ఒకేనాయకుడు ఉండడంగాని, హిందూనాయకునిక్రింద మహమ్మదీయులు రాజకీయవ్యవహారాలను పరిష్కరించుకోవడం గాని సంభవించదు. మహమ్మదీయులకు ఒక నాయకుడున్నూ, హిందువులకు మరియొక నాయకుడున్నూ అవసర మవుతుంది. నాయకుడు కాగోరు మేధావి యగు హిందువు యొక్క పోటీ లేకుండా మహమ్మదీయుడును, మేధావి యగు మహమ్మదీయుని పోటీ లేకుండా హిందువుడును నాయకత్వానికి రావడం వీలగుతున్నది. అతిసమర్థు డగువాడు ఇద్దరికీ నాయకు డగుటకు బదులు అల్పసమర్థులు, అధికారకాంక్షయే ప్రధాన లక్షణముగా గలవారు ఇద్దరు నాయకు లగుతున్నారు. మతానికీ రాజకీయానికీ ముడిపెట్టడంలో ఇదే ప్రధానోద్దేశం.

## కుల, రాజకీయాలకు కృత్రిమ సంబంధం కల్పించేవారి ఉద్దేశ్యం

హిందువులలో కులానికీ రాజకీయవిషయాలకూ కృత్రిమసంబంధం కల్పించి ముడిపెడ్తుండేవారి ఉద్దేశంకూడా ఇంతే. "కులాన్ని బట్టి బ్రాహ్మణులు వేరే, బ్రాహ్మణేతరులు వేరే. అందుచేత రాజకీయాలలోకూడా వారు వేరువేరుగా ఉండవలసిందే కాని కలియకూడదు" అని వాదిస్తూ, బ్రాహ్మణులను తమపక్షంలో చేర్చుకొనని జస్టిసునాయకు లిట్టివారే. ఈలాగు వాదిస్తేనేకాని బ్రాహ్మణుల మూలమున పోటీలేకుండా వారు నాయకు లగుట సంభవించదు. ఇదే విధంగా హరిజనులు కులమునుబట్టేకాక, రాజకీయ విషయాలలో ప్రత్యేకవర్గమునకు చెందినవా రనియు, తక్కిన హిందువులతో వారు చేరకూడ దనియు కొందరు హరిజననాయకులు వాదిస్తుంటారు. వారు నాయకు లగుట కట్టివాదముతప్ప మరియొక ఆధారము లేదు. నాయకత్వంసంపాదించుటలో అపరిమితమైన పట్టుదలకలవారికి ఈలాటి కృత్రిమసంబంధాలను కల్పించుట స్వభావము. కాని వారు ఒక గొప్పవిషయమును గమనించుటలేదు. ఇట్టి ప్రవర్తనచేత వివిధ కులములలోనివారు, మతములలోనివారు, జాతులలోనివారు కలిసిన గొప్ప రాజకీయపక్షానికి నాయకులగు అవకాశాన్ని వారు కోల్పోతున్నారు. కోరతగినది ఇట్టి నాయకత్వమేకదా!

## ఆ ఉద్దేశ్యంలోని అసందర్భాలు

ఇట్టిపొరబాటు మన దేశంలోనేకాక ప్రపంచంలో మరికొన్ని దేశాలయందుకూడా స్వాధికారాభిలాషు లగువారు చేయుచున్నారు. దీని కంతకూ మానవజీవితముయొక్క నిజమైన లక్షణమున్నూ, సోదరభావముయొక్క నిజస్వరూపమున్నూ అనేకులు తెలుసుకొనకుండుటే కారణము. మానవజీవితం బహుముఖమైనది. మానవుడు సాధించవలసిన ప్రయోజనాలూ, నెరవేర్చవలసిన ధర్మాలూ అనేకములు కాని ఒక్కటిమాత్రమే కాదు. ఒక్కొక్క ప్రయోజనం సాధించడంలో ఒక్కొకరితో అతనికి అనుబంధం కలుగుతుంది. ఎవరితో సంబంధం కల్పించుకుంటే ఆ ప్రయోజనం సాధించడానికి వీలగుతుందో ఆలాటివారితో సంబంధం కల్పించుకోవడమే ఉత్తమమార్గం కాని, ఆవిషయంలో సహాయం చేయలేనివారితో సంబంధం పెట్టుకోవడం ఉచితం కాదు. దుకాణాన్ని పెట్టుకొని వ్యాపారం చేసి లాభం సంపాదించకోరిన మహమ్మదీయుడు "నేను మహమ్మదీయులకు తప్ప మరెవ్వరికీ నా దుకాణంలోని వస్తువులను విక్రయించను" అని పీఠంవేసుకొని కూర్చుంటే అత డేమి వ్యాపారం చేయగలడు? ఎంతలాభం సంపాదించగలడు? ఆలాగు కూర్చోవడం వ్యాపారధర్మమా? ఆకలిగొన్న హిందువు వచ్చి నిర్ణయించిన ఖరీదు ఇవ్వడానికి అంగీకరించి బియ్యంకావలెనని కోరితే అతడు హిందువుడనే కారణంచేత బియ్యం అమ్మకపోవడం ధర్మవిరుద్ధం; సోదరభావానికి విరోధం. వ్యాపారంలో మతాన్ని తీసుకోవచ్చి ముడిపెట్టడం అసంబద్ధం; మతాని కచ్చట తావు లేదు. క్రయవిక్రయాలు చేయడంలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు—అందరూ సంబంధీకులే. విద్యను నేర్చుకొనకోరువాడు విద్యను నేర్పగల గురువులలో ఉత్తము డెవడో అతనివద్దకు వెళ్లినయెడల చక్కనివిద్య లభించునుగాని "నేను హిందువును. గురువుకాతగ్గవాడు మహమ్మదీయ పండితుడు. ఆలాటివానివద్ద విద్య నేర్చుకోవడమా? అంతకంటే విద్యావిహీనుడుగా ఉండడమే మేలు" అని ఎవరైనా అంటే ఆలాటివాడు బుద్ధిహీనుడని చెప్పవలసి యుంటుందిగదా? తక్కిన విషయాలలోకూడా ఇంతే. ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క విషయం ప్రధానం వహిస్తుంది. విశాలహృదయం కలవాడు ఈ సత్యాన్ని గ్రహించి సందర్భానుసారంగా మతవిషయాలలో ఒకరితోను, వృత్తివిషయాలలో మరియొకరితోను, విద్యావిషయాలలో ఇంకొకరితోను, రాజకీయవిషయాలలో మరియొకరితోను కలిసి పనిచేయడానికి సిద్ధపడతాడు. అతనికి ఒక్కొక్కవిషయంలో ఒక్కొక్కరు సోదరు లవుతారు. వృత్తినిబట్టి కొందరు, మతమునుబట్టి మరికొందరు, రాజకీయాలనుబట్టి తదితరులు అతని భ్రాతృవర్గంలో చేర్తారు. అన్ని భ్రాతృవర్గాలవిషయంలో కూడా అతడు సోదరభావాన్ని చూపవలసి ఉంటుంది. అప్పుడే అతడు నిర్బంధం అన్నది లేకుండా, స్వేచ్ఛగా విహరించకలిగిఉంటాడు. పదిమందితో కలిసి ఏదైనా పని చేస్తున్నప్పుడు—వీ రందరూ ఆంధ్రులా, బంగాళీలా, హిందువులా, మహమ్మదీయులా అనే ప్రశ్న వేసుకోవడం ఆపనికి భంగం కలిగించడమే. ఈలాటిప్రశ్నలు వేసుకొనవలసిన సందర్భాలు ఉన్నవి. కాని విచక్షణలేకుండా ప్రస్తుతం అప్రస్తుతం ఆలోచించకుండా మనంచేసే ప్రతికార్యమందుకూడా ఈలాటి ప్రశ్నలు వేసుకొని పనిలోకి దిగడం గర్హింపదగిఉన్నది. ఈవిచక్షణ లోపించుటచేతనే మైనారటీసమస్య రోజురోజుకూ క్లిష్టతరం కావడం సంభవిస్తున్నది. ప్రతిమనుష్యుని యొక్క జీవితమూ ఒక మహావృక్షం, అందు ఎన్నో శాఖోపశాఖ లున్నవి; వాటినుండి పూచే పుష్పాలు, పండే పండ్లు వివిధాలు. అన్నిశాఖలు, అన్నిఉపశాఖలు, అన్నిపండ్లు,

అన్ని పువ్వులు ఉన్నప్పుడే ఆవృక్షానికి శోభ. వీటిలో ఏది లోపించినా ఆశోభ తగ్గుతుంది. ఈ సత్యాన్ని గ్రహించకుండా కొందరు కులం అనే శాఖమాత్రం ఉంటే చాలు- తక్కినవి అప్రధానాలు- వాటిని కొట్టివేయవచ్చును అనిన్నీ, మరికొందరు మతమే ప్రధానమైనశాఖ- తక్కినవి అట్టివి కావు- అవి ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే అనిన్నీ, మరొకరు రాజకీయ జీవితమే ప్రధానశాఖ- తక్కినవన్నీ అందులో ఇమిడిఉన్నవి అనిన్నీ రకరకములైన తత్వాలను ఉపదేశిస్తున్నారు. "నిజమైన హిందువుగా ఉంటే చాలు" నని కొందరు, "నిజమైన మహమ్మదీయుడుగా ఉంటే మరి కావలసింది ఏమీలేదు, సర్వం అందులోనే ఉంది" అని మరి కొందరూ ఉపదేశిస్తుంటారు. కాని నిజమైన హిందువు, నిజమైన మహమ్మదీయుడు అన్నమాటలకు అర్థం ఏమో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. ఈలాగు కాకుండా "ప్రతిమనుష్యుడూకూడా అనేకవర్గాలతో అనుబంధం కలవాడు. ప్రతివర్గంకూడా అతని జన్మసాఫల్యానికి అవసరం. ఒక వర్గం చేసే పని మరియొకటి చేయజాలదు. ఏయే వర్గంలో ఉన్నప్పుడు దానికి సంబంధించిన ఉద్దేశాన్ని తదేకదీక్షతో నేరవేర్చడం అతనిధర్మం. ఒకదానికీ మరొకదానికీ ముడిపెట్టడం తప్పు; అనవసరంకూడాను. ఇదే నిజమైన వర్ణసంకరం. ప్రళయానికి ఈ సంకరమే కారణము. సంకరము పోవడమే పునస్సృష్టి." అనేవిషయాన్ని అందరూ అవగాహనచేసుకోవలసిఉన్నది.

## సారాంశం

పైవిషయాలనుబట్టి తేలింది యేమిటంటే —(౧) స్వరాజ్యం సాధించతగ్గది. రాజకీయస్వాతంత్ర్యం లేని దేశంలోని ప్రజల జీవితాలు అసంపూర్ణములు. వారికి జన్మసాఫల్యం లేదు. (౨) స్వరాజ్యంవస్తే అధికసంఖ్యాకులగు హిందువులు అల్పసంఖ్యాకులగు మహమ్మదీయులను, హరిజనులను, క్రైస్తవులను, శిక్కులను, పార్శీలను బాధిస్తారనే వాదం నిరాధారం. (౩) స్వరాజ్యం వచ్చినతర్వాత హిందూదేశాన్ని రెండుభాగాలుగా పంచి, ఒకభాగం మహమ్మదీయులూ, ఇంకొకభాగం హిందువులూ ఉంచుకోవడం అనే విధానం ఆత్మహత్యవంటిది. ఇది ఎన్నటికీ జరగతగినదికాదు. (౪) మతానికీ రాజకీయవిషయాలకూ ముడిపెట్టడం అనుచితము. సంబంధంలేని వాటికి కృత్రిమసంబంధం కల్పించ పూనుకోవడంవల్లనే ఈమైనారటీలసమస్య బయలుదేరినది.

## ఈ సమస్యా పరిష్కారానికి సాధనమేమిటి ?

మైనారటీలసమస్య పరిష్కారం కావడానికి ఏదైనా సాధనం ఉన్నదా ? దీనికంతా హృదయపరివర్తనమే ప్రధానసాధనం. అధికసంఖ్యాకులు నమ్మతగినవారు కారనిన్నీ, క్రూరులనిన్నీ, మతాంతరులను బాధపెట్టెదరనిన్నీ తలచడంచేత అల్పసంఖ్యాకుల హృదయాలలో వేదన కలుగుతున్నది. మనోవేదనకు మామూలు మందులు పనికిరావు. "వేదనపడడానికి కారణాలు లేవు; అధికసంఖ్యాకులుకూడా మనసోదరులే; మనమంతా ఒకదేశంలో పుట్టి పెరుగుతున్నాము; మనమంతా భారతీయులము. మాతృభూమిని రక్షించి సర్వసంపదలతో తులతూగునట్లు చేయడం మన అందరి ధర్మం. దానిమూలంగా మన అందరికీ సుఖం కలుగుతుంది. దేశాభిమానం లేకపోవడంచేతనే ఇదివరలోను ఇప్పుడును మనకు లెక్కలేని కష్టాలు కలిగినవి. మనం పరాధీనులమై పరాయివారి సౌఖ్యానికి చాకిరీ చేయవలసినస్థితిలోనికి వచ్చాము. మనది అని చెప్పుకొని గర్వించతగినట్టి ప్రభుత్వం ఒకదానిని స్థాపించి, దానిమూలంగా మన సౌఖ్యాన్ని వృద్ధిచేసుకోవడానికి మంచితరుణం సమీపించింది. ఇట్టి తరుణంలో మనం అనవసరమైన హృదయవేదనను పొంది, మనదేశంలో పుట్టి పెరిగిన వారే మనకు ద్రోహం చేస్తున్నారని అనుకొని, వారితో కలియకుండా స్వరాజ్యానికై వారు చేస్తుండే ప్రయత్నాలను భంగపరచడం కేవలం దేశద్రోహం. దేశానికి విముక్తి వచ్చిందంటే దేశంలో ఉన్నవారందరికీ విముక్తి వచ్చినట్లే. కాబట్టి కులభేదాలు, వర్ణభేదాలు, మతభేదాలు లోనగువాటిని పాటింపకుండా అందరూ కలిసి దేశస్వాతంత్ర్యానికిగాను పాటుపడవలెను. "మనమంతా భారతీయులము" అనేభావం అల్పసంఖ్యాకుల హృదయంలో నాటుకొని, వారి మనస్సు మారినయెడల ఈ మైనారటీల సమస్య పరిష్కారమైనట్లు మనం అనుకోనవచ్చును. అందుకుగాను సర్వప్రయత్నములూ ఇప్పుడు జరగవలసిఉన్నది. అధికారకాంక్షగల అల్పసంఖ్యాకుల నాయకుల మనసులను మార్చడం చాలా కష్టం. సామాన్యప్రజలతో పరిచయంకల్పించుకొని, వారిమనస్సులను మార్చడానికి ప్రయత్నాలు జరగవలెను. ఎప్పుడైతే ఈమార్పు కలుగుతుందో అప్పుడు తక్కిన చిల్లరసమస్యలను పరిష్కరించడం సులభం. మన దేశానికి ఏలాటి ప్రజాప్రభుత్వం ఉండవలెను? మంత్రివర్గాలు ఏకపక్షములుగా ఉండవలెనా, అనేకపక్షములుగా ఉండవలెనా? ఫెడరల్ విధానంలో కేంద్రప్రభుత్వానికి ఎట్టి అధికారం ఉండవలెను, రాష్ట్రాలకు ఎట్టిఅధికారం చెందవలెను? మతం, భాష, విజ్ఞానం మొదలైన విషయాలలో అధికసంఖ్యాకులవలన అల్పసంఖ్యాకులకు ప్రమాదంరాకుండా ఉండడానికి ఏలాటిచట్టాలు అవసరం? ఈచట్టాలను అమలులోపెట్టే అధికారం ఎవరి కుండవలెను?—అనేవిషయాలను పరిష్కరించటం అంత కష్టమైనపని కాదు.

# తెలుగు ఫిలిం పరిశ్రమ

## లాభదాయకంగా ఉండాలంటే......!

ప్రజాభిప్రాయాన్ని, ప్రజాభిరుచులను గమనించి చిత్రాలు తీయాలి

కొత్తనటీనటులతో బేరంసాగించటంకంటె పేరుప్రతిష్ఠలుగల నటీనటులనే ఎన్నుకోవాలి

ఆ నటీనటులతో దీర్ఘకాలం పద్ధతిమీద అగ్రిమెంట్లు ఏర్పాటు చేసుకోవాలి

నిర్మాణవ్యయంలో యథోచితమైన పొదుపు చూపాలి

అట్లని పబ్లిసిటీకోసం విరివిగా ఖర్చుపెట్టడానికి వెనుదీయరాదు

అద్దెస్టూడియోలలో ఫిలిముతీయటం మానాలి

తెనుగునాట స్వంతస్టూడియో ఒకటి నిర్మించాలి

● శ్రీ గూడవల్లి రామబ్రహ్మం ●

ఫిలిమ పరిశ్రమాభివృద్ధికి అనుకూల వాతావరణం ఆంధ్రదేశంలో విరివిగా కనబడుతూ ఉన్నది. పట్టణాల్లోనే కాక పల్లెలలోకూడా ఫిలింకంపెనీల ప్రారంభోత్సవాలు జరుగుతూవున్నట్టు రోజూ వార్తలు వస్తున్నాయి. అందుకు సంతసింపవలసిందే.

కాని,—వ్యాపారపద్ధతులు తెలియక, కావలసిన పెట్టుబడి సేకరించుకోకుండా కేవలం ఉత్సాహమే ప్రధానంగా పెట్టుకుని ఈ కంపెనీలు స్థాపించటంవల్ల నూతనోత్సాహం తగ్గిపోతున్నది; కంపెనీలకు ఎక్కువ నష్టం వస్తున్నది. చివరకు పరిశ్రమకే దెబ్బ తగుల్తూవున్నది.

ఆంధ్రదేశంలో ఉరుకులెత్తుతూ ఉన్న ఈ ఉత్సాహం శిథిలం కాకుండా చిరస్థాయిగా నిలవటానికీ, కంపెనీలకు నష్టం రాకుండా లాభాలు ఎక్కువగా రావటానికీ, పరిశ్రమ కళాకాంతులతో వికసించటానికీ - నా యీ క్రింది సలహాను తోటి పరిశ్రమదారులు శ్రద్ధగా గమనించాలని ప్రార్థన.

గత సంవత్సరంలో సినిమా పరిశ్రమాభివృద్ధికి దోహదం కల్గించే పరిస్థితు లేమీ కనబడలేదు. అంతా 'చుక్క ఎదురు'గానే ఉన్నది. విడుదలయిన పదిహేను ఫిలిములలో ఏ ఒకటి రెంటికోమాత్రం లాభం వచ్చిందన్న మాట వినగలిగాం. తక్కినవాటికి అంతగా నష్టం రాకపోయినా, లాభంమాత్రం రాలేదని ఖండితంగా చెప్పవచ్చు.

దీనికి కారణాలు అనేకము లున్నా, ఈ పరిస్థితుల్లో ... వ్యాపారానుభవం లేనివారు - చివరకు కంపెనీల యాక్టు ఐనా చూడనివారు, రోజుకొక ఫిలిం కంపెనీ 'లిమిటెడ్' చేస్తున్నారంటే ఆంధ్రుల సాహసాన్నే తెలుపుతున్నది. కాని, వ్యాపార వ్యవహార నిర్వహణ శక్తినిమాత్రం చాటటంలేదు; అనుభవం ఉండీ, పెట్టుబడికి కావలసిన డబ్బుండీ, పలుకుబడి ఉండీ- తీసినఫిల్ములే జనరంజకంగా ఉండక నష్టంపాలవుతూవుంటే... ఇంతమంది ఇన్నికంపెనీలు ఈ సమయంలో స్థాపించటం వ్యాపారంకోసం కాకుండా విలాసార్థమే అవటంవల్ల నా ఈవ్యాసం వారికి ఉద్దేశింపబడలేదు.

తెలిసి, కళ్లు మూసుకుని, భోగలాలసత్వానికి ఈ పరిశ్రమలోకి దూకేవారిని ఎవరు అడ్డగలరు ?— కాక ఇతరులుచెప్పిన మాయమాటలకు లోబడి, అపరిమితమైన లాభాలు గడింపవచ్చుననే అభిలాషతో ఈ



కుంకుమ తిలకరచన

[ వాహినీపిక్చర్సువారి ‘ సుమంగలి ’లో కుమారి ]



దీనదృష్టులు

[ ఇందిరాదేవి ఫిలిమ్సువారి ' ఇల్లాలు 'లో కాంచనమాల ]



భర్త తన ప్రియురాలెలా వుండాలని

కోరుకుంటాడు ?

ప్రధానాచార్య ఆత్రే, బి.ఏ., బి. టి. టి. డి. (లండన్),

వినాయక్ లు తెరమీద

హాన్సువారి చిత్రం

# అర్ధాంగి

## BETTER HALF

లో నిరూపిస్తారు

ఈచిత్రం కేవల వినోదమేకాకుండా విజ్ఞానంకూడా ప్రసాదిస్తుంది

పాత్రధారణ: వినాయక్, బాబురావు పెంధార్కర్, మాల్వాంకర్,
లీలా ఛిట్నీస్, బి. ఏ., మీనాక్షి మున్నగువారు

ఇదివరలో మీరు చూడకుంటే అనేకస్థలాల్లో ఒకేసారి కనకోత్సవం అనుభవించనున్న

'బ్రహ్మాచారి' చూడండి.

'మదర్ ఇండియా' సహజవర్ణచిత్రము

సహజవర్ణచిత్రము

రాజప్రతినిధి, ఆగాఖాన్, సరోజినినాయుడు, భూల్లాభాయిదేశాయి మున్నగువారి మన్ననల నందినది.

దక్షిణ సర్క్యూటుకు హక్కుదార్లు :

దేవీ ఫిలింసు, లిమిటెడ్, పి. టి. మద్రాసు.

ఇది సామాన్యంగా ఒక ఫిలిమ్‌కు అయ్యేఖర్చు మదింపు. అన్నీ అనుకున్నట్టుగా సానుకూలంగా జరిగి పోతేమాట!

మాటవరసకి—ఒకఫిలిం నిర్మించడానికి కనీసం ఒక లక్షరూపాయలు కావాలని నిర్ణయిద్దాం. అందులో ముఖ్యమయిన పద్దులు నాలుగు:

| | | |
|---|---|---|
| i. | రా ఫిలిం | [మొత్తం ఖర్చులో నాల్గవ వంతు.] |
| ii. | నటీనటులు | [ " " ఆరవ " ] |
| iii. | పబ్లిసిటీ | [ " " " " ] |
| iv. | స్టూడియో అద్దెలు | [ " " " " ] |

తదితరఖర్చులు అట్టే గమనింపతగ్గవి కావు. ఈ నాలుగు పద్దుల్లోనూ ఏమయినా పొదుపు చేయటానికి వీలుందేమో చూతాం:

(i) 'రా' ఫిలిం:—ఇది మనదేశంలో తయారయ్యేది కాదు. అంచేత ధరనిర్ణయంమీద మనప్రభుత్వానికిగాని, మనకికాని ఏవిధమైన పెత్తనంలేదు. పైగా-యుద్ధం రావటంవల్ల నూటికి 25 వంతున ధరలు హెచ్చాయి. కనుక, ఈ ఐటమ్‌లో ఖర్చు తగ్గకపోగా, హెచ్చటానికే అవకాశం కనపడుతూంది.

(ii) నటీనటులు:—ఒక లక్ష రూపాయిలతో తయారయ్యే పిక్చరులో ఈ శీర్షికకు రూ. 15,000 లు మాత్రమే ఖర్చు వేశాం. కాని, ఇదంత నికరం కాదు. పేరుప్రఖ్యాతులుగల నటీనటవర్గం కావాలంటే ఫిలిమ్‌కి నలభైవేలకుపైగా ఖర్చుపెట్టిన తెలుగు ప్రొడ్యూసర్లున్నారు. అక్కర్లేదనుకొని పదివేలల్లో పూర్తిచేసుకొన్నవారూ ఉన్నారు.

'ద్రౌపది' నటీనటవర్గానికి రూ. 35,000 లు అయింది. 'రైతుబిడ్డ' నటీనట వర్గానికి రూ. 25,000 లు అయింది. 'చండిక'కు రూ.40,000 లు దాటుతూఉన్నది. ఒక్క 'కాళిదాసు'లోని నటీనటవర్గానికి ఇచ్చిన వేతనాలు రూ. 90,000 లకి మించాయంటే మీరు నమ్మితీరాలి. ఎక్కడిమాటో యెందుకు?—నేను ఇప్పుడు డైరెక్టుచేస్తున్న "ఇల్లాలు"లో ఒక్క కాంచనమాలవేతనమే నాల్గునెలలకూ రూ. 12,000 లు!

దీనికి తలా తోకా లేదు; నియమమూ నిర్ణయమూ లేదు. ప్రొడ్యూసర్ రుచుల్నిబట్టి తారాబలం చంద్రబలం గుణించాలి. పేరుప్రతిష్ఠలు గల తారల్ని లంకించుకొంటే "పేడడబ్బుల వర్షం" కురుస్తుందంటారు కొందరు! క్రొత్త నటీనటులను సృష్టించి పొదుపుగా బేరం సాగించాలంటారు కొందరు!

ఎటు చెప్పటానికీ వీల్లేని సమస్య ఇది. కాని, డబ్బు పోయినా, పేరుప్రతిష్ఠలు గల నటీనటులతోనే ఫిలింతీస్తే అట్టే 'లుక్సాన' లేని వ్యాపార మంటాను నేను. క్రొత్తవారితో బేరం సాగించటం ఒకప్పుడు లాభించినా, చాలదొట్ల నష్టదాయకంగానే మారుతుంది. అందుచేత పేరుప్రతిష్ఠలు గల నటీనటవర్గాన్నే — కాస్తో కూస్తో అనుభవం ఉన్నవారినే — ఏరుకోవటం మంచిది.

అయితే, రోజు కో కంపెనీ బయల్దేరే యీ రోజుల్లో - ఫిలిం తీసినా తీయకపోయినా, పోటీలు సంతబేరాలు హెచ్చిపోవటంవల్ల, ప్రతితారా చుక్కల్లో కూర్చోవటం వల్ల ఈ కష్టాన్ని ఎట్లా ఎదుర్కోవటమో మన మిప్పుడు తర్కించుకోవాలి.

దానికి ఒకటే మార్గ ముంది: అది యేమిటంటే — ఫిలిం పద్ధతిమీద కాకుండా దీర్ఘకాలం పద్ధతిమీద నటీనటులవల్ల అగ్రిమెంట్లు కట్టుకోవటం.

ఇందుతో — పోటీలవల్ల బేరాలు పెరగకుండా ... ఒక కంపెనీకి ఒక తార ఆకట్టుకొని ఉండి, ఆ కంపెనీకి పేరుప్రతిష్ఠలు కలిగించటం, ఆ తారకు ఫిలిం ఫిలింకూ సంతనబడి-ఎదురుచూడకుండా నాల్గు కాలాల పాటు కడుపులో నీళ్లు కదలకుండా ఉండటం కలుగుతవి. ఇది ఉభయతారకమైన పద్ధతి.

ఈ విధంగా సుస్థిరమైన నటీనటవర్గం కూర్చుకోవాలంటే కంపెనీలకు ఎక్కువ పెట్టుబడి వుండాలి. లాభ నష్టాలను లెక్కించకుండా సంవత్సరాని కో నాల్గు ఫిలింలు తీసేటట్టు ఉండాలి. ఈ విషయం తరవాత చర్చిద్దాం.

(iii)పబ్లిసిటీ:—దీనికింద మొత్తం రూ.15,000లు ఖర్చు అంచనా వేశాం. ఇది చూడగానే "అబ్బో! ఇది

రామబ్రహ్మం పద్ధతి" అని గుండెలు బాదుకొంటారు చాలమంది. ఈ ఖర్చు అనవసరమని నాతోటివారు తుడుపెట్టటానికి తయారవుతారు. అంచేత ఈ ఖర్చు లోని 'వ్యాపార మర్మం' తెలియపరిచి, ఈ ఖర్చు అత్యంతావసరమైనదని రుజువు చేయాల్సిన బాధ్యత నాపైని ఉన్నది. మనకు విస్తీర్ణం చాల తక్కువ. "Small profits and quick returns" అనేది వ్యాపారసూత్రం. మన పెట్టుబడి ఎంత తొందరలో మనం రాబట్టుకొంటామో అంత ప్రయోజకులమన్నమాట.

ఒక లక్షరూపాయలు ఖర్చుపెట్టి ఒక ఫిలిం తీశామంటే—ఆ మొత్తం కనీసం మూడు నెలల్లోనైనా రాబట్టుకోవాలంటే: ఎక్కువకాపీలు ఎక్కువ సెంటర్లలో విడుదల చేయాలి. కాపీలనుబట్టి "లోన్ పబ్లిసిటీ" సెట్లు తయారు కావాలి. ఒకేసారి ముఖ్యమైన పట్టణాల్లో విడుదల చేస్తున్నాము కాబట్టి ప్రత్యేకించి "రిలీజు పబ్లిసిటీ" చేస్తే ఎంతో లాభం.

ఎక్కడ చూచినా, ఏ పేపరు తిరగేసినా, ఏ రైలెక్కినా, ఏ మూల చూచినా ఆఫిలిం "పేరు" కనబడాలి. దానికితోడు పత్రికల బాకాలు పల్లెపల్లెలా మార్మోగాలి. అదంతా ఒకపద్ధతిమీద నడపాలి. ఆ నడపటానికి ప్రత్యేకశిక్షణ అవసరం. లేకుంటే దుబారా జాస్తిఅవుతుంది. అట్లా చేస్తే మంచిపిక్చరుకు భలేఊపు.

ఒకచోట రెండువారాలు "రన్" అయ్యేది 7, 8 వారాలు "రన్" కావచ్చు. పల్లెజనాలు చద్దిమూటలతో తయారవుతారు. మూలనుండే ముసిలమ్మలు మునిమనవళ్లతో వచ్చి మూగిపోతారు. అట్లా కాకపోతే ఆ వూరి జనంతోనే ఆఖరు. పల్లెలకు ఆ ఫిలింపేరు అట్టే పాకటానికి వీల్లేదు. 'కొత్త ఒక వింత; పాత ఒక రోత!'

మొదటి రోజుల్లోనే బండి కదలాలి. పల్లెటిజనం ప్రయాణం కట్టాలి. ఒకసారి ఆ దండు బయల్దేరిం దంటే, ఇక జగన్నాథరథం మరి ఆగదు. ఆ కదలికకోసమే బ్రహ్మాండమైన ఈ పబ్లిసిటీ. పబ్లిసిటీ లేకపోతే తొందరలో పెట్టుబడి తిరిగిరాదు. మరొకఫిలిమ్ తీయటానికి వీల్లేదు. పబ్లిసిటీకి తగినట్టుగా ఫిలిం ఉంటే...పెట్టుబడి మూడునెలల్లో గిర్రునతిరిగి ఒళ్లో పడుతుందని నమ్మండి. ఆ పబ్లిసిటీ ఆశాభంగం కలగజేస్తే, ఫిలిం జనరంజకంగా ఉండకపోతే పబ్లిసిటీ అంతా శుద్ధదండగ అనే భావించాలి.

అంచేత, లాభాలు రావాలనే ఆశతోనే మనం వ్యాపారం చేస్తాము కాబట్టి, ఈ ఖర్చుకి ఎంతమాత్రమూ వెనుదీయకూడ దని నా మతం. జంకినపక్షమందు మంచిఫిలిముకూడ దెబ్బతింటుం దని నావాదం.

రిలీజ్ పబ్లిసిటీ లేకుండా విడుదలయిన "వరవిక్రయం" ఫిలిమ్ ఎంత జనరంజకంగా ఉన్నా ఇంతవరకు అసలు వసూలు కాలేదంటే, దానికి లోపం ఇదే నని నమ్మాలి. అందుచేత యీ ఖర్చు అత్యావసరమనీ, తగ్గించటాని కెంతమాత్రమూ వీల్లేదనీ నా విశ్వాసం.

(iv.) స్టూడియో అద్దెలు:—సుమారు రూ. 15000 లు ఖర్చు అంచనా వేశాం ఈ శీర్షికకింద. కాని, శ్రద్ధగా చూస్తే, విపులంగా పరిశీలిస్తే ఇంకా యెంతో ఎక్కువే ఖర్చుపెట్టాల్సి వస్తుంది. ఒక్కొక్క స్టూడియోకు ఒక్కొకవిధమైన అగ్రిమెంటు. ఆ యగ్రిమెంటు సాగదీసి అమల్లో పెడితే అంతా ఘోరమే!— దినదినగండం. ఫిలిం పూర్తయ్యేవరకు స్టూడియో అధికారులతో దెబ్బలాట్టానికి వీల్లేదు ... 'నం బిచ్చింది ప్రసాదం!'

వాళ్లకు అందుబాటులో వున్న ఒక చిరిగి మాసిపోయిన సెట్టు ఇచ్చి, ఇది ఇంద్రభవనం అంటే — అందులో షూట్ చేయటానికి తయారు కావాల్సిందే.

లేకుంటే — మేకులు దగ్గిర్నుంచి రంగుల వరకు, పనిచేసే పనివాళ్ల భోజనాల దగ్గిర్నుంచి ముడుపులవరకు, స్టూడియో నిర్వాహకుల బహుమతుల దగ్గిర్నుంచి పెట్టుబడులవరకు నడీ చప్పుడూ కాకుండా - రట్టూ రవ్వా లేకుండా - డబ్బు అంటే లెక్కలేకుండా విరజిమ్మితే ... పదిరోజులు ఆలస్యమయినా మనం ఇచ్చిన డిజైన్‌కు ఒక బారెడు దూరంగా, ఏదో ఒక రకమయిన సెట్టు తయారవుతుంది. అందువల్ల ఖర్చు జాస్తీ అవుతుంది.

ఆ సెట్టులోకి కావలసిన పరికరాలు కూడ బోలెడు అద్దెలు పోసి మనమే సమకూర్చుకోవాలి. అప్పుడే కాస్త స్వాభావికత ఏర్పడుతుంది.

లేకపోతే, పీర్ల పండగలో హిందూ మహమ్మదీయ కలగలుపులాగు — స్టూడియోవా రిచ్చిన సెట్టులో పౌరాణికం, చారిత్రకం, సాంఘికం అన్నీ 'ఏక్ దమ్ము'గా షూట్ చేయాల్సిందే. చేయకపోతే కాలవిలంబనం !

కనక, నాల్గునెలల్లో ఫిలిం పూర్తికావా లన్నప్పుడు - అన్ని సెట్లూ మన యిష్టం వచ్చినట్టు తయారు కావాలంటే అటు నటీనటులకూ, ఇటు స్టూడియోకూ ప్రోరేటాలు కుమ్మరించవలసిందే.

... ... ...

కాలక్రమేణ ఫిల్ములవల్ల రాబడి తగ్గుతున్నదనీ, పెట్టుబడి పెరుగుతున్నదనీ పైని మనవిచేశాను. పెట్టుబడి తగ్గటానికి మనం ఆలోచిస్తున్నప్పుడు రాబడి తగ్గటానికి గల కారణాలుకూడా ఆలోచించాలి:

(1) ఊరూరా, ఒకటికి రెండు థియేటర్లు వెలసి; పోటీ మితిమీరటం

(2) ప్రజాభిరుచికి అనుగుణంగా ఫిల్ములు తయారు కాకపోవటం

(3) ప్రత్యేకత, విశిష్టత, జాతీయత—మన ఫిలిమ్ లలో లోపించటం

ఇవి—రాబడి తగ్గటానికి ముఖ్యమయిన మూడు కారణాలుగా ఎంచుకోవచ్చు.

మొదటికారణం మనచేతులు దాటిన విషయం. కట్టిన థియేటర్లు కూలదోయటానికి ఎవరూ ఉద్యమించరు. కాకపోతే, మరి కొత్తవి లేవకుండా ప్రయత్నించవచ్చు.

ఇక - రెండు, మూడు కారణాలు ముఖ్యమైనవి. మనకు ప్రత్యేకంగా స్టూడియోలు లేనప్పుడు, ఏ యితర స్టూడియోలలోనో మనం ఫిల్ములుతీస్తూ, జాతీయత ఉట్టిపడాలెనంటే మాటలా ?

'మద్రాసు మాది' అని రొమ్ము చరుస్తాం. కాకపోతే, అర్ధానికైనా హక్కుందంటూ వాదిస్తాం. మద్రాసులో ఉన్న స్టూడియోలలోనే - తెలుగువారు పెత్తనం చెలాయిస్తున్న స్టూడియోలలోనే _ ఇంతెందుకు, చివరి నా స్టూడియోలోనే - నేను డైరెక్టుచేసిన ' రైతుబిడ్డ ' కి లోనే—రామిరెడ్డి విజయోత్సవంలో రైతులుగా దాపరించిన ఎక్‌స్ట్రాలచేత తెలుగురైతుల కట్టుమోస్తరుగా గోచీలు పెట్టించడం నాతరం కాకపోయింది.

ఇక — ప్రత్యేకతనుగురించీ, విశిష్టతనుగూర్చీ ఆట్టే తర్కించటం అనవసరం. వాళ్లందరకూ గోచీలు సర్దుతూ కూచుంటే రోజు రోజంతా వృథా ఐపూరుకుంటుంది. రోజుకి రూ. 300లు స్టూడియోబాడుగ చెల్లించాలి. ఇంతమందికీ తలకొక అర్ధరూపాయి చొప్పున రూ. 200లు కుమ్మరించాలి. భోజన మజ్జనాదులకు మరి రెండువందలు తగులుబాటు. పెట్రోలు వగైరా చిల్లరకర్చులకి మరో వంద.

ఇంత డబ్బు విరజిమ్మి గోచీలు సర్దుతూ కూచోవటం మంచిదా వ్యాపారదృష్టిలో ?—లేక కళాలక్ష్మికి స్వస్తి చెప్పి, కళ్లు మూసుకొని షూటింగు సాగించుకుపోవటం మంచిదా ?

ఇట్లా తయారవుతున్నాయి మన ఫిల్ములు. ఈ చిక్కులు తొలగాలెనంటే అద్దెస్టూడియోలలో ఫిల్ములు తీయటం మానాలి; తెలుగునాట స్వంతస్టూడియో ఒకటి నిర్మించాలి. దీర్ఘకాలపు అగ్రిమెంట్లతో నటీనటులను సేకరించాలి. కళాదృష్టినీ, వ్యాపారదృష్టినీ మేళవించి, తెలుగుదనంతో పరిమళించే తెలుగుఫిల్ముల్ని తయారు చేయాలి.

బాగో ఓగో—ఫిలిం కాగానే ఫిలిం తీయకలిగి ఉండాలి. స్టూడియోకు, నటీనటులకు విరామంలేకుండా ఫిలింనిర్మాణం సాగిపోవాలి.

ఇందుకు కనీసం అయిదు లక్షలైనా కావాలి. ఇట్టి నిర్మాణానికి— పుట్టగొడుగుల్లాగు ప్రతిపల్లెలోనూ బయలుదేరే కంపెనీలు వారివారి వేరువేరు ప్రయత్నాలు మానుకొని, సంయుక్తంగా సాయపడాలి.

అంటే... తెలుగు ప్రొడ్యూసర్ల సమాఖ్య ఒకటి యేర్పడాలి. అప్పుడు మహారాష్ట్రులకు ప్రభాత్ కంపెనీ లాగున, వంగీయులకు న్యూథియేటర్సు లాగున తెలుగువారికి 'తెలుగుటాకీస్ లిమిటెడ్' విలసిల్లగలదు.

# దొంగలున్నారు, జాగ్రత్త!

[ కథా నిక ]

★

శ్రీ
ఇంద్రకంటి
హనుమచ్ఛాస్త్రి

"హృదయపూర్వకంగా ఒకరినొకరు ప్రేమించుకొని... గువ్వజంటవలె నీలాలనింగిపై తేలిపోవడంకన్న వేరేభాగ్యమేమిటి ?"




౧

అప్పుడే—ఇంటర్మీడియేట్ ఎగ్జామినేషన్‌లో పేపరు రాసివచ్చిన విసుగున—ఒక్కవిసురున కారులోంచి దూకి, ఒక్క అంగలో మేడపైకి వెళ్లి, టెక్స్టునూ, నోట్సునూ 'మీ దిక్కున్నచోట చెప్పుకో'మన్నట్టు టేబిల్‌మీదకు విసరి, ఆత్రంగా కిటికీలన్నీ తెరచి, హఠాత్తుగా గదిలో చొరబడే మలయపర్వత సానువులనుండి దిగుమతియగు కమ్మతెమ్మెరలకు నల్లపట్టు ముంగురులూ, తెల్లనిపైటా తపతప కొట్టుకోగా, గ్రామొఫోన్ టేబిలుకు దగ్గరగావున్న ముఖమల్ సోఫాను ఆప్యాయంగా అనుగ్రహించింది శకుంతలాదేవి.

కమ్మని కళావలయాలుగా, మాధుర్య నిలయాలుగా ... అక్కడి శబ్దగుణక ఆకాశాన్ని ఘూర్ణైనహాయితో, పరిమళపుతేనెల్తో నింపుతూ గిరగిర సైగాల్ మహాశయుడు పాడుకుపోతున్నాడు— "సుఖ్ కే... ...దుఃఖ్ కే...ఏక్ స్వపన్ హై" ఇత్యాది.

ప్లేటు మార్చడానికి రికార్డుబాక్సువైపు చేయి చాచుతూ, చట్టున ఆత్మారాధన జ్ఞప్తివారి, అధోలోకాన్ని ఉద్దేశించి—

"మంగా, కాఫీ... కాలేజీనుంచి రావడం చూడలేదూ ?"

"అమ్మా, ఇదిగో తెస్తున్నా—మరిచిపోలేదు"

శకుంతల కావలసిన రికార్డుకోసం తడవుతూ వుండగా... టేబిల్ మీద ఒక కవరుత్తరం కంటపడింది.

ఆకస్మికంగా ఆమెముఖంలో ఒక వెయ్యి ప్రశ్నార్థక చిహ్నాలు—ఇదేమిటీ—అపరిచిత అక్షరాలు?

ఆశ్చర్యంబరువున అనుకోని అనిమేషత్వం దఖలుపడ్డ ఆ అచ్చర ఆ ఉత్తరం అందుకుని చించింది.

చిత్తరంజన విలాసం,
4 ఏప్రిల్ 1932

ప్రియమైన శకుంతలకు—

ఈ ఉత్తరం ఎట్లా ప్రారంభించాలో నిజంగా నాకర్థం కాలేదు.

నీవు నన్ను సరిగ్గా అర్థం చేసుకోక...నీ చల్లని నల్లని కళ్లల్లో కెంపులు చెరుగుతూ నావైపు చూస్తే...మరణాన్ని శరణుపొందవలసి వస్తుంది.

నీవు మోహినీదేవతవలె ఒక్క చూపుతో నా హృదయాన్ని—ప్రాణాలను ఆకర్షించావు.

ప్రేమ సాక్షాత్తూ భగవత్స్వరూపం. దానిశక్తి అనంతం. దానికి ఏవీ అడ్డురాలేవు. పవిత్రమైన ప్రేమలో ఎవ్వరూ తప్పులు పట్టలేరు.

హృదయపూర్వకంగా ఒకరినొకరం ప్రేమించుకుని, రెండు నీలిమబ్బుల్లాగ—నువ్వుజంటవలె నీలాల నింగిపై తేలిపోవడం కన్న భాగ్యం ఏమిటి? నీవు మనస్ఫూర్తిగా ఒక్కపరి......

నీ,
రాజారావు.

సగంలోనే చదవడం పూర్తిచేసి...చివాలున సోఫాలోనుంచి లేచి—కవరుతో సహా ... కాదగినంత ఉండచేసి చిత్తుకాగితాల బుట్టవైపుగా విసరి, కిటికీలో నుంచి శూన్యంగా చూస్తూ—

"ఎవరీ అయాచిత ప్రేమమూర్తి? ఎప్పుడూ క్లాసులో ఇతన్ని నిదానించి చూచినట్లైనా జ్ఞాపకంలేదే?

"మొగవాళ్లు ఎంత బుద్ధిహీనులు! పొరపాటున గోడలవైపు—దూలాలవైపు చూచినట్టు చూసినా ఆ మామూలు చూపులోగూడా 'తివిరి ఇసుమున తైలంబు తీసి'నట్టు ప్రేమనుతీసి ఉత్తరాలు రాస్తారుకాబోలు!

"అప్పటి అమాయిక శకుంతలను దొంగ రాజు ప్రేమను అభినయించి టోపీవేసినట్టు...పిచ్చివాడు... ఈ రాజారావెవరో 20వ శతాబ్ది శకుంతలమీద ట్రయి చేస్తున్నాడు"

అని విరగబడి నవ్వుతూ సోఫాలో ఒరిగింది.

మంగ ట్రేలో పింగాణీ కాఫీ కెటిలూ, కప్పులూ తెచ్చి ఎదుటపెట్టి, శకుంతలను చూసి తెల్లబోయి నించుంది.

శకుంతల ఆగి గంభీరంగా—

"మంగా, నే వచ్చేసరికి నా టేబిలుమీద ఒక ఉత్తరం ఉంది. ఎట్లావచ్చింది ఇక్కడికి? నిజం చెప్పు—"

పాపం, మంగకు అంతా అయోమయంగా వుంది. నిజం చెప్పివేస్తే ఏంతప్పుగా పరిణమిస్తుందో? అబద్ధంగా నే నేమీ ఎరగనంటే ఇప్పుడే ఇక్కడనుంచి గెంటివేస్తారేమో—?

గొంతులో పది పచ్చి వెలక్కాయలు పిసిగినట్లయింది.

"మాట్లాడవేం? నువ్వు దీనిసంగతి ఎరగవా?"

"అమ్మా, కోపంచెయ్యకండి. ఆ కాగితం మడత కూడని దని తెలిస్తే—తెచ్చి మీ బల్లమీద పెట్టను. ఈవేళ పొద్దున్న దొరలాంటి ఒకాయన మన 'గేటు గుమ్మం' దగ్గిర నాక్కనిపించి మంచిగా నన్ను పిల్చి 'ఇది మీ అమ్మాయిగారి కిచ్చెయ్యి—చాలా అవసరం' అని ఇచ్చి వెళ్లారు. ఈకాలపు చదువుకునేవారికి ఇల్లాంటి తప్పు లుండవు కాబో లనుకుని మీ బల్లమీద పెట్టానమ్మా ... తెలివితక్కువదాన్ని —" నీళ్లు తిరిగే కళ్లను చాటుచేసుకోబోయింది.

అవమాన క్లిన్నమైన సాటిస్త్రీ హృదయవేదనను గ్రహించి, జాలిగా

"ఛా! నిన్నేమీ అనలేదుగా? ఈపైని ఎవరిచ్చినా ఇట్లాంటివి పుచ్చుకోకు. ఏకాలపు చదువులైనా చదువుల్లో ఏముంది ... బుద్ధి సూటిగా వుంటే—?"

కాఫీకప్పు అందుకుని రెండుగుక్కలుతాగి మళ్లా ఆలోచనలో పడింది.

మంగ బల్లలమీద వస్తువులను సర్దుతూ తన పనుల్లో నిమగ్న అయింది.

"ఎవరీరాజా...రావు? మంగ చెప్పినట్టు సూటుతో వుంటాడా? ఓహో...ఈ వీధి చివ్వరిమేడ ... ప్లీడరు బలరామయ్యగారి మేనల్లుడు — సరే — తరచు ఆడపిల్లలకంటెగూడా శ్రద్ధగా టాయిలెట్ చేసుకుని అందరికళ్లనూ ఆకర్షించాలని చూస్తూవుంటాడు. ఔను, యువతులు తిరిగిచూడదగిన కోమలమూర్తే! కాని—ఇంత దుర్బలహృదయుడా? నిజంగా ప్రేమారాధకుడైతే ఎంత నిదానిస్తాడు? మహాభక్తుడికి తాను భక్తుణ్ణనే తెలియదే...మహాకవికి తాను కవిననే జ్ఞాపకం ఉండదే? తన ఉన్నతిని ఎదుటివారు గ్రహించినప్పుడే దానికి స్థిరత్వం! గొప్పవారు గొప్పసాధన చేస్తారు—సిద్ధిపొందుతారు.

"ఈ కుర్రప్రేమికులు మా సిల్కుచీరలను,రిబ్బనుజడలను చూసి భ్రమసి, ప్రేమలనీ విరహాలనీ—షెల్లీ

లను చూసి, కృష్ణపక్షాల్లో కుంగి ప్రేమలు నేర్చుకుని—కంటిఎదటివారినీ ఇంటిఎదటివారినీ పీడిస్తారు.

"వీళ్లు—ప్రేమకోసం—కొన్ని యేళ్లు తపించి ఉండగలరా? అగ్నిపరీక్షలకు ఓర్వగలరా? ఒకప్పుడు... అవసరమైతే—ఎట్టిత్యాగమైనా చెయ్యగలరా? వట్టిది.

"అదృష్టవశాత్తూ ఏ అమాయిక కోమలి ఐనా వలలో పడితే—పీల్చివేసి 'విమ్టో' సీసాలా మూలకు విసరి చక్కాపోతారు.

దుష్యంతు డేం చేశాడు? మధురవనదేవత శకుంతలను చల్లని మాలినీతీరాన — కుసుమితపాటల వృక్షచ్ఛాయల్లో—బెల్లించి, అనుభవించి, ఛీ—

"ఈ పురుషవంచకులకు ఈశకుంతల ఘాటైన పాఠం చెప్పాలంటే ఎట్లా?

"సరే — అట్లాగే చెయ్యాలి. సాహసం? — ఫర్వా లేదు.

ఉత్సాహ బలవన్నిశ్చయంతో లేచి

"మంగా, ఈ వేళ రాత్రి... మన మోచిత్రనాటకం చూడబోతున్నాం. నువ్వుకూడా నాతో వుండాలి. మూడోకంటివాళ్లకు తెలిస్తే—తల ఎగిరిపోతుందిసుమా!"

"మీ మాటకు ఎదురు చెప్పడం... ఎప్పుడేనా వుందా అమ్మా"

"సరే న...డు...వు"

హుషారుగా లేచి శకుంతల మేడకిందికి వెళ్లింది.

2

శ్వేట్ కలర్ పారిస్ సిల్కుచీర కొత్తఫక్కీలో తీర్చి కట్టుకొని, లేత ఊదారంగు బ్లౌజు తొడుక్కొని, నిగనిగలాడే నల్లనిజుట్టును వదలుగా—చెవులు కమ్ముకునేలాగు వాలుజడగా మలచి మెడమీదనుంచి వక్షస్థలం మీదకు విడచి, ఆననశ్రీకి 'హిమానీ' స్పర్శతో లావణ్యదోహదాన్ని పచరించి, రాత్రి పదిగంటలకు తన ప్రసాధనం పూర్తిచేసి శకుంతల... డ్రెస్సింగ్ టేబిల్ వద్ద ఒకసారి తన అందాన్ని కొంటెకళ్లతో పరీక్షించి "బస్—మంగా, రెడీ" అంది.

మంగకు వట్టి గందరగోళంగా వుంది. ఈ మహాప్రస్థానం ఎంతవరకో, ఎందుకో సూచాయగా అడగడానికైనా దమ్ములు లేవు. సినీమాకా? వేళ దాటిపోయింది. ఇందాకా నాటకం అన్నమాట వట్టి తమాషాకు. ఉహుఁ—తెలియదు.

శకుంతల అప్పుడే మేడమెట్లు దిగిపోతోంది. గది తలుపులు దగ్గరగా లాగి మంగ ఆమెను అనుసరించింది.

మేడముందటి మాలతిబవరును దాటి, గేటును వెనక్కి నెట్టి, రోడ్డుమీదుగా చైత్రశుద్ధ చవతిమసక వెన్నెల్లో ఇద్దరూ ముందుకు నడుస్తున్నారు.

3

రెండు మళుపులు తిరిగి తిన్నగా వీధి చివర ప్లీడరు ____ గారి ఇంటిముందు హఠాత్తుగా ఆగి వీధిగదిలో వెలిగే దీపపుకాంతిని నిదానించి, మంగను గదికి చేరువగా—ఒక స్తంభంచాటున నుంచునేటట్టు సంజ్ఞచేసి, గంభీరంగా తలుపుదగ్గిరకు వెళ్లి మెల్లగా తలుపుమీద 'టాప్' చేసింది.

కొన్ని నిమిషాల్లో గదితలుపులు 'హల్లో-కమిన్' అంటూ మామూలుస్నేహితులెవరో అనుకుని విడుతూండగా శకుంతల లోపల ప్రవేశించింది.

గళ్లలుంగీ, చేతులులేని తెల్ల బనియనూ, పాంపియోతలనూనెసువాసనతో చిక్కులు చిక్కులుగా వేల్లాడే ఉంగరాలక్రాపూ, ఒకచేతిలో 'సిజరు' ధూమవర్తికసుగంధధూమం, రెండవచేత మర్నాడు పరీక్షకు కసరత్తుచేసే షేక్స్పియరునాటకం—తో కుసుమపుకుమారమూర్తి ... రాజారావు తన బంగారుకలల్లోని ప్రేయసి ఆకస్మికంగా ప్రత్యక్షంకావడం చూసి నిశ్చేష్టితుడై విస్తుపోయి, మంచి మాటలకోసం వెదుక్కొని, ఎట్టకేలకు—

"స్వర్గలోకపుదారి తప్పి... అప్సరస ఇట్లా నడచివచ్చిందా?"

" * * * * "

"ఉత్తరం చూసి... ఏమనుకుంటావో, నా పవిత్రప్రేమను అపార్థంచేసుకుని ఎలా అవమానిస్తావో అని మహ పరితపించాను."

...న్న అర్థంచసుకుని, ఉత్తమప్రేమకు స్వాగతం ఇచ్చి ఆదరించగలవని నాకు మొదటినుంచీ ధైర్యమే."

" * * * * "

"అదేమిటి—పలుకే బంగారం అయిపోయిందా? ఒక్కసారి ఆ కుర్చీలో కూచుని అనుగ్రహించరాదూ? రేపటి పేపరుకు నీవు ఎంతసేపు చదవాలి—రా! వీణ వాయించినట్టు కాస్సేపు హాయిగా మాటాడు."

ఇంతవరకు శకుంతల పొంగివచ్చే నవ్వును నల్లని కొంకెకళ్ల పుక్కిట బట్టి—

"ఇదేమిటి, రాజా, నన్నింతగా మన్నిస్తున్నావు? అచ్చర తోవతప్పినా నలకూబరుడి చైత్రరథంలోకేగా వచ్చిపడింది?

"ఎన్నాళ్లు నా ప్రియుడికోసం కలలుగన్నాను! ఇంతవరకూ—ఈ పాడులోకంలో నన్నింతగా ప్రేమించినవారే కరవైపోయారు. ప్రేమపరమార్థం నీవంటి బుద్ధిమంతులకు తెలుస్తుందిగాని తదితర క్షుద్రులకు ఎట్లా తెలుస్తుంది?"

" * * * * "

"కొందరు మూర్ఖులు మా మెరుగులువారే యౌవనాన్ని చూసి, మా విలోలనేత్రాలకు తల్లకిందులై మమ్మల్ని తరింపచెయ్యడానికిమల్లె మోహించి అనేక విధాల పీడిస్తారు. నాకు తెలుసు, నువ్వు అట్లాంటివాడవు కాదు."

" * * * * "

"అవును: నీవంటి పక్వహృదయుడు ప్రేమ కోసం ఎంతటి త్యాగమైనా చేస్తాడు—కదూ?"

" * * * * "

"నేను గాఢంగా ఆలోచించి — ఒక్కనిమిషం మాఇంట ఇక ఉండలేక ఇక్కడికి వచ్చేశాను. నిరీక్షించగా నిరీక్షించగా శిశిరలతానికుంజానికి వసంతమూర్తిలాగా నువ్వు దొరికావు. ఈవేళ నీఉత్తరం చూసి నా జన్మ ధన్యం అనుకున్నాను.

ఏమీ అక్కర్లేదు. లే—క్షణం ఆలస్యంచెయ్యకు. నాది ఓమర్ ఖాయ్యంమతం, నాకు పాస్టు, ఫ్యూచరు లేదు ఉన్నది ఒక్క ప్రెజెంటెన్స్.

"స్త్రీ హృదయం ఇవ్వడమేగాని తీసుకోడం ఎరగదు. రా—ఈరాత్రే ఏ దూరదేశాలకో వెళ్లిపోయి హాయిగా పావురాదంపతుల్లా విహరిస్తూ ధన్యజీవితలను గడుపుదాం. అడ్డుచెప్పకు—"

తన ప్రేమ ఇట్లా నడికిరేయిలో గొంతు పట్టుకుని ఉక్కిరిబిక్కిరి చేస్తుందని రాజారావు ఎప్పుడూ అనుకోలేదు, పాపం!

అతనికి శకుంతలధోరణి ఏ ఉల్లోలకల్లోలసముద్రంలోకో తనను విసరివేస్తూన్నట్టు అనిపించింది. కళ్లు గిర్రున తిరిగాయి.

అతను ఊహించుకునే భవిష్యత్తంతా వికృతదృశ్యాలతో, తెరలుగా తనఎదుట వేలాడుతోంది— మామయ్య ఇంక తనగుమ్మం ఎక్కితే మాట దక్కదన్నాడు. అతని ఆశ్రయంవల్ల తనకు లాభించే బి. ఎ. డిగ్రీ,ఉద్యోగం— అన్నీ, రైల్లో కూచున్నప్పుడు చెట్లు వెనక్కు పరిగెత్తుకు పోయినట్టు, వెనక్కు పరుగెత్తుకు పోతున్నాయి. దేశాంతరాల్లో — స్వయంపోషక శక్తి లేక—ఈ సుకుమారితో...అన్నానికికూడా బాధపడి తిరుగుతున్నాడు. అంతా ఊసడించి నవ్వుతున్నారు .. ప్రేమ — ఆదర్శాలు కథలపుస్తకాల్లో చదువుకోడానికి బాగుంటాయిగాని ప్రాక్టికల్ లైఫ్‌లో ఫెయిల్యూర్ అనుకున్నాడు. కుదేలయిపోయి—

"శకుంతలా! నిర్మలప్రేమ అంటే నీ కంతగా బోధపడినట్టు లేదు! బుద్ధిమంతురాలవు — వూహించు. ప్రేమకు ఇంత తొట్రుపాటు పనికిరాదు. బహు నిదానించాలి, ఓపికపట్టాలి; తొందరపడి ఎట్టి నిర్ణయాలకూ రాకూడదు." ఏం తోచక ఖంగారుగా — లాలనగా అన్నాడు రాజా. శకుంతల మరింత బిగిసి —

"నే నిప్పు డేమీ ఆలోచించలేను. నే నింక ఆ నీరసపు టింటికి—శుష్కజీవితానికి వంచేసినా వెళ్లను. నా ప్రేమమూర్తిదగ్గర నే నే నుండిపోతాను"

రాజా...కు కర్తవ్యం తోచలేదు. మామయ్య ఇదేమైనా వింటే కొంప మునిగిపోతుంది.—తా నసలు చాలా తెలివితక్కువపని చేశా నని తాత్కాలికంగా అనుకోక తప్పిందికాదు. తెగించి అన్నాడు—

"శకుంతలా, నిన్ను బతిమాలుకుంటా: ఇప్పటికి వెళ్లిపో—వెళ్లు. దీనితో నా ఫ్యూచరంతా ధ్వంసమై పోతుంది. క్షమించ మనడంకన్నా ఇప్పు డేమీ చెప్ప లేను. న న్నింక హింసించకు—"

శకుంతల విజయగర్వంతో చటాలున విజృంభించి—

"రాజారావ్! ఇప్పటికేనా నీ దుర్బల హృదయం నీకు బోధపడిందా? మొగజాతిది ఎంత తేలిక బుద్ధో అర్థ మయిందా? స్త్రీయౌవనవిలాసాలకు గుండె చెదిరి, ప్రేమ అనుకుని ఆత్మవంచన చేసుకుని ఏ అమాయిక ఐనా దొరికితే ద్రోహంచేసి తమదారిని పోతారా? ఇకమీదనైనా బుద్ధిగా చదువుకుని బాగుపడు. ప్రేమను గూర్చి ఇప్పుడు నువ్వు నాకు చెప్పిన సూత్రాలను నువ్వు బాగా మననంచెయ్యి.

"ఇట్లా మనం తేలికబుద్ధులతో సంచరిస్తున్నాం గనకనే కాలేజీల గౌరవం గంగలో కలిసింది. అజ్ఞానులూ — సుజ్ఞానులూ ఇందుకే కో ఎడ్యుకేషన్ అంటే చులకనగా మాట్లాడుతారు.

"ఇకమీదనైనా నావలె ఎవ్వరి మనశ్శాంతినీ చెడగొట్టకు. ఇట్లా అన్నందుకు మనస్సులో ఏమీ కించపడకు. ఇట్లా జరిగినట్లే జ్ఞాపకం ఉంచుకోకుండా—ఈ పైని ఆప్తస్నేహితులుగా వుందాం. గుడ్ నైట్!"

జయప్రదంగా, పాంచజన్యంఊదిన ఉత్సాహంతో, నవ్వుతూ శకుంతల మంగలో ... ... ... గబ గబ ఇంటిమార్గం పట్టింది.



బలహీనం! వెనుభూతం!! జాగర్త!!!




# జీవరక్షక (బలవర్ధకౌషధము)

"ఆరోగ్యమే మహాభాగ్యం." అట్టి ఆరోగ్యములేక లక్షల కొలదిజనులు నిత్యము కృశించిపోవుచున్నారు. ఆలస్యముచేయక వెంటనే బలవర్ధకౌషధము సేవించుడు.

ఆరోగ్యమును, తేజస్సును ప్రసాదించుటలో "జీవరక్ష"కు మించినది లేదు.

రక్తము క్షీణించి—ఒళ్లు పాలిపోయి—అజీర్ణరోగము, మలబద్ధకము, తలనొప్పి, నిద్రలేమి, గుండెల్లో మంటలు, ఆయాసము మున్నగు వ్యాధుల నన్నింటిని పోగొట్టును.

"జీవరక్షక" బలహీనులకు బలమును, జ్ఞాపకశక్తిలేనివారికి జ్ఞాపకశక్తి, దుర్బలవీర్యులకు వీర్య పటుత్వము నొసంగి ఉత్సాహవంతులుగ చేయుననుట అతిశయోక్తిగాదు.

దీనిని స్త్రీలు, పురుషులు, బిడ్డలు యావన్మంది నిర్భయంగా వాడవచ్చును. ఒకటి లేక రెండుబుడ్లు వాడినచో తప్పక గుణ మిచ్చును.

## ఏజంట్లు లేనిచోట్ల ఏజంట్లు కావలెను.

| | |
|---|---|
| పెద్దసైజు బుడ్డి 1-కి | 2—14—0 |
| చిన్నసైజు ,, ,, | 1—9—0 |

వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

కోరినవారికి క్యాటలాగు ఉచితముగ పంపబడును.




# రేణుకాదేవి ఆశ్రమము,

**155, నైనియప్పనాయకన్ వీధి, - - - - పి. టి. మద్రాసు.**

# చెన్నపురికి ఆదిపురుషులు ఆంధ్రులే

**మన చెన్నపట్టణము**

ఆదిలో

ఆంధ్రదేశములోనిది :

ఆంధ్రనాయకుల ఏలుబడిలోనిది :

ఆంధ్రసామ్రాజ్యాధిపత్యమునకు లోబడినది :

ఆంగ్లేయులకు ఆస్కారమిచ్చినవారు ఆంధ్రులు.

**ఈ పట్టణముమీఁది 'సర్వహక్కులు'ను అక్షరాలా ఆంధ్రులవే యనుటకు ప్రాచీనప్రబంధముల ఆధారముతో నిరూపితములైన ఈ ఉపపత్తులను అవధరింపుడు.**

శ్రీ
శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి

**చెన్నపురి, లేక మద్రాసు**

మన రాజధానికి చెన్నపట్టణ మనియు, మద్రాసు అనియు రెండుపేర్లు ఉన్నవి. తెలుఁగువారు చెన్నపట్టణ మని వాడెదరు. తమిళులు 'చెన్నై', 'చెన్ననగరం' అని వాడెదరు. సాధారణముగా దేశీయవర్తకులు మొదలగువారు మద్రాసు అని వాడరు. మద్రాసు అనునది రాజవ్యవహారాదులలోను, ఆంగ్లసంబంధవ్యాపారములలోను ప్రచారము నొందినది; రాజకీయ ధోరణిని ప్రచారమునకు వచ్చి నిలిచియున్నది. ఆ పేర్లు వచ్చుటకు కారణములు ముందు తెలియును.

ఈ రాజధానిలో ఆంధ్రులు, అఱవలు (తమిళులు), కర్ణాటకులు, మలయాళీలు, మహారాష్ట్రులు, ఉత్కళులు, ఘూర్జరవారు, ఇంకను భారతీయశాఖలలో నసేకులును, ఆంగ్లేయులు-వారివారి యవాంతరశాఖలలో వివిధజాతులవారును, వివిధ భాషలను మాటలాడువారును నివసించుచున్నారు.

గ్రామములోఁ గాని, పట్టణములోఁ గాని, దేశములోఁ గాని ఖండములోఁ గాని తమరు నివసించుటచేతను, అక్కడ తాము పుట్టుటచేతను, తమపూర్వులచట నివసించుటచేతను 'ఇది మాది, ఇవి మావి' అనెడి యభిమానము వారివారి కాయా గ్రామాదులయందుఁ గలుగుట మానవసహజము. అది లేనివాఁడు అభిమానశూన్యుఁడే. దురభిమానము గూడదుగాని న్యాయ్యమైన యభిమాన ముండుట యలంకారమే.

**నివాసము, అభిజనము**

తాను నివసించినది 'నివాస' మనియు, తనపూర్వులు నివసించినది 'అభిజన' మనియు మనవారు విభాగ మేర్పఱచిరి. ప్రకృతము చెన్నపురిలో నున్నవా రందఱకును ఇది నివాసమే. ఇక్కడ జన్మించినవారికి 'జన్మహక్కు' ఉండితీరును. వారివారికుటుంబములలోని పూర్వులు ఇక్కడనే నివసించినయెడల వారికి ఇది అభిజనము (అనఁగా వారిపూర్వు లున్నది).

వారివారి మాతృభాషనుబట్టియో, దేశనామమును బట్టియో యొక్కొక్కవర్గమువారిని ఒక్కొక్కకుటుంబముగా భావింతము. అప్పుడు ఆంధ్రులు అందఱును ఒకకుటుంబము, తమిళులు అందఱును ఒకకుటుంబము. అట్లే కర్ణాటకాదులు. అట్టి యేర్పాటు గావించుకొనినపుడు, చెన్నపురి యేకుటుంబమువారి పూర్వులది అను విషయమును పరిశోధించితిమేని ఆంధ్రకుటుంబమువారి పూర్వులది అని స్పష్టముగా తేలుచున్నది. అది ఆంధ్రులును, ఆంధ్రేతరులునుగూడ నిష్పక్షపాతబుద్ధితో పరిశీలింపవలసిన విషయములలో ముఖ్యమైనది.

ఆ విషయమును ఉద్ఘోషించుచున్న తెనుఁగుప్రబంధములు చూతము. ఆంధ్రభోజుఁడయిన శ్రీ కృష్ణదేవరాయలు విజయనగరమున సామ్రాజ్యపీఠము నలంకరించి పాలించునపుడు తాను జయించిన దేశములలో ఒక్కొక్కభాగమునకు ఒక్కొక్కనాయకుని పాలనముచేయ నియోగించి సామ్రాజ్యము ఏలుచుండెడివాఁడు.

ఆ వరుసలో చెన్నమనాయకుఁడు పెద్దనాయకుఁడుగా నుండి శత్రువులను నిర్మూలము గావించి సామ్రాజ్యశాసనప్రకారము

ప్రవర్తించుచుండెడివాఁడు. ఆతని కుమారులలో వేంకటనాయకుఁడు విజయనగరసామ్రాజ్యాధికారి యగు పెద్దవేంకటరాయల యాజ్ఞాప్రకారము

### చెన్నపురి అను పేరేల వచ్చెను?

నాయకరాజు లందఱపైని అధికారిగా నుండెడివాఁడు. చెన్నమనాయకుని కొడుకులలో నొకఁడగు అయ్యపనాయకుఁడు ఈ సముద్రప్రాంతమునకు ప్రభు వయియుండెడివాఁడు. చెన్నప్పనాయకుని కుమారులలో మఱొకఁడు అంకనాయకుఁడు రాజకార్యనిర్వాహకుఁడే కాక గొప్పకవీశ్వరుఁడును అయ్యెను. ఆతఁడు తెనుఁగున 'ఉషాపరిణయము'[1] అను ప్రబంధము రచించెను. వారి కుటుంబమునందఱును మహాయోధులు, మహావిద్యావంతులు, మహాకవీశ్వరులు నయి యుండెడివారు. వారికి దామరలవారు అని ప్రసిద్ధి. అదే యింటిపేరు. వారు వెలుగోటివారితో సంబంధబాంధవ్యములుగల వెలమకులభూషణులు.

అంకనాయకుఁడు రచించిన ఉషాపరిణయమునందును, చెన్నమనాయకుని తమ్ముఁడగు వేంగళభూపతి రచించిన బహుళాశ్వచరిత్రయందును వారివంశము వర్ణింపఁబడినది. దానిని వానినుండి గ్రహింతము. వారికి మూలపురుషుఁడు శ్రీపాదవిభుఁడు. ఆతనికుమారుఁడు అబ్బరాజు. ఆయనకొడుకు ధర్మవిభుఁడు. ఆయన

### దామర్ల వంశము

వలివేటి తిమ్మరాజుకూఁతురగు వేంగళమ్మను పెండ్లాడి ఆమెయందు వరదరాజు, వేంగళరాజు, తిమ్మరాజు, కోనరాజు అను నలుగురు పుత్త్రులఁ బడసెను. వారిలోని వేంగళ (వేంకట) రాజునకు అయ్యమ్మయందు చెన్నరాజు (ఇతఁడే మన చెన్నప్ప), కేసనయును, గుర్వమ్మయందు వేంగళరాజును (ఈతఁడే బహుళాశ్వచరిత్ర రచయిత), వరదరాజును, కేసమ్మయందు కృష్ణరాజును పుట్టిరి. వారిలో చెన్నప్పనాయకునకు కృష్ణమ్మయందు వేంకటరాజును, లింగమ్మయందు అయ్యపరాజును,తిమ్మాంబయందు అంకరాజును (ఇతఁడే ఉషాపరిణయ కృతికర్త),తిమ్మరాజును,వేంగళమ్మయందు చినవేంకటరాజును ఉద్భవించిరి. వీరిలో వేంకటనాయకుఁడు (దామర్ల వేంకటనాయకుఁడు) అప్పటి విజయనగరసామ్రాజ్యాధిపతియగు పెద్ద వేంకటపతిరాయల యాజ్ఞచొప్పున నాయకరాజు లందఱలోను ప్రధానుఁడుగా నుండెడివాఁడు.

ఉషాపరిణయమున[1] కవి వంశవర్ణనలో అంకభూపాలుఁడు వేంకటనాయకుని శౌర్యధైర్యాదులు వర్ణించి యిట్లు వచించె:

"రహి నవ్వేంకటధారుణీరమణుఁ డా
 రా తండ్రిపే రొప్పఁగా
మహిఁ జిత్రంబగు చెన్నసాగరము ధ
 ర్మస్ఫూర్తిఁ గట్టించె ;
త్యహరీశోదితతేజుఁ గృష్ణఘనవా
 హాధీశు నావాలి బల్
వహినే చిం (జిం?) జిరమాథ్యుఁ ద్రుంచి శుభలీ
 లం గాంచె రామోన్నతిన్"

దామర్ల వేంకటనాయకుఁడు జింజిరాజును ద్రుంచినవిషయమును, తనతండ్రియగు చెన్నమనాయకునిపేర చెన్నసాగరము కట్టించిన విషయమును ముఖ్యములు. ఈ చెన్నసాగరము నార్త్ఆర్కాటు డిస్ట్రిక్టులో ఉన్న తటాకమునకు పేరు. కావున పెద్దతటాకమొకటి చెన్నప్పపేర వేంకటనాయకుఁడు కట్టించె నని తేలినది.

ఈ చెన్నసాగరము ఊరిపేరు అని దొరతనమువారి అముద్రితగ్రంథభాండాగారమందలి పుస్తకములపట్టికలో ఉషాపరిణయమునుగుఱించి వ్రాసినదానిలో కలదు. కట్టించె

### చెన్నపురి కట్టడము

నను పదమును బట్టియు, అంబాసముద్రము మొదలగు గ్రామనామము లుండుటనుబట్టియు అట్లు చెప్పియుందురు గాని చెన్నసాగరమనుపేర ఒకతటాకము ఒకచోట నున్నదని తెలిసినపుడు గ్రామనామ మనుట కవకాశము లేదు. సోపానాదులతో నున్న తటాకమును వాపి మొదలగువానివలెనే కట్టించె నని చెప్పఁదగును. దామర్ల వేంకటరాజు తండ్రిపేర చెన్నసాగరము కట్టించినట్లే అయ్యనృపతి తనతండ్రిపేర చెన్నపట్టణమును కట్టించెను. ఆవిషయము చూతము—

"అయ్యధరాధినాయకుఁ డ
 హర్పతితేజుఁడు మీఱఁ జంద్రుతో
వియ్యముఁ జెందఁజాలు ముఖ
 బింబము దానగుణంబుఁ జెందుచున్
దొయ్యలు లెల్లఁ జూచి పరి
 తోషము గాంచుచు మానసంబులన్
దియ్యనివిల్లు డాఁచి జగ
 తిం జరియించు మనోజుఁడో యనన్."

"ప్రళయకావేరి మైలాపురంబు గల్మి
తీరమునఁ బోర నది మట్టుపెట్టఁ దండ్రి
పేరఁ దనర్మధ్యభూమిని బృథువిభూతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి."

అయ్యపనాయకుఁడు తనతండ్రిపేర గొప్పసంపదతో చెన్నపట్టణము కట్టించినాఁడు. దాని పరిణామముగా ప్రళయకావేరియు,

1. ఉషాపరిణయము అముద్రితము; దొరతనమువారి అముద్రిత గ్రంథభాండాగారమున నున్నది.

మైలాపురమును సంపదవిషయమై శౌర్యముతో పోరాడుచుండుట మట్టుపెట్టఁబడినది; అనఁగా అడఁచివేయఁబడినది. మట్టుపెట్టన్ = అణఁచివేయునట్లు అని యర్థము.

ఈ సందర్భము తెలిసికొనుటకై అప్పటి దేశస్థితి కొంత తెలిసికొనవలసియున్నది. అ దేమనఁగా—

మన చెన్నపట్టణము కట్టుట 1630 ప్రాంతమున జరిగియుండును. అప్పటికే మనదేశములోనికి ఈస్టు ఇండియాకంపెనీవారు వర్తకమునకై వచ్చియుండిరి. పోర్చుగీసులు ఇతరులకంటె ముందే మైలాపురము చేరి యిది వారి వర్తకమునకు అనువైన ప్రదేశమగుటచేత చాల ద్రవ్యము సంపాదించి మైలాపురమున స్థిరవసతి కల్పించుకొనిరి. అప్పటికి డచ్చివారు సూరతులో నివసించి లాభములేక మసూలిపటము, అర్మగాఁవ్ (దుగ్గానిపటము)చేరిరి. అంతకంటె దక్షిణభాగము వారివ్యాపారమునకు లాభకరమని యెంచిపులికాటుకు వచ్చిరి. ఈ ప్రాంతము ప్రత్తిపంటకు, బట్టలనేతకు, రంగువేతకు కావలసిన సామగ్రి లభించుదేశము గావున వారికి చాల లాభకరము. పులికాటులో నుండి అక్కడకు ఇరువదియైదుమైళ్లదూరమున దక్షిణభాగమున నున్న మైలాపురమునకు వచ్చి తమకంటె ముందుగానే ఎక్కువలాభము సంపాదించిన పోర్చుగీసువారిపైని అసహనము చెంది అప్పుడప్పుడు ఏదోవంకతో పోరాడుచుండెడివారు. అప్పుడు ఇక్కడ కొంత దిబ్బ, కొన్ని కొంపలు ఉన్నను అరణ్యప్రాయముగా నుండియుండును. ఈ ప్రాంతమునకు ఏలికయైన అయ్యపరాజు తన తండ్రిపేర గొప్పసంపత్తుతో పట్టణము కట్టఁగా అటు పోర్చుగీసువారికిఁగాని, యిటు డచ్చివారికిఁగాని ఆ వైపునకు 'రావడము' అంటే బెదురుపుట్టినది. దానివలన ఆ పోరును మట్టుపెట్టినట్లయినది.

ప్రళయకావేరి అనఁగా పులికాట్ (ఇది చెన్నపురికి 22మైళ్లలో ఉత్తరమున నున్నది. పయిపద్యములో ప్రళయకావేరి-అనఁగా పులికాటులో ఉన్నవారు, అనఁగా డచ్చివారు అని అర్థము. (ప్రళయకావేరి, పులికాటు అనుమాటలను గురించి యొకవ్యాసము వ్రాయఁదగినవిషయము ఉన్నది. ఇప్పు డేల ?) మైలాపురము-అనఁగా మైలాపురములో ఉన్నవారు, పోర్చుగీసులు అని యర్థము. ఇది లక్షణ. 'మంచాః క్రోశంతి' అన్నారు మన లాక్షణికులు. మంచములు ఏడ్చుచున్నవి 'అంటే' మంచములమీఁద నున్నవారు అని అర్థము చెప్పిరి. ఇక్కడను అట్లే చెప్పుకొనవలసియున్నది.

పోర్చుగీసువారును, డచ్చివారును పోరుచుండఁగా అది మట్టుపెట్టన్ = మట్టుపెట్టుటకై, అంటే "మట్టుపెట్టడముకోసము" తండ్రిపేర పట్టణము కట్టించెను. అనఁగా-వారిద్దరును పోరుచుండెడి పోరు-దానివలన తమకు (ప్రభుత్వము చేయుచున్న అయ్యపరాజునకు) బాధ కలుగుచుండెడిది- అది ఆఁపుటకై. ఈ పట్టణము తండ్రిపేర అయ్యనృపతి కట్టించెను అని అర్థము చెప్పికొని, ఈ చెన్నపట్టణము కట్టించుటలో ముఖ్యోద్దేశ మేమంటే డచ్చివారును, పోర్చుగీసువారును పోరుచుండెడి పోరు ఆఁపుట అని కొందఱు తేల్చుచున్నారు.

**అయ్యనృపతి యుద్దేశము, కవియుద్దేశమును**

మహారాజ సమానుఁడయిన చెన్నరాజు పేర సర్వనాయకప్రధానుఁ డయిన దామరల వేంకటనాయకుని సర్వాధికారము క్రింద సామంతరాజయి ఈ ప్రాంతమునకు ఏలికయయిన అయ్యపరాజు, వర్తకమునకు వచ్చిన డచ్చివారును, పోర్చుగీసువారును పోట్లాడుచుండ నపుడు ఆబాధ తొలఁగించుకొనుటకై తండ్రిపేర గొప్ప వైశ్వర్యముతో పట్టణము కట్టినాఁడు అని కవి చెప్పఁదలఁచెనా ? అప్పుడు వెంకటనాయకుఁడు ఏ యుద్దేశముతో చెన్నసాగరము కట్టినాఁ డందము? తమతండ్రిపేరు శాశ్వతముగా లోకమున విలసిల్లఁజేయునుద్దేశముతో అయ్యనృపతి తనతండ్రిపేర గొప్పసంపద నుపయోగించి పట్టణము కట్టుకొనఁగా అంతకు మునుపటివలె వారికి వారికి పోరాటము జరుగుటకు వీలులేక, ఆపోరు అడఁగిపోయిన దని తాత్కాలికస్థితి చూపుట కవియుద్దేశముగాని వారి పోరాటమువలనఁ గలుగు బాధలు మాన్పుకొను నుద్దేశముతో తండ్రిపేర పట్టణము కట్టినాఁ డని చెప్పుట కవియుద్దేశము కా దని తోఁచును. ఒకవేళ అట్లు చెప్పినను, ఆతనితండ్రిపేర ఏదో పట్టణము కట్టినపుడు వారిపోరు మట్టుపెట్టఁబడునా ? వారి ప్రభావము అట్టిదే యయి, అంతమాత్రముచేతనే మట్టుపెట్టఁబడునపుడు తండ్రిపేర ఊరుకట్టకుండఁగా ఆనాయకులు మరొకవిధమున వారిని ఆఁపఁజాలరా? కావున ఆయుద్దేశము కల్పించుట సరియైనదికాదు. ఆ మట్టుపెట్టుట తాత్కాలిక సందర్భమునుబట్టి సంభవించిన పరిణామ మనుట యుచితము. ఇంతకును ఆపద్యపాదమున 'అది' అనునది అంత సందర్భముగానున్నట్లు తోఁచుటలేదు. ప్రత్యంతరము లభించు భాగ్యమబ్బినయెడల చాల మంచిది. యత్నింతము. ఇదైనను లభించినందులకు మనము ధన్యుల మనుకొనఁదగు. ఇ వన్నియు కవుల పిచ్చివ్రాఁత లని 'హులాష్ కాకి' అన్నట్లు దీనిని చరిత్రైకపరాయణులు కొట్టివేయవలసినదే కాని యీస్టు ఇండియా కంపెనీవారి ధర్మమా అని, అప్పటి వ్యాపార వ్యవహారాదులను వారినిమిత్తమై వ్రాసియుంచుకొన్నను యథార్థస్థితిని. వారి వ్యవహారపత్రములలో నిలిపియుంచిరి. వానిలోఁ గొన్నివ్రాఁతలు పైని చెప్పిన చెన్నపురీనిర్మాణవిషయమును ధ్రువపఱచుచున్నవి గావున మనవారు 'హులాక్, పా' మ్మనుటకు అవకాశము లేకపోయినది.

ఏది యెట్లున్నను అయ్యనృపతి తనతండ్రిపేర చెన్నపట్టణము కట్టించె ననుట నిర్వివాదమేకదా. నాయకప్రధానుఁడగు దామర్ల వేంకటపతి చెన్నసాగరము కట్టించి తండ్రిపేరు శాశ్వతము గావించెను. అయ్యనృపతి తండ్రిపేర చెన్నపట్టణము నిర్మించి తండ్రి

కీర్తిని శాశ్వతతరము చేసెను. అంకభూపాలుఁడు తనతండ్రికీర్తిని, తనయన్నలయశస్సును గూడ శాశ్వతబ్రహ్మకల్పముగా ఉండునట్లు చేయుటకై ప్రబంధము రచించి తమవంశవర్ణనమున ఆ విషయములను వక్కాణించినాఁడు. అంకభూపాలుని గ్రంథమే లేనిచో ఈ విషయము మనకుఁ దెలియ నవకాశము గలుగదుగదా? చెన్నసాగరము, చెన్నపట్టణము అను పేర్లు పేర్లేకాక తటాకమును పట్టణమును ఉన్నను ఏదోపేరనుకొనవలసియుండును. అంకనృపతిరచన వలన చెన్నప్ప, వెంకటరాజు, అయ్యపరాజు గూడ ధన్యులు. వారియందఱికంటె ఆంధ్రజాతి ధన్యమైనది. ఆతనియెడలఁ గృతజ్ఞమై యుండవలెను. అందులకే మనవారు ప్రబంధము సప్తసంతానములలో శ్రేష్ఠమైన దన్నారు.

చెన్నప్ప సామాన్యుఁడా? ఆతనినిగుఱించి ఉషాపరిణయమున చెప్పినదానినిబట్టి యాతని శౌర్యధైర్యాదార్యాదులు స్పష్టమగును. మఱియు చెన్నప్పనాయకుని తమ్ముఁడగు వేంగళరాజు రచించిన బహుళాశ్వచరిత్రపీఠికలో రచించిన చెన్నప్పవర్ణనము అత్యద్భుతము; కేవలము అతిశయోక్త్యాదులు లేకుండఁగ జరిగిన విజయాదివిషయములను ఉద్ఘోషించుచున్నది.

### చెన్నప్పవర్ణన

బహుళాశ్వచరిత్ర పీఠిక చూచునది:

"సీ. తనభుజాభుజగప్రతాపానలమునకుఁ
బ్రత్యర్థికీర్తి పారదముగాఁగఁ
దన ధాటికౌరటత్పటహగర్జ కరాతి
పార్థివావలి హంసపటలిగాఁగ

........................

వఱలు దామర్లవంశపావనచరిత్రుఁ
డాహవకిరీటి యర్థిదైన్యాంధతమస
భాస్కరుఁడు శోభమానయశస్కరుండు
చెన్నభూపాలుఁ డరిరాజసన్నుతుండు."

"ఘోరాజిం దనతేజిఁ దోలి విమతక్షోణీతలాధీశులన్
నారాజిం దెగటార్చి వీరభటసన్నాహంబుతోఁ జేరునా
నారీజాగజమస్తము న్నఱకి నానావస్తువుల్ గొన్న యా
నారీజాలమనోజు దామరల చెన్నక్ష్మాపు సెన్నందగున్."

సీ. "మునుమున్న యేరాజు మున్నలిబైళ్లను
వేలూరిలింగభూవిభునిఁ గొట్టెఁ
బంచవన్నియడాలు వట్టించె నేరాజు
పరవీరభద్రేభపటలి రెచ్చి
శుక్రవారమునాఁడె చొరఁబాఱి యేరాజు
పాండీని బలమును భంగపఱిచె
ధీరతఁ గూడలూతూరిలో నేరాజు
శాత్రవబలముల సంహరించె

నతఁడు సామాన్యుఁడే దామరాన్వవాయ
కలశవారాశిపూర్ణరాకాశశాంకుఁ
డనఁగఁ గడికోటమల్లశుభాంకయుతుఁడు
వేంకటేంద్రుని చెన్నభూవిభువరుండు."

మహాయోద్ధ, మహారాజు, మహారసికుఁడు, మహానుభావుఁడును అగు మన చెన్నమనాయకుని పేరఁ గట్టినది మన చెన్నపట్టణము. ఆంధ్రు లయిననేమి ఆంధ్రేతరు లయిన నేమి అందఱును అట్టివాని పేరఁ గట్టిన పట్టణమున నుండు భాగ్యమబ్బినందుకు ఆనందింపవలసినదే. అయ్యప్ప, ఆహా, ఎట్టిచోటు వెదకినాఁడు! సముద్రతీరము. ఏమిబీచిసుఖము! ధనవంతులకు, దరిద్రులకుఁగూడ హాయిగదా!!

### చెన్నపురి పూర్వ వృత్తము; మద్రాసు

ఇది మన చెన్నపురిపుట్టువు. ఇంక దీని పూర్వోత్తరములను పరిశీలింతము. దీని పుట్టువునకుఁ బూర్వమే ఇదేస్థలముననో, దీనికి కొంచెము ఈవలనో ఆవలననో చిన్నయూరు ఉండియుండును. అది మొట్టమొదట పెద్ద పట్టణమయి తర్వాత క్షీణదశకు వచ్చియుండును. దానిని ఆపేరనే పట్టణమని వాడుట సహజము. పూర్వము సర్వప్రసిద్ధి పొందిన వేంగీపురమును- నేఁడు దిబ్బయైనను- వేంగీపురము అనియే వాడుచున్నాముకదా! ప్రకృతస్థలము పట్టణముగాను, నివాసార్హముగాను ఉండినయెడల పోర్చుగీసువారు అక్కడనే నివసింపఁ బ్రయత్నించియుందురు. మైలాపురమువలె సదుపాయముగా నది కన్పడియుండదు. ఆస్థలమును పోర్చుగీసులు, డచ్చివారు, ఇంగ్లీషువారు వారివారి రికార్డులలో మొట్టమొదట మద్రాస్సపటము, మదరాస్సపటము, మద్దరాసపటము, మదిరాసపటము, మద్రాస్ పటము మొదలగు పదములతో వాడియుండిరి. వ్యవహారములో ఏకరూపమున నుంచుటకై వారదే వాడుచుండఁగావాడుచుండఁగా చివరకు మద్రాస్ అయినది. తర్వాత వచ్చిన చెన్నపట్నము అనుపేరు వారు వాడలేదు. దానిమూలమును తెలిసికొనుటకు యత్నించినను అది మొట్టమొదట వ్రాసినవ్రాఁతలలో మదరాస్స, మద్దరాస మొదలగు రూపములు కనఁబడుటచేత మాదిరాజ, లేక మాదరాజ అనుపదములు దానికి మూలపదములు కానోపు నని యూహింపవలసియున్నది. మాదిరాజు పేరనో, మాదరాజు పేరనో ఎప్పుడో కట్టిన పట్టణమయియుండవచ్చును. దానివిషయము ఇంకను పరిశోధించవలెను. దానికి సాధనములు దొరకినపుడుగాని నిర్ణయింప శక్యముగాదు. ఏమయినను అది యాంధ్రరాజుల పరిపాలనలోని దేశమనుట తప్పదుగదా! ఇంగ్లీషువారికి కవులిచ్చునప్పటికి విజయనగరసామ్రాజ్యమున ఆంధ్రనాయకులలో దామర్ల వేంకటపతిపాలనయందు అయ్యనృపతి యేలుబడిలో నున్నదనుట నిస్సందేహము. ఇది యే చోడరాజుల కాలముననో వెలసియుండును. చెప్పఁజాలము. విశ్వగుణా

ప్రదర్శకత్వంలో

# విక్టోరియా 4 బి.



టాకీ ఉపకరణములు ముఖ్యలక్షణములు
సంపూర్ణముగా క్రొత్తమోడెలు.
అతి నవీనమైన హైఫైడెలిటీ శబ్దగ్రహణపద్ధతి
వేరుశబ్ద మేమియు నుండదు - తక్కువవెల
5000 అడుగుల కండెలు వాల్వులు,
మిగతా భాగములు అంతా ఆర్. సి. ఏ.
ఉష్ణదేశములకుగాను ప్రత్యేకముగా నిర్మింపబడెను.
వెంటనే ప్రతిష్ఠించుటకు సిద్ధముగా నున్నది.
ఇవిగాక ఎంజిను, డైనోమో, ఉత్పత్తిచేయు పరికరములు, ఆర్క్ రెసిస్టెన్సు,
స్లయిడు ఉపకరణములు, కార్బనులు, సిమెంటు, నాదవిద్యాపరికరములు,
స్టూడియో రసాయనములు, సినిమాపరిశ్రమకు సంబంధించిన
మరియే యితర పరికరములును దొరకును.

వివరములకు:

**కావలెను**

దక్షిణాదికి
సబ్ ఏజెంట్లు కావలెను.

**PATEL BROTHERS,**
**TALKIE SPECIALISTS,**
Dinroze Estate,
1/17, H Mount Road, Madras.

---

# సుగేశన్ అండు కంపెనీ, లిమిటెడ్.

## 109, మూర్ స్ట్రీట్, మద్రాస్.

షిప్పుబ్రోకర్లు, నౌకలలో ఎక్కించుటకు, నౌకలకు పంపుటకు, భీమాచేయుటకు
ప్రతినిధులు: జెనరల్ స్టీవ్‌డర్లు, అన్నిరకములు సరకులకు కష్టమ్సుకట్టుట
మున్నగువాటిలో నిపుణులు.

అన్నివిధముల కష్టమ్సు ఎంట్రీలతో వ్యవహరించుటకు ప్రత్యేకించినసంస్థ.
ఎక్కువ పనితనము, తక్కువ ఛార్జీలు.

**టెలిఫోన్: 2742, తంతులు: "షార్ప్" పో. బా. నెం. 1240.**

కోడ్లు: A B C 6th & 7th, బెంట్లీ సంపూర్ణముగను, రెండవ ఫేజు, లీబర్, ఓరియంటలు 3 అక్షములకోడ్, మరియు యూనివర్సల్ కోడ్.

ఏజన్సీలు

ప్రపంచమంతయు కలవు.

దర్శనము, ఆనందరంగరాయచంపువు, సర్వదేవతావిలాసము అను సంస్కృత గ్రంథములలోను, ఉషాపరిణయము, చెన్నపురీవిలాసము అను తెనుఁగుగ్రంథములలోను చెన్నపురిప్రశంస గలదు. మద్రాసు అనుపేరు ఆగ్రంథములలోఁ గానరాదు. ద్వీపాంతరస్థులలో ఆంగ్లేయుల వ్యవహారమున నిలిచి బ్రిటిషురాజ్యముతోపాటు వ్యాపకమయి స్థిరత్వమునుగాంచినది. వారికి ఎన్నిదేశములతోనో వ్యాపారముండును. మొదట వాడిన పేరు మార్చుటకు ఎంతయో వ్యవహారము జరుగవలయును. అందుచేత వారికి మార్చ వీలుగలిగియుండదు.

కొందఱు పండితులు మద్రపురి అని వాడుదురు. అది నిఘంటువులలోకిఁగూడ నెక్కి మద్రులపట్టణము అనుఅర్థముతో కనఁబడుచున్నది. మద్రు లెక్కడ? మనదేశముతో వారికి సంబంధ మేమి? అది చింత్యము. అది మద్రాస్‌పట్ట మనుదానికి గీర్వాణీకరణము కాఁబోలు. మరి కొన్ని వ్యుత్పత్తులు కొందఱు సూచించిరి గాని అవి దేశకాలభేదదోషగ్రస్తము లగుటచేత పొసఁగవు. ఏ మయినను చెన్నపురి, మద్రాసులు పర్యాయపదములవలె నొక్కటేపురమును తెలుపుచున్న వనుటకు సందేహము లేదు. ఇది చెన్నపురి పూర్వవృత్తము. ఇంక ఉత్తరవృత్తము చూతము.

**ఇంగ్లీషువారి ప్రవేశము**

చెన్నపురి కట్టిన కొలఁదికాలములోనే ఇంగ్లీషువారి ఏజెంటు ఫ్రాన్సిస్ డే విజయనగరసామ్రాజ్యాధిపతి యయిన పెద్దవేంకటపతిరాయల క్రింద ప్రధాననాయకుఁ డయిన దామర్ల వేంకటనాయకునివలన చెన్నపట్టణమున వర్తకము చేసికొనుటకును, సంరక్షణార్థము కోట యొకటి కట్టుకొనుటకును కొన్నిషరతులతో రెండుసంవత్సరములకు కౌ లొకటి పొందెను. ఆ పెద్దవేంకటపతి 1642 లో మృతి నొందుటచేత ఆతని స్థానమున శ్రీరంగరాయ లభిషిక్తుఁ డయ్యెను. ఆతఁడు విజయనగరసామ్రాజ్యమును పూర్వపుటౌన్నత్యమునకుఁ దీసికొనిరాఁదలఁచి, స్వయముగా వ్యవహారములు చూచునపుడు దామరల వేంకటనాయకుఁడు గోల్కొండనవాబులతో కలసి తనకు ద్రోహము చేయుచున్నట్లు గ్రహించి వానిని అధికారమునుండి తొలఁగించెను. పులికాటు, తిరుపతిప్రాంతములవఱకు వచ్చిన గోలకొండసేనలను వెనుకకుఁ దఱుమఁగొట్టెను. అప్పుడు ఆ ఇంగ్లీషువారి యేజెంట్లు శ్రీరంగరాయలవలన క్రొత్తకౌలు సంపాదించుట మంచి దని యెంచిరి. అంతకుముందు కౌలిచ్చిన దామర్ల వేంకటనాయకుఁడు పదభ్రష్టుఁ డయినాఁడు. అతనిపైని అధికారియగు పెద్ద వేంకటపతిరాయలు మృతిఁజెందినాఁడు. శ్రీరంగనాయకులు పొమ్మన్నచో వారికి గతి యేమున్నది? వారు కొందఱు కలసి శ్రీరంగనాయకుని దర్శనమునకుఁబోయి క్రొత్తకౌలు సంపాదించిరి. దానివలన వారికిఁ గావలసిన సదుపాయము లన్నియు సంపాదితము లయినవి.

**ఇంగ్లీషువారి పరిపాలనలో చెన్నపురిని ఉన్న రాజుల స్థితి**

శ్రీరంగరాయలు ముప్పదిసంవత్సరములు రాజ్యముచేసెను. విజయనగరసామ్రాజ్యమును పూర్వపుటౌన్నత్యమునకు తీసికొనిరావలయు నని యత్నించి కొంత సాధించెను. కాని చిట్టచివరకు రాజ్య మన్యహస్తగత మయ్యె నని తెలియుచున్నది. మనపురము క్రమముగా ఆంగ్లేయులపాలనకు వచ్చినది. సర్వదేవతావిలాస మను సంస్కృతచంపువులో చెన్నపురీవర్ణనము గలదు. దానిలో "శ్వేతముఖపాలితా ప్యశ్వేతముఖపాలితా ... చెన్నపురీ" అని కలదు. ఆ విరోధాభాసమునకు సమాధానము చెప్పుటకు ఇట్లు సమర్థింపవలెను: "శ్వేతముఖులచేతను పాలితమైనను శ్వేతముఖేతరుల పాలనములోనిది." మనచెన్నపట్టణము మనరాజుల యాధిపత్యమున నున్నను పట్టణమున దొంగతనములు,దుండగములు,హత్యలు మొదలగునవి జరుగకుండఁగ కాపాడుటకును, తప్పుచేసినవారిని శిక్షించుటకును అధికారము శ్వేతముఖులు ఆరాజులవలన పొందియున్నారు. దాని ప్రకారము పాలించుచుండువారు కావున శ్వేతముఖపాలిత మయినది. 'శ్వేతముఖపాలితమయినను అశ్వేతముఖ పాలిత మయినది (అనఁగా రాజాధిపత్యము శ్వేతముఖేతరులది) అను భావము పొసఁగుచున్నది. ఆ గ్రంథమందే రంగరాయలు వేదాచలనాయకుఁడు, కళింగమహారాజు మొదలగువారితో చెన్నపురమున సర్వాధికారము చేయుచు ఇచ్చటనుండి సేనలతో చిదంబరాదిక్షేత్రములకు పోయివచ్చుచుండినట్లును, ఇక్కడ ఆంగ్లేయులతో సరససల్లాపములతోఁ గాలక్షేపము చేయుచుండినట్లును, వారివారి మహాభోగభాగ్యానుభవముతో నాటకప్రదర్శనవిద్వత్కవితాదివినోదములతో నుండినట్లును చెప్పఁబడినది. అది చంపు వయినను గ్రంథమంతయు నాటకరూపమునఁ గలదు. అది అసంపూర్తిగా నున్నది. మఱొకప్రతి లభించినతోడనే దానిని లోకమునఁ బ్రకటింపయత్నము జరుగుచున్నది. ఆ రంగరాయలు ఈ రంగరాయలు ఏకపురుషుఁడగునో కాఁడో ప్రకృతము చెప్ప నవకాశము లేదు. ఆంగ్లపరిపాలనకు వచ్చినతర్వాతఁగూడ ఆంధ్రప్రభువు లెందఱో ఈ చెన్నపురిలో మహావైభవముతో విలసిల్లిరని చెప్పుటకు సంశయము లేకుండఁగ నాగ్రంథ ముపయోగపడును.

**ఇంగ్లీషువారికి ఆంధ్రులు తోడ్పడుట**

విజయనగరరాజుల తర్వాతను దేశము గోలకొండ నవాబుల యధీన మయినపుడు ఆంగ్లేయులు వారివలనను పట్టా సంపాదించిరి. అప్పుడుగూడ అక్కన్నమాదన్నల ప్రధానిత్వము. వారిమేనల్లుఁడు పొదిలి లింగన్న పూనమల్లిలో రాజకార్యనియుక్తుఁడు. వారును తెలుఁగువారేకదా! అక్కడను ఆంధ్రప్రధానిత్వమే. తర్వాత మొగలు సామ్రాజ్యము వచ్చినది. అప్పుడుగూడ మద్రాసు పరిస్థితులకు ఆటంకము రాలేదు,

క్రమక్రమముగా వారివలనఁగూడ సర్వాధికారమును, హక్కులను ఈస్టుఇండియా కంపెనీవారు పొందిరి. పట్టణమును, ఓడరేవును బాగు చేసిరి. క్రమముగా బ్రిటిషుపరిపాలనలోనికి వచ్చి గొప్పరాజధాని యైనది. ఈ పట్టణమును వృద్ధిలోనికిఁ దీసికొనివచ్చిన వర్తకులలోను, ఉద్యోగస్థులలోను తెలుఁగువారే ఎక్కువమంది ఉన్నట్లును, ఎక్కువ మందే కాదు—ముఖ్యు లున్నట్లును కొన్ని "రికార్డు"లవలనఁ దెలియ వచ్చుచున్నది. ఆవిషయమును కొంతవఱకు భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు 1938 సం. న చెన్నపురిలో జరిగిన యాంధ్రమహాసభలో తమ స్వాగతోపన్యాసమున స్పష్టముగా తెలిపిరి.

అంతేకాక శ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులవారు ప్రకటించిన చెన్నపురీవిలాసము అనుగ్రంథమువలన చెన్నపురిలోనున్న తెలుఁగువా రెట్టివా రుండెడివారో తేటతెల్లమగును. వల్లూరిరాజగు బొమ్మదేవర నాగభూపాలుని ప్రోత్సాహమున మతుకుమల్లి నరసింహశాస్త్రులవా రది రచించిరి. అది పరిశీలించినచో ఆంగ్లులకును, ఆంధ్రులకును గల పరస్పర హితాభిలాషిత్వము తెలియఁగలదు. చెన్నపురీవిలాసము క్రీ. శ. 1864 సం. న మతుకుమల్లి నృసింహశాస్త్రులవారిచే రచింపఁబడినది. బొమ్మదేవరనాగభూపాలుఁడు నృసింహశాస్త్రిని బిలిచి,

"పురములలోనఁ జెన్నపురిపూర్ణవిలాసము వర్ణనీయమై
ఖరి యగుఁగానఁ దత్పురవికస్వరచారు విలాస వర్ణన
స్ఫురణ నొనర్పు మొక్కకృతి భూరిగభీరతరార్థగుంభన
ర్మరసభరంబుగా మతుకుమల్లినృసింహకవీంద్రశేఖరా!

అని సగౌరవంగా నానతియొసంగిన" కవి యీ గ్రంథమును రచించెను. ఆ నాగభూపాలుఁడు వల్లూరిరాజులలోనివాఁడు. ఆతనిని గుఱించి కవి చెప్పిన భాగములోనివి కొన్ని తెలిపినచో ఆతనిస్థితి యును, తెలుఁగురాజులు ప్రభుత్వముజరుపుచున్న యాంగ్లేయుల యెడల ప్రవర్తించినపద్ధతియు స్పష్టమగును.

"ప్రబలు రాజాబహద్దరు ప్రభృతినిభృత
బిరుదపుంఖిత ఢక్కా గభీర నినద
భీతభీతాఖిలాహితవ్రాతుఁ డగుచు
బొమ్మదేవరకుల నాగభూవిభుండు.

"అయ్యవనీతలాధిపజనాగ్రణి గొర్నరు మెంటువారి క
త్యయ్యవిభూతిచే నమితసంఖ్య మహోళకటప్రచారసా
హాయ్యము పేర్మి సైన్యముల కాహవసన్నహనోద్యమంబులన్
జయ్యనఁ జేసి మేల్గను నజస్రతదార్జితవైభవోన్నతిన్.

"ప్రకటప్రీతిని హూణవల్లభులు క్యారక్టర్ల నారాజపు
త్త్రికచూడామణి కిచ్చనిచ్చెదరు హైదర్బాదులోన న్నబా
బొకమే లక్కల్కితురాయి రత్నరుచిరం బుద్ద్యోతివజ్రాశ్మకీ
ర్ణకరాకల్పయుగంబు నర్థి నిడె సన్మానక్రియాసైఖరిన్."

ఈ గ్రంథమున గద్యపద్యములతో పురము, శాఖానగరములు (పేఁటలు), వీథులు చక్కఁగ వర్ణింపఁబడినవి. ముత్యాలపేఁట, పెద్దనాయనిపేఁటవీథి, పగడాలవీథి, ఏడుబావులకొడ్డి, వినోదసభ (మ్యూజియమ్), పార్థసారథిదేవాలయము మొదలగునవి అన్నియుఁ గన్నులఁ గట్టినట్టు వర్ణింపఁబడినవి.

హూణదేవాలయము, హౌసు (హూణవాణిజ్యశాలలు) "అల యూర్బత్నెటుహౌసు బెన్నిహావుసుల్ ......" మొదలగునవి గూడ వర్ణింపఁబడినవి. పట్టణమంతటలోను ఆంధ్రులప్రాభవము, ఐశ్వర్యము, తాత్కాలికపుర పురోభివృద్ధికిఁ దోడ్పడిన వని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఆంధ్రుఁడు విచారింపవలసినవిషయ మొకటి కన్పట్టుచున్నది.

ఒకపద్యములో మనరాజధానిని వర్ణించుచు

"సీ. కుంభకోణము కల్లికోట......
అనఁగ శ్రీకాకుళము గంజ మనఁగఁ బరగు
నిరువదియు రెండు జిల్లాల కిరువు మీఱు
రాజకార్యంబులకు నెల్ల రాజధాని."

అన్నాఁడు. అందు అప్పుడు ఉన్న గంజాము ఇప్పుడు విడి పోయినదిగదా. అది ఆంధ్రదేశప్రాంతములోనిది. దానికి విచారించిన లాభమేమి? నాలుగుప్రక్కలను నాలుగుభాగములు పోకుండఁగఁ జూచుకొనవలసియున్నది.

**సింహావలోకనము**

సింహావలోకనము చేయఁగా ఏమికన్పడుచున్నదో చూతుఁడు. చెన్నపురికి ఆదిపురుషులు ఆంధ్రులు. దేశము ఆంధ్రము. చెన్నపురి ఆంధ్రనాయకుల ఏలుబడిలోనిది. ఆంధ్ర సామ్రాజ్యాధిపత్యములోనిది. ఆంగ్లేయులకు ఆస్కార మిచ్చినవారు ఆంధ్రులు. ఆదిని ఆంధ్రులహక్కు. ఆహక్కు ఎట్లుపోవును? ఆంధ్రుల తాతగారి సొమ్మే. అప్పటినుండియును ఆంగ్లేయులకు తోడ్పడుచు పట్టణమున నివసించి పట్టణాభివృద్ధికి ముఖ్యకారకు లయినవారు ఆంధ్రులు. ఆంధ్రులకు హక్కుభుక్తము లున్నవి. ఎవరు లేదనఁగలరు?

ఆంధ్రులకు అసూయ లేదు. అన్ని భాషలవారని, అన్నిదేశములవారిని ఆదరించి వారిచేత నాదరింపఁబడి యానందముగా కలసి మెలసి ఉండుట ఆంధ్రులకు సహజగుణము.

ఏకారణముల నయిన నేమి వివిధభాషలవారికి, వివిధదేశములవారికి మన చెన్నపురి యను పురమతల్లి తల్లివంటి దైనది. ఆంధ్రులు, అఱవలు (తమిళులు), కన్నడులు, మహారాష్ట్రులు, మహమ్మదీయులు, పార్సీలు, ఇతర భారతీయజాతులవారు, యూరపుదేశాగత వివిధజాతిమతములవారు అందఱును సోదరతుల్యులయి మన మద్రాసు, మన చెన్నపురి ఇంకను ఇతోధికముగా వృద్ధిలోనికి వచ్చు మార్గములను చూచి యైకమత్యముతో పరస్పర క్షేమాభిలాషులయి మెలఁగుదురుగాత!

విక్రమవత్సరము వచ్చుచున్నది గావున మీ విక్రమములు చూపుచు సక్రమముగా సంచరించి సంవత్సరమంతయు సంతోషముతో జరుపుదురుగాత!

ఐకమత్యమున తేజస్వంతు లగుదురుగాత!
అనావశ్యక ద్వేషములఁ బొందకుందురుగాత!

"తేజస్వినా వధీత మస్తు
మా విద్విషావహై"
ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

---

# నాప్రక్కనే వరున్నావా?

[గేయము]

**శ్రీ వెదురుమూడి వెంకటకృష్ణారావు**

రాగము - యదుకులకాంభోజి : తాళము - మిశ్రచాపు

పల్లవి

పడతిరో! పెడమొగముగ నా-ప్రక్క-నేవరున్నావా!

అనుపల్లవి

ఎడబాటుకోర్వకనామది-ఎంతో తపించుచుండ॥ పడ॥

చరణములు

వాలుజడను చూడ-కాలసర్ప మని
లోలోన ఇపుడేమొ-చాలా భయమయ్యె,
కాళ రాతిరినాటి-కాఱుచీకటి గ్రమ్మి
కాలు సేతులకే-ఘనయుద్ధము లాయె॥ పడతిరో॥

కీలుసంధుల-తాలిమి తప్పి
నేల కూలనున్నదే-యీ నా నిలు వెల్ల!
జాల మింత చేయ మేల?-జాలి చూపవె, చెలియా!
నాలీలాలోకములకు-నవమహోదయ మౌనె॥ పడతిరో॥

బాలకృష్ణునిపాలి-ప్రాణామృతభాండమే!
కేలు మోడ్చి నీపాద-నీరేజములపై వ్రాలెద,
శ్రీ లొనగూర్చు దివ్య-శృంగారము వెలయ,
పాలసముద్రమ్ముఁ-బోలుమో మిటు త్రిప్పవే॥ పడతిరో॥

# ఆంధ్ర ఇన్స్యూరెన్సు



శ్రీ. జి. లక్ష్మీనారాయణగారు
చైరుమన్, బోర్డు ఆఫ్ డైరక్టర్సు.

**1925**-వ సంవత్సరమున కొందరాంధ్రనాయకులు ప్రారంభించిన "ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ" దినదినాభివృద్ధినొంది ఆసేతుహిమాచలపర్యంతము విస్తరించి, నిర్మాణసౌష్టవము కల్గి, నేడు భారతదేశమందలి ప్రధాన భీమాసంస్థలలో ఉన్నతస్థాన మాక్రమింపగల్గినది. భారతదేశములో ప్రతి రాష్ట్రమందు కూడ "ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ" అసూయకల్గించు స్థయిర్యము కల్గి, ప్రజానురాగము నొందగల్గుటకు అనేక కారణములు గలవు. అవేవన:—

1. దేశోద్ధారక కె. నాగేశ్వరరావుగారు
టంగుటూరి ప్రకాశంగారు
డా. పట్టాభిసీతారామయ్యగారు
వి. రామదాసుపంతులుగారు

మున్నగు ఆంధ్రప్రముఖులును త్యాగశీలురును, ప్రజాసేవకులు నైనవారిచే ప్రారంభింపబడిన ఈసంస్థయొక్క అత్యున్నతములైన ఉదారాశయములు.

2. ప్రధానకార్యాలయమునందును, వివిధశాఖలయందును జరుగుచున్న మితవ్యయము, సంరక్షణ క్రమాభివృద్ధులతోగూడిన పరిపాలనావిధానం.

3. రాష్ట్రమందలి మారుమూలప్రదేశములకు కూడ విస్తరించి అతి బాహుళ్యమైన వ్యాపారాంగ నిర్మాణక్రమము, పట్టాదార్లకు ప్రయోజనకారులుగా నుండున ట్లెన్నుకొనబడిన కంపెనీ ప్రతినిధులయొక్క ఉన్నత పరిమాణము.

4. అతితక్కువప్రీమియములు; ఎక్కువైన సదుపాయములు; చక్కని సంవత్సరలాభాలు, పట్టాదార్లకు అద్వితీయమైన సౌకర్యాలు; ఏమాత్రం చిక్కులులేనిపట్టా స్వాభావిక లక్షణములు.

ఇవన్నీకాక—

5. కంపెనీ ప్రతినిధులద్వారా క్లెయిముల పరిష్కారము. మా ప్రతినిధులు న్యాయశాస్త్రరీత్యా జరుగవలసినవిధానమునంతను నడపి పట్టా క్లెయిముగా ఫలించిన వెంటనే పరిష్కారమగునట్లు సహాయపడెదరు.

| "ఆంధ్ర" అభి |
|---|
| మొత్తం జీవితనిధి |
| మొత్తం అమలులో నున్న ఇవ్వబడిన పట్టాల మొ |
| మొత్తం ఆస్తులు |

పై నుదహరింపబడినవి మిగతాసంస్థలకంటె 'ఆంధ్ర' కల్గియున్న యుత్కృష్ట లక్షణములలో కొన్ని మాత్రమే. అతి తక్కువవెలకు లభించు సదుపాయములు, అద్వితీయములైన పట్టా లక్షణములు—ఇవియే "ఆంధ్ర"కు తన మాతృరాష్ట్రమునందు కంటె పరరాష్ట్రములలో కూడ అత్యధిక ఆదరణ అభిమానములను చేకూర్చినవి.

ఆరంభమునుండె చక్కనిబోనసు పంచిపెట్టగల్గినంత మిత వ్యయపరిపాలనగల కొద్ది భీమాసంస్థలలో 'ఆంధ్ర' ఒకటి. కనుక 'ఆంధ్ర' పట్టాదార్లు అమోఘమగు సదుపాయములను అతితక్కువ



శ్రీ. వై. మంగయ్యగారు, కార్యదర్శి.

# కంపెనీ, లిమిటెడ్.

**వృద్ధి అంకెలు**
**26,30,000**
**వ్యాపారం 2 కోట్లు**
**త్తం సంఖ్య 23,920**
**30,00,000**

ఖర్చుతో పొందుటయే గాక అవసరము కలిగి నపుడెల్ల శిక్షణపొందిన "ఆంధ్ర" ప్రతినిధుల ద్వారా విలువలేని సహాయము పొందుచుండ గలరు.

'ఆంధ్ర' ప్రతి ఆంధ్రుడును గర్వించదగినసంస్థ. అంతేకాదు. దాని ఆకర్షణీయమగు లక్షణములను గమనించినవెనుక దానితో భీమా చేయుట అత్యుత్తమమైన దని మీరే గ్రహింపగలరు. "జీవితవిషయాలు" అను ఉపయోగవంతమైన మా చిన్నిపొత్తమునకు వ్రాసి మితవ్యయము, ఆదాచేయుట మున్నగువాటికి సంబంధించిన కొన్ని ప్రధానవిషయముల నెఱుంగుడు. ఈ ప్రతి కొరకు ప్రధాన కార్యాలయమునకుగాని, శాఖాకార్యాలయములకుగాని వ్రాయుడు.



శ్రీ. పి. పార్థసారథి నాయుడుగారు
మేనేజింగు డైరక్టరు.



శ్రీ. డి. సుబ్రహ్మణ్యంగారు
సహాయ కార్యదర్శి.

**The ANDHRA INSURANCE COMPANY LIMITED**
**MASULIPATAM**

**ఆంధ్ర ఇన్‌స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.**

ప్రధాన కార్యాలయం :
ఆంధ్ర ఇన్సూరెన్సు భవనములు, మచిలీపట్టణము.

శాఖలు :
ఆంధ్ర ఇన్సూరెన్సు భవనములు, లింగిచెట్టివీథి, మద్రాసు.
,, ,, ,, ధనతోలి, నాగపురం.
,, ,, 3, చౌరంగి స్క్వేర్, కలకత్తా.
,, ,, తిరుమల దేవసరమ్‌రోడ్, ఎర్నాకులం.

భారతదేశమునందంతటా సబ్ ఆఫీసులు, ఏజన్సీలు గలవు.

# మహాకవి తిక్కన

శ్రీ దరిమడుగు కామయ్య

నట్టడవి డించి నన్నయ
భట్టారకుఁ డరుగఁ దెనుఁగుఁబలుకుఁబడంతిం
జిట్టితనంబున సాకిన
దిట్టవుగద పురుడుదీర్చి తిక్కకవీంద్రా!

పందలమంది తెన్గునఁ బ్రబంధములన్ వెలయించి సాహితీ
సుందరికిన్ గిరం బలరు సొమ్ములు పెట్టిరి కాని, రూపుఁ గ
న్పొందుగఁ దీర్చి నెన్నడలు నేర్ప వలంతులె? ఆంధ్రవాఙ్మయం
బందు భవద్విభాగ మరయంగ మొగంబున ముక్కువంటిదో.

తెలుఁగుఁబలుకుల చలువరా తెలమిఁ గూర్చి
తనరఁజేసితి భారతతాజమహాలు
సుకవిమాత్రుండవే నీవు సోమయాజి!
అతుకుదోఁపని యాశిల్ప మద్భుతంబు.

కవితారసాంభోధి నవగాహన మొనర్చి లలితరత్నాలు వెల్వఱచినావు
సకలాంధ్రజాతీయశబ్దముత్యాల నర్మిలి సరమ్ముగ వినిర్మించినావు
మూలంపుఁబటమున ముద్దురంగుల నద్ది తెనుఁగుఁజీరకు వన్నె దెచ్చినావు
అఱగొఱగా నున్న యనుఁగుందెనుఁగుదోఁట నందనవనము గ నొనర్చినావు
మనుమసిద్ధివిభుండు 'మామా' యనంగ
సుకవు లెంతయు మార్గదర్శకుఁ డనంగ
అఖిలధీజనతతి సోమయాజి యనఁగ
గణనకెక్కితి తిక్కనకవివతంస!

తనయొడిఁ దాల్ప నోచినకతమ్మున సింహపురీలలామ పా
వనమగు నీ యశోలతకు బాదుగ ధన్యచరిత్ర యయ్యెఁ ది
క్కనకవిచంద్ర! మిక్కిలి పొగడ్త లిఁకేటికి ధాత్రి నాంధ్రస
జ్జనుఁ డొకఁ డుండినన్ మఱవఁజాలఁడు నిన్ను యుగాంతవేళలన్.

# ఆంధ్రనాటకముల యారంభదశ

**ప్రాచీనాంధ్రకవులు నాటకవాఙ్మయమును**
**ఉపేక్షాభావముతో చూచుటకు హేతువులు**

---

● శ్రీ దివాకర్ల వేంకటావధాని ●

నన్నయ తిక్కనలు మొదలైన ప్రాచీనాంధ్ర మహాకవులు అనువాదరూపముననైన నేమి, స్వతంత్ర రూపముననైన నేమి తెలుఁగున ఉత్తమ కావ్యములను పెక్కింటిని వెలయించి ఆంధ్రవాఙ్మయమును మహోత్తమస్థానమున నిలిపినారు. కాని వారు ఆనాఁటికే సంస్కృతాదిభాషలయందు విస్తార వ్యాప్తి గాంచిన నాటక వాఙ్మయమును ఆంధ్రీకరించుటగాని, తదనుసారముగ స్వతంత్రనాటకములను రచించుటగాని చేయలేదు. చివరకు సంస్కృతలక్షణగ్రంథములను ఆంధ్రీకరించిన ఒకరిద్దరు ఆంధ్రలాక్షణికులుకూడ తదితర లక్షణములతోపాటు రూపక లక్షణములనుగూడ అనువదింపవలసి యుండియు అట్లు చేయరైరి. వారి ఈ ఔదాసీన్యమునకు హేతువు లేవో, ఇట్టి సందర్భములో ఆంధ్రనాటకముల పుట్టుక యెప్పుడు, ఎట్లు కలిగినదో, ఆంధ్రప్రజానీకము వానినెట్లు ఆదరించినదో మొదలైన అంశములు ఈ వ్యాసములో రసవంతముగా రచియింపఁబడినవి.

నన్నయకుఁ బూర్వ మాంధ్రభాషకు స్థిరమైన రూపము కాని, కావ్యరచనావశ్యకము లైన ఛందోవిస్తృతులు కాని లేకుండె ననుట సర్వపండిత సమ్మతమైన విషయము. అప్పటి యాంధ్రవాఙ్మయము ప్రాయికముగా శాసనాది రూపము నే తాల్చియుండెనుగాని యింకను గావ్యాకృతిని వహింపలేదు. తొలుఁదొలుత నీ భాషాపాదపమునఁ గావ్యరూపస్వాదుఫలమును బండించినవాఁడు నన్నయ. ఈతఁడు రాజరాజనరేంద్రుని ప్రేరణచే సర్వధర్మసమన్వయసంధానదక్షమయి పంచమవేదము నాఁ బరఁగు భారతము నాంధ్రీకరింప నారంభించెను. ఈతఁడు స్వతంత్రకావ్యరచనానుకూలములైన ప్రతిభావ్యుత్పత్తులు కలవాఁడే యయ్యు నొకవంకఁ దననాఁటి కసంస్కృతమై యవ్యవహితమై యున్న భాషకు సుస్థిరాకారము నొసఁగుభార మటుండ స్వతంత్ర కావ్యరచన భారమునుగూడ వహించుట కష్టతర మని కాఁబోలు నట్టిపనికిఁ బూనుకొనఁడాయెను. అదిగాక తత్కాల పరిస్థితులును, బ్రభుశాసనమును భారతమువంటి బ్రాహ్మణమతప్రచారక గ్రంథము యొక్క యావిష్కరణమునకు మిక్కిలి యనుకూలములై యుండెను. నన్నయతరువాతఁ దిక్కనయు, నెఱ్ఱనయు నాతనిచే నారంభింపఁబడిన యా యుత్తమ కావ్యము నాంధ్రీకరణము పూర్తిచేసిరి. ప్రతిభాశాలులైన యీ మూగురుకవులును దమతమ యుగములందలి కవుల కెల్లరకును నాదర్శప్రాయులగుటచే నప్పటి యాంధ్రకవులు పెక్కురు వీరి మార్గమునే యనుసరించి ప్రసిద్ధములైన యితరపురాణములఁ గొన్నిటి నాంధ్రీకరించిరి. నన్నెచోడుని కుమారసంభవమువంటి స్వతంత్ర కావ్యములుకూడ నొండు రెండు వెలువడినను ఆంధ్రీకృతములైనవానిలో నివి నూటికిఁ దొమ్మిదికూడ నుండవు. మొత్తముమీఁద నెఱ్ఱన యుగాంతము వఱకు వెల్వడిన యాంధ్ర వాఙ్మయమునఁ బురాణపరివర్తనమే ప్రధానలక్షణ మని భావింపవచ్చును.

భారతకవుల యాంధ్రీకరణపద్ధతి యసామాన్యమైనది. వ్యాసరచిత భారతమునుండి కథాంశములను మాత్రము గైకొని వారు తక్కిన మెఱుఁగుల నన్నిటిని దామే తీర్చి దిద్దిరి. వలయునెడలఁ బూర్వోత్తర కథాభాగములను సైతము తారుమారు చేయుటకు వారు వెనుదీయలేదు. కథాగమనమున కడ్డుగలిగించునట్టియు, నప్రసక్తములయినట్టియు, గూఢవేదాంతగర్భితము లగుటచే దుర్గ్రాహములైనట్టియుఁ గథాభాగములను గేవలము సూచించి విడిచివైచిరి. సనత్సుజాతీయము, భగవద్గీత మొదలగున విట్టివానికిఁ దార్కాణ

ములు. వీరు వర్ణనభాగములను రచియించుటలో మిక్కిలిస్వాతంత్ర్యము వహించి మూలగతమైన వర్ణనలతో పాటు స్వకపోలకల్పితములైన వర్ణనలఁ గూడఁ గొన్నిటి నందుఁ బ్రవేశపెట్టిరి; పాత్రముల శీలస్వభావములను వర్ణించుపట్లఁ గూడఁ గొన్నియెడల మూలవిరుద్ధమైన పద్ధతి నవలంబించిరి. తిక్కన ద్రౌపదీపాత్రకును, వ్యాసుని ద్రౌపదీపాత్రకును స్వభావవిషయమునఁ గల తారతమ్యమే దీనికిఁ బ్రబలదృష్టాంతము. కాన వ్యాసునిభారతము చెంత నుంచుకొని యందలి శ్లోకములన్నియు నిర్వ్యోఢ నాంధ్రీకృతములైనవని చూచుటకాని, యందలివర్ణన లన్నియు నిందు మక్కికి మక్కిగా ననువదింపఁబడిన వని చూచుటకాని మిక్కిలి నిష్ఫలము. మొత్తముమీఁద నాంధ్రీకరణ మన్న పే రున్నను ఆంధ్రమహాభారత మొక స్వతంత్ర రచనమువలెనే చూపట్టునుగాని మూలగ్రంథము నతిసన్నిహితముగా ననుసరించిన కేవల పరివర్తనమువలెఁ గానిపించదు. కవిత్రయమువారి యీ పరివర్తనపద్ధతి నంత సమగ్రముగా ననుకరింపలేకపోయినను బురాణ పరివర్తకులు పెక్కు రామార్గము వెంటనే పోయి రని చెప్పవచ్చును.

స్థూలముగాఁ జూచినచో సంస్కృత వాఙ్మయము నంతను బురాణములు, కావ్యములు, నాటకములు అని మూఁడు ముఖ్యవిభాగములు గావింపవచ్చును. అందుఁ బురాణములు వివిధవిషయసంకలితములును, అతి విస్తృతములును. కావ్యములు వర్ణన ప్రధానములు; వస్త్వైక్యముతోడి ప్రౌఢరచనకునికిపట్టులు. నాటకములు ప్రధానముగా రసాశ్రయములు. సంవాదపూర్వకము లయి యవి యనతివిస్తృతముగ నుండును. ప్రథమాంధ్రకవు లాకాలప్రభావమునుబట్టి ధర్మోపదేశబాహుళ్యముగల పురాణముల నాంధ్రీకరించి భాషాసేవఁ గావించిరి. ఎఱ్ఱన యుగానంతరము వెలసిన యాంధ్రకవులు పురాణపరివర్తనమును విడిచి సంస్కృతమున విశేష ప్రసిద్ధినందిన కావ్యముల నాంధ్రీకరింప మొదలిడిరి. నన్నెచోడుఁడు తన కుమారసంభవమున నుద్భటుఁడను సంస్కృతకవి రచించిన కుమారసంభవమును బేర్కొనెను గాని యాతఁడా కావ్యమునందలి వర్ణనలను గుమారసంభవమునందలి వానినివలె నెచ్చటనైన గ్రహించి యుండెనేమోకాని దాని ననుపదముగ ననువదించినవాఁడుమాత్రము కాఁడు. కాఁగా సంస్కృతకావ్య పరివర్తనకుఁ బ్రప్రథమమున నారంభించినవాఁడు శ్రీనాథుఁడు. ఇతఁడు శ్రీహర్షుని నైషధము నాంధ్రీకరించుటయేకాక హరవిలాసమునందుఁ గుమారసంభవమునందలి శ్లోకములఁ బెక్కింటి నాంధ్రీకరించెను. ఈతని యాంధ్రీకరణమునకును గవిత్రయము వారి యాంధ్రీకరణమునకును విశేష తారతమ్యము కలదు. ఇతని పద్ధతి కవిత్రయమువారిదివలె నతి స్వతంత్రము కాదు. ఔచిత్యంబు పాటించి యనౌచిత్యంబు పరిహరించి యతి మనోహరముగ నాంధ్రీకరించుచు వచ్చినను, ఇతఁడు మూలగ్రంథము నందలి శ్లోకములను సన్నిహితముగా ననుసరింపక మానినవాఁడు కాఁడు. సీసపద్యములం దితఁడు స్వకల్పితపాదములఁ బ్రవేశపెట్టిన చోట్లును, గ్రంథకర్త యభిప్రాయము గూఢముగా నున్నప్పుడు దానిని స్వేచ్ఛగా వివరించినపట్లును అచ్చటచ్చటఁ గలవు. మొత్తముమీఁద నితని పరివర్తనము కవిత్రయమువారి దానివలె నతిస్వతంత్రమును, అధునాతనుల నాటకపరివర్తనములవలె మక్కికి మక్కియును గాక మూలభిన్నముకాని స్వతంత్రపరివర్తనమై విలసిల్లుచున్నది.

పురాణకావ్యపరివర్తనము సాగిన తరువాత నాటకములు పరివర్తింపఁబడుట సహజపరిణామక్రమము. శ్రీనాథయుగమునందలి కవులు నైసర్గికమైన యీ క్రమమును బరిశీలింపకపోయినవారు కారు. శ్రీనాథుని పరివర్తనపద్ధతినే యవలంబించి వీరు ప్రసిద్ధములైన సంస్కృత నాటకములఁ గొన్నిటి నాంధ్రీకరించిరి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి తన శృంగారశాకుంతలమునఁ గాళిదాసుని శాకుంతలమునందలి శ్లోకములఁ గొన్నిటిఁ దెనిఁగించి యచ్చటచ్చటఁ జొప్పించెను. నందిమల్లయ్య, ఘంటసింగనలు వేదాంతపరమైన ప్రబోధచంద్రోదయమును సంపూర్ణముగ ననువదించిరి. రాజశేఖరుని విద్ధసాలభంజిక యేకదేశముగనో, పూర్ణముగనో మంచన కేయూరబాహుచరిత్రమున ననూదితమని యనుకొనుటకుఁ గొన్ని కారణములు గలవు.

కాని యీపరివర్తనమునం దొక విశేషము కానవచ్చుచున్నది.

పురాణ పరివర్తకులు గాని, కావ్య పరివర్తకులుగాని మూలగ్రంథముల నాంధ్రీకరించుచో వాని యాకృతులం దెట్టి మార్పును గావించియుండలేదు; వర్ణనభావముల విషయమున వారు కొంత స్వాతంత్ర్యము వహించినను ఆకృతి జోలికిమాత్రము పోయిన వారు కారు. ఈ నాటకపరివర్తకు లట్లు కాదు. వీ రా నాటకములను యథారూపముగా నాంధ్రీకరింపక ప్రబంధములుగా నాంధ్రీకరించి యుండిరి. దీనితో సాదృశ్యముగల విషయ మాంధ్రవాఙ్మయమునందు మఱియొకటి కలదు. కేతన సంస్కృతమున దండి విరచితమైన దశకుమార చరిత్రము నాంధ్రీకరించుచు దాని రూపము నిట్లే మార్చియుండెను. సంస్కృతమున గద్యరచితమైన యా గ్రంథము నాతఁడు పద్యమయ కావ్యముగాఁ జేసెను. గద్యమయమైనను, పద్యమయమైనను రసాత్మక మైన వాక్యప్రపంచము కావ్యమే యగు నను విషయము నెఱింగియును కేతన యాగ్రంథము నట్లు మార్చుటకప్పటి వాఙ్మయపరిస్థితులే కారణము లై యుండును. కేతనకుఁ బూర్వులైన కవుల రచనలలో నెడనెడఁ బద్యములతో పాటు గద్యముకూడ వ్రాయఁబడియుండినను అంతము గద్యమయమైన కావ్య మొక్కటియు లేదు. వాఙ్మయమునం దపూర్వమైన క్రొత్తమార్గము నొకదానిని ద్రొక్కుటకుఁగాని, పద్యమయ కావ్యమునం దభిమానము నూచముట్టుగా విడుచుటకుఁగాని కేతనక్కు మన సొగ్గియుండదు. అట్లే యీ నాటకపరివర్తకులు గావించిన మార్పునకును బ్రబలమైన హేతువులుండితీరవలయును. వీరి పరివర్తనము-ఉన్నంతవఱకు- శ్రీనాథుని పద్ధతినే యనుసరించియుంట నాతిమూలమును, నాతి స్వతంత్రమును నై మిక్కిలి మనోహరముగా నున్నది. ఆంధ్ర వాఙ్మయమున కాభాగ్యము లేకపోయెను గాని వారే యీపద్ధతిని సంస్కృత నాటకముల నాంధ్ర నాటకములుగా ననువదించియుండినచో సంస్కృతనాటకముల యంద మాంధ్రపరివర్తనములఁ గొఱవడినదను కించ లేక యాంధ్రులు తద్రసమును మనసారఁ గ్రోలి యానందించి యుండెడివారే!



శ్రీకృష్ణగానామృత సరస్వతీసంగీతపాఠశాల,
రాజమహేంద్రవరము

[అధ్యాపకురాలు, కొందరు విద్యార్థినులును]

అధ్యాపకురాలిపేరు శ్రీమతి పద్మలక్ష్మి అమ్మాళు. ఈమె వైణికవిద్వాన్ శ్రీమాన్ నల్లాని చక్రవర్తుల శ్రీరామాచార్యులవారి కూతురు. ఫిడేలు, వీణ, గాత్రములు అమోఘముగా సాధనచేసినది. ఈమె 'సమ్మర్ స్కూల్ ఆఫ్ ఇండియన్ మ్యూజిక్' వారి ఆనర్సుపరీక్షలో డిస్టింక్షనుతో సర్టిఫికెట్టు సంపాదించినది. అనేక గానసభలలో తన గానకౌశలమును ప్రదర్శించి సువర్ణపతకములను బహుమానముగా బడసినది. ఈవిడ నడపుచున్న ఈ విద్యాలయము పరంపరగా జరుగుచున్నది.

నాటకముల మాట యిట్లుండఁ గవిసార్వభౌముఁ డగు శ్రీనాథుని రచనముగాఁ బ్రసిద్ధిగాంచిన వీథీ నాటక మొండు కానవచ్చుచున్నది. దశరూపకములలో నొకటియైన వీథికి లాక్షణికు లొసఁగిన లక్షణము దీనఁ గానిపించ దనుట నిర్వివాదము. ఇందు శృంగారరసాలంబనములును, అసభ్యములును నగు చాటుపద్యములు

కొన్ని గలవు. మహాకవియైన శ్రీనాథుఁడు వీథీలక్షణము నెఱుంగక యుండఁడు; ఎఱిఁగియెఱిఁగి యీ రీతిగాఁ గొన్ని పద్యములు రచించి వీథి యనునామము పెట్టియు నుండఁడు. వీథి యను నామ మాపద్యసముదాయమున కవాంతరముగాఁ గలిగియుండనోపు. లేదా పలువురు పండితులు సందేహించున ట్లిది శ్రీనాథరచితమే కాక మఱియెవ్వరిదోయయ్యు శ్రీనాథునిపేరఁ బరఁగుచుండవచ్చును.

ఇట్లు పదునేడవశతాబ్ది యారంభమువఱకును దెనుఁగున స్వతంత్ర నాటకములుగాని, సంస్కృత నాటకముల యథారూప పరివర్తనములు గాని వెలువడియుండలేదు. ఈ కారణముచే నంతకుఁ బూర్వమున నున్న యాంధ్రకవులు రసదోహలములగు సంస్కృత నాటకముల యాత్కృష్ట్యమును గమనించియుండలేదని కాని, తామై స్వతంత్రనాటక సృష్టి చేయఁ గడంగుటకుఁ దగిన సామర్థ్యము లేనివా రనికాని మనము తలంచుట పొరపాటు. పూర్వకవులలోఁ బెక్కు రీయుత్తమసృష్టికిఁ గావలసిన ప్రతిభాసామర్థ్యములు కలవారయ్యు ననివార్యములగు కొన్ని కారణములచేఁ దద్రచనవిషయమున నౌదాసీన్యము వహించియుందు రనుటకుఁ బెక్కునిదర్శనములు కలవు. కథోపాఖ్యాన రచనకౌశలమే ప్రధానముగఁ గావలసిన భారతమువంటి యితిహాసమునందుఁ గూడఁ బ్రతిఘట్టమునందును నాటకసరణు లచ్చొత్తించిన తిక్కన స్వతంత్రనాటకము నొకదానిని రచింపఁబూనకుండుట కాతని శక్తిలోపమే ప్రధానహేతు వనుకొనుట మిక్కిలి పరిహాసపాత్ర మగును. రూపమునఁ గాకపోయినను గుణపరంపరచే నాటకమే యనిపించుకొనుచున్న ప్రభావతీప్రద్యుమ్నము నంత నిపుణముగ నిర్మించిన పింగళిసూరన నాటకమొండు వ్రాయఁ గడంగమికి నుపజ్ఞాలోపమనుటకంటె భిన్నమైన హేత్వంతరమునుసూచించుట లెస్స. ఇట్లే శ్రీనాథాద్యన్యకవీశ్వరులు సైత ముత్తమనాటక రచనోత్సాహమును గానిపించకుండుటకుఁ బ్రజ్ఞాభావము కాక వేఱునిమిత్తములు బలవత్తరములై యుండితీరవలెను. ప్రతిభాశాలులగు కవులు క్రొంగ్రొత్తపోకడలఁ బోయి తమ బుద్ధివైశిష్ట్యముచే నవనవ కావ్యభూజముల మొలపించి తద్రసపరిమళములచే వాఙ్మయమహావనములఁ బరితోవాసితములఁ గావింతు రనుట సుప్రసిద్ధమే. పై మూగురు కవుల ప్రతిభయుఁ బ్రధానముగా నాటకోచితము. సంస్కృతనాటకముల సారమును బర్యాప్తముగ నాస్వాదించిన యీ మహాకవులు స్వతంత్రనాటకములను బరిమితముగనైన సృష్టించియుండవలసినది. వీరే కాదు, మన పూర్వకవు లందఱును సంస్కృత వాఙ్మయపయోధిపారమును ముట్టినవారే. దీనికి వీ రాంధ్రమునకుఁ బరివర్తించిన సంస్కృత గ్రంథజాలమే తార్కాణము. కొంచె మించుమించుగా వీరు సంస్కృతమునఁ గల ప్రసిద్ధకావ్యముల నన్నింటిని దెనిఁగించిరని చెప్పవచ్చును. అట్టి వీరు స్వతంత్రముగా నాటకముల వ్రాయకుండినను రసనిధానములై, కావ్యముల నుత్తమములని యెన్నఁబడుచున్న సంస్కృతనాటకములలో నొకదానిని గూడఁ దెనుఁగున నావిష్కరింపమి మిక్కిలి విస్మయావహము. కొందఱు సంస్కృతనాటకముల పరివర్తనమును బ్రారంభించియు వాని రూపమును మార్చి ప్రబంధములుగా ననువదించుట చూడ నాటకరూపరచనమున కా కాలమున నేవియో యనివార్యములైన యాటంకము లుండవలయు ననుట నిర్వివాదము.

సంస్కృతనాటకములలో నొండు రెండు తక్క తక్కిన వన్నియు శృంగార రసప్రధానములు. మతప్రచారమే ప్రయోజనముగాఁ గల ప్రబోధచంద్రోదయమువంటి నాటకము లంతకుముందు లేవు. తెనుఁగువాఙ్మయముయొక్క పుట్టుక యానాఁటి పరిస్థితులనుబట్టి చాలవఱకు బ్రాహ్మణమతోద్ధరణముతోఁ సంబంధించియుండుట సంభవించెను. అప్పటి యాంధ్రసమ్రాట్టులుకూడ దానికొఱకే విశ్వప్రయత్నములు చేయుచుండిరి. అట్టియెడ పంచమవేద మనఁబరఁగి సర్వధర్మసమన్వయసంధానక్షమములగు భారతమువంటి యుత్తమ గ్రంథములయొక్క పరివర్తనమే మిక్కిలి యావశ్యకమై కనుపట్టెను. అందుచేతనే శ్రీనాథుని యుగము వఱకునుగల తెనుఁగువాఙ్మయము మతప్రచారమున కనువగు పురాణముల పరివర్తనముతోడనే భాసిల్లుచుండెను. పైఁగా శ్రీనాథునికిఁ బూర్వులైన యాంధ్రకవులలో నన్నెచోడునివంటి స్వతంత్ర కావ్యకర్తలు తక్కువ. వాఙ్మయారంభమైన యా

క్రొత్తదినములలో నాద్యులైన నన్నయాదుల మార్గమును వీడి నాటక పరివర్తన మారంభించి భిన్నమార్గమును ద్రొక్కుట కప్పటి కవులకు ధైర్యము చాలినది కాదు.

సంస్కృతనాటకములలో సంస్కృతప్రాకృతములకు రెంటికిని విరివియైన యుపయోగము కలదు. సంస్కృతమువలెనే ప్రాకృతము కూడఁ బూర్వవైయాకరణులచే నిబద్ధమై, నియమితమైయుండుటచే నది సంస్కృతముతోపాటు స్వతంత్రమై కావ్యములయందు నిరాక్షేపముగ నుపయోగింపఁబడుచు నొక ప్రత్యేక భాషగఁ బరిగణింపఁబడుచున్నది. అంతియగాక సంస్కృతలాక్షణికులు నాటకనిర్మాణమునఁ బాత్రలుపయోగించు భాష విషయమునఁ గొన్ని నియమము లేర్పఱిచిరి. బ్రాహ్మణులును, నాయకులును, రాజులును శుద్ధ సంస్కృతము నుపయోగింతురు. స్త్రీలును, నీచజనులును బ్రాకృతము నుపయోగింతురు. మఱల నీప్రాకృత ప్రయోగవిషయమునఁ గొంత వేఱుపాటు కలదు. కులీనలగు స్త్రీలు గీతములలో మహారాష్ట్రీ ప్రాకృతము నుపయోగింతురు. సాధారణ సంభాషణమున వీరును, బాలాదులును, సేవకులును శౌరసేని నుపయోగింతురు. అంతఃపురపరిచారకులు మాగధిని, నీచసేవకులు పైశాచిని వాడుదురు. ఇట్లు పాత్రల యంతరములను బట్టి సంస్కృత నాటకములలో భాషా ప్రయోగము నియమితమై యున్నది. సర్వసాహిత్య మార్గములందును సంస్కృత ఫక్కినే యనుకరించు నలవాటు కల తెలుఁగువారి కీనిబంధనము కొంత యాటంకము కలిగించినది. ఏల యన సంస్కృతప్రాకృతములవలెఁ దెలుఁగున గ్రాంథిక గ్రామ్య భాషలు రెండును వ్యాకరణ పరిసంస్కృతములై యుండలేదు. తెలుఁగున గ్రామ్యమునకు స్థిరమైన యాకృతి లేదు. కాఁగా సంస్కృతనాటక కర్తలు ప్రాకృతమును, దద్భేదములను నుపయోగించిన చోటులలోఁ దెలుఁగువా రెట్టి భాషావిశేషము నుపయోగింపవలెనో స్పష్టపడియుండదు. పోనీ, లాక్షణికులు చెప్పిన యీ యొక్క నిబంధనము నుల్లంఘించి సర్వపాత్రలకు నొకటే భాష నుపయోగించి నాటకరచనకుఁ గడంగుటకుఁ బూర్వాంధ్రకవుల కంత నిరంకుశత్వమును, స్వాతంత్ర్యమును లేకపోయెను. దీనికి ఫలమే తెలుఁగున నాటకములు తరుణములో వెలువడకుండుట.

సంస్కృత నాటకములైనను ప్రసిద్ధములైనవి సంఖ్యేయములే. అవి పదియవ శతాబ్దికిఁ బూర్వమేమి వ్రాయఁబడెనో కాని తరువాత వాని నంతవిరివిగా వ్రాయఁగడంగినవారు చాల తక్కువ. వ్రాయఁబడిన నాటకములలోఁ గూడఁ బ్రబోధచంద్రోదయమువంటి నాటకము లేయొకటి రెండో తక్క తక్కినవి ప్రసిద్ధికి రాలేదు. ప్రాచీన సంస్కృతనాటకములు కాళిదాసాదుల కాలములో నప్పుడప్పుడు ప్రదర్శింపఁబడుచుండిన నుండవచ్చును కాని తరువాత వానిని బ్రదర్శింపఁబూనినవా రెవరును లేరు. ఏల యన సంస్కృత నాటకములు బహుభాషాభూయిష్ఠము లగుటచే విద్వత్సామాజిక పరిషత్తులకొఱకే యూహింపఁబడినవి కాని నిరక్షరులైన సామాన్యజనుల కొఱకుఁ గాదు. అదిగాక పదియవ శతాబ్దికిఁ దరువాత — అంతకుఁ బూర్వమునుండి సైతము — దేశభాష లధిగమించుచు వచ్చిన యధిక ప్రాధాన్యము కతమున సంస్కృతమునకుఁ బ్రాముఖ్యము తగ్గుచుండెను. ఈ కారణములచే సంస్కృత నాటకముల ప్రదర్శనము లేకుండె ననియే చెప్పవచ్చును. అట్టి ప్రదర్శనము లుండినచో వానిని జూచినప్పుడైన నాంధ్రకవులకు నాటకరచనాభిలాష కలిగియుండెడిదేమో.

నాటకము గద్యపద్యమయమై సారస్వత ప్రయోజనమునే కాక (literary purpose) రంగప్రయోజనమును గూడ (theatrical purpose) కూడ నిర్వహించు కావ్యవిశేషము. ఈ ప్రయోజనద్వితయమునం దేది కొఱవడినను అది సమగ్రమైన, శ్రేష్ఠమైన నాటకము కాఁజాలదు. శ్రవ్యకావ్యములుగా మాత్రము చదివి యానందింపఁదగిన ప్రబోధచంద్రోదయాది నాటకములలో నిట్టిలోపము కొంతవట్టు కానవచ్చును. శ్రవ్యకావ్యములయందు మనోనయన గోచరములు మాత్రమే కాఁదగు కథాజగత్పాత్రలు దృశ్యకావ్యములందుఁ జర్మచక్షుర్గోచరము లగుచుండుటచే నిష్పాదితమగు ప్రత్యక్షతయే 'కావ్యేషు నాటకం రమ్య' మ్మను నానుడికి ముఖ్యకారణము.

శ్రీనాథుఁడు హర్షనైషధము నాంధ్రీకరించి యాతని తరువాతఁ దండోపతండములుగ వెలువడిన ప్రబంధములను నొకజాతి వాఙ్మయమున కాదర్శభూతుఁ డయ్యెను. ఈ ప్రబంధములుకూడ గద్యపద్యమయములై దండిచే నిర్వచింపఁబడిన చంపూకావ్యజాతిలోఁ జేరును. వర్ణనాప్రధానములే యయ్యు నివి శృంగారాదిరస పరిపోషకములై హృద్యముగ నుండును. కాని నాటకములలోఁ గాననగు సంవాదక్రమము గాని, యవి నిర్వహింపఁగల రంగప్రయోజనముగాని వీనియందుఁ జూపట్టవు. పూర్వాంధ్రకవులు రంగపరికరసాహాయ్యముచేఁ బ్రయోజితములైన సంస్కృతనాటకములను గాని, యాంధ్రనాటకములనుగాని చూచి యానందించి యెఱుఁగరు. అందుచేఁ గించిదూనముగా నాటకాకృతినే వహించిన ప్రబంధములఁ బఠించి తదాస్వాదితానందానుభవముచేతనే సంతుష్టులైరి. ఈ కారణముచేతనే పినవీరభద్రాదికవులు సంస్కృతనాటకములను బ్రబంధములుగా ననువదించిరి. దీనినిబట్టి వీరు నాటకములను శ్రవ్యకావ్యములుగానే చూచి వాని సారస్వతప్రయోజనముతో మాత్రమే తుష్టి నొందిరని స్పష్టపడుచున్నది.

విజయనగర వినాశానంతరము తంజావూరు మధురసంస్థానములు ప్రసిద్ధికి వచ్చెను. ఈ సంస్థానముల నాయకులు వాఙ్మయాభిరుచి కలవారై యనేకకావ్యములను దామ వ్రాసియుఁ, దమ యాశ్రితులచేత వ్రాయించియు నాంధ్రభాషను సర్వవిధముల నభివృద్ధిచేసిరి. వీరి పోషణమున యక్షగానములు విరివిగా రచింపఁబడి ప్రదర్శింపఁబడుచుండెను. ఈ యక్షగానములు జక్కుల పాటలు అను తెనుఁగుపదమునకు సంస్కృతరూప మని పండితులూహించుచున్నారు. వీని ప్రాచీనతను నిర్ణయించుటకుఁ దగిన సాధనసామగ్రి యిపుడందు బాటులో లేదు. తొలుఁదొలుత నివి సత్కవి రచితములు కాక నటులచేతనో, మఱి యే స్వల్పపాండిత్యము కలవారిచేతనో వ్రాయఁబడినవచనరూపసంబంధము కల పురాణపద్యములతో విలసిల్లుచుండెను. తరువాత తరువాత వీనిని జను లాదరించుటచే విద్వత్కవులు కూడ స్వతంత్రముగా నిట్టివానిని వ్రాయ నారంభించిరి. వీనిలోఁ గూడఁ బలు తెఱఁగులు కలవు. అందుఁ గూచిపూఁడివారు ప్రఖ్యాతిలోనికిఁదీసికొని వచ్చిన యభినయప్రధానము లైన కలాపము లొకవిధము. ఈయక్షగానము లన్నియుఁ బద్య గద్యమయములై సూత్రధారునిచే నుచ్చరింపఁ దగిన యుపోద్ఘాతపూర్వకము లై నట్టియు, పాత్రప్రవేశసూచకము లై నట్టియు వచనములతో నిండియుండును. కాని వీనిలో నేదియు రసవస్తు నాయక రూపములయందు స్థిరత్వమును గాంచినది కాదు. ఇవి శుద్ధదేశిమార్గమునకుఁ జెందినవి. రూపము నందుఁగాని, లక్షణమునందుఁగాని సంస్కృతనాటకములకును వీనికిని సన్నిహితసంబంధ మేదియుఁ గానరాదు.

ఇప్పు డిప్పుడు మనభాషలో వెలయుచున్న నాటకములకు సంస్కృత రూపకములే యాదర్శకములు. యక్షగానములే యిట్లు పరిణమించిన వనుకొనుట పొరపాటు. ఇంకను ఈ యక్షగానములు కాలక్రమమున మాఱి రూపమునందుఁ గించిద్భిన్నములే యయ్యును హరికథలుగాఁ బరిణమించిన వనుకొనవచ్చును. ఇట్టివి శ్రీనాథుని యుగము నుండియు వ్రాయఁబడి యప్పుడప్పుడు ప్రదర్శింపఁబడుచుండుటచే నప్పటివారు వీని ప్రదర్శనముల నవలోకించుటతోడనే సంతుష్టులై సంస్కృత నాటకములను బోలిన నాటకములను మనభాషలో వ్రాయుటకుఁ బూనుకొనరైరి.

పైఁగా నాటకము లాడుటకుఁ గావలసిన నాటకశాలలు కాని, రంగపరికరములు కాని యప్పు డాంధ్రదేశమున నెచ్చటను లేకుండెను. కృష్ణదేవరాయలవంటి రసికులైన సార్వభౌములుకూడ శ్రవ్య కావ్యపఠనమాత్రముచేతనే తృప్తిఁ గాంచిరి కాని దృశ్యకావ్యములఁ గన్నారఁ జూచి యానందింపఁదగిన యేర్పాటులు కావించియుండలేదు. కృష్ణదేవరాయల సభలో నృత్యములు జరుగుచుండెనని స్వరోచిపురప్రవేశ సందర్భమున మనుచరిత్రలోఁ బెద్దనార్యుఁడు రచించిన 'చిలుకలకొల్కికల్కి యొకచేడియ నాటకశాల మేడపై, నిలువున నిల్చి' అను పద్యమువలనఁ దెలియుచున్నది. కాని యది నాటక సంబంధి యగునో కాదో, యయినను ఆంధ్ర

నాటకములకును, వానికిని గల సంబంధ మెట్టిదో తెలిసికొనుట కాధారములు లేవు. ఇట్లే తంజావూరు రాజుల కాలమునఁగూడ నృత్యగీతాది వినోదములకై యొకశాల నిర్మింపఁబడెను. అది 'సరస్వతీమహాలు' అను పేరితో నిప్పటికిని నిల్చి యా రాజుల కళాభిరుచిని వేనోళ్ల నుద్ఘోషించుచున్నది. ఇందుఁగూడ నాటకసంబంధులుకాని నృత్యములును, ఆ కాలమున విరివిగానుండిన యక్షగానములు భాగవతములు మున్నగువాని ప్రయోగములును జరుగుచుండె ననుట కవకాశము కలదు కాని నాటకములు ప్రయోగింపఁబడె ననుటకుఁ దగిన నిదర్శనములు లేవు.

ఇట్లు నాటక ప్రయోగమునకు ముఖ్యావశ్యకములైన రంగ పరికరాదులు లేకపోవుటచేతను, నాటకపాత్రధారు లార్యధర్మము ననుసరించి సంఘమున నీచముగఁ జూడఁబడుచుండుటచేతను, ప్రభువులు సైతము నాటకకళ నభివృద్ధి చేయ నంతశ్రద్ధ వహింపకపోవుటచేతను ఆనాఁటి కవు లీవాఙ్మయశాఖయం దభిరుచి వహించి కావ్యరచనముచే దానిఁబరిపోషింపఁ బూనుకొనరైరి. ఈ కారణముచేతఁ బ్రజాసామాన్యమునకు నాటకప్రయోగ మెంత నీతిప్రదాయకమో, యెంత ప్రశాంతి ప్రదమో యనునంశము పూర్తిగా విస్మృతమైపోయెను. సంస్కృత నాటక ప్రయోగములు క్షీణించినతరువాత వీథీనర్తకులయొక్కయు (Street dancers), వీథీగాయకులయొక్కయు (Opera singers) సంఖ్య యధికమగుటయు, విద్యావిహీనులగు ప్రాకృతజనులు వాని నాదరించుటయుఁ దటస్థించెను. కాన నాగరులును, విద్యావంతులును వీరియెడ నసహ్యాభావమును బ్రకటించుచుండిరి. ఈ పరిస్థితివలనఁగూడ నాటకవాఙ్మయ మన్నను, దద్రచన మన్నను ఆనాఁటి కవులకు నీరసభావమేకాని గౌరవము లేకపోయెను.

నాటకకళ సంస్కృతమున సమగ్రత్వమును బ్రాపించినది. తల్లక్షణముల సమగ్రముగా వివరించు లక్షణగ్రంథము లందుఁ బెక్కు వెలువడినవి. ఆంధ్రకవులు సంస్కృతకావ్యముల నాంధ్రీకరించినట్లు కొన్ని నాటకముల నాంధ్రీకరింపకపోవుట యటుండ నీ లక్షణగ్రంథములనైనఁ దెలుఁగున వెలయింపరైరి. తెలుఁగుభాషకుఁ, దత్కావ్యములకు స్వల్పముగ లక్షణములను వివరించినవారుకూడ ఈ రూపకలక్షణమును బరిత్యజించిరి. పదుమూఁడవ శతాబ్దియందలి విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణిలో నీరూపకప్రశంస కొలఁదిగనైన నొనర్చియుండలేదు. పదునారవ శతాబ్దియందలి భట్టుమూర్తి నరసభూపాలీయ మను పేర విద్యానాథుని ప్రతాపరుద్రీయమును గొంచెమించుమించుగఁ బరివర్తనము చేయుచు నందలి రూపకప్రకరణమును విడిచివైచెను. ఆంధ్రనాటకరచనము కాని తత్ప్రయోగము కాని లేదుకదా-దానిలక్షణము నియ్యెడ వివరింప నేల యని యతఁ డద్దానియెడ నౌదాసీన్యము వహించియుండును. నిజము పరికింపఁగా నీలాక్షణికులయెడఁ గొంచెమైనను దోషము లేదు. లాక్షణికుఁ డున్న కావ్యములను, దదంతర్భాగములను బరికించి వానికి లక్షణము వ్రాయునేకాని లేనివానికి తానై యొకలక్షణము సృష్టించి భావికవు లీమార్గము ననుసరింపవలె నని శాసించునట్టివాఁడు కాఁడు. అందుచే రూపకనామవాచ్యములగు కావ్యముల యభావముచే లాక్షణికు లాశాఖవాఙ్మయమునకు లక్షణము వివరింపరైరి. లక్షణాభావముచే కవులు రసాశ్రయములైన రూపకములను రచించి యాంధ్రభాషాయోష నలంకరింపరైరి. ఫలితార్థమేమనఁగా-నాటి దేశభాషలలోఁ బెక్కు ఆనాఁడే కళాసర్వస్వములైన రూపకములచే విరాజిల్లుచుండఁగా నాంధ్రమునకు నిన్న మొన్నటిదాఁక నాభాగ్యము లేకపోయినది.

ఇఁక పదునేడవశతాబ్దిలోనివాఁడగు నెలకూచి బాలసరస్వతి తాను రచించిన రాఘవ యాదవ పాండవీయములో 'కవి సమీహిత రంగకౌముదీనామ నాటకవిధాన ప్రతిష్ఠాఘనుండ'నని వ్రాసికొనెను. ఈరంగకౌముది నాటకవిధాన మని చెప్పఁబడుటచే నాటకలక్షణమును నిరూపించు నొక లక్షణగ్రంథ మైయుండవచ్చును. ఆ గ్రంథము నామమాత్రావశిష్టమగుటచే నం దెట్టినాటకములకు లక్షణము విధింపఁబడెనో, యేలక్ష్యమును బట్టి యది వ్రాయఁబడెనో, లేక యది యేదేని సంస్కృతలక్షణమునకుఁ బరివర్తనమో తెలిసికొనుట కవకాశము చిక్కకున్నది. ఆకాలమున యక్షగానములనియెడి ప్రదర్శనోచితమైన వాఙ్మ

యభాగము కొంచెముకొంచెముగాఁ దలచూపుచుండె నని యిదివఱకే చెప్పఁబడినది. ఈరంగకౌముది యట్టి వానిలక్షణమును నిరూపించు గ్రంథ మేమో యని సందేహించుటకు వీలు కలదు. లేదా యిదికూడ నట్టి యక్షగానములలో నొకదాని పే రనుకొన్నను అంత బాధలేదు. అది లక్షణగ్రంథమైనను యక్షగానమైనను దానినామమును బట్టి పదునేడవ శతాబ్దిలో రంగోద్ధరణమునకై కొంత ప్రయత్నము జరుగుచుండె నని మాత్రము విశ్వసింపవచ్చును.

పదునెనిమిదవశతాబ్ది మొదటి వాఁడగు కుందుర్తి వెంకటాచలపతి తన రచించిన కార్తికమాహాత్మ్యములో 'చాటుకృతులును బహువిధనాటకములు ... రచనగావించి పాండ్యవిభుచేఁ బ్రభుత్వసంపదలఁ గనితి' నని వ్రాసికొనెను. ఈతఁడు రచించిన యీ బహువిధ నాటకము లెట్టివో నిర్ణయించుట కవి యుపలభ్యమానములు కావు పైఁగా నితని ప్రభువులును, రసికులు, కవులు, కవి పోషకులు నైన విజయరంగ చొక్క భూపాలాది పాండ్య భూపతులుకూడ నట్టి నాటకముల నభినయింపఁజేసినట్లు కానఁబడదు. ఈతఁడువ్రాసిన యీ నాటకములుకూడ నప్పుడు బహుళ ప్రచారమున నుండిన యక్షగానభేదములే యయి యుండును. కాఁగా మన మిప్పుడు కాంచుచున్న యాంధ్రనాటకములకుఁ బదునెనిమిదవ శతాబ్దిలో నగమువఱకు బీజారోపణము కావింపఁబడలే దని యూహింపవచ్చును.

పందొమ్మిదవ శతాబ్ది యుత్తర భాగమున విజయనగర పురాధీశ్వరు లగు శ్రీమదానందగజపతిమహారాజులుంగారు సంస్కృత నాటకముల సారము చూఱలు గొన్న వార లగుటచే దత్ప్రయోగ దిదృక్షువులై నాటకసంఘము నొకదానిని స్థాపించి శాకుంతలాద్యుత్తమనాటకములఁ గొన్నిటి నభినయింపఁ జేసిరి. తెలుఁగు దేశమున నాటక ప్రదర్శనము లారంభించుట కదియే ప్రథమమని స్థూలముగాఁ జెప్పవచ్చును. కాని యీ యుద్యమము చాలకాల మవిచ్ఛిన్నముగా సాగినదికాదు. మహారాజుగారి మరణముతో నాయనచే స్థాపింపఁబడిన నాటక సంఘముకూడఁ దూష్ణీంభావమును వహింపవలసి వచ్చెను. ఈ కాలమునఁ దెలుఁగు ప్రజలలో నాటకాభిరుచి విస్తరింపఁ జేసిన కొన్ని విశేషపరిస్థితు లంకురించెను. మహారాష్ట్రమునను, దదితర స్థలములందును ఆ కాలమున పార్శీ నాటక సంఘములు బయలుదేరి యీ భాషయందలి నాటకములను విరివిగాఁ బ్రదర్శింప మొదలుపెట్టెను. ఈ నాటక సంఘములు తమతమ దేశములయందే నాటకములను బ్రదర్శించుటతోఁ దృప్తి నొందక తెలుఁగు కన్నడ దేశములకుఁ బోయి కొన్ని నాటకముల నభినయింప నారంభించెను. క్రొత్తగావచ్చిన యీ నాటక ప్రదర్శనము లపారమగు జనసంఖ్య నాకర్షించుచుండెను. ఇట్టి ప్రదర్శనములు తాత్కాలికముగాజరుగుచుండుటచే దెలుఁగువారిలో స్వభాషయందుఁగూడ నట్టినాటకములుకొన్నియుండి ప్రదర్శింపఁబడునో నుత్సాహముతోఁ జూచుట కభిరుచి జనించెను. ఈ పరిస్థితుల నన్నటిని బరికించుచుండిన పండితు లప్పుడప్పుడే సంస్కృత నాటకముల నాంధ్రమునకుఁ బరివర్తింపఁ బూనుకొనిరి. తొలిదినములలో నాంధ్ర వాఙ్మయమువలెనే నాటకవాఙ్మయముగూడ మునుముందు బరివర్తనముతోనే ప్రారంభమగుట యిటఁ బరిశీలింపఁ దగినది.

ఈనాటకముల పరివర్తనపద్ధతికిని, బూర్వకవుల పరివర్తనపద్ధతికిని విశేషతారతమ్య మున్నది. పూర్వకవులు తగినస్వాతంత్ర్యము వహించి పరివర్తనములు సైతము స్వతంత్రములుగాఁ గనిపించునట్లొనర్చిరి. వీ రట్లుగాక నాటకములందలి పద్యములకు ప్రతిపదపరివర్తనముచేయుట కారంభించుటచే నీపద్యముల నడక సామాన్యముగాఁ గుంటుపడి శ్రుతికటువుగా నుండును. వీరు శ్లోకముల నాంధ్రీకరించునట్లు నందలిపదము లెల్లఁ బరివర్తితము లైనవో లేదో పరిశీలింతురు కాని యందలిభావములు మూలమునందువలె సులభద్యోతకమై సమగ్రముగా వ్యక్తములైనవో లేదో చూడరు. అందుచే నీ పద్యములు కొన్నిచోట్లఁ గేవల నీరసపదముల సముదాయమువలెఁ దోఁచును. పైఁగా వీరు భావవ్యక్తి కంత ప్రాధాన్యము నీయకపోవుట చేతను,మూలముకంటె పరివర్తనము సులభముగ నున్నచో తమ పాండిత్యమునకు భంగము వాటిల్లు నను భ్రాంతిచేతను మూలములోని పదముల

కంటెం గ్లిష్టతరములైన పదముల నీ పరివర్తనములయందువాడఁజూతురు. అందుచే మూలసాహాయ్యము లేనిదే వీరిపరివర్తనముల సంపూర్ణభావము చదువరులకుఁ దెలియనే తెలియదు. అనువాదకుఁ డెంత యసామాన్య ప్రజ్ఞకలవాఁడైనను ననువాదము గుణమునందును, అర్థసౌలభ్యమునందును, రసస్ఫురణయందును మూలమునంత పటువుగా నుండుట దుర్లభము. అందును పైని చెప్పఁబడినయట్టి దోషములుకూడఁ గొన్ని యుండినచోఁ బరివర్తనములు మూలములతోఁ బోల్చి చూచిన మిక్కిలి నీరసములై కానవచ్చును. ఈ కారణముచేతనే సంస్కృతనాటకములు పూర్వకవులచే నాంధ్రీకరింపఁబడలేదని తెలుఁగువారికి విచారము.

ఎట్లైనను సంస్కృతనాటకముల పరివర్తనము ప్రారంభ మగుటతోడనే యాంధ్రవాఙ్మయమున నొక నూతనోత్తేజము పొడసూపినది. ఆ కాలమున మచిలీపట్టణమున నుపాధ్యాయులుగా నున్న శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు నాటకాభావముచే మన వాఙ్మయమునకుఁ గల్గిన తీరని కొఱంతను వారింప భట్టనారాయణుని వేణీసంహారనాటకము నాంధ్రీకరించిరి. కాని యేకారణముచేతనో యా పరివర్తనము ముద్రితము కాలేదు. (వీరు 'మధుకరీమంజరియ' మనుస్వతంత్రనాటకమునుగూడ రచించిరి. తరువాతఁ జెన్ననగర నివాసులగు శ్రీ కొక్కొండ వెంకటరత్నముపంతులుగారు ధర్మభట్టకృతమైన నరకాసురవిజయవ్యాయోగము ననువదించి ప్రకటించిరి. ఈకాలముననే విశాఖపట్టణస్థులగు శ్రీ పరవస్తు వెంకటరంగాచార్యులుగారు కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలము నాంధ్రీకరింప నారంభించి యందలి కొంతభాగమును దాము ప్రకటించుచుండిన మాసపత్రిక ముఖమున వెలువరించిరి. కాని యా గ్రంథ మసంపూర్ణముగ నుండఁగనే యాచార్యులుగారు దివంగతులగుటచే నది యట్లే యుండిపోవలసివచ్చెను. తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగా రా నాటకమునే తమ నిసర్గమధురమైన శైలిలో రచించి తొలుత వివేకవర్ధనీ పత్రికా మూలమునను, దరువాతఁ బుస్తకరూపమునను వెలయించిరి. వీ రిట్లు సంస్కృతనాటకములను మఱికొన్నింటిని దెలిఁగించుటయే కాక యాంగ్లేయ మహాకవి యగు షేక్స్పియరు రచించిన మర్చెంటు ఆఫ్ వెనిస్ (Merchant of Venice), కామెడీ ఆఫ్ ఎర్రర్సు (Comedy of Errors) అను నాటకములనుగూడఁ దెలుఁగునకుఁ దర్జుమా చేసిరి. ఈ కాలముననే శ్రీగురుజాడ రామమూర్తిపంతులుగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు మొదలగు మఱికొందఱు పండితులు సంస్కృతాంగ్లములనుండి మఱికొన్ని నాటకముల ననువదించి ప్రకటించిరి. వీరేశలింగముపంతులుగా రిట్లు నాటకములను రచించుటయేకాక యొకనాటకసంఘమును గూడ స్థాపించి తమ రత్నావళిని, Comedy of Errors ను అప్పుడప్పుడభినయింపఁజేయుచుండిరి. ఇట్టి సంఘములు మఱికొన్ని విశాఖపట్టణము, విజయనగరము మొదలగు పెద్దపెద్ద పట్టణములలో స్థాపింపఁబడి యచ్చటి ప్రజలను బరివర్తితనాటకముల ప్రదర్శనములచే నానందింపఁజేయుచుండెను. గుంటూరిలో శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్యముగా రిట్టి సంస్థనే యొకదానిని నెలకొల్పి తాము గావించిన పరివర్తనములను, పౌరాణిక కథావస్తువిలసితము లగు స్వతంత్రనాటకములను బ్రదర్శింపఁజేయుచుండిరి.

ఈ కాలముననే (1880 మొదలు) బళ్లారినగరమున సరసవినోదినీ సభయనియును, సుమనోరమా సభయనియును రెండు నాటకసంఘము లేర్పడి మిక్కిలి సమర్థులును, నాటకరచనాప్రదర్శనములయం దసమాన ప్రతిభాశాలులును నగు నిరువురు న్యాయవాదులచే జయప్రదముగాఁ గొనసాగింపఁబడుచుండెను. వీ రిరువురును సంస్కృతనాటకములఁ బరివర్తించుజోలికిఁ బోక చరిత్రము నుండియుఁ, బురాణప్రబంధముల నుండియు వస్తువులను గ్రహించి పెక్కునాటకములను రచించిరి. ఆంగ్లగీర్వాణాంధ్ర భాషలయం దసమానవైదుష్యము కలవా రగుటచే వీరి నాటకములయం దాంగ్ల సంస్కృతసరణులు రెండును గానవగును. ఆంగ్లభాషా సంప్రదాయము ననుసరించి యిరువురును విషాదాంత నాటకములు (Tragedies) రచించిరి. వానిలో రామకృష్ణమాచార్యుల విషాద సారంగధరమును, శ్రీనివాసరాయలవిజయనగరరాజ్యపతనమును

నాంధ్రు లందఱు నెఱింగిన వే. ఈకవు లిరువురును గొంచె మించుమించుగా సమకాలికులును, సహపౌరులును నగుట వీరినిగూర్చి యొక విషయము చెప్పవలసియున్నది. అది వీరినాటక వస్తువుల సమానభావము. పరస్పరస్పర్ధచేతనుబలె వీరిలో నొకరు నాటకీకరించిన వస్తువునే రెండవవారును మరల గ్రహించి నాటకముగా వ్రాయుట కాననగును. వీరిరువురును మంచి నటకులుకూడ నగుటచేఁ దమ రచించిన నాటకములను దాము స్థాపించిన నాటక సమాజములచే బళ్లారి, మదరాసు మున్నగు పట్టణములలోఁ బ్రదర్శించుచుండిరి. వీరు రచించిన నాటకములు పెక్కు అముద్రితములైనను అప్రదర్శితములైనవి తక్కువ. ఆంధ్రనాటక వాఙ్మయమున కింత రూప మొసంగి ప్రాణముపోసిన యీ మహనీయమూర్తు లిరువురు నాంధ్రులకుఁ జిరస్మరణీయులు. అచ్చటచ్చట నాంగ్లనాటక పద్ధతుల ననుసరించిన వీరి నాటకములలో సంస్కృతనాటక ప్రాతికూల్యము కొంత కానవచ్చుటచేఁ బండితులకు వీరి నాటకములపై నంత యభిమానము లేకున్నను బ్రదర్శనకాలమున నివి యాకర్షించు ప్రేక్షకసమూహమే వీరి నాటకముల యభిరంజకత్వమునకుఁ దార్కాణము. ఏ కారణముచేతనో శ్రీనివాసరాయల నాటకములకుఁ గృష్ణమాచార్యులవారి నాటకముల కున్నంతవ్యాప్తి కానరాదు. వారు రచించిన నాటకములన్నిటిలో విజయనగర రాజ్యపతనముమాత్రమే యెడపదడప ప్రదర్శింపఁబడుట కాననగును. ఆచార్యులుగారి నాటకములలోఁ బ్రదర్శనానుకూల్యము మెండగుటచేఁగాఁ బోలును జనాదరముబడయని నాటకమే లేదు. ఇట్లు నాటకము లనినఁ దెలుఁగుప్రజలకును, గవులకును విశేషాభిరుచిని గలిగించిన యీ పార్శీ నాటక సంఘములు ప్రశంసనీయములు. తరువాత బయలుదేరిన కవులు కేవల పరివర్తనములతోఁ దృప్తిపడక సంస్కృత మార్గానుసారముగనే కొన్ని స్వతంత్రనాటకములను వ్రాయఁబూనిరి. ఆధునికులు వ్రాయుచున్న నాటకములలో నాంగ్లవంగభాషాప్రభావము కూడ సుంత గోచరించుచున్నది.



# పండిత డి. గోపాలాచార్యులవారి

# 3



## జీవామృతము

కుటుంబానికి ఆధారభూతుడైన పురుషునికి ఆరోగ్యము, బలము నొసంగి, పనిఒత్తిడివల్ల, మరియే యితర చింతలవల్ల క్రుంగకుండా కాపాడుతుంది.

ప్రఖ్యాతి చెందిన -

ఔషధములు -



## అరుణ

గృహలక్ష్మి, స్త్రీ సహజమైన వ్యాధులకు గురికాకుండా చేస్తుంది. గర్భాశయరోగములను నివారించి, బలమిస్తుంది.

ప్రతికుటుంబమునకు -

అత్యవసరములైనవి -

★

**1898**

నుండి

ప్రసిద్ధి చెందినవి

★



## బాలప్రాశ

పసిపిల్లలకు, రుచికరమైన బలవర్ధకౌషధము. తల్లి అక్కటే బాధపడకుండా పిల్లలు దినదిన ప్రవర్ధమానమయేందుకు తోడ్పడుతుంది.

అన్ని మందులషాపుల్లో దొరకును

# ఆయుర్వేదాశ్రమము

**151,** గోవిందప్పనాయక వీధి :: :: :: పి. బి. **287.** మద్రాసు.




ఎడారియోడ

రంగుకాగితములముక్కల
నతికించి తయారుచేసిన చిత్రము.

చిత్రకారుడు : శ్రీ కె. తణికాచలం.

# రాసలీల - గోపికలు

## రాసక్రీడలోని అంతరార్థము
## గోపికల ప్రేమయందలి గూఢతత్త్వము

శ్రీ సముద్రాల రాఘవాచార్యులు

సర్వాంగీణముగా కృష్ణదాసులై, సర్వమును కృష్ణమయముగా భావించి, ఇహమునందును పరమునందును ప్రాప్యప్రాపకము లన్నియు శ్రీకృష్ణుడుగానే యెంచి నిరుపాధికమైన భక్తిసామ్రాజ్యమునకు అధికారిణులై వెలయుచున్న గోపికల సౌశీల్యమునకు వంకపెట్టుట సంప్రదాయజ్ఞాన అపరిజ్ఞతకు గుర్తు.

రాసక్రీడ యన్న శబ్దము విన్నపుడు క్రీడావిశేష మగు రాసలీల స్ఫురించును. కాని – గోపీకృష్ణచరిత్రాత్మక మగు రాసలీల లేనిచో ఆనాట్యము జీవరహితము కాఁగలదు. అందులకే ఈవ్యాసమునకు "రాసలీల – గోపికలు" అని పేరుపెట్టవలసి వచ్చినది. రాస మనగా స్త్రీపురుషులు చేతులు పెనవైచికొని మండలాకారముగా నేర్పడి చేయు నృత్యమని నాట్యశాస్త్రము వలన ద్యోతక మగుచున్నది. సగటున కృష్ణచరిత్రలో రాస మని వ్యవహరింపబడుచున్నను భిన్నగ్రంథములలో ఈసందర్భమున హల్లీసక మను శబ్దముగూడ ప్రయోగింపబడియున్నది. ఈ శబ్దమునకుగూడ నాట్యాచార్యులు పైయర్థమునే వ్రాసియున్నారు. ఏపేర్లతో వ్యవహరించినను అందలి తత్త్వములో మాత్రము భేదము కానరాదు.

### రాసలీల రామణీయకత

కృష్ణచరిత్ర ప్రతిపాదకములైన పురాణములలో పెక్కింట రాసలీల వర్ణింపబడియున్నది. రాసలీల తెలుగుదేశమునందే కాక భారతదేశమునందలి అనేక ప్రాంతములలో జానపద నృత్యములలో, వినోదములలో ప్రముఖస్థానము నందియున్నది. అది రమణీయదృశ్య మనుట కట్టి సందియమును లేదు. ఆనాడు శ్రీకృష్ణుడు గోపికలతో రాసలీల సలిపినప్పుడు సకల దేవతలును సకుటుంబముగా వచ్చి దర్శించి ధన్యులైనట్లు భావించిరన్నచో దాని వైభవము, దానిలో గల ఆనందము ఇట్టిదని వేరుగా చెప్ప నక్కఱయుండదు. ఆ కారణమువలననే ఈవ్యాసమున విశేషించి పరామృశింపబడుచున్నది.

### వాఙ్మయములో దానిస్థానము

రాసలీల వైష్ణవతత్త్వమునందేగాక వాఙ్మయమునందుగూడ మనోహరమైనది. అది కృష్ణోపాసకులచేత విశ్వసాహిత్యమున నత్యున్నతస్థానమున నుంపబడియున్నది. దానియందనిర్వచనీయమును, నతిమానుషమును నగు పరమార్థ మిమిడియున్నదని వారి వివరణము. సత్యమున కది శ్రీకృష్ణపరమున లీలామాత్రముగా నున్నను గోపీపక్షమునం దీశ్వరోపాసనావిలసితమే కాఁగల దని పరిశీలనము వలన తెలిసికొనబడుచున్నది. విదేశీయులును, విమతస్థులును నగువారు కొందరీ విలాసము దోషజుష్ట మనియు, నీపరమార్థమునందు క్షుద్రమైన కామాంకము లున్నవనియు నిందించుచున్నారు. సగుణోపాసకులు దానిని పరిరక్షించుకొన లేకపోలేదు. ఎంతయో తత్త్వార్థవివరణమును, తర్కమును నుపయోగించిరి. రసమూర్తుల కౌసత్యము మనోగోచరమైనది.

### బ్రహ్మవైవర్తపురాణమునందలి రాసక్రీడావర్ణనము

"నందరాజదత్తమగు శ్రీకృష్ణపరబ్రహ్మమును కవుగిట నదుముకొని రాధాదేవి పరమానందముతో నాకాళిందీతీరభూములలో పర్యటింపసాగినది. పరమాత్మ భౌతికసృష్టియందలి సౌందర్యసారమును నిగ్గులుతీర్చి యాచిన్నిబాలునకు వర్ణించి చూపుచుండెను. తత్పరోక్షమున నాతనికై తానెన్ని యిడుమపాటులు గుడిచినదియు, తానెంత విలపించినదియు చెప్పినట్లు చెప్పక, చేసినట్లు చేయక, ప్రియుని గాఢపరిరంభణము ననుభవించురీతి, ఉపాసితమగు దైవము తన చేతులలో పడినయట్లు ఒకరకమైన యానందమును, తన్మయతను, పారవశ్యమును నభినయించుచు, ఆనందనికేతనమగు నికుంజసదనమునకు గొంపోయెను. రాధ అపుడు రాసమండలమును స్మరించెను. తోడనే వనమండలము మనోహరవిహారభూమిగా మారిపోయెను. వెంటనే కవుగిటిలోనున్న శ్రీకృష్ణుడు కిశోరమూర్తియై గోలోకమునందలి కథను స్మృతికి గొనివచ్చి దానిని నెర

వేర్పేద నని సరసాలాపము లాడుచుండగా బ్రహ్మ యా ప్రదేశమునకు వచ్చి రాధాకృష్ణుల ననేకవిధముల స్తుతించి, స్వయముగా దాను గన్యాప్రదాతయై వా రిరువురకును యథాశాస్త్రముగా వివాహము గావించెను. బ్రహ్మ యంతర్హితుడైన పిదప వారు రాసమండలవిహారము గావించిరి."

## ఇతర గ్రంథములందలి వర్ణన

బ్రహ్మవైవర్తమునందలి పైరాసక్రీడకును ఇతర గ్రంథములయందలి రాసక్రీడకును పోలిక లేదు. విష్ణుపురాణ, భాగవత, హరివంశములందుగూడ రాసవిహారము వర్ణింపబడియున్నను వానియందు రాధాప్రస్తావము గానరాదు. అయినను రాసక్రీడనుగురించిన ప్రస్తావము రాధాచరిత్రమునందు ప్రాముఖ్యము వహించియున్నది. రాధాతత్వనిష్పత్తియందు రాసమండలమునకును, రాధకునుగల సంబంధము వ్రాయబడియున్నది. రాధాకృష్ణు లధిష్ఠానములుగా కల్పింపబడియున్న నూతన వైష్ణవదర్శనమునందు రాసము విశిష్ట స్వరూపము గాంచియున్నది. కనుక రాసమండలమునందలి రాధాకృష్ణ(గోపికాకృష్ణ) సంబంధమును సమన్వయించి చూడనిచో విషయము మనకు సుబోధము గాజాలదు.

రాసక్రీడావిమర్శన మన్న నాధునిక కృష్ణోపాసకులకు ఆరాధనాంతిమావస్థగానున్న గోపికాకృష్ణసంబంధపరామర్శన మని తలంపవలయును.

ప్రాచీన సంస్కృత వాఙ్మయమునందు శ్రీ కృష్ణచరిత్రప్రతిపాదక మైన మొదటి గ్రంథము మహాభారత మని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. దానియందు గోపికాకృష్ణ సంబంధము బహిరంగముగా కన్పించకపోవుటచేత నిది కల్పితము కావచ్చునని చరిత్రకారులలో కొందరి యూహ. ఏమైనను కృష్ణుని 'గోపీజనప్రియత్వము'ను భారత మంగీకరించుచున్నది. మహాభారత మతరువాత నీ విషయమున ప్రమాణగ్రంథము విష్ణుపురాణము. దానిలో పంచమాంశమున బదమూడవ యధ్యాయమునందు గోపీకృష్ణచరిత్ర మభివర్ణింపబడియున్నది. మహాభారతఖిలగ్రంథమగు హరివంశములో ఇరువదియవ అధ్యాయమున పై యితివృత్తము వర్ణింపబడియుండుట గానవగును. ఈ రెండును వేర్వేరు గ్రంథములలో నొకడే మహాకవి–కాదు, మహర్షి–నిర్వచించిన సిద్ధాంతములు. వీని పరస్పరైక్యమును విచారించినపిమ్మట శ్రీ భాగవతములోని రాస పంచాధ్యాయిని గూర్చి విమర్శించుట సమంజసము. ఆ రెండుగ్రంథములలోని రాసలీలావర్ణనము క్రింద పొందు పరుపబడుచున్నవి:

"కృష్ణస్తు విమలం వ్యోమ
శరచ్చంద్రస్య చంద్రికాం,
తథా కుముదినీం ఫుల్లా
మామోదితదిగన్తరాం.

వనరాజీం యథాకూజ
ద్భృంగమాలాం మనోరమాం,
విలోక్య సహగోపీభి
ర్మనశ్చక్రే రతింప్రతి.

సహ రామేణ మధుర
మతీవ వనితాప్రియం
జగౌ కలపదం శౌరి
ర్నానాతంత్రీకృతస్వనం.

రమ్యం గీతధ్వనిం శ్రుత్వా
సంత్యజ్యావసథాం స్తదా,
ఆజగ్ము స్త్వరితా గోప్యో
యత్రాస్తే మధుసూదనః.

శనైశ్శనై ర్జగౌ గోపీ
కాచిత్ తస్య లయానుగం
ద త్తావధానా కాచిత్తు
తమేవ మనసా స్మరన్.

కాచిత్ కృష్ణేతికృష్ణేతి
ప్రోక్త్వా లజ్జాముపాగతా
యయౌచ కాచిత్ ప్రేమాన్ధా
తత్పార్శ్వ మవిలజ్జితా.

కాచిదావసథస్యాంతః
స్థితా దృష్ట్వా బహి ర్గురూన్,
తన్మయత్వేన గోవిందం
దధ్యౌ మీలితలోచనా.

తచ్చింతావిపులాహ్లాద
క్షీణపుణ్యచయా తథా
తదప్రాప్తిమహాదుఃఖ
విలీనాశేషపాతకా.

చింతయంతీ జగత్సూతిం
పరబ్రహ్మస్వరూపిణం,
నిరుచ్ఛ్వాసతయా ముక్తిం
గతాన్యా గోపకన్యకా.

గోపీపరివృతో రాత్రిం
శరచ్చంద్రమనోరమాం,
మానయామాస గోవిందో
రాసారంభరసోత్సుకః,

గోప్యశ్చ బృందశః కృష్ణ
చేష్టా స్వాయత్తమూర్తయః,
అన్యదేశం గతే కృష్ణే
చేరుర్బృందావనాంతరం

* * *

తతో దదృశు రాయాంతం
వికాసిముఖపంకజం,
గోప్య స్త్రైలోక్యగోప్తారం
కృష్ణ మక్లిష్టచేష్టితం,

కాచిదాలోక్య గోవింద
మాయాంత మతిహర్షితా,
కృష్ణకృష్ణేతికృష్ణేతి
ప్రాహ నాన్య ముదైరయత్,

కాచిత్ భ్రూభంగురం కృత్వా
లలాటఫలకం హరిం
విలోక్య నేత్ర భృంగాభ్యాం
పపౌ తన్ముఖపంకజం.

కాచిదాలోక్య గోవిందం
నిమీలితవిలోచనా,
తస్యైవరూపం ధ్యాయంతీ
యోగారూఢేవ చాబభౌ.

తతః కాచి త్ప్రియాలాపైః
కాశ్చిత్ భ్రూ భంగవీక్షణైః,

నిస్యైఽమనయమన్యాశ్చ
కరస్పర్శేన మాధవః.

తాభిః ప్రసన్నచిత్తాభి
ర్గోపీభిస్సహ సాదరం
రరామ రాసగోష్ఠీభి
రుదారచరితో హరిః.

రాసమండలబంధోఽపి
కృష్ణపార్శ్వ మనుజ్ఝతా,
గోపీజనేన నైవాభూ
దేకస్థానస్థిరాత్మనా,
హస్తే ప్రగృహ్య చైకైకాం
గోపికాం రాసమండలీం,
చకార తత్కరస్పర్శ
నిమీలితదృశాం హరిః.

తతః ప్రవవృతే రాస
శ్చలద్వలయనిస్వనః,
అనుయాతశరత్కావ్య
గేయగీతి రనుక్రమాత్.

కృష్ణశ్శరచ్చంద్రమసం
కౌముదీం కుముదాకరం
జగౌ గోపీజనస్త్వేకా
కృష్ణనామ పునఃపునః.

పరివృత్త శ్రమేణైకా
చలద్వలయలాపినీం,
దదౌ బాహులతాం స్కంధే
గోపీ మధునిఘాతినః.

కాచిత్ ప్రవిలసద్బాహుః
పరిరభ్య చుచుంబ తం
గోపీగీతస్తుతివ్యాజ
నిపుణా మధుసూదనం.

గోపీకపోలసంశ్లేష
మభిపత్య హరేర్భుజౌ
పులకోద్గమసస్యాయ
స్వేదాంబు ఘనతాం గతౌ.

రాసగేయం జగౌ కృష్ణ
యావత్ తారతరధ్వనిః,
సాధు కృష్ణేతి కృష్ణేతి
తావద్వా ద్విగుణం జగుః.
గతేఽనుగమనం చక్రుః
వలనే సమ్ముఖం యయుః,
ప్రతిలోమానులోమాభ్యాం భేజు
ర్గోపాంగనా హరిం.

స తథా సహ గోపీభి
రరామ మధుసూదనః,
యథాబ్దకోటిప్రమితః
క్షణస్తేన వినాభవత్.

తా వార్యమాణాః పతిభిః
పితృభిర్భ్రాతృభిస్తథా,
కృష్ణం గోపాంగనా రాత్రౌ
రమయంతి రతిప్రియాః.

సోఽపి కైశోరకవయో
మానయన్మధుసూదనః,
రేమే తాభి రమేయాత్మా
క్షపాసు క్షపితాహితః."

—విష్ణు. పంచమాంశ. ౧౩ అధ్యా.

ఈక్రింది శ్లోకములు హరివంశము లోనివి:

"కృష్ణస్తు యౌవనం దృష్ట్వా
నిశి చంద్రమసో వనం
శారదీంచ నిశాం రమ్యాం
మనశ్చక్రే రతిం ప్రతి.

స కరీషాంగరాగాసు
వ్రజరథ్యాసు వీర్యవాన్,
వృషాణాం జాత దర్పాణాం
యుద్ధాని సమయోజయత్.

గోపాలాంశ్చ బలోదగ్రాన్
యోధయామాస వీర్యవాన్
వనే స వీరో గాశ్చైవ
జగ్రాహ గ్రాహవద్విభుః.

యువతీర్గోపకన్యాశ్చ
రాత్రౌ సంకాల్య కాలవిత్
కైశోరకం మానయన్ వై
సహ తాభిర్ముమోద హ.

తాస్తస్య వదనం కాంతం
కాంతా గోపస్త్రియో నిశి,
పిబంతి నయనాక్షేపై
ర్గాం గతం శశినం యథా.
హరితాలార్ద్రపీతేన
స కౌశేయేన వాససా,
వసానో భద్రవసనం
కృష్ణః కాంతతరోఽభవత్.

స బద్ధాంగదనిర్యూహ
శ్చిత్రయా వనమాలయా,
శోభమానోఽహి గోవిందః
శోభయామాస తద్వ్రజం.

నామ దామోదరేత్యేవం
గోపకన్యాస్తదాబ్రువన్,
విచిత్రం చరితం ఘోషే
దృష్ట్వా తత్తస్య భాస్వతః.

తాస్తం పయోధరోత్తుంగై
రురోభిః సమపీడయన్,
భ్రామితాక్షైశ్చ వదనై
ర్నిరీక్షంతే వరాంగనాః.

తా వార్యమాణాః పితృభి
ర్భ్రాతృభి ర్మాతృభి స్తథా
కృష్ణం గోపాంగనా రాత్రౌ
మృగయంతే రతిప్రియాః.

తాస్తు పంక్తీకృతాస్సర్వా
రమయంతి మనోరమం,
గాయంత్యః కృష్ణచరితం
ద్వంద్వశో గోపకన్యకాః.

కృష్ణలీలానుకారిణ్యః
కృష్ణప్రణిహితేక్షణాః,
కృష్ణస్య గతిగామిన్య
స్తరుణ్యస్తా వరాంగనాః.

వనేషు తాళహస్తాగ్రైః
కుటయంత స్తథాపరాః,
చేరుర్వై చరితం తస్య
కృష్ణస్య వ్రజయోషితః.

తాస్తస్య నృత్యం గీతంచ
విలాసస్మితవీక్షితమ్,
ముదితాశ్చానుకుర్వన్త్యః
క్రీడంత్యో వ్రజయోషితః.

భావనిష్యందమధురం
గాయంత్యస్తా వరాంగనాః,
వ్రజంగతాస్సుఖం చేరు
ర్దామోదర పరాయణాః.
కరీష పాంశుదిగ్ధాంగా
స్తాః కృష్ణ మనువవ్రిరే,
రమయంత్యో యథా నాగం
సంప్రమత్తం కరేణవః.
తమన్యాభావవికచై
ర్నేత్రైః ప్రహసితాననాః,
పిబంత్యతృప్తా వనితాః
కృష్ణం కృష్ణమృగేక్షణాః.
ముఖం యస్యాబ్జసంకాశం
తృషితా గోపకన్యకాః,
రత్యంతరగతా రాత్రౌ
పిబంతి రతిలాలసాః.
హాహేతి కుర్వతస్తస్య
ప్రహృష్టాస్తా వరాంగనాః,
జగృహుర్నిస్సృతాం వాణీం
నామ్నా దామోదరేరితాం.
తాసాం గ్రథితసీమంతా
రతిం శ్రాంత్యాకులీకృతాః
చారు విస్రంసిరే కేశాః
కుచాగ్రే గోపయోషితాం.
ఏవం స కృష్ణో గోపీనాం
చక్రవాలైరలంకృతః,
శారదీషు సచంద్రాసు
నిశాసు ముముదే సుఖీ."

—హరివంశము, 20 అధ్యాయము.

## ఆవర్ణనలలోని సామ్య, వైషమ్యములు

పై రెంటియందును సామ్యమెంతయున్నదో విభిన్నతకూడ నంతగానున్నది. విష్ణుపురాణమునందలి వర్ణనములో నుపయోగింపబడిన 'రమ్' ధాతువుయొక్క అన్ని రూపములకును క్రీడార్థము చెప్పినయెడల నిందు లేశమైనను నింద్యకామము స్ఫురింపకపోవుటటుండ పరిపూర్ణమగు భక్తియోగము ప్రకాశిత మగుచున్నది. రెండు గ్రంథభాగములను జాగ్రత్తగా పోల్చిచూచినచో కవితాగాంభీర్యౌదార్యములందు విష్ణుపురాణకారునికంటె హరివంశకారుడు కొంచెము లోజ్జుగా గాన్పించుచున్నాడు. విష్ణుపురాణమునందు పరమభక్తిప్రదర్శనమునం దుపయుక్తములైన భావములను అనువదించుటలోను, విరళించుటలోను హరివంశకారుడు ఒడుదొడుకులలో బడి మొత్తముమీద వలపుపొలమును ద్రొక్కి చూడకుండజాలకపోయెను. పై రెండు గ్రంథములలోని భేదమును సంగ్రహముగా చెప్పుచు విష్ణుపురాణమున జపలబాలిక లానందచంచల లనియు, హరివంశమున విలాసప్రియ లనియు బంకించంద్రుడు నుడివియున్నాడు. రాసక్రీడాసంబంధమగు నితివృత్తము రెంటియందును సమానముగానే చూపట్టుచున్నది.

## భాగవతకారుని ధోరణి

ఇట్లు భగవద్భక్తి విలాసముగా పై రెండు గ్రంథములందును వర్ణింపబడియున్న గోపికాకృష్ణసంబంధప్రకాశకమగు నీరాలి లీలను భాగవతకారుడెట్లు రచించెనో మనము గమనింపగల్గియున్నచో నిందలి నిగూఢతత్వము సుబోధము కాగలుగుచున్నది. భాగవతదశమస్కంధములోని 29-వ అధ్యాయము మొదలు 33-వ అధ్యాయము వరకుగల గ్రంథమునకు రాసపంచాధ్యాయి యని పేరు. అందు మొదటి అధ్యాయమున శ్రీకృష్ణుడు శరచ్చంద్రికామధుర మగు యామినిలో వేణువును పూరించుటయు, ఆ వేణునాదమును విని గోపికలు కృష్ణదర్శనలాలసలై పరువెత్తికొనిపోవుటయు, అటులరుదెంచిన గోపికలనుగాంచి లోకవిరుద్ధముగా నిట్లిలు వెడలి వచ్చుట ధర్మసమ్మతము గాదని కృష్ణుడు ధర్మోపన్యాసము గావించుటయు, వారు (గోపికలు) తమరాకయందలి యౌచిత్యమును భక్తిమూలమున రక్షించికొనగా నాతడు సంతృప్తుడై వారలతో నాత్మారాముడై క్రీడించుటయు వర్ణింపబడియున్నది.

అందులోనే రెండవ యధ్యాయమున కృష్ణాన్వేషణమును, మూడవదానిలో గోపికాగీతలును, నాల్గవదానిలో శ్రీకృష్ణుని పునర్దర్శనమును వర్ణింపబడియున్నవి. ఈ మూండధ్యాయములలోను సూక్ష్మముగా పరిశీలించి చూచినచో వైషయికవ్యవహారము కన్పింపదని చెప్పుటకు వలనుపడదు. ఇక కడపటిదగు ముప్పదిమూడవయధ్యాయమున రాసక్రీడ వర్ణింపబడియున్నది. వర్ణనాంశములందు పైరెండు పురాణములకును దీనికిని సామ్యమున్నను ఆదర్శమునందు కొంచెము భేదము కన్పించుచున్నది. గోపికలు శ్రీకృష్ణుని పతిగా వరించుటచేత గాబోలు నా సందర్భములలో నింద్రియ సంబంధమైన కామము పరిలక్షితము గాక తప్పలేదు. బ్రహ్మవైవర్తమునందుగూడ భక్తిపారమ్యముకంటె శృంగారమే విపులముగా వర్ణింపబడియున్నది. గ్రంథవైరళ్యభయముచే నది యంతయు నిచట నుల్లేఖింపబడలేదు.

## విమర్శకుల ప్రతికూలవిమర్శ

పై మూడు గ్రంథములందును కనుపించుచున్న యింద్రియలాలసత్వ మాధారముగా పౌరస్త్యపాశ్చాత్య విమర్శకులు కొందరు శ్రీకృష్ణగోపికాసంబంధము కామజుష్టమనియు, భక్తిదూరమనియు చెప్పుచున్నారు. ఆవాదములోని గుణాగుణవిచారము మన కప్రకృతము గాజాలదు.

## గోకులలీలల సింహావలోకనము

గోపికాచరిత్రలోని పరమాదర్శమగు నీభాగమును సమన్వయింపవలసివచ్చినపుడు శ్రీకృష్ణుని గోకులలీల నంతయు నొక్కసారి సింహావలోకనము చేయకతప్పదు. బృందావనమున నవతరించిన గోగోపగోపికలందరును శ్రీరామావతారమునాటి మహర్షులును, స్త్రీలును, వేదములును నని గర్గసంహితలో గలదు. గోలోకమునుండి రాధికాగోపీయూథములును, గోగోపాలురును శ్రీకృష్ణకైంకర్యమునకై యవతరించియుండినట్లు బ్రహ్మవైవర్తమునందు వ్రాయబడియున్నది. దాని

# రోజ్ డౌన్స్

"మాక్సు ఆయిల్" కంటిన్యూయస్ ఆటోమాటిక్

ఆయిల్ యెక్సుపెల్లర్



వివిధరకముల గింజలనుండి నూనెతయారుచేయుటకు చాలనవీనము,

ప్రశస్తమ్మునైన యంత్రము.

పూర్తి వివరములకు ఈ దిగువ అడ్రెసుకు వ్రాయుడు :—

మార్షల్ సన్స్ అండ్ కో., (ఇండియా) లిమిటెడ్,

మార్షల్స్ బిల్డింగు, మదరాసు.

యందలి సత్యాసత్యములతో మనకిట ప్రసక్తి లేదు. కాని– ఈ సందర్భమున మనము తెలిసికొనదగినది బృందావనములోని సమస్త పదార్థములును సాధారణప్రకృతివిభిన్నమైన పవిత్రమూర్తు లనిమాత్రమై యున్నది. శ్రీ కృష్ణుడుకూడ మధురయం దవతరించిన కొన్ని గడియలకే అట విడిచి బృందావనము చేరుటకు గారణము భగవద్వియోగ విహ్వలులగు బృందావన భక్తులను ఆనంద పరచుటకే యని భక్తియోగుల విశ్వాసము. "మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద" యను భగవద్వాక్యము దానిని ధ్రువపరచుచున్నది. అట్లు బృందావనప్రవేశ మొనర్చిన కృష్ణభగవానుడు బృందావనములోని సకల జీవకోటిని తన యప్రాకృతసౌందర్యముచే తన్మయులను గావించెను. ఆ మహానుభావుడు బృందలో కాలు పెట్టినదాది అనేకోత్సవములు, మహత్తరానందములు గోపికల హృదయము నాకర్షించెను. శ్రీ కృష్ణరచితములగు దనుజసంహార కార్యములు వారి హృదయమునందు భగవద్బుద్ధిని కలిగించెను. నవనీతాపహరణాది వృత్తాంతములలో తమకును,మృద్భక్షణాదికములలో యశోదకును గల్గిన యనుభవము పైయూహను బలపరుపజాలియుండెను. ఇట్టు లప్రాకృత సౌందర్యశక్తులచేత గోపులమును ఆనందింపజేయుచున్న కృష్ణునియం దందరును బద్ధానురాగులైరి. ఆ ప్రేమమును నిరంతర సన్నివేశముచేత అతివేలమై నిష్కామముగా పరిణమించుచుండెను. ఇచట నొక్కింత చెప్పవలసియున్నది. ప్రేమము భక్తియొక్క అపరిణతస్వరూపమని భక్తియోగులు. భక్తిని అయిదుతరగతులుగా వారు విభజించియున్నారు.శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురభావములని వానికి పేరు. ఈ పంచభావములను శ్రీ కృష్ణుడు గోపులమునందు ప్రయోగించెను. తన ప్రాకృతలీలారంగస్థలమగు గోపులము నందు శాంతభావమును, సవయస్కులగు గోపబాలురయందును,గోవత్సములయందును దాస్యసఖ్యభావములను, తనకంటె వయోవృద్ధులగు గోపగోపికాజనమునందును, మాతృగోగణమునందును దాస్యవాత్సల్య భావములను,దుర్లభమును,పరమమును నగు మధురభావమును గోపకన్యాగణమునందును ప్రయోగించినట్లు పురాణములవల్ల నవగత మగుచున్నది. ఈ మధురభావమే కాంతాసక్తి యని కొందరు చెప్పుదురు. పూర్వోక్తములైన చతుర్విధభావలక్షణములును పంచమభావమునందు పరిణమించునని వారి సిద్ధాంతము. గోపికలు ఈ పంచభావములలోను చక్కగా నుత్తీర్ణలైరి. శ్రీ కృష్ణుని నిరంతర దర్శన శ్రవణ మననాదులవల్ల వారియందుత్పన్నమైన భక్తిబీజములు క్రమక్రమముగా విప్పారినట్లు బృందావనలీలలు తెలియజేయుచున్నవి.గోపిక లెల్లరును యమునాతీరమున కార్తికమునందు కాత్యాయనీ పూజసలుపునాటికి వారిహృదయములందు సోపాధికమైన సగుణభక్తి విజృంభించియుండెను. వ్రతాంతదినమున శ్రీ కృష్ణపూజా వివశలైన గోపికలు వివస్త్రలై యమునలో స్నానము చేయుచుండగా గోపికాచేలము లపహరించిన వెన్నదొంగధర్మోపన్యాసము గోపికల హృదయవికాసమును వర్ణింపజాలియున్నది. ఇట్టి యుపన్యాసమే యించుక మార్పుతో మునిపత్నులకు గూడ చెప్పబడియున్నది. ఈ యుపన్యాససారము తాను గోపకాంతలయందు ప్రవర్తింపజేయదలచుకొన్న మధురభావము, లేక కాంతాసక్తియొక్క రూపమును సూచించుచున్నది. గోపికావస్త్రాపహరణమునకు దరువాత గొన్ని మాసములు గడచినపిదప రాసక్రీడ జరిగినది. రాసక్రీడాసమయమునకు వారు మధురభావమునుగూడ జీర్ణము కావించికొనిరి. ఐహికసాంసారికములైన యేఅభిమానములు కూడ వారి హృదయోద్వేగము నరికట్టలేకపోయినవి. అందువల్లనే వారు చేయుచున్న గృహకార్యముల నన్నిటిని అంతటంతటనే వదలి కృష్ణమయులై పరువెత్తికొనిపోయిరి. వారిని/ వారి భర్తలుగాని, బాధ్యస్థులగు మరెవ్వరుగాని యరికట్టలేదు. అపరిణతస్థితిలో నున్నవారలు గృహాంగణములనైన ద్రొక్కక యిండ్లయందే కృష్ణధ్యాన నిమీలితలోచనలై యున్నారు. ఇట్లు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః" అను గీతావాక్యతాత్పర్య మీవరకే వారి హృదయనాళములలో కవోష్ణముగా సంచలించుచుండెను. వారు ఈ ప్రపత్తిసిద్ధాంతమును పూర్ణముగా గ్రహించుకొన్నట్లు శ్రీకృష్ణునితో రాసరంగమున గావించిన వారి ప్రత్యాఖ్యానము తెలుపుచున్నది. ఇట్లు సర్వాంగీణముగా కృష్ణదాసులై, సర్వమును కృష్ణమయముగా భావించి, ఇహమునందును పరమునందును ప్రాప్యప్రాపకము లన్నియు శ్రీకృష్ణుడుగానే యెంచి, నిరుపాధికమైన భక్తిసామ్రాజ్యమున కధికారిణులై వెలయుచున్న గోపికల సౌశీల్యమునకు వంకపెట్టుట సంప్రదాయజ్ఞానమునకు దూరము. అట్లు గోపికలు ఆత్మనివేదనాసక్తలై శ్రీకృష్ణునిపొందినపిదప వారి కభిమానము మరల రేకెత్తెను.తద్గర్వనిర్వాపణమైనగాని వారు పొందవలసిన పరమావస్థను పొందజాలరని శ్రీ కృష్ణు డంతర్హితుడయ్యెను. గోపికలు శ్రీకృష్ణ వియోగము నోర్వజాలక ప్రపంచ మంతయు శ్రీకృష్ణమయముగా భావించి యన్వేషించుచు, కొందొకపట్ల తమ్మే శ్రీకృష్ణునిగా భావించికొని తన్మయ లగుచు పరమవిరహాసక్తిని, పునర్విశ్లేషభీరుత్వమును ప్రకటించుచు వాపోవసాగిరి. అప్పుడు శ్రీకృష్ణుడు వారలకు సాక్షాత్కరించి రాసక్రీడ గావించెను.

## రాసక్రీడయందలి అంతరార్థము

ఈ యంశములను రమారమి అన్నిపురాణములును ఏకగ్రీవముగా నంగీకరించుచున్నవి. వీని అంతరార్థమును ప్రకటించుటలో పురాణకారుల వర్ణనాంశములలోను, ప్రదర్శన పద్ధతులలోను భిన్నమార్గము గనుపించుచున్నను రాసక్రీడయందలి నిగూఢతత్త్వము దానినిగానే యంగీకరించి యున్నారని చెప్పకతప్పదు. ఈ రాసక్రీడ కృష్ణుని పక్ష

మున లీలామాత్రమైనను గోపికల పక్షమున ఈశ్వరోపాసనముగా నున్నదని ప్రారంభమునందు నేను వ్రాయుట కిదియే కారణము. ఈ యంశములను హృదయస్థము గావించుకొని సమన్వయించినచో రాసమునందు కామాంకములు కన్పింపవు. శ్రీశుకునివలన రాసపంచాధ్యాయిని విన్న పరీక్షితునకుగూడ పై యంశమునందు సందేహ ముదయింపక పోలేదు. ఆ సందేహమును శ్రీశుకుడు భాగవతమునందే పరిష్కరించియున్నాడు.

## సంశయములు-అపోహాలు

"తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః" అనుపట్టున శ్రీశుకుడు, లేనిచో వ్యాసుడు ప్రయోగించిన జారబుద్ధి యను శబ్దము అపార్థమును విరళించుచున్నదని కొందరి సంశయము. ఈ శ్లోకమును తెలిగించుటలో పోతన మహాకవిగూడ మూలభావమును గమనించినట్లు తోచదు. గోపికలు శ్రీకృష్ణుని జారునిగా భావించి యభిసరించిరని ఆయన చెప్పియున్నాడు. అట్టి తెనిగింపు ప్రకరణమునకు మిక్కిలి విరుద్ధముగా నున్నట్లు తోచుచున్నది. 'తనుభృతాం కిల బంధురాత్మా'యని శ్రీకృష్ణునితో గల తమ సంబంధమును నిరుపాధికమగు ఆత్మసంబంధముగా నిర్ణయించిన గోపికలు శ్రీకృష్ణుని జారునిగా భావించి పొందిరని చెప్పుట సంగత మని యెవరును పలుక సాహసింపరు. సాక్షాత్పరబ్రహ్మమగు శ్రీకృష్ణుడు గూడ అట్టి యవకాశమును గోపికల కొసగి యుండడు.

జారబుద్ధి యను సమాసమును రెండు విధములుగా చెప్పవచ్చును: జార ఏవ బుద్ధిః = జారబుద్ధి యనియు, జారే ఇవ బుద్ధిః = జారబుద్ధి యనియు చెప్పవచ్చును. అనగా జారుడను బుద్ధి జారబుద్ధియగును. రెండవపక్షమున జారునియందు గల బుద్ధి జార బుద్ధి కాగలదు. శ్రీకృష్ణునియందు గోపికలకుండు విశ్వాసము, ప్రేమము పరాత్పరుడనిగాని జారుడని కాదని యిది వరకే చెప్పబడియున్నది. అందువలన మొదటి పద్ధతిని విడిచి రెండవ అర్థమునే తీసికొనుట మంచిది. ఇపుడు శ్రీకృష్ణుని యందు గోపికలకు గల బుద్ధి జారునియందు జారిణికిగల బుద్ధివంటి బుద్ధియని చెప్పినట్లయినది.

## అర్థ నిష్కర్ష

ఈ విషయమునే ధ్రువపరచుచు శ్రుతి 'యోషా జారమివ ప్రియ'మ్మని భక్తివిషయమున పల్కుచున్నది. నారదమహర్షి గూడ సూత్రీకరించుచు భక్తి ప్రశంసలో 'యథా వ్రజగోపీనాం' అని చెప్పియున్నాడు. కావున గోపికలు కామమోహితలై శ్రీకృష్ణుని సంగమమును గోరియుండ లేదని చెప్పవచ్చును.

## శ్రీకృష్ణుని పరమార్థసంకల్పము

ఇందు శ్రీకృష్ణునిగురించికూడ కొన్ని వాక్యములు వ్రాయవలసి యున్నది. శ్రీ కృష్ణుడు భగవంతుడైనను మనుష్యుడుగా నవతరించిన పిదప తద్ధర్మము లనుష్ఠింపకతప్పదు. దీనిని గురించి బంకించంద్రుడిట్లు వ్రాసియున్నాడు: "మనుష్యత్వమే మనుష్యధర్మము. మనుష్యవృత్తులయనుశీలనమును, ప్రస్ఫురణమును, చరితార్థతయే మనుష్యత్వము. ఆవృత్తులు శారీరకమనియు, జ్ఞానార్జనమనియు, కార్యకారిణియనియు, చిత్తరంజనియనియు నాలుగు విధములుగా విభజింపబడి యున్నవి. సకల వృత్తులచేతను సౌందర్యాదుల బర్యాలోచన చేసి యసమానమైన నిర్మలానందము ననుభవించుట చిత్తరంజన మనబడును. ఆవృత్తుల పరిపూర్ణానుశీలనముచే సచ్చిదానందమయమైన జగత్తు లభించుచున్నది. అందువలన జగన్మయమై సచ్చిదానందసంపూర్ణస్వరూప మనుభవమునకు రాగలదు. చిత్తరంజకమైన వృత్తుల ననుసరింపకుండుటవలన ధర్మహాని యగును. ఆదర్శపురుషునకు జిత్తవృత్తులలో నెవ్వియు ననుశీలనవిరహితములుగను, స్ఫూర్తిహీనములుగను నుండజాలవు. శ్రీకృష్ణుని రాసలీల యీ చిత్తరంజనవృత్తుల యనుశీలనమున కుదాహరణముగ నున్నది. ఒకప్రక్క ననంతసౌందర్యవికాసము; మరియొకప్రక్క ననంతసౌందర్యోపాసనము. ఈవృత్తుల నన్నిటిని నీశ్వరముఖముగా ప్రేరేపించుటయే చిత్తరంజనవృత్తుల పరిపూర్ణానుశీలనము."

## ఈ ప్రేమమార్గమే తరువాతి యనేక భక్తులకు ఆశ్రయణీయమైనది

ఇట్లు శ్రీకృష్ణుడు మనుష్యత్వమునకు భంగము రాకుండ భగవత్త్వబుద్ధిని సంసారపాశబద్ధులగు జీవులకు గల్గించి తన్మూలమున వారి ననుష్ఠానయోగ్యమగు భక్తి మార్గమున తరింపజేయుటకు సంకల్పించుకొనెను. ఈ అభిప్రాయమే శ్రీకృష్ణుడు బృందావన లీలలో పెక్కుమారులు గోపికల కుపదేశించినట్లు మనము భాగవతమువలన తెలిసికొనుచున్నాము. ప్రకృతిమయులగు సమస్త మానవులకును ఈ గోపిక లవలంబించిన ప్రేమమార్గమే (భక్తియోగమే) యుత్తమసాధన మని నారద శాండిల్యమహర్షులుగూడ సూత్రీకరించియున్నారు. శ్రీకృష్ణ దూతగా మధుర నుండి బృందావనమున కరుదెంచిన యుద్ధవుడు గోపికల పాదరజోలేశలాలసుడై ప్రార్థించెను. శ్రీద్రావిడ వాఙ్మయ నిర్మాతయు, విశిష్టాద్వైతప్రతిష్ఠాపకుడును, మహా భక్తాగ్రేసరుడును నగు నమ్మాళ్వారు తాను నాయికయై భగవాను నుపాసించెను. ఈ మార్గము ననుసరించియే రామానుజాదులు భగవదుపాసనామార్గములు తొమ్మిదింటిలోను నాయికానాయక భావము నొకదానినిగా బరిగ్రహించియుండిరి. జయదేవమహాకవియు దీనిని హృదయమునం దుంచికొనియే గీతగోవిందము కీర్తించెను. అభినవ కృష్ణావతారుడగు చైతన్యుడుగూడ నీ మార్గమునే లోకమున వెలయించెను. ఈసిద్ధాంతమును మనస్సునం దుంచికొని నవీనవైష్ణవధర్మములు కొన్ని ప్రచారములోనికి దీసికొనిరాబడినవి. మొత్తముమీద నీ మనోహరప్రేమసంబంధము చేతనే గోపీకృష్ణచరిత్ర విషయకమగు వాఙ్మ

యను విశ్వసాహిత్యమున నుచ్చస్థానము నొందజాలియున్నది.

## జీవబ్రహ్మల అభేదలీల ప్రదర్శనమే రాసము

ఈవివరణమువలన రాసమండలమున శ్రీకృష్ణుడు గోపికలకు చూపినది జీవబ్రహ్మల అభేదలీల యని ధ్రువపడుచున్నది. కాని కొందరు పురాణకర్తలు ఈఘట్టమును నృత్యవిశేషముగానే అర్థముచేసికొని తమ సంగీత నాట్యశాస్త్ర పాండితిని గుప్పివిడిచిరి. వాని నుండి మరికొన్ని విచిత్రములు బయలుదేరినవి. భాగవతవ్యాఖ్యాత విశ్వనాథచక్రవర్తి రాసములోనుండి కృష్ణబీజమగు "క్లీం" ను సృష్టించెను. మరియొకరు - ఈ లీలకు ముందు గోపికలు విన్న వేణునాదము వంశ సుషిరనాదము కాదనియు, హృదయవేణు సంజనితనాద మనియు యోగశాస్త్రము నాశ్రయించి వివరించిరి. ఇంకొక రది రసశబ్దవాచ్యుడైన పరబ్రహ్మవికాసమనియు, తదానందానుభవ మనియూ తలచిరి.

## రాసమునకును, రాధకును గల అవిచ్ఛిన్న సంబంధము

ఈ సందర్భమున శ్రీకృష్ణునకు నిత్యానపాయిని యైన రాధమాట తడవకుండుటకు వీలులేదు. రాసమునకును రాధకును అవిచ్ఛిన్నసంబంధ మున్నది. రాసమండలము లోనుండియే రాధ జనించినట్లు నవీనవైష్ణవ మతగ్రంథములు తెలుపుచున్నవి. కాని రాసలీల కన్పించు పెక్కుగ్రంథములలో ఆ యితివృత్తమున రాధప్రస్తావమే కనిపించుట లేదు. అయినను కొందరు ఈ మహాలీలలో రాధ కలదని నమ్ముచున్నారు. వారివాదములో హేతువాదము కనిపింపదు. ఆవివరణమున కిది యెడనుకాదు.

మొత్తముమీద రాసము వైజ్ఞానికావలంబనముతో మహారాసమై, స్థూల చిదచిద్విశిష్టమునుండి సూక్ష్మచిదచిద్విశిష్టము వరకు ప్రాకి అనాదిత్వము, శాశ్వతత్వము నెలకొల్పుకొన్నది. ఈమనోహర లీలావివేచనకు పాగల్ హరినాథుని శ్రీసూక్తితో మంగళ వాక్యము చెప్పెదను:

"...Whatever is visible is Prakriti and nothing else. With the base Prakriti (Passive Principle) Krishna, the only Purusha manifested as Consciousness is eternally at grand play. This play is without beginning or end and is eternal. This is called the sublimest sport (Maha-Rasa). The only active or male agent Krishna is incessantly at play with Prakriti in someway or other. This play knows no stop and is unending. Even Brahma and Siva have foundered in the Ocean of Thoughts in order to solve the secret of this play; save and except Krishna no one is capable of penetrating into it. The real object of this bewildering game is known only to Sri Krishna and to Sri Radhika (Moola-Prakriti). To anyother it is a sealed book.'



# ప్రత్యక్ష శయ్య

[నిజంగా జరిగిన కథ]

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ శ్రీ శ్రీ వత్సవాయి చతుర్భుజతిమ్మజగపతి మహారాజు పెద్దాపురరాజ్యం పరిపాలిస్తూ వున్న రోజులు—

రాజ్యం అంతా సర్వవిధాలా సుభిక్షంగా వుంది.

కళాకుశలు లందరూ రాజపూజ్యత అనుభవిస్తున్నారు.

కాని, వారంటే దివాన్జీకి వల్లమాలిన కోపం.

ఏవో నాలుగు కబుర్లు చెప్పి, ఇంద్రుడ వనీ, చంద్రుడ వనీ పొగిడి, వేలకొద్దీ డబ్బు కాజేస్తారనీ, అగ్రహారాలు కూడా కొట్టేస్తా రనీ ఆకోపం.

కానయితే, అతగాడు బ్రాహ్మడే; వైదికుడున్నూ. కొంచెమో గొప్పో చదువుకున్నవాడు కూడాను.

కాని అతను పొట్టి అంకెలపోగు.

అతనికి డబ్బే పావనం.

ప్రజలవల్ల అణాపైసలు నిక్కచ్చిగా వసూలు చెయ్యడం—అలా చెల్లించగలగడానికి, ఆ ప్రజలకు తగిన వసతులు కల్పించడం—ఇంతే అతని లోకం.

పది డబ్బులు వస్తా యంటేనే వొక డబ్బు ఖర్చు పెట్టడం అతని పద్ధతి.

అంచేత, పండితులకు అతని దర్శనం సాధారణంగా అందరాని ఫలంగా వుంటూ వుంటుంది.

మహారాజు దర్శనం అతని ద్వారానే కావాలి కనక అది మరీ దుర్ఘటం అవుతూ వుంటుంది.

కాని మహారాజు విద్యాప్రియుడు.

కళ లంటే అతనికి నిద్రాహారా లక్కర్లే దన్నంత ప్రీతి.

ఇంతేకాక,—

ఆ రాజ్యంలో, ఆ ప్రధానాధికారి యెంత విద్యావిముఖుడో, అతనికింది ఆ అప్రధానాధికారులు అంత విద్యాసుముఖులు.

వారిలో కొందరు కళాకుశలులున్నూ వున్నారు.

ఈసన్నివేశమే లేకపోతే, పండితులకు, రాజసభలోనే కాదు, పెద్దాపురప్పట్నంలోనే ప్రవేశం లేకపోవును.

ఏతావతా:

ఈసౌకర్యం వినియోగించుకుని వొకనాడు, వొక బ్రాహ్మణయువకుడు, కోటలోనే — కచేరీగదిలోనే దివాన్జీయెదటికి వెళ్ళగలిగాడు.

అదృష్టవశంవల్ల, ఆవేళ, మహారాజు పక్కగదిలోనే మిత్రులతో దశావతారీ ఆడుతూ వుండడం తటస్థపడింది.

ఆ కింది అధికారులు ఆయువకుడికి యీ సంగతి కూడా చెప్పి, దివాన్జీతో దొమ్ములాడి అయినా మహారాజు దృష్టి ఆకర్షించుకో మని హెచ్చరించారు.

౧

అధికారదర్పానికి దీర్ఘానుభవం సాయపడి దివాన్జీ బిర్రుగా చూడగా, పాండిత్యగర్వానికి కింది అధికారుల ప్రోత్సాహం జతపడి యువకుడు అలవోకగా చూశాడు.

పాల్కురికి సోమనాథుని 2 గ్రంథములు

# పండితారాధ్యచరిత్ర వెల 5-0-0

# బసవపురాణము వెల 2-8-0

రెండూ కలిపి **6-0-0**

ఆంధ్ర గ్రంథమాల, పోస్టుబాక్సు 212, మదరాసు.

---

# హిందుస్థాన్ లో భీమా చేయండి
## కు ప్రతినిధులుగా వుండండి

తన వయసు సంస్థలలో అభివృద్ధి నొందుచున్న జీవిత భీమా సంస్థ.

**అభివృద్ధి వివరములు**

| | |
|---|---|
| క్రొత్తవ్యాపారము | 3 కోట్ల 14 లక్షలకుపైగా |
| అమలులో నున్న పట్టాలు | 16 " 34 " |
| జీవిత నిధి | 2 " 96 " |
| మొత్తం ఆస్తులు | 3 " 36 " |

ప్రాతినిధ్యం లేని స్థలాలలో ఏజంట్లు కావలెను.

## హిందుస్థాన్ కో-ఆపరేటివ్ ఇన్సూరెన్సు సొసైటీ, లిమిటెడ్.

ప్రధాన కార్యాలయం:
**"హిందూస్థాన్ బిల్డింగ్స్"**
సురేంద్రనాథ్ బెనర్జీరోడ్, కలకత్తా.

మద్రాసు బ్రాంచి:
**"హిందుస్థాన్ బిల్డింగ్స్"**
107, ఆర్మీనియన్ వీధి, మద్రాసు.

---

## మెసర్సు. పి. కోదండరామపిళ్ల

(1854 సం॥లో స్థాపితము)

మేలైన గృహోపకరణ **నిర్మాతలు, సప్లయిదారులు.**

పి. పొన్నుస్వామిపిళ్లై బిల్డింగ్సు, నెం. 39,44 వెస్టు ఎస్ప్లనేడ్, మదరాస్.

ఎంట్రన్సు హాలు, డైనింగురూము, లైబ్రరీ, షాపులు, ఇంక ఆఫీసులకు కావలసిన అన్ని విధముల ఫర్నీచర్లు, టేకుసామానులు, నల్లమ్రాను, తెల్లమ్రానులతో అనేక రకములలో ఇత్తడిచట్టములు పొన్నుతో సహా, చక్కగచేర్చి, గట్టిగాను భద్రముగాను చేయబడును.

కోరినవారి కేవిధమగు సామానులనైనను సరే, కొయ్యపనులకైనను సరే ఎస్టిమేటు యివ్వబడును. ఒకసారి మా వస్తుప్రదర్శనహాలు చూచినచో మీకు తృప్తి కలుగును. దూరపుస్థలమునుండి వచ్చు ఆర్డరులు సామానులకగు రైల్వే చార్జీకిగాను వాని కిమ్మతులలో మూడవవంతు సొమ్ము పంపినతోడనే శ్రద్ధగా వి. పి. చేయబడును.



Messrs. P. KOTHANDARAM PILLAI,
*Cabinet Makers,* 39, Esplanade, P. T. Madras.



సుందర దరహాసము

[భవానీపిక్చర్సువారి 'చండిక'లో కన్నాంబ]



మాతృవాత్సల్యము

[ చిత్రకారుడు : శ్రీ తేజోమూర్తుల కేశవరావు. ]

ఇది దివాన్జీ కళ్లల్లో కారపుగుండ కొట్టింది.

యువకు డది గుర్తించి, మొదట నమ్రుడై "నమో మహద్భ్యః. మాది పలివెలతాణాకి చెందిన వొక కుగ్రామం. నా పేరు బులుసు రామగోవిందశాస్త్రి" అని అంజలిబంధంగా విన్నవించి, తరవాత "నీసంగ తంతా తెలుసుకునే వచ్చానయ్యోయ్" అన్నట్టు సుతారంగా తల పంకిస్తూ నిటార్గా నుంచున్నాడు.

దీంతో గాయం రేగినట్టయి, పురపుర చూస్తూ, "యిక్కడి కెలా వచ్చారండీ?" అని తల యెగరవేసుకుంటూ అడిగాడు దివాన్జీ.

"చెప్పలేను. ఎంచేత నంటే? ఇక్కడికి రావడంలో నా ప్రజ్ఞా, నా ప్రయత్నమూ కూడా లేవు. కేవలమూ తమ దివ్యతేజస్సే న న్నిక్కడి కాకర్షించింది. తమ అధికారమే న న్నిక్కడ నుంచోబెట్టింది" అంటూ బెల్లిస్తూ చూశాడు శాస్త్రి.

ఇది విని, పక్క గదిలో మహారాజు చకితుడై ద్వారంకేసి చూశాడు.

కాని దివాన్జీమాత్రం యిది వినయమో అవినయమో, పొగడ్తో తెగడ్తో కూడా గుర్తించుకోలేక నీరవు డయిపోయాడు.

అది గ్రహించి "ఎక్కడి కక్కడే పద్మవ్యూహం. అడుగడుగునా విచ్చుకత్తులతో పహరాలు. నిజంగా మానవమాత్రుల కిది సంభవ మేనా? కాని కళ్లు మూసి తెరిచా టప్పటికి నే నిక్క డున్నాను. ఇక చెప్పడాని కేం వుంది?" అని తల యెగరవేసుకుంటూ మళ్లీ అడిగాడు శాస్త్రి.

ఇది విని దివాన్జీ మరీ నీరవు డయిపోయాడు.

దీంతో మహారాజు కళాప్రీతి ఉద్బుద్ధ మయింది.

కొంతసేపు అధికారీ, ఆగంతుకుడూ అభావదృష్టులు పరుపుకున్నారు.

తరవాత ప్రయత్నపూర్వకంగా కంఠం స్వాధీనపరుచుకుని "అయితే యేమి టండీ? ఎందుకోస మండీ మీ రాకా?" అని చిమచిమలాడుతూ అడిగాడు దివాన్జీ.

"చిత్తం చిత్తం. ఒక్కమాటు పురాణకాలక్షేపం చేసి ప్రభువుని మెప్పించా లనీ—"

"మెప్పించీ?"

"ఎంతో కొంత సత్కారం—"

"అదీ అసలు సంగతి" అని చెయ్యి విదిలించుకుంటూ అందుకున్నాడు దివాన్జీ.

"నే నెరగనూ? ఎవరు వేంచేసినా అందుకే. ఆ ద్రవ్యాశ శ్రవ్యంగా వుండడానికే యీ చిలవలూ పలవలూనూ"

ఆటగాళ్లు చకితులై ప్రభువుని చూడగా, ప్రభువు ఒక చెవి యిటు వొగ్గాడు.

"తమరు సరిగా సెలవిప్పించారు. ఏమంటే? మనుష్యుడు చేసే ప్రతీ పనిలోనూ యీ పూత తప్పదు. పైగా, నావృత్తిలక్షణం కూడా అదే"

"సంతోషించాం"

"ఎంత దురుసుతనమూ" అనుకుని ఆటగాళ్లు స్తబ్ధు లయినారు.

మహారాజు చెవిలో అపశ్రుతి దెబ్బ కొట్టింది.

శాస్త్రి కొంచెం వుద్రిక్తు డయినాడు.

అరసికత తొందరపెట్టగా యిలా అనేశాడు; గాని మహారాజు వినేశా డేమో అని అంతలో స్వగతంగా పిసుక్కుని, వెంటనే ధోరణి మార్చి "నుంచునే వున్నారు, కూచోండి. అయితే, యేం చదివారూ మీరూ?" అంటూ గుర్రం దిగి అడిగాడు దివాన్జీ.

"తమ సన్నిధిని కూచున్నా నుంచున్నట్టే, నుంచున్నా కూచున్నట్టే. పై పెచ్చు, తమరు ముందే సంతోషించారు గాని పరిశీలన అంతా మిగిలే వుంది. కనక నుంచుని మాట్లాడ్డానికే నాకు సెలవిప్పించండి. మరి ప్రకృతం. నేను ఉభయభాషల్లోనూ పంచకావ్యాలూ చదివా నండి" అని గంభీరంగా చూస్తూ చెప్పాడు శాస్త్రి.

ఇది దివాన్జీని కొంచెం వుద్రిక్తుణ్ణి చేసింది; కాని పైకి చల్లపడ్డట్టు కనపడుతూ "తరవాత?" అని అడిగాడతను.

చేత నవునంటే నమ్మేయ్యవలసిం దేనా?" అని మాట పూర్తి చేశాడు.

"ఏం నమ్మితే?"

చురుగ్గా చూసి "ఏమా? ఎవర్ని కూర్చోబెట్టినా చదివించగలరా?" అని టొకాయించి అడిగాడు దివాన్జీ.

"ఆ"

"ఏమాత్రం చదువు వచ్చివున్నానా?"

"ఆ"

"వాచకం ధారాళంగా లేకపోయినానా?"

ఎదురొమ్ము విరుచుకుంటూ మళ్లీ "ఆ"అన్నాడు శాస్త్రి.

ఇది విని చేతిలోవున్న ముక్కలు కిందపడేశాడు ప్రభువు.

ఆటగాళ్లు ముగ్గురూ యెవరిచేతిలో వున్న ముక్కలు వారు కలిపేసుకుని, చూపులు మహారాజు మొగంమీదా, చెవులు యీ సంభాషణమీదా నిలుపుకున్నారు.

కాని, విశాఖపట్నం సీటికొళాయీలు పుటుకూ పుటుకూ రెండేసి చుక్కలు రాల్చి యిగుర్చుకు పోయేటట్టు "అసాధ్యం"అనీ, "నమ్మడానికి వీల్లేదు"అనీ మాత్రం గొణిగి, మొగం వంచుకుని దివాన్జీ యేదో కాగితం చూసుకోసాగాడు.

అది నిర్లక్ష్యంగానూ, తనమొడల తిరస్కారభావంగానూ గ్రహించి, చాలా బాధపడి "సాధ్యమా అసాధ్యమా అంటే అది మనిషిని పట్టి వుంటుంది. ఈ విషయం గ్రహించడంకూడా మనిషిని పట్టే వుంటుంది. కాగా, యిలాంటి సందర్భాలు తటస్థపడ్డప్పుడు సహృదయులు చెయ్యదగినది పరీక్ష" అన్నాడు శాస్త్రి.

కాని దివాన్జీ మాట్లాడలేదు. మొగ మయినా యెత్తలేదు.

"అందుకు పూనుకోకపోతే ఆ సహృదయతకు వినియోగం యేదీ? అసలు దాని అస్తిత్వానికి నిదర్శనం యేమిటీ?" అని మళ్లీ అడిగాడు శాస్త్రి.

దివాన్జీ హృదయం దడదడ లాడింది. అయినా అతను మాట్లాడలేదు.

"నిజానికి తమ రిప్పుడు చేస్తూ వున్నది కూడా పరీక్షే; అయితే, రకం మట్టుకు మారిస్తే గాని అది యిక్కడ సమన్వయించదు" అని కొంటె చూపులు చూశాడు శాస్త్రి.

అప్పుడున్నూ దివాన్జీ చలించలేదు.

"పోనీ, తమ రున్న స్థితిలో నన్ను పరీక్షించడం సాధ్యపడకపోవచ్చు. ఇందుకోసం తమ రెలాంటి హేమాహేమీలను తెచ్చినా నాకు సమ్మతమే. ఇందులో వోడిపోతే తమరు స్వయంగా నా కెలాంటి శిక్ష విధించినా నేను సిద్ధమే"

ఇది విని అక్కడ ఆటగాళ్లు మహారాజుకేసి మిడుతూ మిడుతూ చూశారు.

మహారాజు ద్వారంకేసి పులుకూ పులుకూ చూశాడు.

ఇక్కడ దివాన్జీ "మా కిదే పనా? సంభవాలు చూడ్డానికే పీలుపడదే, అసంభవాల కోసం మేము పనులు మానుకూర్చోవలసిం దేనా?" అంటూ కరుగ్గా అడిగాడు.

ఇది శాస్త్రికి మనస్సు నొప్పించింది.

"ఇది పని కాకపోతే కాదూ?" అంటూ అందుకున్నా డతను.

"ఈస్థలం సర్వవిధాలా ప్రజలను ఆజ్ఞపెట్టడానికి సమర్థ మయినది. ఆకారణంవల్ల యిది అందరికీ అందుబాటులో వుండతగ్గది కావడం లేదూ? ఇదిన్నీ కాక: సంభవాల కోసం తమదాకా రా నక్కర్లేదు. తమ వంటి పదస్థులు చిత్తగించవలసినవి అసంభవాలే"

దీనిమీద దివాన్జీకి కోపమే వచ్చింది; కాని కా దనడం యెలాగా? అతనికి దారి తోచలేదు.

పైపెచ్చు "ఇంతదూరం ముదరనివ్వడం పొరబాటు" అని తప్పే తోచింది. మాట్లాడలేక కళ్లప్పగించి వూరుకున్నాడు.

"పూర్వుల తపఃప్రభావంవల్ల తమ రీ మహోన్నతపదవి పొందగలిగారు. ఆ తపఃప్రభావం తమకి కళాభిరుచి కలిగించకపోవడం అసంభవం కాదూ? కనక తమవంటివారే పెదవి విరిస్తే యిక విద్యలకు గతి యేదీ?"

దీనిమీద "మాట్టాడితే ప్రతీవాడికీ యిదొక వేలంబం. విద్యలుట విద్యలు" అని గొణుక్కుంటూ దివాన్జీ మొగం వంచుకున్నాడు.

ఈ గొణుగుడు మహారాజుకి వుద్రేకం కలిగించింది.

వెంటనే అతను ద్వారపాలికకేసి చూసి "సభకి సెలవయిందని చెప్పు" అన్నాడు.

ఇది శాస్త్రికి కోకిలకూజితంలా వినపడింది.

దాంతో "యేం, అయిందా?" అన్నట్టు ముదలకింపు చూపు చూశాడతను.

మహారాజు మాటకీ, ద్వారపాలిక రాకకీ కూలిపోయిన దివాన్జీ దీంతో చితికిపోయాడు.

౪

సరిగా జాముపొద్దువేళ సభ కూడింది.

తెల్లని మసలందుమీద మహారాజు సలక్షణంగా కొలువుతీరాడు.

రాజబంధువులూ, సామంతులూ, అధికారులూ, పండితులూ, పౌరప్రముఖులూ "యెప్పుడెప్పుడ"ని ఆత్రపడుతూ, ప్రభువుని పరివేష్టించి వున్నారు.

క్షణాలు గడియలుగానూ, గడియలు క్షణాలుగానూ మారిపోతున్నాయి.

మహారాజు కళ్లల్లోనూ, శాస్త్రి చూపుల్లోనూ అంకితమై, గాంభీర్యం, కొలువు అంతా ఆకట్టి వుంది.

కొంతసేపటికి, ప్రభువు ఇంగితం కనిపెట్టి, ఆస్థాన పౌరాణికుడు ఆంధ్రమహాభారతం తెచ్చి శాస్త్రి కందించి తప్పుకున్నాడు.

అతని వెనకనే పదహారేళ్ల చామరగ్రాహిణి వచ్చి, ముందు పాదాభివందనం చేసి, తరవాత శాస్త్రి యెడమదిక్కున కూచుంది.

అది చూసి సభ్యులందరూ "కత్తులమీద పరీక్ష" అనుకుంటూ వుండగా, సుతారంగా సూత్రం విప్పి, శాస్త్రి, పౌరాణికుడికేసి చూశాడు.

ప్రభువు మేనమామ—తొంభైయేళ్ల వృద్ధు—దంతులూరి వేంకటపతిరాజు వెండిమీసాలు సవరించుకుంటూ "ఊరుభంగం ఘట్టం తీయించండి" అని బోసినోరు చప్పళించుకున్నాడు.

అందుకు సభ్యులందరూ వుత్సుకులు కాగా, శాస్త్రికూడా పరమోత్సాహం పొంది "మహాప్రసాదం" అంటూ మొదట ఆ ఆజ్ఞ అంజలిబంధంతో అందుకుని, తరవాత "సంస్థానానికి తగిన ఘట్టం. శయ్యకి తగిన ఘట్టం. నా బిరుదుకిన్నీ తగిన ఘట్టం. నేనేది నిరీక్షిస్తున్నానో అదే మమ్మేలినవారు సెలవిప్పించారు. అయితే వొక్క మనవి" అని మళ్లీ దోసిలి వొగ్గాడు.

"సెలవిప్పించండి" అన్నాడు ప్రభువుపక్షంగా వేంకటపతిరాజు.

"ముందొక పెట్టె తెప్పించి నా కుడివేపున వుంచాలి"

"తరవాతా?"

"ఇక్కడ వున్నవారందరూ తమ దగ్గిర వున్న ఆయుధాలు అందులో వుంచెయ్యాలి"

ఇది విని సభ్యులందరూ మొగమొగాలు చూసుకున్నారు. మొగమాటం విడిచిపెట్టి అనందట్లో "ప్రభువువారికీ, పసిపిల్లలకూ, భటులకూ కూడా మినహాయింపు లేదు" అని కచ్చితంగా చెప్పేశాడు శాస్త్రి.

ఉలిక్కిపడి మేనమామ ప్రభువుకేసి చూశాడు. ప్రభువు వింతపడ్డాడు; కాని "యిప్పించెయ్యండి" అన్నాడు.

కళ్లు మూశాటప్పటికి పెట్టె రావడమూ, మళ్లీ తెరిచాటప్పటికి చిన్న చాకులు కూడా అందులో నిక్షిప్తాలు కావడమూ జరిగిపోయింది.

౫

"ఏదీ, చదువు పిల్లా" అంటూ చామరగ్రాహిణికి పుస్తకం అందించాడు శాస్త్రి.

నిరంతరాభివృద్ధి అనగా అధికమగుచున్న ప్రజానోదము!

# న్యూ ఏషియాటిక్

## లైఫ్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.

# NEW ASIATIC

## LIFE INSURANCE COMPANY, LIMITED.

తన ఆరవయేట

**1939 సం॥లో రూ. 50 లక్షలకుపైగా**

వ్యాపారము పూర్తిచేసినది

**1938లో రూ. 41.74 లక్షలు మాత్రమే**

మేనేజింగు ఏజంట్లు : బిర్లా బ్రదర్స్, లిమిటెడ్.

మీరు భీమాచేయుటకు, లేక ప్రాతినిధ్యము వహించుటకు తగిన సంస.

వివరములకు క్రిందివారికి వ్రాయుడు :

కె. యస్. సుబ్రహ్మణ్యం,
దత్తమండలములు, చిత్తూరు, ఏజన్సీల
సూపరింటెండెంటు.
7/9, బ్రాడ్వే, మద్రాసు.

మద్రాసుశాఖ :
ఏ. సుబ్బయ్య,
బ్రాంచి మేనేజరు,
289, లింగిచెట్టి వీధి, జి. టి. మద్రాసు.

కృష్ణ అండ్ కంపెనీ,
ఉత్తరసర్కారులు, నెల్లూరు
ఆర్గనైజరు,
41, లింగిచెట్టివీధి, జి. టి. మద్రాసు.

---

# భారత్ కేఫ్

**180, మౌంటురోడ్డు మరియు మాంబళం.**

మౌంటు రోడ్డు టెలిఫోన్ నంబరు **86009.**

మాంబళం ,, ,, **88073.**

## ఒకసారి వచ్చిచూచిన

## మీకు సంతృప్తికలుగును.

విందులు వగైరా ఏర్పాటులు మా ప్రత్యేక విశేషము.

పుస్తకంలో రాత చూస్తే ముత్యాలకోవ.

పిల్ల కళ్లు చూస్తే ఆకర్ణాంతాలు.

కాని నాలుక మాత్రం కొంచెం ప్రయత్నించగా వర్ణక్రమమే నడవలేదు.

అది చూసి సభ్యు లందరూ "లాభం లే"దను కున్నారు; గాని శాస్త్రి దోసిలి వొగ్గి, నమ్రుడై "సెల వా?" అని అడిగాడు.

"ఒక్కటే సెలవు" అనుకున్నారు సభ్యులు; కాని వేంకటపతిరాజు "కానివ్వండి" అన్నట్టు తలా చెయ్యీ వూపాడు.

వెంటనే "యిలా చూడు పిల్లా" అన్నాడు శాస్త్రి.

పిల్ల చూసింది.

"పాడగలవా?"

"చేతకా దండి"

"ఏం?"

"సంగీతం నేర్చుకోలే దండి"

"సాహిత్యమో?"

"లేదండి"

"పోనీ, ఆడగలవా?"

"ఆ" అన్నట్టు పిల్ల తల వూపింది.

"బాగుంది. అయితే మొగం పైకెత్తు"

పిల్ల చెప్పినట్టు చేసింది.

"ఉలిక్కిపడ కేం"

"అలాగే" అన్నట్టు మళ్లీ తల వూపింది.

అప్పుడు శాస్త్రి పిల్ల తలమీద ఎడమచెయ్యి వుంచి, కళ్లు మూసుకున్నాడు. ఒక్క క్షణం నిటాగ్గా కూచుని పైకి చూస్తూ యేదో మంత్రం పునశ్చరణ చేశాడు. మరొక్క క్షణం కుడిచేతి వేళ్లు సవరించు కున్నాడు.

. తరవాత కళ్లల్లోకి గంభీరంగా చూస్తూ పిల్ల కంఠం నిమిరాడు.

ఇదంతా అయేటప్పటికి పిల్ల కళ్లు మూసుదిగుం.

"అదేం?" అని అడిగాడు శాస్త్రి.

"కళ్లు మూసుకుపోతున్నాయండి"

"ఒక్కమాటు చూడు"

"చూడాలని లేదండి. చూడలేనండి"

"బాధగా వుందా?"

"లేదండి"

"మరెలా వుంది?"

"కంఠంలో వొణుకు పుడుతోందండి"

"ఏమనిపిస్తోంది?"

"పాడా లనిపిస్తోం దండి"

"అయితే యింకేం? ఏదీ వొక్క రాగం—"

"దారి దొరకడం లేదండి"

శాస్త్రి ప్రభువుకేసి చూశాడు. ప్రభువు మేన మామకేసి చూశాడు. మేనమామ యిటు తిరిగి శాస్త్రి కేసి చూశాడు.

సభ్యులు గుబగుబలాడిపోయారు.

అప్పుడు శాస్త్రి, వొక్కమాటు మందహాసం చేసి, కుడిచెవిమీద చెయ్యి పెట్టుకుని, తన నోరు పిల్ల కుడిచెవిలో వుంచి "రేం రేం" అంటూ రేగుప్తి రాగం అందుకుని వొక్క విసురు విసిరాడు.

వెంటనే పిల్ల, శాస్త్రి విడిచినచోట అందుకుని వొక్క గడియ ఆలాపన చేసి సభ అంతా గలగల్లాడిం చేసింది.

దాంతో ప్రభువు మొగం వికసించింది.

మేనమామ జోసినోరు వివృతం అయింది.

దివాన్జీ మొగం వాలిపోయింది.

## ౬

అటు సభ్యుల మొగాలమీద ఆశ్చర్యజ్యోత్స్న అంతరించకుండానే యిటుశాస్త్రి మళ్లీ నిటాగ్గా కూచున్నాడు.

ఎడమ చెయ్యి పిల్లతలమీద వుంచి మళ్లీ కళ్లు మూసుకుని వొక్కక్షణం పునశ్చరణ చేశాడు.

ఉత్తరక్షణంలో కుడిచేత్తో పిల్ల కళ్లు తుడిచి, ఆమె చెవి దగ్గిరగా తన నోరుంచుకుని

"పలపలని మూఁకలోఁ గాల్
నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీ కొడుకు గదా
కలితభుజుండై యొక్కఁడుఁ
దొలఁగి చనియె నేమి చెప్పుదుం గురునాథా?"

అని చదివి, తర్జనితో నిర్దేశిస్తూ పుస్తకంలో పిల్లకి ఆపద్యం చూపించాడు.

తన కళ్లు ప్రఫుల్లపద్మపత్రాలు కాగా, వెంటనే ఆమె శాస్త్రి యేస్థాయిలో అందుకున్నాడో ఆస్థాయిలోనే అందుకుని యథాశ్రుతంగా పద్యం చదివేసింది.

అది మొదలు,

గోదావరీప్రవాహం లాగ ఆమె పద్యం చదవడమూ, గుర్రం కదను తొక్కినట్టు అతను అర్థం చెప్పడమూనూ.

అతని ఆవేశం ఆమెకి సంక్రమించింది. ఆమె వుత్సాహం అతన్ని రెచ్చగొట్టింది.

దానిమీద సభ్యు లందరూ జంత్రపు బొమ్మలయి పోయారు.

సుయోధనోపాలంభం ప్రారంభం అయింది.

మొదట సభ్యులు చకితులై వొకరికేసి వొకరు చూసుకున్నారు. తరవాత వారిలో కొంద రుత్సుకులు కాగా, తక్కినవా రసంతృప్తు లయినారు.

క్రమంగా, వొక పక్షాన కనుబొమ్మ లెగిరాయి. వెంటనే రెండో పక్షాన కళ్లు నిప్పులు కురిశాయి.

ఇది పూర్తికాకుండా సుయోధనుడు ధర్మజుణ్ణి నిరసిస్తూ గదాయుద్ధానికి భీముణ్ణి యేరుకున్నాడు.

దాంతో, వుద్రిక్తు లయి వున్న సభ్యులు కొంద రటూ, కొంద రిటూ కేటాయిం పయిపోయారు.

స్థితప్రజ్ఞుడైన ప్రభువు అందుకే ఆశ్చర్యపడుతూ వుండగా, ఆ ద్వైపాయనహ్రదప్రాంతంలో గదాగదిగానూ, యీ సభలో బాహాబాహిగానూ యుద్ధం ప్రారంభం అయింది.

పెద్ద గందరగోళం అయిపోయింది.

అది చూసి, "ఆ, ఆ" అని కళవళపడుతూ లేచి ప్రభువు వారించగా సమయజ్ఞుడైన శాస్త్రి పిల్లతలమీది తన చెయ్యి తీసేసుకుని, లేచి నుంచుని, ప్రభువుకేసి తిరిగి "అపరాధిని, క్షమధ్వం" అంటూ నమ్రుడై దోసిలి వొగ్గాడు.

ఈ సందట్లో కంగారుపడుతూ లేచి పిల్ల తన స్థానంలోకి వెళ్లిపోయింది.

అప్పటి కప్పుడే సభ్యు లందరూ మొదట చల్లపడి, తరవాత సిగ్గుపడి, చివరికి ఆశ్చర్యపడిపోయారు.

ఉత్తరక్షణంలో ప్రభువు ప్రకృతిలో పడి "మహానుభావా! తమరు మానవమాత్రులు కారు. ఆ సమయంలో తమ రక్కడే వుండివుంటే సుయోధనుడు భీముణ్ణే కాదు; శ్రీకృష్ణుణ్ణి కూడా చితకబొడిచేసి వుండు"నని ప్రశంసిస్తూ అమాంతంగా శాస్త్రిని కౌగిలించుకున్నాడు.

(ఇది జరిగిందీ, విన్నదీని. రచనమట్టుకే నాది)

# వింశోత్తరీ దశానిర్ణయము

## యుగానుసారముగా గ్రహముల
## మహాదశలను తెలిసికొను జ్యోతిశ్శాస్త్ర సూక్ష్మము

శ్రీ కప్పగంతుల విశ్వనాథం

శ్రీ సచ్చిదానందరూపమై గుణాతీతంబగు బ్రహ్మంబు ప్రకృతిసంవళితమై అహోరాత్రాత్మక కాలమూర్తిగా వెలసె. అతని మధ్యతత్వమే హోరాత్మకంబనబడును. అట్టి బ్రహ్మంబు త్రిపాదమృతవిభూతియు, ఏకపాదవిశ్వభూత విభూతియు నగుచు చతుష్పాదం బని శ్రుతిశిరోజేగీయమానంబయ్యె. అట్టి అహోరాత్రైకకపాలంబు త్రింశదంశాత్మకం బయ్యె (30 భాగలు). అట్లే భచక్రాత్మకుండగు కాలమూర్తికి నవయవంబగు కపాలస్థానీయమైన రాశియును త్రింశద్భాగాత్మకం బన నొప్పె. అట్టి త్రింశత్సంఖ్యయందు, బిందు మయాత్మకం బనియు, దాని వామభాగమున ప్రకృతిగుణంబులగు సత్వరజస్తమంబులు మూడును బెరిగె. అట్టి చరాచర విశ్వభాగమునకు గల 30 అంశములలో నవగ్రహములు భోక్తృత్వాధికారమును చెందె. కర్మ పరిపాక ఫలకాల సూచకులై దశాధిపతు లనంబడిరి.

ముప్పది అంశములలో సూర్యునకు $1\frac{1}{2}$, చంద్రునకు $2\frac{1}{2}$, కుజునకు $1\frac{3}{4}$, రాహువునకు $4\frac{1}{2}$, గురువునకు 4, శనికి $4\frac{3}{4}$, బుధునకు $4\frac{1}{4}$, కేతువునకు $1\frac{3}{4}$, శుక్రునకు 5—ఇట్లు అంశములు భోగ్యములయ్యెను.

అందు భూపుత్రుని (కుజుని) వెంబడి భూచ్ఛాయయగు రాహువునకును, తదనంతరము రాహుదోష పరిహారకుండగు గురునికిని, తరువాత గురుదశా సుఖభోగ ప్రయోజకాయుష్కారకుం డగు శనికిని, ఆయుస్సాఫల్య సంపాదకంబగు ప్రజ్ఞకు కారకుడైన బుధునికిని, ప్రజ్ఞకు పరమ ఫలంబగు మోక్షమునిచ్చు కేతువునకును, పిదప సర్వభోగ్య సూచకుండగు రుద్రాంశముగల శుక్రునకును, ఆదియం దాదిభూతుండగు సూర్యునకును, అనంతరము మాతృభూతుండగు చంద్రునకును, పిమ్మట జ్యేష్ఠ భ్రాతయగు కుజునకును దశలక్రమము ఏర్పడెను. $1\frac{1}{2}+2\frac{1}{2}+1\frac{3}{4}+4\frac{1}{2}+4+4\frac{3}{4}+4\frac{1}{4}+1\frac{3}{4}+5=26\frac{16}{4}$ లేక 30 అంశలు—సమష్టికపాలము. $30\times4=120$ కపాలాంశలు. కావున ఇవియే కలియుగంబున పరమాయుస్సంవత్సరములు. గ్రహముల కపాలాంశలను ద్విగుణించిన సమష్టిషష్టి ఘటికాత్మకాహోరాత్రం బయ్యె. $30\times2=60$ గడియలు.

దీనిని దశగుణ మొనరింప తత్సమష్టి ద్వాపరయుగమున షట్శతాబ్ద పరిమితాయుః పరిమాణం బయ్యె: $60\times10=600$ ద్వాపరాయుస్సు. దీనిని షడ్గుణ మొనర్చిన సమష్టిసంవత్సరములు త్రేతాయుగంబున పరమాయుఃపరిమాణం బయ్యెను. $600\times6=3600$ త్రేతాయుగ పరమాయుస్సంవత్సరములు. దీనిని చతుర్గుణ మొనరించగా వచ్చిన మొత్తము కృతయుగంబున పరమాయుస్సంవత్సరములు. $3600\times4=14400$ కృతాయుః ప్రమాణము. అట్టి కృతయుగ పరమాయుస్సంవత్సరములను కలి తన పరమాయుస్సంవత్సరములతో భాగించగా, లబ్ధములు వరుసగా సూర్యాది గ్రహములకు మహాదశా సంవత్సరము లగుచున్నవి.

ర 6, చం 10, కు 7, రా 18, గు 16, శ 19, బు 17, కే 7, శు 20 = 120 సం.లు వెరశి.

| *రవి 180 X 4=720 | 30X 6=180 | 3 X 10=30 | $1\frac{1}{2}$ X 2=3 | | | |
|---|---|---|---|---|---|---|
| గ్రహములు | చతుర్గుణ త్రేతాంశాః | షడ్గుణ ద్వాపరాంశాః | దశగుణ కపాల ద్వ్యంశాః | ద్వికపాలాంశాః | కపాలాంశాః | నక్షత్ర దశాబ్దాః |
| రవి * | 720 | 180 | 30 | 3 | $1\frac{1}{2}$ | 6 |
| చంద్ర | 1200 | 300 | 50 | 5 | $2\frac{1}{2}$ | 10 |
| కుజ | 840 | 210 | 35 | $3\frac{1}{2}$ | $1\frac{3}{4}$ | 7 |
| రాహు | 2160 | 540 | 90 | 9 | $4\frac{1}{2}$ | 18 |
| గురు | 1920 | 480 | 80 | 8 | 4 | 16 |
| శని | 2280 | 570 | 95 | $9\frac{1}{2}$ | $4\frac{3}{4}$ | 19 |
| బుధ | 2040 | 510 | 85 | $8\frac{1}{2}$ | $4\frac{1}{4}$ | 17 |
| కేతు | 840 | 210 | 35 | $3\frac{1}{2}$ | $1\frac{3}{4}$ | 7 |
| శుక్ర | 2400 | 600 | 100 | 10 | 5 | 20 |
| 9 గ్రహములు | 14400 సం॥లు కృతాయుస్సు | 3600 సం॥లు త్రేతాయుస్సు | 600 సం॥లు ద్వాపరాయుస్సు | 60 | 30 | 120 సం॥లు కల్యాయుః వింశోత్తరీయః |

$30 \times 2 \times 10 \times 6 \times 4 = 480 \times 30 = 14400$ కృతయుగ పరమాయుర్వత్సరములు.

(1) ఉదాహరణ:—రవిమహాదశ.

కృతయుగములో 14400 పరమాయువు అయినప్పుడు రవిమహాదశ 720 సం॥ములు. కలియుగములో 120 సం॥లు పరమాయువు అయిన రవిమహాదశ ఎంత?

14400 సం॥లకు—720 సం॥లు.

$1 \text{——} \frac{720}{14400}$

120—— ?

$\therefore \frac{720 \times 120}{14400} = 6$ సం॥లు కలియుగ రవిమహాదశ.

(2) ఉదాహరణ: త్రేతాయుగములో బుధమహాదశ 510 సం॥లు అయిన ద్వాపరయుగములో బుధమహాదశా ప్రమాణము ఎంత ?

త్రేతాయుగములో పరమాయుః ప్రమాణము 3600 అయిన బుధమహాదశా ప్రమాణము 510 సం॥లు వచ్చినవి. ద్వాపరయుగములో పరమాయుః ప్రమాణము 600 సం॥ము లయిన బుధమహాదశ ఎంత ?

3600 సం॥లకు 510

$1 \quad ,, \quad \frac{510}{3600}$

600 ,, ?

$\therefore \frac{510 \times 600}{3600} = 85$ సంవత్సరములు.

(3) ఉదాహరణ : ద్వాపరయుగములో బుధమహాదశ 85 సం॥లు అయిన శుక్రమహాదశ ఎంత ?

బుధమహాదశ : శుక్రమహాదశ :: $4\frac{1}{4}$ 5

$85 : x :: 4\frac{1}{4} : 5$

$\therefore x = \frac{85 \times 5 \times 4}{17} = 100$ సంవత్సరములు శుక్రమహాదశ.

(4) ఉదాహరణ: ద్వాపరయుగములో శుక్రమహాదశా సంవత్సరములు 100 అయిన కలియుగములో శుక్రమహాదశా సంవత్సరములు ఎన్ని ?

ద్వాపరయుగములో పరమాయుః ప్రమాణము 600 సంవత్సరములు అయిన శుక్రుని మహాదశాసంవత్సరములు 100 అగును. కలియుగములో 120 సంవత్సరములు అయినశుక్రునికి ఎన్ని సంవత్సరములు వచ్చును?

ద్వాపరములో 600సంవత్సరములు అయినప్పుడు 100 శుక్రునిమహాదశాసంవత్సరములు. కలిలో 120 సంవత్సరములు అయిన శుక్రునికి ఎన్ని ?

$\frac{100 \times 120}{600} = 20$ సం॥లు శుక్రునికి వచ్చును.

కనుక కలియుగములో శుక్రమహాదశ 20 సంవత్సరములు.

ఇట్లే ప్రతిగ్రహముయొక్క మహాదశ తెలిసికొనవచ్చును.



# విజ్ఞానవిశేషాలు

# ఆనువంశికము - వాహకులు

## (Heredity and the Carriers of Inheritance)

వంశానుక్రమంగా మానవసంతానంలో కొన్ని కొన్ని చాయలు, కొన్నికొన్ని లక్షణాలు, కొన్నికొన్ని గుణాలు మొదలైన పోలికలు అనుగతంగా అబ్బుతూవుంటాయని మనలో చాలా మందికి తెలుసు. అందులోనూ,ముఖ్యంగా తల్లిదండ్రులచాలు పిల్లలలో కొద్దిగానో హెచ్చుగానో రూఢంగా సంక్రమిస్తూవుండడం నిత్యజీవితంలో చూస్తూనేవున్నాము. ఇలాగ తల్లి,తండ్రి,తాత, ముత్తాత మొదలైన ప్రాణులలోని సహజమైన గుణశీలాదులు వారి సంతానానికి ఏవిధంగా సంక్రమిస్తాయి, అవి వేటిగుండా వస్తాయి,ఇలాగా వంశపారంపర్యంగా ఈగుణశీలాదులు రావడంలో ఏదైనా గొలుసుకట్టు ఉన్నదా ఇత్యాది ప్రశ్నలకు ఈవైజ్ఞానికవ్యాసం అతి వివరంగా, అతి సులభంగా, అతి రుచికరంగా సమాధానమిస్తున్నది.

---

ప్రాణికోటిలో ఉన్న ప్రాణులు రెండు తరగతులు. అవి అందరకును తెలిసినవే. 1. జంతువులు. 2. వృక్షములు. మనుష్యులుకూడా జంతువులే అని వేరే చెప్పనక్కరలేదు. అటు పిపీలిక మొదలు బ్రహ్మవరకు, ఇటు గడ్డిపఱక మొదలు కల్పవృక్షందాకా చక్కగా పరిశీలించినట్లయి తే ప్రతిప్రాణియొక్క జీవితోద్దేశమూ ఒక్కటే అని తెలుస్తుంది. ప్రాణమున్న ప్రతి అణువుకూడా తన జీవితం చాలించేలోపల తనపోలిక గల ప్రాణుల్ని కొన్నిటిని భూమి మీద పడవేసి, అంటే—తనలాంటి ప్రాణుల్నే ఉత్పత్తిచేసి భూమి మీద తనజాతి అంతరించకుండా ఆచంద్రార్కంగా ఉండాలని ప్రయత్నిస్తుంది. ప్రయత్నించడమేగాక కేవలం అలాగ జరుగుతూ ఉన్నట్లు మనం చూస్తూనే ఉన్నాం. అదే ప్రతిప్రాణికీ జీవితాశయం. ఇది పుట్టుకతోటే ఉన్న స్వభావంగాని మధ్యలో బయలుదేరిందిగాదు. మనుష్యులలో మనం స్పష్టంగా చూస్తాం యీ విషయం. "మేము ఔరంగజేబునుంచి తిన్నగా బయలుదేరిన సంతతి"అనీ,"మేము సూర్యవంశపు రాజులం. శ్రీ రామచంద్రుడు మావంశంలోవాడే" అనీ, "మాది భారద్వాజసగోత్రం. భరద్వాజుడే మావంశకర్త"అనీ చెప్పుకుంటూఉంటే వింటూనేఉన్నాం. రెండు సంవత్సరాల క్రితందాకా మాఆవిడ అమ్మమ్మ తల్లి బ్రతికుంది. అందుచేత ఆవిషయం నమ్మకతప్పదు. సరే: పిల్లికి పుట్టిన సంతానం పిల్లులే అవటమేమి? కుక్కలు ఎందుకు కాకూడదు? వేపాకు ఏవూళ్లో చూసినా చేదువి మమేగాని, తియ్యగా పంచదార లాగుంటే కాఫీలోకీ, టీలోకీ వేరే పంచదార కొనుక్కో అక్కఱలేదే? పుట్టినప్పటినుంచీ కాకుల్ని చూస్తున్నాం. ఒక్కటీ తెల్లనిది కనబడదేమి? పోతన పరమభాగవతోత్తముడై భాగవతంపలకడమేమి, పేరావధాన్లు పంచాంగం పట్టుకొని పౌరోహిత్యం చేయడమేమి? ఈమాదిరిసందేహాలు తెలుసుకోవాలనే యిచ్ఛగల ప్రతిమానవుడికీ కలుగుతాయి. వీటికి సమాధానం కుక్క 'భౌంయి' మనటానికీ, పిల్లి 'మ్యావు' అనటానికీ కారణం ఏమిచెపుతామో అదే చెప్పవలసి ఉంటుంది. ప్రస్తుతం 'అవి అలాగ ఉండాలికాబట్టి'అని సమాధానం చేసుకుంటే, తర్వాత సరియైనకారణం మీకే బోధపడుతుంది. అంటే తల్లిప్రాణిలో ఉన్న సహజమైనగుణాలు పిల్లకు ఏవిధంగా వస్తాయి, అవి వేటిగుండా వస్తాయి, యీలాగ పారంపర్యా రావటాని కేదైనా గొలుసుకట్టు ఉందా ?—ఇదే ఆనువంశికం.

మనకంటికి కనబడే ప్రతిజీవిశరీరమూ లెక్కపెట్టలేనన్ని చిన్న చిన్నగదులు (Cells)కలిసి ఒకటిగా ఏర్పడింది. శరీరం ఎంతపెద్దదైతే అంత అసంఖ్యాకంగా ఉంటాయి యీగదులు. ఈగదులనే జీవకణము లని అంటారు. ఇవి మనకంటికి కనబడవు. శరీరంలో ఏభాగమైనాసరే అతిసన్నని పొరగా తీసి, దానిని సూక్ష్మదర్శక యంత్రం

క్రింద పరీక్షిస్తే అప్పుడు యీగదులను మనం స్పష్టంగా చూడగలం. కొన్ని జీవుల శరీరం కేవలం ఒక్క జీవకణంతోటే ఏర్పడిఉంటుంది. వాటినే మనం సూక్ష్మజీవు లంటాం. అవి ఎక్కడపడితే అక్కడ ఉంటాయి; గాలిలో ఎగురుతూ ఉంటాయి; నీళ్లలో ఉంటాయి; క్రుళ్లిపోయిన వస్తువులలో అమితంగా ఉంటాయి; మనం తినే ఆహారపదార్థాలలో కొన్నిటిలో ఉంటాయి; పెరుగులో ఉంటాయి: మన నాలుకమీదఉండే పాచిని కొద్దిగా తీసి సూక్ష్మదర్శకయంత్రంక్రింద పరీక్షిస్తే లక్షలకొలది కనబడతాయి; మన శరీరంలో కూడా ఉంటాయి. ఈసూక్ష్మ జీవులలో కొన్నిరకములైనవి ప్లేగు, కలరా, క్షయ మొదలైన అనేక అంటువ్యాధులకు కారణం. కొన్ని మనకు సహాయకారిగా ఉంటాయి. ముఖ్యమైన విషయం ఏమిటంటే—ఒక్క జీవకణమే శరీరంగా గల యీసూక్ష్మజీవులుకూడా పెద్దప్రాణులు తమ జీవితంలో కనబరచే అవస్థల నన్నిటినీ పొందుతాయి. వాటికికూడా ఆహారంకోసం చలనం, ఆహారం తీసుకోవటం, ఎదగటం, ప్రాణవాయువును తీసుకొని బొగ్గుపులుసుగాలి విడవటం, సంతానోత్పత్తి, చావు మొదలైనవన్నీ ఉంటాయి. అందుచేత, శరీరంలోఉండే ప్రతి జీవకణమూ ఒక్కొక్క సూక్ష్మజీవి అన్నమాట.

ఈ జీవకణా న్నిప్పుడు కొద్దిగా పరిశీలిద్దాం. ఇవి–కొన్ని గుండ్రంగా, కొన్ని నలుపలకలగా, అయిదుపలకలగా, ఆరుపలకలగా—యిల్లా ఉంటాయి. ఈ జీవకణంచుట్టూ ఒక సన్ననిపొర ఆవరణగా ఉండి, ఒకదానినుంచి మరొకదానిని వేరుపరుస్తూ ఉంటుంది. ఈ పొరను **Cell-wall** అని అంటారు. దీనిలోపల చిక్కటి జావలాంటి పదార్థం నిండిఉంటుంది. దీనిమీదే ప్రాణం ఆధారపడిఉంది. ఈపదార్థంలేని వస్తువుకు ప్రాణం ఉండనేఉండదు. దీనిని జీవరసము (**Protoplasm**) అని అంటారు. ఈ జీవరస తత్త్వాన్నిగురించి చెప్పటానికి ప్రస్తుతం వ్యవధి చాల దనుకుంటాను. ఈ జీవరసంలో మధ్య ఒక గుండ్రటి వస్తువు ఉంటుంది. దీనికి 'న్యూక్లియసు' అనిపేరు. దీనిలోకూడా జావలాంటి ద్రవం ఉంటుంది. ముఖ్యంగా దీనిలో 'క్రొమాటిన్' అనే పదార్థం సన్నని ఒక వలమాదిరిగా అల్లుకొని ఉంటుంది. దీనిలో మరియొక చిన్న గుండ్రటిముద్ద కనబడుతుంది. ఇది కూడా క్రొమాటిన్‌తో చేయబడినదే. దీనిని 'న్యూక్లియోలసు' అంటారు. ఈ న్యూక్లియసుకు తక్కినభాగంతో వేరుచేస్తూ ఒకపొర ఉంటుంది.

ఇదీ జీవకణంలోఉండే సామగ్రి అంతాను. ఈచిన్న సామగ్రితోటేఒక్క జీవకణం యీబ్రహ్మండమైన సృష్టినంతా సృష్టిస్తూవుంది. మీరు ఈ ప్రపంచంలో మీకంటికి కనబడే ఎంత పెద్దజంతువునైనా, ఎంత పెద్దవృక్షమునైనా తీసుకోండి. అంత పెద్దశరీరంకూడా ఒక్క జీవకణంలోనుంచి వచ్చిందే. ఇంకొకసంగతి: నాబుద్ధికి తోచేది ఏమిటంటే—ఈ ప్రపంచంలో ఎన్ని వృక్షములున్నాయో, ఎన్ని జంతువులున్నాయో, ఎంతమంది మనుష్యు లున్నారో—ఇదివరలో పోయినవి, ముందు రానున్నవి—అందఱూ యీ జీవసృష్టి కంతటికీ కారణమైన ఒక జీవకణాన్నుంచి వచ్చినవారే. అంటే, యివిఅన్నీ ఏకోదరు




జీవకణం

[1. Cell-wall, 2. జీవరసం, 3. న్యూక్లియసు, 4. క్రొమాటిన వల, 5. న్యూక్లియోలసు.]

లన్నమాట. అందుచేత ఈ విధంగాకూడ మనం విశ్వమానవసోదరత్వంతోబాటు విశ్వజంతు సోదరత్వం, విశ్వవృక్ష సోదరత్వం, ప్రేమ చూపవలసి ఉంటుందనే నా ఉద్దేశం. ఈ జీవకణం అడ్డంగా కొలిచినట్లయితే సుమారు ఒక మిల్లిమీటరులో 1/10,000 వ భాగం ఉంటుంది. అది ఎంతతీక్ష్ణమైన సూక్ష్మదర్శకయంత్రంతో పరీక్షించినా స్పష్టంగా కనబడదు. అసలు మొట్టమొదట ఈజీవంగాని, జీవకణంగాని ఏలాగున వచ్చిందయ్యా అంటే పాశ్చాత్య వైజ్ఞానికులు పంచభూతములనుండి ఏర్పడిం దన్నారు. ఈమాట మనవేదాలు సృష్ట్యాదినే ఘోషించినట్లు వినికిడి. పైనచెప్పిన యీజీవపరంపర కంతకూ కారణమే మనం గ్రహించవలసిన ముఖ్యమైన విషయం. అది జీవకణంలో సంతానోత్పత్తిని కలిగించే పదార్థ ముండే, అది అవిచ్ఛిన్నంగా అనాదినుంచి ఒక తీగవలె స్థిరుగా వచ్చే స్వభావమే. దానినే వైస్‌మాన్ అనే పాశ్చాత్య వైజ్ఞానికుడు **Continuity of Germplasm** అని అన్నాడు. ఆపదార్థమే 'జెరమ్ప్లాసం'. ప్రతిజీవకణానికీ ఆన్యూక్లియసు అనే పదార్థం ముఖ్యావసరం. అదిలేనిదే జీవకణం ఒకటి రెంటూ, రెండు నాలుగూగా వృద్ధిపొందటానికి అవకాశమేలేదు. మనం తెలుసుకోబోయే విషయమంతా దానిమీదే ఆధారపడిఉంది. అది లేకపోతే ఆనువంశికమే లేదు. వాహకు లంతకన్నా లేవు. ఈజీవకణాన్నే పరిశోధనాలయంలో స్వశక్తిచేత సృష్టించడానికి పాశ్చాత్య జీవశాస్త్రజ్ఞులు విశ్వప్రయత్నం చేస్తున్నారు. వారి కది సిద్ధించదని గట్టిగా చెప్పేటందుకు వీలులేదు. కాని మనం చూస్తామో చూడమో.

ప్రతిస్థూలశరీరంలోనూ రెండు రకములైన జీవకణా లుంటాయి: 1. శరీరపోషణకు అవసరమైనవి, 2. సంతానోత్పత్తికి అవసరమైనవి. శరీరంలో ఏభాగమైనా పెరగటానికిగాని, ఏక్రొత్త అవయవమైనా బయలుదేరటానికిగాని మొదటి రకపు జీవకణములే ఆధారం. అవి ఒకటి రెండు, రెండునాల్గు, నాల్గు ఎనిమిది–యీమాదిరిగా

ఏర్పడతాయని పైన చెప్పేఉన్నాను. ఇవి శరీరమంతటా కనబడతాయి. రెండవరకపు జీవకణాలు ప్రత్యేకమైన యిటువంటి జీవకణాల నుంచి వచ్చినవేకాని అవి వాటి నియామకస్థలంలోనే ఏర్పడతాయి. మన ప్రస్తుతవిషయానికి ఈ రెండురకాల జీవకణాలూ ఏవిధంగా ఏర్పడుతున్నాయో తెలుసుకోవటం కొంత అవసరం. అది తెలుసుకొనేందుకు మీరు కొద్దిగా శ్రమపడాలి. మనకంటికి కనబడే వస్తువులన్నీ ఏదో మనకు తెలియని ఒక శక్తిచేత కొన్నిలక్షలరెట్లు పెద్దవిగా చేయబడి, ప్రతిజీవకణం ఒక ఏనుగంత పెద్దదైనట్లుగాగాని, ఒక జీవకణంలో దూరి దానిపొరలోనుంచి మరొకదానిలోకి పోగలిగినంత సూక్ష్మశరీరం మీరు పొందినట్లుగాగాని భావించుకోవాలి. ఇది భావకవులకు చాలా సులభం. ఎందుచేతంటే-ఆకులో ఆకులై, పూవులో పూవులై, ననులేతరెమ్మలుకూడా అయిన వాళ్లు వాటిలో ఉండే జీవకణాలలోకూడా దూరిపోవడానికి కించిత్ ఆట్టే అంత శ్రమపడనక్కఱలేదు. అప్పుడు మీకు ఈజీవకణంలోపల జరిగే తమాషా, ఆ అతిసున్నితమైన పనిముట్లు, ఈ అనంతకోటిజీవులలోనేగాక ఒకే జాతిలోకూడా ఉన్న వ్యత్యాసము లెల్లా వస్తున్నాయో, ఈ ఆనువంశికం వేటిచేతుల్లో ఉందో ఈరహస్యం అంతా చక్కగా దృగ్గోచరమవుతుంది.

మొదట శరీరపోషణ కవసరమైన జీవకణాలసంఖ్య ఎట్లా వృద్ధిపొందుతూవుందో చూద్దాం. జీవకణంలో ఉండే న్యూక్లియసు మొదట క్రమంగా పెద్దదై, దానిలో నున్న క్రొమాటిక్ వలయొక్క దారము లన్నీ యీ క్రొమాటిక్ పదార్థంతో చిక్కబడి, త్రాళ్లు మాదిరిగా అయి, ఆవల అంతా ఒకటే త్రాడుగా అయి అల్లిబిల్లిగా ఏర్పడుతుంది. చివరికి ఆత్రాడు 'U' లేక 'V' ఆకారంగల కొన్ని ముక్కలుగా తెగిపోతుంది. ఈ ముక్కలయొక్క సంఖ్య వాటి యిష్టంవచ్చినట్లుగా ఏర్పడదు. ప్రతిరకపు ప్రాణికీ ఒకొక్క సంఖ్య నియామకంగా ఉంటుంది. మనుష్యునిలో (స్త్రీపురుష బిడ్డలిలోను) ప్రతిజీవకణంలోనూ 48 ముక్క లుంటాయి. ఏజాతి మనుష్యుడైనా సరే అన్నే ఏర్పడతాయిగాని ఒకటి ఎక్కువగాని, ఒకటి తక్కువగాని ఎప్పటికీ కనిపించవు. మనయింట్లో తిరిగే యీగజీవకణంలో 12 ఉంటాయి. 'డ్రాసోఫైలా' అనే ఒకవిధమైన యీగ ఉంది. దానిలో 8. ఒకవిధమైన చేపలలో యివి 200 ఉన్నాయి. అలాగే గుఱ్ఱాలలో, కోతులలో, పిల్లులలో, కుక్కలలో, కౌజులలో, పురుగులలో—ఒకటేమిటి ప్రతిరకపు ప్రాణికీ ఆయాసంఖ్య ఉంటుంది. చెట్టుచేమలలోకూడా అంతే. వేపచెట్టుయొక్క జీవకణంలో ఉండే సంఖ్య వేరు; వెలగచెట్టులో ఉండే సంఖ్య వేరు. మామిడిచెట్టులో ఒకసంఖ్య ఉంటే, మారేడుచెట్టులో మరొకసంఖ్య. ఒకవేళ ఒకేసంఖ్య రెండురకములైన ప్రాణులలో ఉన్నటే, యీ క్రొమాటిన్ముక్కల ఆకారంలోనో, సైజులోనో తేడా ఉంటుంది. ఈ క్రొమాటిన్ముక్కలకే 'క్రోమోసోములు' అని పేరు. ఇవే ఆనువంశికవాహకులు. వీటి స్వభావములే, వీటిలో ఉండే గుణములే తరతరాలకూ అంతర్వాహినిగా ప్రవహిస్తూ ఉంటాయి. పిల్లిసంతానం పిల్లులే అవటానికీ, కుక్కసంతానం కుక్కలే అవటానికీ, వేపాకు ఏవూళ్లోచూసినా చేదుగానే ఉండటానికీ యివే కారణం. ఈ ఆనువంశికరహస్యం అంతా వీటిచేతుల్లోనే ఉంది. ఈ మార్పులు కలుగుతూఉంటే, న్యూక్లియసుయొక్కపొర మాయమైపోతుంది. తర్వాత జీవకణంలోఉండే మిగిలిన పదార్థం అతి సన్నని దారపుపోచలుగా తయారై, అవి రెండుధ్రువములుగల ఒక కండెగా ఏర్పడతాయి. అప్పుడు ఈ క్రోమోసోము లన్నీ ఎడమొహం పెడమొహంగా యీకండెయొక్క మధ్యభాగానికి వచ్చి చేరుకుంటాయి. అక్కడ ఒకొక్క క్రోమోసోమూ నిలువుగా రెండుక్రింద చీలి, 'U' లేక 'V' ఆకారంగల క్రోమోసోములు రెట్టింపు అవుతాయి. జీవకణంలో మొదట 4 క్రోమోసోము లున్నా యనుకుంటే, అవి యిప్పుడు 8 అవుతా యన్నమాట. వాటిలో నాలుగు క్రోమోసోములు యీ కండెయొక్క దారములను పట్టుకొని నెమ్మదిగా ఉత్తర ధ్రువానికీ, మిగిలిన నాలుగూ దక్షిణధ్రువానికీ చేరతాయి. అక్కడ వీటితో ఒక చిన్న న్యూక్లియసు న్యూక్లియోలసుతో సహా ఏర్పడుతుంది. అంటే, మొదటిన్యూక్లియసుయొక్క పదార్థం చెరిసగం అయి, రెండు చిన్న న్యూక్లియసులు ఏర్పడతాయి. ఈలోపుగా యీ కండెయొక్క దారాలసంఖ్య ఎక్కువై, జీవకణంలో మధ్యకొన్ని రేణువులకూడికతో అడ్డంగా ఒక పల్చటిపొర ఏర్పడుతుంది. ఇది రెండుపొరలుగా ఉంటుంది. ఒకపొర క్రిందిజీవకణానిది. రెండవది పైదానిది. తరువాత యీకండె నెమ్మదిగా జీర్ణించిపోతుంది. ఈ విధంగా ఒక జీవకణం రెండు, రెండు నాలుగు, నాలుగు ఎనిమిదిగా శరీర మంతటా అవుతాయి. ప్రతిజీవకణంలోనూ ఏర్పడే యీ క్రోమోసోముల సంఖ్య 4 మాత్రమే.

ఇంక సంతానోత్పత్తి కవసరమగు జీవకణాలు ఏవిధంగా ఏర్పడతాయో చూద్దాం. ఇక్కడకూడా న్యూక్లియసులో ఆ క్రొమాటిన్‌తో ఏర్పడిన త్రాడు తయారవుతుంది. బాగా పరిశీలిస్తే అది త్రాడంతా ఒకటే అయినప్పటికీ రెండేసిత్రాళ్లు ఒకదాని ప్రక్క నొకటి చేరినట్లు కనిపిస్తుంది. చివరకు బాగా చిక్కపడిన తర్వాత ముక్కలుముక్కలుగా అయి, రెండేసి క్రోమోసోములు ఒకజతగా చేరతాయి. ఇక్కడకూడా మొట్టమొదట జీవకణంలో నాలుగు క్రోమోసోము లున్నా యనుకుంటే, రెండేసికల జతలు రెండు ఏర్పడతాయి. అంటే, క్రోమోసోములయొక్కసంఖ్య యిక్కడ సగం అయిందన్నమాట. ఇదే పైదానికిని దీనికిని ఉన్న భేదం. ఈ సగం అవటం చాలా అవసరం. ఎందుచేతో యిప్పుడే తెలుస్తుంది. ఈలోపుగా ప్రతిజతా వాటివాటి సహజమైన ఆకారం కలిగి ఉంటాయి. ఉండి, యించుమించుగా ప్రతిజతలోనూ ఒకదాని నొకటి అంటుకొని ఉంటాయి. అప్పుడు ఒకదానిలోనున్న క్రొమాటిన్



2. శరీరపోషణ కవసరమగు జీవకణము రెండుగాఅగుట.

[1. జీవకణం, 2. క్రొమాటిన్ త్రాడు, 3. కండె-దాని మధ్య చేరిన క్రోమోసోములు, 4. ధ్రువములకు ప్రయాణమగుచున్న క్రోమోసోములు, 5. ధ్రువములకు చేరుచున్న క్రోమోసోములు, 6. ధ్రువములకు చేరినవి, 7. జీవకణంలో మధ్య రేణువులకూడిక, 8. రెండు చిన్నజీవకణములు.]

పదార్థం మరొకదానిలోనికి పోవచ్చు. ఈ రెండుజతలూ న్యూక్లియసు మధ్యకు వచ్చి చేరుకుంటాయి. ఇక్కడకూడా రెండుధ్రువములు కల దారపుకండెమాదిరిది ఏర్పడుతుంది. ఇప్పుడు పైదానికివలె యీ క్రోమోసోములు రెండుగా చీలవు. చీలక, యీ రెండు జతలలోనూ, ఒక్కొక్కజతకు ఒక్కొక్కటిచొప్పున రెండు ఉత్తరధ్రువానికీ, రెండు దక్షిణధ్రువానికీ పోయి చేరుకుంటాయి. ఇప్పుడు ఒక్కొక్క ధ్రువంలో రెండు క్రోమోసోములు మాత్రమే ఉన్నాయి. ఈ రెంటితోటే అక్కడ ఒక న్యూక్లియసు ఏర్పడుతుంది. ఇప్పుడే యీ రెండు న్యూక్లియసులమధ్య ఒకపొర ఏర్పడితే ఏర్పడవచ్చు. వెంటనే పైభాగంలోనున్న యీ చిన్న న్యూక్లియసులో యీ రెండు క్రోమోసోములూ మళ్లీ ఒకత్రాడుగా మారి, రెండుముక్కలై, మధ్యకు చేరి, అక్కడ యిప్పుడు ఒక్కొక్కటి నిలువుగా రెండుక్రింద చీలి, మొత్తం నాలుగు క్రోమోసోములు ఏర్పడి, మళ్లీ ఏర్పడిన యీ దారపుకండె సాహాయ్యంతో రెండు ఒకమూలకూ, రెండు ఇంకొకమూలకూ చేరి, అక్కడ యింతకంటె చిన్న న్యూక్లియసును తయారుచేస్తాయి. క్రిందిభాగంలోనూ యీ విధంగానే రెండు చిన్న న్యూక్లియసులు ఏర్పడతాయి. అంటే, మొత్తం నాలుగు న్యూక్లియసులు జీవకణంలో ఏర్పడ్డాయి. తర్వాత యీ నాల్గింటిని వేరుచేస్తూ పొరలు ఏర్పడతాయి. ఈ విధంగా 4 క్రోమోసోములు కల ఒక తల్లిజీవకణాన్నుంచి రెండేసి క్రోమోసోములు కల చిన్న జీవకణాలు 4 ఏర్పడ్డాయి. ఇవే సంతానోత్పత్తికి అవసరమైన జీవకణాలు. వీటిని **Germ-cells** అంటారు.

ఈ మాదిరిగా ఒక్కొక్క తల్లి జీవకణాన్నుంచి పురుషశరీరంలో 4 పురుషబీజములు, అదేవిధంగా స్త్రీ శరీరంలో 4 అండములు ఏర్పడతాయి. కాని అండము పెరుగుటకు ఆహారం ఎక్కువ కావాలి కాబట్టి, సాధారణంగా ఆ నాల్గు అండములలోను మూడుజీర్ణించిపోయి ఒక్క అండంమాత్రం బాగా పెరుగుతుంది. వృక్షములలో కూడా అంతే. ఇందులో మనం ముఖ్యంగా గమనించవలసిన విషయం తక్కిన శరీరంలో ఉన్న క్రోమోసోములలో సగంమాత్రమే యీ బీజములలో ఉండటం. ఇది చాలా ముఖ్యం. అదేకనక లేకపోతే పిండం నరుడుగా తయారవటానికి బదులు ఏ వానరుడుగానో, పిల్లిగా తయారవటానికి బదులు ఏభూతపిల్లిగానో తయారవవచ్చు. ఈ ఏర్పాటు అతిసూక్ష్మమైనదిన్నీ, అత్యవసరమైనదిన్నీ. ఎందుచేతంటే, పురుషశరీరంలో ఉన్న బీజమున్నూ, స్త్రీ శరీరంలో ఉన్న అండమున్నూ కలిస్తేనేగాని పిండం ఏర్పాటవదన్న సంగతి అందరకూ తెలిసిన విషయమే. పై ఉదాహరణప్రకారం శరీరంలో ఉన్న ప్రతి జీవకణంలోనూ 4 క్రోమోసోము లుంటే, సంతానోత్పత్తికి అవసరమైన జీవకణాలు ఏర్పడినప్పుడు పురుషబీజంలో 2, అండంలో 2 మాత్రమే ఉన్నాయి. పురుషబీజమూ,అండమూ కలిసినప్పుడు యిందులో రెండూ,అందులో రెండూ కలిసి 4 అయి, శరీరంలో ప్రతిజీవకణంలోనూ మామూలుగా ఉండవలసిన క్రోమోసోములసంఖ్య ఏర్పడి ఆ పిండం తయారౌతుంది. లేకపోతే, వీటిలోకూడ నాలుగేసి క్రోమోసోము లుంటే, రెండు నాల్గులు ఎనిమిది క్రోమోసోములయి, సింహం అవటానికి బదులు ఏ నరసింహమో అవతరిస్తుం దని పైన చెప్పినవిషయమే. చూడండీ! ఇది ఎంత చక్కని ఏర్పాటో! ఈ చిత్రాన్ని ఏ శిల్పి సృష్టించగలడు? ఎవడు చిత్రించగలడు? ఈ మార్పు లన్నీ మనం సూక్ష్మదర్శకయంత్రం క్రిందచూడగలం. 'హిమోటాక్సిలిన్' అనే రంగు వేస్తే జీవకణంలో యీ క్రోమోసోములు, న్యూక్లియసు నల్లగా కనబడతాయి.

అవసరమైన విషయం ఇంకొక్కటిమాత్రం ఉంది. ఎక్కడినుంచో గింజపడి మన దొడ్డిలో బొప్పాయిమొక్క మొలిచింది. అది పోతుచెట్టు అవుతుందా, ఆడచెట్టు అవుతుందా? కోడి గ్రుడ్డు పొదుగుతూవుంది. అది పుంజు అవుతుందా, పెట్టా? మన ఆవు ఈనబోయింది. కోడెదూడను పెడుతుందా, పెయ్యదూడను పెడుతుందా? పెయ్యదూడైతే మళ్లీ పాలపూచీ గడుస్తుంది. అవధాన్లగారికి అందఱూ ఆడపిల్లలే. పాపం! మచ్చుకోసం మగనలుసొకడు పుడితే వంశమైనా ఉద్ధరిస్తాడు. శిశువుకు యీ స్త్రీ పురుషనిర్ధారణ ఏలా కలుగుతూవుంది? ఇది కూడా యీ క్రోమోసోముల చేతిలోనే ఉందిగాని ఆయాప్రాణుల ప్రయోజకత్వం


GENERAL MOTORS TRUCK




3. తల్లి జీవకణమునుండిసంతానోత్పత్తికవసరమగు జీవకణములేర్పడుట.

[1. క్రొమాటిన్ త్రాడు, 2. క్రోమోసోములు, 3. సమానమైన రెండు క్రోమోసోముజతలు, 4. ధ్రువములకు ప్రయాణ మగుచున్న రెండేసి క్రోమోసోములు, 5. రెండు భాగములలోను రెండుగా చీలిన క్రోమోసోములు, 6. రెండేసి క్రోమోసోములు కల నాలుగు జీవకణములు, 7. తల్లిజీవకణమునుండి ఏర్పడిన సంతానోత్పత్తి కవసరమగు నాలుగు జీవకణములు.]

---

ందులో ఏమీ లేదు. ఏలాగంటే—స్త్రీ పురుష భాగములు వేర్వేరే వ్యక్తులలోగల ప్రతిరకపు ప్రాణికీ స్త్రీ శరీరంలోనూ, పురుషశరీరంలోనూ ఉన్న జీవకణాలలో యీ క్రోమోసోముల సంఖ్య ఒకటే అయినప్పటికీ కొద్దిగా తేడా ఉంది. ఇవి రెండేసి కలిసి ఒక జతగా ఏర్పడతాయని పైన మీరు చూసిందే. ప్రతి జతలో ఉండే రెండు క్రోమోసోములూ ఆకారంలో ఒకే మాదిరిగా ఉంటాయి. కాని స్త్రీ శరీరంలో ఉన్న జీవకణంలో ఒక జతలోమాత్రం రెండు క్రోమోసోములుగూడా తక్కినవాటికంటె పొడుగుగానో, పొట్టి లావుగానో, సన్నంగానో ఉండి ఏర్పాటుగా కనబడతాయి. వీటిని X క్రోమోసోములు అని అన్నారు. అండము తయారయ్యేటప్పుడు ఈ రెండు క్రోమోసోములలోనూ పైన మీరు చూసిన ప్రకారం ఒక X క్రోమోసోము మాత్రమే దానిలో ఉంటుంది. పురుషశరీరంలో ఉన్న జీవకణంలో అన్ని క్రోమోసోముల జతలూ ఒకేమాదిరిగా ఉండక, వాటిలో ఒకజతలోనున్నవి ఒకటి పెద్దది, ఒకటి చిన్నదిగా ఉంటాయి; ఒకటి ఒక మాదిరిగాను, యింకొకటి మరొకమాదిరిగాను ఉంటాయి. ఈ పెద్ద క్రోమోసోము స్త్రీశరీరంలో ఉండే X క్రోమోసోము మాదిరిగానే ఉంటుంది. అందుచేత దీనినికూడా X క్రోమోసోము అన్నారు. చిన్న క్రోమోసోమును Y క్రోమోసోము అన్నారు. అంటే, పురుషశరీరంలో ఉండే జీవకణంలో ఒక X క్రోమోసోము, ఒక Y క్రోమోసోము ఉన్నాయి. దీనినుండి నాలుగు పురుషబీజములు ఏర్పడినప్పుడు రెండిటిలోకి X క్రోమోసోం వస్తుంది; రెండిటిలోకి Y క్రోమోసోం వస్తుంది. అందుచేత రెండు రకాలుగా పురుషబీజములు ఏర్పడతాయి. X క్రోమోసోం ఉన్న పురుషబీజం అండంతో కలిస్తే, అందులో ఉన్న X క్రోమోసోం, యిందులోనున్న X క్రోమోసోం కలిసి రెండు X క్రోమోసోములయి, ఆపిండం స్త్రీశరీరం అవుతుంది. ఒకవేళ Y క్రోమోసోం ఉన్న పురుషబీజం ఆ అండంతో కలిస్తే అందులో ఉన్న X క్రోమోసోం, యీ Y క్రోమోసోం కలిసి, XY కల ఒకజత ఏర్పడి ఆ పిండం పురుషశరీరమవుతుంది. ఆ మాదిరిగానే ఒక జీవకణంలోనుంచి తయారైన నాలుగు పురుషబీజములు కూడా నాలుగు అండములతో కలిసినట్లయితే (ఒక్కొక్క అండం పిండరూపం దాల్చటానికి పురుషబీజం ఒక్కటే కావాలి) ఆ శిశువులలో యిద్దఱు పురుషులు, యిద్దఱు స్త్రీలు ఉంటారు. కొన్ని ప్రాణులలో పురుషశరీరంలో నున్న జీవకణంయొక్క క్రోమోసోములసంఖ్య స్త్రీ శరీరంలోనున్న సంఖ్యకంటె ఒకటి ఎక్కువగాని, ఒకటి తక్కువగాని ఉంటుంది. స్త్రీ జీవకణంలో 10 క్రోమోసోము లుంటే పురుష జీవకణంలో 11 గాని, 9 గాని ఉంటాయి. 11 ఉన్నా యనుకుందాం, ఇవి 5 జతలు, పైన ఒక్కటిగా ఏర్పడతాయి. దీనినుండి వచ్చిన నాలుగు పురుషబీజములలో రెంటికి 5 క్రోమోసోములు, రెంటికి 6 క్రోమోసోములు ఉంటాయి. అండంలో 5 క్రోమోసోము లుంటాయి. 5 ఉన్న బీజం అండంతో కలిస్తే 5+5=10 అయి స్త్రీ శరీరమున్నూ, 6 ఉన్న బీజం కలిస్తే 6+5=11 అయి పురుష శరీరమున్నూ ఆ శిశువుకు కలుగుతాయి. శిశువుకు స్త్రీ పురుషనిర్ధారణ యీ విధంగా కలుగుతూవుందిగాని రకరకాలు, రావిచెట్టు ప్రదక్షిణాలు, సింహాద్రి అప్పన్న మ్రొక్కులు, సింగరాచార్లగారి సిద్ధౌషధాలు వీటివల్ల అయ్యేది ఏమీ లేదు. సింగినాదం జీలకఱ్ఱ తప్ప!!

కొన్నాళ్ళ క్రిందట నాకు ఒకసందర్భంలో ఒకమాదిరి పిచ్చి పట్టింది. అది ఉండటం ఒకరోజే ఉందిలెండి. ఏమిటంటే — ఈ జీవపరిణామం ఏమిటీ ఇంత అధ్వాన్నంగా వెళ్లింది? సృష్టిలో కొన్ని ప్రాణుల కున్నట్టు స్త్రీపురుష భాగములు రెండూకలిసి మనుష్యులలో కూడా ఒకేవ్యక్తిశరీరంలో ఉంటే (కొబ్బరిచెట్టు, వానపాము మొదలైనవాటిమాదిరిగా) యీ స్త్రీలు, పురుషులు అనే భేదం పోయి, ఈ సంయోగ వియోగాలు అసలే పోయి, ప్రస్తుతం ప్రపంచంలో ఉన్న అశాంతిలో ముప్పాతికమూడుపాళ్లు తగ్గి, మానవజీవితంలో కొంత శాంతి ఏర్పడుతుందేమో అని. ఋతుకాలంలో పైప్రాణులమాదిరిగానే సంతానంకూడా కలుగుతుంది. దీనివల్ల అనర్థాలూ లేకపోలేదు.




4. మనుష్యునిలో పురుషుని శరీరమందు జీవ కణంలో ఉన్న క్రోమోసోములు.

ఉన్నప్పటికీ, అది సాధ్యమవుతుందా? స్త్రీలకూ పురుషులకూ సమాన హక్కులు రావచ్చు. వివాహము, భార్య, భర్త అనే శబ్దాలు అన్ని నిఘంటువులలోనుంచి పోవలసిన స్థితి రావచ్చు. కాని, మానవశరీర




5. శిశువుకు స్త్రీ పురుషనిర్ధారణ.

నిర్మాణంలో యీ మార్పు వచ్చేదెల్లాగ? అన్ని దేశాలలోనూ మానవ జీవితంలో రష్యాలో ఉన్న బోల్షివిజం రావచ్చుగాని, మానవశరీరంలో యీమాదిరి బోల్షివిజం రావటం సూర్యచంద్రులు రెండూ ఒకేగ్రహంలో ఉండటం ఎంత సాధ్యమో అంత సాధ్యం. అదిగాక, సముద్రందాకా వచ్చిన గంగానదిని మళ్లీ వెనక్కిపట్టించి శివుడినెత్తిమీద కూర్చోపెట్టడానికి ఆభగీరథుడికికూడా సాధ్యంకాదు. ఈప్రవాహానికి ఏ విశ్వేశ్వరయ్య ఆనకట్ట కట్టగలడు? కాని ఒక్క సంగతి. ఇంతటితోమాత్రం యీ జీవపరిణామం ఆగిపోలేదు. ఈ ప్రాక్ప్రతీచీ సంగ్రామాలలో ప్రపంచం పూర్తిగా నిర్మూలనమవ్వం కాకపోతే, యీ భూకంపాలు, అగ్నిపర్వతాలు విజృంభించకుండా ఉంటే, కొన్నాళ్లకు ఉత్తుంగభుజుడు పోయి ఏ నందుడో రాజైనప్పుడు మానవశరీరం హెచ్. జి. వెల్సు మహాశయుడు సూచించినట్లుగా ఏ విధంగా మారుతుందో మనం చెప్పలేం. విషయాంతరంలోకి వెళ్లానేమో, క్షమించండి.

ఈ సందర్భంలోనే కొజ్జాలను గురించికూడా చెప్పటం అప్రస్తుతం కాదుగాని వ్యవధి లేకపోవటంచేత మరొకమాటు మనవి చేస్తాను. కవలపిల్లలు పుట్టడాన్నిగురించి కొద్దిగా చెప్పతాను. గర్భాశయంలో ఉన్న అండం పురుషబీజంతో కలిసిన తర్వాత పిండంగా మారి కొన్నిపట్ల వెంటనే రెండు సమానభాగములుగా చీలుతుంది. తర్వాత ఈ రెండు భాగములూ వేరువేరుగా వృద్ధిపొంది ఇద్దరు శిశువులు అవుతారు. ఈ విధంగా పుట్టిన కవలపిల్లలు X క్రోమోసోము ఉన్న పురుషబీజం అండంతో కలిసిఉంటే యిద్దరూ స్త్రీలు, Y క్రోమోసోము ఉన్నబీజం కలిసిఉంటే యిద్దరూ పురుషులూ అవుతారు. వీళ్లిద్దఱకూ పోలిక 16 అణాలుకూడా ఉంటుంది. కొన్నిచోట్ల, రెండు వేరువేరు అండములు పిండములుగా అయి కూడా కవలపిల్లలు కలుగుతారు. ఈ రెండు అండములతో రెండూ Y క్రోమోసోము ఉన్న పురుషబీజములే కలిసి ఉంటే యిద్దరూ పురుషులు, X క్రోమోసోము ఉన్న బీజములు కలిస్తే యిద్దఱూ స్త్రీలు, లేకపోతే ఒకస్త్రీ, ఒక పురుషుడూ అవుతారు. వీటిరెండిటికీ పోలిక ఏ ఎనిమిది అణాలో, పది అణాలో ఉంటుంది. నలుగురైదుగురు శిశువులు ఒకేసారి ఒక్కొక్కప్పుడు కలుగుతారు. అవికూడా యీ మాదిరిగానే ఏర్పడతాయి.

ఈ క్రోమోసోముల దగ్గరకు మరొక్కమారు వెళ్లి వాటిని లోతుగా పరిశీలిస్తే యీ ఆనువంశికరహస్యం యింకా స్పష్టం అవుతుంది. ఆ ప్రాణికి ఉన్న సహజమైన లక్షణాలు, గుణాలు అన్నీ యీ క్రోమోసోములలోనే యిమిడి, అంతర్భూతంగా ఉన్నట్టు తెలుస్తుంది. ప్రతి క్రోమోసోమూ దాని పొడుగు ననుసరించి ఒకటో, రెండో, నాలుగో, యింకా ఎక్కువో గుణాలకుగాని, లక్షణాలకుగాని జవాబుదారీగా ఉండి వాటిని ఆ ప్రాణిలో సమయానుకూలంగా ఉత్తేజింపజేస్తుంది. ప్రతి క్రోమోసోములోనూ కొంతభాగం ఒకగుణానికి, కొంతభాగం మరొకగుణానికి, మరికొంతభాగం యింకొకగుణానికి యీవిధంగా బాధ్యత వహిస్తుంది. ఈ ఒక్కొక్క భాగానికి 'జెనీ' అని పేరు పెట్టారు. ఒక్కొక్క క్రోమోసోములోనూ కొన్ని జెనీలు ఉంటాయి. కొన్ని విధములైన గుణాలకు ఒకటికంటె ఎక్కువ జెనీలుకూడా

కారణంగా ఉంటాయి. ఈ ఆనువంశికము, ఈపోలికలు అన్నీ యీ జెనీలవల్లనే కలుగుతున్నాయి. ఈ జెనీలు క్రోమోసోముకంటె కొన్నిరెట్లు చిన్నవవటంచేత వీటిని వేరువేరుగా ఎంత తీక్ష్ణమైన సూక్ష్మదర్శక యంత్రమైనా యింతవరకు చూపించలేకపోయింది.

ఇప్పుడు, తల్లిదండ్రులకూ సంతానానికీ పోలికలు ఏవిధంగా ఉంటాయో, ఎంతవరకుంటాయో, ఆనువంశికంగా యివి రావటంలో ఎక్కడ ఎప్పుడు ఏవిధంగా మార్పులు చెందుతాయో, అసలు తల్లి దండ్రులలో నున్న ఏయేగుణాలు బిడ్డకు వస్తాయో, ఏవి రావో అనే విషయాలు తెలుసుకుందాం.

బాహ్య పరిస్థితులవలన ప్రాణికి కలిగిన గుణాలు శిశువుకు వస్తాయా, రావా అనే విషయాన్నిగురించి అభిప్రాయభేదం వైజ్ఞానికులలో చాలాకాలం ఉంది. మొదట కొంతకాలంవరకూ అవికూడా శిశువుకు కలుగుతాయనే వారు అభిప్రాయపడ్డారు. తరువాత కొన్ని పరిశోధనాఫలితములనుబట్టి కొంతమంది అవి రానేరవని నిశ్చయించారు. ఆప్రాణిజెరంప్లాసంలో ఉన్న గుణాలే వస్తాయికాని, బాహ్య పరిస్థితులకు జెరంప్లాసం సర్వసాధారణంగా మారదు కాబట్టి అవి శిశువుకు రావన్నారు. ఈ విషయంలో ఒక ఉదాహరణచెప్పతాను. ఒకడు తాను నివసించు పరిస్థితులు సరిగా లేకపోవటంచేత ఏ క్షయ వ్యాధినో గ్రహించి దీర్ఘరోగిగా ఉన్నాడనుకోండి. అతనికి ఒకశిశువు కలిగింది. ఆ శిశువుశరీరంలో యీవ్యాధిచిహ్నములు ఏమీ కన్పించవు. కాని ఒక్కటిమాత్రం ఉంటుంది. ఈశిశువు పెరిగి పెద్దదైనా బాహ్య పరిస్థితులు అనుకూలంగా ఉండి, యీ వ్యాధికి కారణమైన సూక్ష్మ జీవులు తన శరీరంలో ప్రవేశించటానికి అవకాశం ఉంటే, అవి చక్కగా ఆహ్వానింపబడి, వాటికి ఆశరీరంలో స్థిరమైన ఆశ్రయం ఏర్పడి, వెంటనే ఆవ్యాధి ఆశరీరంలో బయలుదేరుతుంది. తండ్రిలో ఉన్న వ్యాధి యీ శిశువుకు రాకపోయినా, ఏమాత్రమైనా అవకాశమిస్తే గ్రహించడానికి సిద్ధంగా ఉంటుంది. దీనినే **Predisposition to the disease** అని అన్నారు. ఇది ఆనువంశికంగా వస్తుంది. ఇది కొన్నివ్యాధుల విషయంలోనేగాని, బాహ్యపరిస్థితులవలన వచ్చే కొన్నిగుణాలకు యీమాత్రంకూడా ఉండదు. అందుచేత, బాహ్యపరిస్థితులవలన కలిగే ఏగుణంకూడా జెరంప్లాసంను మార్చలేదని మాత్రం కాదు. ఏమైనా, యీవిషయం యింకా అటో యిటో పూర్తిగా నిర్ధారణ కానట్లే కనిపిస్తుంది. వృక్షములలో కొన్ని విషయాల కిది సరిపడటం లేదు.

ఏ శిశువైనా సరే తల్లిదండ్రులను నూటికి నూరుపాళ్లు పోలి ఉండటం చాలా దుర్లభం. అలాగ ఉండదు కూడాను. కారణం యిప్పుడే బోధపడుతుంది. అదిగాక, ప్రతిప్రాణిలోనూ ప్రతిలక్షణమూ బలీయంగానో, సాధువుగానో ఉంటుంది. అది ఏమాదిరిదో తెలియనిదే సంతానం ఫలానామాదిరిగా ఉంటుందని చెప్పటం కష్టం. ఏగుణం బలీయమైతే ఆ గుణం శిశువులో కనబడుతుంది. తండ్రి నల్లగా ఉంటాడు, తల్లి ఎఱ్ఱగా ఉంటుంది. వీటిలో ఏగుణం బలీయంగా ఉంటే అది శిశువుకు వస్తుంది. ఇంకొకవిషయం. ఆ ప్రాణిలోఉండే ఆ గుణం పూర్తిగా స్వచ్ఛమైనదో, లేక కల్తీ ఉందో కూడా తెలియాలి. తెలియందే, ఆ గుణమే తప్పకుండా వస్తుందని చెప్పటానికి వీలులేదు. తల్లి, తండ్రి యిద్దఱూ నల్లగానే ఉంటారు. శిశువు ఎఱ్ఱగా ఉండొచ్చు—కుమ్మరావంలో యిత్తడి ముంతలాగ. ఎందుచేతంటే, మాతామహియో మాతామహుడో, పితామహియో పితామహుడో ఎఱ్ఱగా ఉండి, తల్లియొక్కగాని, తండ్రియొక్కగాని జెరంప్లాసంలో ఉన్న 'నలుపు' అనే గుణం కల జెనీలో 'ఎఱుపు'గుణం కల జెనీకూడా కలిసి కల్తీగా ఉండొచ్చు. ఈ జెనీలు ఏలాగ మారతాయో, ఏది పైకి వస్తుందో, ఏది రాదో చెప్పటం కొద్దిగా కష్టం. ఒకసారి జార్జి బెర్నార్డుషాను ఒక అందమైన ఫ్రెంచి దేశపుస్త్రీ అడిగిందట: "నీవు చాలా తెలివితేటలైన వాడవుగదా. నీవూ నేనూ వివాహం చేసుకుంటే మనకు పుట్టిన బిడ్డ ఎంతో తెలివితేటలైనదిగాను, ఎంతో అందమైనదిగాను ఉంటుంది. ప్రపంచంలో యింతకంటె కావలిసిం దేముంది? కనుక నన్ను పెళ్లి చేసుకో" మని. దానికి షా నవ్వి, "ఆపుట్టిన శిశువుకు నీతెలివి తేటలూ, నా అందం వస్తే ఏంచేస్తావు?" అన్నాడట. పండితపుత్రుడు పండితపుత్రుడుగానే ఉండటానికి కారణం యిదే అనుకుంటాను.

కాబట్టి సంతానమునకు తల్లిదండ్రులనుంచి గుణాలు ఎన్ని విధములుగా రావచ్చునో చూద్దాం:

1. తండ్రిలోని గుణం, తల్లిలోని గుణం రెండూ కలిసి చక్కగా మిశ్రమమై శిశువులో కనబడుతుంది. తండ్రి నల్లగా, తల్లి ఎఱ్ఱగా ఉంటే, శిశువు చామనచాయగా, దోరగా ఉండొచ్చు. ఉంటే ఒకవేళ ఒకచూపువాసి ఎఱుపుగాని, నలుపుగాని ఎక్కువగా ఉండొచ్చు.

2. తండ్రిలోగాని, తల్లిలోగాని ఉన్న గుణం బలీయమైనదైతే ఆగుణం ఒక్కటే శిశువులో కనబడుతుంది. ఇక్కడ తండ్రి మాదిరిగా కేవలం నల్లగా గాని, తల్లిమాదిరిగా కేవలం ఎఱ్ఱగా గాని శిశువు ఉంటుంది.

3. తండ్రిలో ఉన్న గుణం కొంత, తల్లిలో ఉన్న గుణం కొంత వేరువేరుగా 'తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం'లాగ శిశువులో కలుగుతాయి. తల్లిశరీరం నున్నగా ఉండి, తండ్రికి ఒంటినిండా రోమకళ ఎక్కువగా ఉందనుకోండి. శిశువుకు కొన్నిభాగములలో రోమకళ ఉండి, కొన్నిభాగములు నున్నగా ఉంటాయి.

4. తండ్రిలో ఉన్న గుణం ఒకశిశువుకు, తల్లిలో ఉన్న గుణం రెండోశిశువుకు, మళ్లీ మూడోశిశువుకు తండ్రిగుణం యీలాగ ఒకటి విడిచి ఒకటి రావచ్చు. తండ్రి ఆజానుబాహువు; తల్లి మరుగుజ్జు. ఒకశిశువు తండ్రిలాగ పొడుగుగా, రెండవశిశువు తల్లిలాగ పొట్టిగా, మూడవది మళ్లీ తండ్రిలాగ పొడుగుగా ఉంటుంది.

5. కొన్నిచోట్ల నేను పైనచెప్పినట్లు శిశువులో ఉన్న గుణం తండ్రిలోగాని, తల్లిలోగాని ఎక్కడా కనబడదు. అప్పుడు ఆ శిశువు ఈ ఆనువంశికంలో వెనక్కిపోయి ఏతాతనో, ముత్తాతనో ఆగుణంలో పోలిఉండొచ్చు. తల్లీ, తండ్రీ దద్దమ్మలైె శిశువు మిరియపుగింజ లాంటివాడు పుట్టి పెద్దయినతర్వాత మంచి మేధావి అవవచ్చు. తాతో, ముత్తాతో దేవాంతకుడై ఉండాలి. ఈమాదిరి పోలిక ఒకొక్కప్పుడు వంశవృక్షంలో యింకా వెనక్కి పోతేకూడా పోవచ్చు.

ఈ మాదిరిగా పోలికలు శిశువులకు వస్తాయి. వీటికోసం మనం ఎక్కడో వెతకక్కర్లేదు. మన సంసారాలలో చూస్తూ ఉన్నదే.

1857 మొదలు 1865-వ సం.రం వరకు గ్రిగార్ మెండెల్ అనే ఒక ఆస్ట్రియా దేశపు మతాధికారి ఊసుపోటానికని మొదలుపెట్టి అక్కడే కొన్ని బటానీమొక్కలతో పరిశోధనలు చేశాడు. స్వచ్ఛమైన గుణములు కల మొక్కలనే తీసుకుని గుణాలను వేరువేరుగా పరిక్షిస్తూ మూడుతరాలదాకా ఆ గుణాలు ఏలాగవస్తాయో చూశాడు. తర్వాత ఈ ఆనువంశికాన్ని గురించి కొన్ని సూత్రాలు వ్రాసిపెట్టాడు. అతడు 1884-వ సం.రంలో చనిపోయాడు. ఈ సూత్రాలు సుమారు 40 సం.ల దాకా సూర్యరశ్మిని చూడక బూజుపట్టిపోయాయి. 1900-వ సం. రంలో కొందఱు ప్రముఖులు యీ విషయాన్నే తీసుకొని పరిశోధనచేస్తే వారిఫలితాలు యిదివరకే మెండెల్ చేత సూచింపబడ్డా యని తెలిసికొని, అప్పుడు వాటిని వెల్తురులోకి తెచ్చి, ఆయన పేరు విజ్ఞానప్రపంచంలో చిరస్థాయిగా ఉండాలని దానికి 'మెండలిజం'అని పేరుపెట్టారు. ఆ మెండెల్ వేసిన బీజమే వీరి నీటి సాహాయ్యంతో మొక్కై, మ్రానై, శాఖోపశాఖలతో యిప్పుడు మహావృక్షమైంది. దీనిమీద ఆధారపడి జీవశాస్త్రపు శాఖ లన్నిటిలోనూ అనేకమైన అంచనాలు వేస్తూ మానవ సౌకర్యంకోసం పరిశోధనలు చేస్తున్నారు. ఫలితములు పొందుతున్నారు. వ్యవసాయశాఖలో అనేకమైన లాభాలు కలుగుతున్నాయి. జంతువులలో ఎక్కువ బలమైనవి, ఎక్కువ పాలిచ్చేవి యితర దేశములవాటితో సంపర్కం కలిగించి తయారుచేస్తున్నారు. పక్షులలో, పుష్పములలో రకరకములైనవి ఏర్పడుతున్నాయి. వైద్యశాఖలోకూడా కొంతవరకు ఉపయోగిస్తున్నారు. మెండెల్ యొక్క ముఖ్యసూత్రము లేవంటే, "ప్రతి ప్రాణిలోనూ ప్రతిగుణానికీ ఒకటి బలీయమై పైకి కనబడేభాగం, మరొకటి సాధువై దాగి ఉండే భాగం ఉంటాయి. ఈ రెండూ కలిసినప్పుడు బలీయమైన లక్షణమే బయటకు కనబడుతుంది. మొదటితరంలో ఒక లక్షణం మాత్రమే కనబడుతుంది; రెండవది దాగిఉంటుంది. కాని రెండు మూడు తరాలలో యీ బలీయ సాధులక్షణాలు వేరువేరుగా సంతతిలో కనబడతాయి. ప్రతిలక్షణం జెరంప్లాసంలోనికి వచ్చి దానికి ఒక జెనీ కారణంగా ఉండి, యీ జెనీలు కలవటం కలవకపోవటంలో ఆ లక్షణములు కనబడటమో, కనబడకపోవటమో అవుతుంది."

చెట్లలోనూ, జంతువులలోనూ ఈ మెండలిజంప్రకారం జరిగిన పరిశోధనలు చాలా ఉన్నాయి. అవి, యిప్పటికే మీరు విసుగెత్తి ఉండటంచేత గ్రహించడానికి కొద్దిగా కష్టపడాలి. అందుచేత వాటిని వదలివేసి, మొదట మన విషయం తెలుసుకోవటం ముఖ్యం కాబట్టి మనుష్యులలో ఈ ఆనువంశికం ఏలా ఉండవచ్చునో చెబుతాను. కాని జరిగిన పరిశోధనలు చాలా తక్కువ. ఎందుచేతంటే, ఎవడైనా పరిశోధకుడు ఒక యూరోపియనుస్త్రీదగ్గరకు వెళ్లి "నీవు ఆ నీగ్రోవాడిని పెళ్లిచేసుకో, మీ సంతతిలో ఎంతమంది శ్వేతముఖు లుంటారో, ఎంతమంది నల్లగా ఉంటారో, ఎంతమందికి జుంజురువెంట్రుకలుంటాయో చూస్తా"ననిగాని, పిల్లికళ్లున్న ఒక స్త్రీతో "నీ వారాగిమీసాలున్న యువకుణ్ణి పెళ్లిచేసుకో- మీ మగ సంతానంలో రాగిమీసాలు, పిల్లికళ్లు ఒకళ్లకే వస్తాయో రావో చూస్తా"ననిగాని అడిగితే వాళ్లు ఒప్పుకుంటారా—వాళ్లకూ వాళ్లకూ యిష్టమైతేనే తప్ప? అందుచేత. అప్పటికి కొన్ని గుణాలు మొక్కలతోను, జంతువులతోను చేసిన పరిశోధనాఫలితములమీద ఆధారపడి మనుష్యులలో కూడా ఫలానామాదిరిగా వస్తాయని అనుకున్నారు. వాటిలో రెండో, మూడో రకాలు ఏ మాదిరిగా ఉండవచ్చునో ఉదాహరిస్తాను.

### శరీరచ్ఛాయ
### (Albinism)




* ఈ మొదటితరంలోని సంతానాన్ని మెండెల్ వాటిలో వాటినే సంపర్కించాడు. వాటి సంతానమే రెండోతరంలో 1 : 2 : 1 వంతులుగా పైమాదిరి గుణాలతో ఉంటాయి. రెండోతరంలోని సంతానాన్నికూడా వేరువేరుగా ఆలాగే సంపర్కించాడు.

ఈవిధంగా మనుష్యులలో వీలు లేనందున కూడా పరిశోధనలు చాలా తక్కువ. నీగ్రోలలో నలుపు గుణాన్ని, యూరోపియనులలో తెలుపు గుణాన్ని సంపర్కిస్తే రెండవతరంలో 64 గురు శిశువులు కలిగితే అందులో ఒకశిశువుమాత్రం స్వచ్ఛమైన తెలుపురంగు కలిగిఉంటుంది. కాని 64 గురుబిడ్డలు ఏస్త్రీకిని లేకపోవటంచేత ఆ స్వచ్ఛమైన తెలుపు కనబడనేకనబడదు.

### శరీరచ్ఛాయ, తలవెంట్రుకలు

తెలుపు × నలుపు...తల్లిదండ్రులు
మెత్తని జుట్టు | జుంజురు జుట్టు
(సా) (బ)
నలుపు (తెలుపు, మెత్తని
జుంజురు జుట్టు జుట్టు...మొదటి తరం.
(వీటిలో వీటిని సంపర్కిస్తే)

9 నలుపు జుంజురుజుట్టు. | 3 తెలుపు జుంజురుజుట్టు. | 3 నలుపు మెత్తని జుట్టు. | 1 తెలుపు... మెత్తని జుట్టు.
...రెండో తరం.

రెండు లక్షణములు తీసికొన్నప్పుడు 16 గురు శిశువులకు రెండోతరంలో 9 : 3 : 3 : 1 వంతులుగా పైమాదిరిగా ఉండవచ్చు.

కొన్ని గుణాలు స్త్రీ, పురుష భేదంతో లంకెపడి వుంటాయి. అవి యీ క్రింది ఉదాహరణమాదిరిగా సంతతిలో వస్తాయి:

### ఆకుపచ్చ, ఎఱుపు రంగులు తెలియని గ్రుడ్డితనం




○ = గ్రుడ్డి కాదు.
◐ = గ్రుడ్డి కాకపోయినా, తన సంతతికి గ్రుడ్డితనాన్ని యిచ్చేగుణం లోపల ఉంది.
● = గ్రుడ్డి.

మనలో కొంతమందికి కాలివ్రేళ్లలో ఒకటో, రెండో బాగా పొట్టిగా ఉంటాయి. ఆ లక్షణంకూడా ఆనువంశికంగా పైమాదిరిగానే వస్తుంది. నేను మొదట చెప్పిన పోలికల నన్నిటినీ మెండలిజమ్ వ్యాఖ్యానం చేస్తుంది.

ఒక్కొక్కప్పుడు ఫలానా గుణం ఫలానాఅప్పుడు వస్తుందని అంచనావేస్తే ఈ క్రోమోసోములు క్రిందిమాదిరిగా దగా చేస్తాయి. క్రోమోసోములు జతలుగా కూడినప్పుడు X క్రోమోసోం జతలో ఉన్నవి ఒకదానినొకటి మెలికవేసుకుని వాటిలో ఉన్న జెనీలను మార్చుకుంటాయి. అప్పుడు అండంలోకి వచ్చిన X క్రోమోసోములో మొదట దానిలో ఉన్న జెనీలు ఉండవు. దీనినే **crossing over** అని అన్నారు.




6. X క్రోమోసోములు మెలివేసుకుని జెనీలను మార్చుకొనుట.

ఈవిధంగా ఆప్రాణిలో ఉన్న గుణాలు ఆనువంశికంగా యీ వాహకులద్వారా వస్తాయి. ఇదేవిధంగా ఒక కులానికి చెందినవాడు మరొకకులంలోని స్త్రీని పెళ్లిచేసుకుంటే వాని సంతతిలో వాని గుణాలు ఎన్నితరాలలో, పూర్తిగా నశిస్తాయో, మళ్లీ తిరిగి ఆగుణాలు రావాలంటే ఏపద్ధతులమీద ఎన్నితరాలలో వస్తాయో మన ధర్మశాస్త్రాలలోకూడా కనపడుతుంది. చూడండి! మన ధర్మశాస్త్రాలేనాటివి? మెండెల్ ఏనాటివాడు? ఈ ఒక్కవిషయమే గాక పాశ్చాత్యలోకంలో బయలుదేరిన వైజ్ఞానికపరిశోధనాఫలితాలు చాలావరకు మనప్రాచీనులకు తెలిసినవే అని నా నమ్మకం. పరిశోధనాపరికరాలు మోటుగా ఉండి విధానం వేరైతే అవవచ్చు. వాళ్లు కేవలం ఆముష్మికాన్నే దృష్టిపథంలో ఉంచుకొన్నందువలన వీటికి ప్రాముఖ్యం యిచ్చి వృద్ధిచేయకపోవటం, ఈ రహస్యాల నన్నిటినీ విపులంగా బహిరంగపరచకపోవటం, ఎక్కడైనా ఒకటీ అరా ఉంటే ప్రస్తుతం 'మృతభాష' అనబడుతూ ఉన్న సంస్కృతంలో ఉండటం, దానిని మనం కారణాంతరాలచే ఉపేక్షించటం, నెమ్మదిగా ఒక్కొక్క సంస్కృత గ్రంథమే పాశ్చాత్యదేశాలకు నడుస్తూ ఉండటం, "తండ్రికి పెండ్లి అవుతూవుందన్న సంబరమే కాని, తనకు సవతితల్లి వస్తూవుందని గుర్తులే" దన్నట్టు యీకారణాలన్నిటిచేత ఐహికమే పరమావధిగా ఉన్న యీరోజుల్లో మనం ప్రాభవభ్రష్టులమై "ఎన్నడు ఇంద్రప్రస్థము నేలితిమో, ఎన్నడు రాజసూయ మొనర్చితిమో" అని అనుకుంటూ పాశ్చాత్య వైజ్ఞానికులు చేసే పరిశోధనలకూ, వాటి ఫలితాలకూ గ్రుడ్లప్పచెప్పి చూస్తూఉండవలసిన పరిస్థితులు వచ్చాయి. అది యుగధర్మం. దాని కిప్పుడెంత విచారించినా కలిసిరాదు.

ఇప్పుడు మీరు చూసిన విషయం అంతా కలిసి యీ సృష్టి అనే మహేంద్రజాలంలో పేకతమాషాలలో ఒక తమాషాలాంటిది. ఇది ఇంకా పూర్తిగా తెలియలేదేమో కూడాను. తెలియని విషయా లెన్ని ఉన్నాయో ఊహ కందవు. ఈమాదిరిగా వివిధ శాఖలలో వైజ్ఞానికులు అనేకమైన రహస్యాలను క్రమక్రమంగా తెలుసుకుంటున్నారు; మానవసేవ చేస్తున్నారు. మానవుడంటూ ప్రపంచంలో ఉన్నంతకాలం ఏదో ఒక పరిశోధన చేస్తూనే ఉంటాడు కాని ఊరుకోడు. ఇటీవల మద్రాసులో జరిగిన అఖిల భారత శాస్త్రపరిశోధక మహాసభకు అధ్యక్షత వహిస్తూ, ప్రొఫెసర్ బిర్‌బాల్‌సాహనీ మహాశయుడు ఈ విధంగా చెప్పాడు: "నిజమైన చిత్రకారుడగు ఆసృష్టికర్త తన శిల్పధోరణి నంతటిని ఒక్కమారుగా ఎప్పటికిని తెలియజేయడు. కాని పరిశోధకుడుమాత్రం విసుగు, నిరాశ చెందకూడదు." అని. స్వర్గీయ పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు ఇంచుమించుగా యీభావము సె యీ మాదిరిగా వ్రాశారు:

"ఎన్నికోటుల జీవు లీ యిలను గలవో!
ఇట్టి గోళమువంటి విం కెన్ని యద్భుతంబు లున్నవో! అందు జీవంబు లిట్టి
వెన్ని పుంఖానుపుంఖంబు లున్నవోక్క!
ఏతదపిసంఖ్య జీవసంఘాతములను
లీల సృజియించి రక్షించి గోళకోటు
లిష్టగతి త్రిప్పునతడు, అబ్బ! ఎంతవాడు!"

"పాదోఽస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి" అని పురుషసూక్తం.

ఇది కేవలం భావనామాత్రమే గాక నిజంకూడా నేమో అని తోస్తుంది. నిజమైన వైజ్ఞానికుడు తన పరిశోధనలవలన క్రొత్త రహస్యములను తెలిసికొనినకొలది ఆసృష్టికర్తకు చేరువ యగుచున్నాననే ఆనందంలో తన్మయత్వం చెందుతూ ఉంటాడు. మానవుడు ఈవిధంగాకూడ ఈ ఇంద్రజాలంలోని రహస్యముల నన్నిటినీ తెలిసికొని క్రమంగా ఆ ఐంద్రజాలికునంతవాడై "అహంబ్రహ్మాస్మి" అనుకునేస్థితి ఎప్పటికైనా వస్తుందా?...రాకపోతుందా?



# కతిపయ శబ్దార్థ స్వరూప పరిశీలన

## కొన్ని తెలుగుశబ్దముల అర్థవివరణలో ప్రమాదములు

## శబ్దరత్నాకరము ఒజ్జబంతి ::: పండితప్రకాండుల అనుసరణ

శ్రీ
దీపాల పిచ్చయ్యశాస్త్రి

ఈనాటి తెనుగు నిఘంటువులలో ఆకారముచేతనేకాక గుణసంపత్తిచేత సైతము గౌరవమును గాంచినది ఒక్క శబ్దరత్నాకరమే. దాని సహాయమున ఆంధ్రభాషోపాసకులు పొందుచున్న ఉపకార మపారము. భాషాపరిచయము నలవరించుకొన యత్నించు విద్యార్థులే కాక, ఆరితేరిన పండితులుకూడా రత్నాకరము నాశ్రయించియే సారస్వత ప్రపంచయాత్ర సాగించుచున్నారు. శ. ర. కర్తయైన బ. సీతారామాచార్యులవారు ఓర్పుతోనూ, నేర్పుతోనూ చిరకాలము పరిశ్రమించి గ్రంథస్థ పదజాలమును చాలవరకు సంతరించినారు. అంతేకాక లోకవ్యవహారమున రూఢికెక్కిన జాతీయములను గూడా సంగ్రహించి తమ కోశమున రాశిపోసి భద్రముగా ముద్రచేసి ఆంధ్రభాషాభివృద్ధికి మంచిమార్గము నేర్పరిచినారు.

అయితే, కొన్నితావులలో పదస్వరూపనిరూపణముననూ, అర్థనిర్ణయముననూ కూడా యించుక పొరపడినారు. భ్రాంతి పురుష ధర్మముగదా! కాకపోయిననూ లోకమున సర్వజ్ఞు డెవడు? ఆపొరపాటు లాచార్యులవారి కపకర్షాధాయకములు కాకపోయినను భాషారాధకులకుమాత్ర మపకారకములుగా నున్నవి. ఎట్లనగా?

స్వయంకృషిచేత సాహిత్యసంపదను సంపాదింపగోరు విద్యార్థులునూ, నిఘంటువుల సాయముననే పెద్దపెద్ద కావ్యములకు టీకలు వ్రాయువ్యాఖ్యాతలునూ, వ్యాపారదృష్టితో చిన్నచిన్న నిఘంటువులు వెలయించు కోశకర్తలున్నూ శ. ర. లోని తప్పుల నట్లే గ్రహించి, వినియోగించి దోషభాజనము లగుచున్నారు. ఇక వారి వ్రాతలను చదువువా రెల్లరును తత్తుల్యులేగదా అగుదురు? ఈరీతిగా, పరంపరగా, ఆంధ్రభాష కపకృతి యధికముగా జరుగుచున్నది.

'ఆంధ్రమల్లినాథు' లనియు, 'సర్వతంత్రస్వతంత్రు' లనియు, తుదకు 'సర్వజ్ఞు' లనియున్నూ కొనియాడబడిన వెంకట్రాయశాస్త్రిగారి టీకలలోనే ఆ తెరగుతప్పులు కుప్పలుగా నున్నవనగా, ఇక తక్కిన తుక్కుటీకల గొడవ వేరుగా తడవ నక్కరలేదుగదా?

'లక్ష్మీనారాయణీయ' మను నామాంతరముగల 'శుద్ధాంధ్రనిఘంటువు' శ. ర. ప్రమాదముల నన్నిటిని అట్లే శుకానువాదము చేయుచున్నదే—అందువల్ల భాషకు లగ్గో, యెగ్గో చూడండి.

బహుపండితపర్యవేక్షణమున ప్రకటితమైన సూర్యారాయాంధ్రనిఘంటువువంటి బృహత్కోశమునందును శ.ర. దోషములు సందుకొన్నవని వ్రాయవలసివచ్చినందుకు చింతిలుచున్నాను.

కావ్యపరనమునకూ, టీకాకరణమునకూ, నిఘంటునిర్మాణమునకున్నూ పూనుకొను పిన్నలూ - పెద్దలూకూడా పెద్దపెద్ద విద్వాంసుల వ్రాతలనైనను పరాబులవలె తలస్పర్శముగా పరీక్షించి పరిగ్రహింపవలెనుగాని, వారివారి పెద్దరికములమీది విశ్వాసమున ఆయావ్రాతల నట్లే యెత్తి వ్రాసికొనుట సముచితము కాదని సవినయముగా హెచ్చరించుటయే నా యీ వ్యాసము యొక్క ఉద్దేశము.

నా యలతిపరిశోధనమున కందినవానిలో ఒక్క నాలుగైదు పదములనుగూర్చి మాత్రమే యిచ్చట ముచ్చటింతును.

### ౧. 'ఉలుకు్క'

"ఉలుకు్క. దే. వి. అశ్వగతివిశేషము. సీ. "చను నులుక్కనఁగ నీచగతిపేరు."—ఆం. భా. ద్వి. కు."

—శబ్దరత్నాకరము.

"ఉలుకు్క. శ. (అశ్వముయొక్క నీచగతి)లుక."

—శుద్ధాంధ్రనిఘంటువు.

"ఉలుకు్క. వి. అశ్వగతిభేదము. (అశ్వముయొక్క) మందగతి. సీ. చను నులుక్కనఁగ నీచగతిపేరు...ఆం. భా. ౨. ౧౯౮."

—సూర్యారాయనిఘంటువు.

'ఉలుకు్క' అను రూపమునకు శ. ర. కర్త యిచ్చిన యుదాహరణ మసమగ్రము. 'చను నులుక్కనఁగ' అను పదములను 'చనును లుక్కనఁగ' అనియును విభాగింపవచ్చును. "అట్లు విభాగించుటకు వీలులేదు. అది 'ఉలుకు్క'గాని 'లుకు్క' కాదు" అని నిర్ధారించుటకా ఆంధ్రభాషార్ణవపద్యము పనికిరాదు. శ. ర. కర్త 'ఉలుకు్క' అన్నాడు గనుక తక్కినవారును 'ఉలుకు్క' అన్నారు. అంతేగాని, ఒక్కరైనా ఒక్కప్రయోగము నిచ్చినారు కారు. నిఘంటునిర్మాత లిట్టితావులలో గట్టిగా పనిచేయక సన్నగా దాటుకొనుట సరిగాదు.

ఇటీవల వేదం వేంకటట్రాయశాస్త్రిగారు దిద్ది ముద్రించిన (చేమకూరవారి) సారంగధర చరిత్రలోని

ఉ॥ "ఉక్కళమైన మంచిమను వొప్పెడు నాహయరత్నమెక్కి చక్క
గక్కస మేమి లేక రవగాలును జోడన యడ్డవేడెము

లుకు్క' అనుపాఠము నూహింపలేకపోయె ననియు నే నూహించితిని. (వావిళ్లవారి ప్రతి) ఆం. భా. లో 'చనును లుక్కనఁగ' అని చక్కగా ఎడపరిచి ముద్రించి యున్నది. ఆ ముద్రణముకూడా నా యూహనే బలపరుచుచున్నది.

ఇన్ని కారణములచేత నాయూహ బలవత్తరమైనను "ఒక్క ప్రతిలోనైనను 'లుకు్క' అని యుండకపోవుటకు హేతువేమా" అన్న శంకమాత్రము న న్నొకవంక బాధించుచునే యుండెను. ఇట్లుండగా, ఒకనా డుబుసుపోకకు బ్రౌణ్యమును తిరుగవేయుటలో 'రవగాలు' అనుపదముక్రింద ఈపద్యము దృగ్గోచర మయినది. అందులో పాఠము 'వేడెముక్ లుక్కుదువాళి' అనియే యున్నది. అంతటితో 'బ్రతుకు జీవుడా' అని 'లుకు్క' పాఠమే సాధువని నిశ్చయించుకొన్నాను.

ఇంతకును చెప్పవచ్చిన దేమనగా—శ. ర. కర్త 'ఉలుకు్క' అనుట పొరపాటు. శు. ని. మాటకేమిగాని, సూ. ని. వంటి గొప్ప నిఘంటువుకూడా ఆ పొరపాటు నట్లే యనువదించుట విచారకర మయిన విషయము. శ. ర. కర్త గొప్ప పండితుడే. అయినను, ఆయన గారి వ్రాతనుగూడా బాగాపరకాయించి పరిగ్రహించుటయేమంచిది.

## ౨. పులపొడుచు

"పులపొడుచు = ఱెప్పవేయకచూచు.

"చప్పుడు సేయక సంజ్ఞకుఁ
జప్పట్లిడుకొంచుఁ గొండసరియలవెంటన్
జప్పుళ్లకుఁ బులపొడుచుచుఁ
జొప్పరయుచు నీలవెట్టుచును శబరభటుల్." భిల్లా. 3. ఆ."
—శబ్దరత్నాకరము.

కంటి నొకమారు మూసి వెంటనే తెరుచుటకు(తెరిచి వెంటనే [...]యుటకు కూడా) 'పులపొడుచుట' అంటారు తెనుగుజనులు.

పై పద్యమున "శబరభటులు చప్పుళ్లకు 'పులపొడుచుచు, [...]లో సంచరించిరి" - అనగా "చప్పుడైనప్పుడెల్లా కన్నుమూయు మరల వెంటనే తెరచిచూచుచూ, ఆచప్పుడుకు కారణమేమా [ప]రిశీలించుచూ పోయి" రని యర్థము. ఎక్కడ చప్పుడైనను (క[...]క్కడ దెబ్బతగులునో అన్నభయమున) రెప్ప లటాలున కం[...]ప్పివేయుట సహజము. కంటిని కాపాడుటలో రెప్పకుగల [...]ట్టిది. కావుననే,

[...]టికి రెప్పయు గాచినభంగి'
—పల్నాటిచరిత్ర (చూ: బ్రౌ.)

"[...]కిన్, ఱెప్పయుఁబోలె మాటయి నెఱిం బనులారసి యొజ్జచా[...]న్, జెప్పుచు" —భార. ఉద్యో. ౪. ౧౧౪.

అను నానుడ[...] లోకమున వెలసినది. చప్పుడైనప్పుడు వెంటనే రెప్ప [...]ట్టుట ప్రా[...]సహజము. అంతేగాని 'ఱెప్పవేయక చూచుట' స్వభావము [...], కావున శ. ర. కర్తవ్రాత తప్పు.

కన్నుతెరచి మూసికొనుట కొకప్రయోగము—

"తడి, తలడిగ్గిముంప, జడతం దుదఱెప్పలఁ గన్నువీడ, పు
ల్పొడుచుచు,...చేష్టుడిగె వతుముపతులుజానువుల్ చోరన్."
ఆముక్త. ౪-౧౧౭.

వర్షములో పక్షులస్థితి వర్ణ్యము.

వానచినుకులు తలమీదిగా దిగి కన్నులలోనికి జారి వ్యథకలిగించుటచేత పక్షులకన్నులు మూతపడిపోయినవి. కంటిలోని నీటిని వెలువరించినగాని ఆవ్యథ తీరదు. వ్యథ కంటిని తెరువనియ్యదు. అందువల్ల కంటిరెప్పతుదల నెట్లో మెల్లగానెత్తి వెంటనేమూసికొనుచూ, అనగా రెప్పలచేత నొత్తి కంటిలోని నీటిని వెలువరించుకొనుచూ ఉన్నవని వర్ణన.

ఈ యర్థము నెరుగక 'ఆంధ్రమల్లినాథులు' శ. ర. లోని అపార్థము నట్లే ఒప్పజెప్పినారు.

"పుల్పొడుచుచున్ = ఱెప్పవేయక చూచుచు" అని టీక.

"ఆనీరే ... కన్నులం జొరఁగా ... వార్చివైచుటకు కన్ను తెఱవలేకుండినవి. లోని నీటిపోటుచే ఱెప్పలు కొంచెము తుదలను వీడఁగా, పక్షులును ఆనీరు వడియుటకుఁగాను రవంతసేపు కను దెఱచికొనియే యుండఁగా" అని తాత్పర్యము.

"పుల్పొడుచుట నీరు వడియుటకు" అని వివరణము.

కంటిలోని (నీటి) పోటుచేత రెప్పలు తుదలయందు తమకైతామే వీడిన వనుటయూ, అది సందుచేసికొని ఆపక్షులు అట్లే రెప్పవేయక చూచుచుండె ననుటయూ ప్రాణిస్వభావమునకు విరుద్ధము. కంటిలో పోటు కలిగినప్పుడు రెప్పలు గట్టిగా మూతపడుటయు, మనము బలవంతముగా తెరచుటయు, తెరచినను వెంటనే మరల మూతపడుటయూ అనుభవములో నున్నసంగతి. ఒకవంక కన్ను మండుచుండగా రెప్పవేయక చూచుట యెట్లు? ఈయర్థమును తెలిసికొనుటకు పాండిత్యముతో పనిలేదు; ప్రాణిస్వభావము నెరిగియుండిన చాలును. శ్రీ శాస్త్రిగారికి 'పులపొడుచు' ధాతువున కర్థము తెలియకపోవుటలో వింతలేదుగాని కంటిలో కుంకుడు నురుసు, సబ్బునీరు వంటివి పడినప్పుడు కలుగు అవస్థయొక్క అనుభవము తెలియకపోవుటమాత్రము గొప్ప వింత.

వావిళ్లవారి వ్యాఖ్యలో "పుల్పొడుచుచు = కన్నులు †పులకరించుచు (అనఁగాఁ దెఱవఁగూడని కన్నుల నతిప్రయత్నమునఁ దెఱచి లోనినీళ్లు వెలువరించుచు)" అని యెంత చక్కగా వివరింపబడియున్నదో చూడండి. ఆయర్థము తప్పనుకొని శాస్త్రిగారు శ. ర. మీది విశ్వాసముచేత 'ఱెప్పవేయక చూచుట'తోనే ముగించినారు.

'రెప్పవేయకచూచు' అనునర్థమున 'పులపొడుచు' అనుధాతువును వాడుట లోకవ్యవహారమునగాని, కావ్యలోకమునగాని నాకు కనపడలేదు. 'వాడాపిల్లవంక రెప్పవేయక చూచెను' అనవలసిన చోట 'వాడాపిల్లవంక పులపొడిచెను' అని తెనుగువాడన డనియే నా నమ్మకము.

† 'పుల[...]ంచుచు' అనుట తప్పులేండి. దాని కేమి? అక్కడమనము గమనింపవలసినది భావము.

లుకు్క' అనుపాఠము నూహింపలేకపోయె ననియు నే నూహించితిని. (వావిళ్లవారి ప్రతి) ఆం. భా. లో 'చనును లుక్కనఁగ' అని చక్కగా ఎడపరిచి ముద్రించి యున్నది. ఆ ముద్రణముకూడా నా యూహానే బలపరుచుచున్నది.

ఇన్ని కారణములచేత నాయూహ బలవత్తరమైనను "ఒక్క ప్రతిలోనైనను 'లుకు్క' అని యుండకపోవుటకు హేతువేమా" అన్న శంకమాత్రము న న్నొకవంక బాధించుచునే యుండెను. ఇట్లుండగా, ఒకనాఁడుబుసుపోకకు బ్రౌణ్యమును తిరుగవేయుటలో 'రవగాలు' అనుపదముక్రింద ఈపద్యము దృగ్గోచర మయినది. అందులో పాఠము 'వేడెముఁ జుకు్కదువాళి' అనియే యున్నది. అంతటితో 'బ్రతుకు జీవుఁడా' అని 'లుకు్క' పాఠమే సాధువని నిశ్చయించుకొన్నాను.

ఇంతకును చెప్పవచ్చిన దేమనగా—శ. ర. కర్త 'ఉలుకు్క' అనుట పొరపాటు. శు. ని. మాటకేమిగాని, సూ. ని. వంటి గొప్ప నిఘంటువుకూడా ఆ పొరపాటు నట్లే యనువదించుట విచారకరమయిన విషయము. శ. ర. కర్త గొప్ప పండితుఁడే. అయినను, ఆయనగారి వ్రాతనుగూడా బాగాపరకాయించి పరిగ్రహించుటయేమంచిది.

## ౨. పులపాడుచు

"పులపాడుచు = ఱెప్పవేయకచూచు.

క. "చప్పుడు సేయక సంజ్ఞలఁ
జప్ప ట్లిడుకొంచుఁ గొండసరియలవెంటన్
జప్పుళ్లకుఁ బులపాడుచుచుఁ
జొప్పరయుచు నీలవెట్టుచును శబరభటుల్." భల్లా. 3. ఆ."
—శబ్దరత్నాకరము.

కంటి నొకమారు మూసి వెంటనే తెరుచుటకు(తెరిచి వెంటనే మూయుటకు కూడా) 'పులపాడుచుట' అంటారు తెనుగుజనులు.

పై పద్యమున "శబరభటులు చప్పుళ్లకు 'పులపాడుచుచు, లో సంచరించిరి" - అనగా "చప్పుడైనప్పుడెల్లా కన్నుమూయు మరల వెంటనే తెరచిచూచుచూ, ఆచప్పుడుకు కారణమేమా పరిశీలించుచూ పోయి" రని యర్థము. ఎక్కడ చప్పుడైనను (ఎక్కడ దెబ్బతగులునో అన్నభయమున) రెప్ప టటాలున కంప్పివేయుట సహజము. కంటిని కాపాడుటలో రెప్పకుగల ప్రాశస్త్యట్టిది. కావుననే,

'టికి రెప్పయు గాచినభంగి'
—పల్నాటిచరిత్ర (చూ: బ్రౌ.)

"టికిన్, ఱెప్పయుఁబోలె మాటయి నెఱిం బనులారసి యొజ్జచాడ్పునన్, జెప్పుచు" —భార. ఉద్యో. ౪. ౧౧౪.

అను నానుడి లోకమున వెలసినది. చప్పుడైనప్పుడు వెంటనే రెప్ప కొట్టుట ప్రాణిసహజము. అంతేగాని 'ఱెప్పవేయక చూచుట' స్వభావము కాదు. కావున శ. ర. కర్తవ్రాత తప్పు.

కన్ను తెరచి మూసికొనుట కొకప్రయోగము—

"తడి, తలడిగ్గిముంప, జడతం దుద ఱెప్పలఁ గన్నువీడి, పు
ల్పొడుచుచు,...చేష్టుడిగె వతుముపక్షులుజానువుల్ చొరన్"
ఆముక్త. ౪-౧౧౭.

వర్షములో పక్షులస్థితి వర్ణ్యము.

వానచినుకులు తలమీదిగా దిగి కన్నులలోనికి జారి వ్యథకలిగించుటచేత పక్షులకన్నులు మూతపడిపోయినవి. కంటిలోని నీటిని వెలువరించినగాని ఆవ్యథ తీరదు. వ్యథ కంటిని తెరువనియ్యదు. అందువల్ల కంటిరెప్పతుదల నెట్లో మెల్లగానెత్తి వెంటనేమూసికొనుచూ, అనగా రెప్పలచేత నొత్తి కంటిలోని నీటిని వెలువరించుకొనుచూ ఉన్నవని వర్ణన.

ఈ యర్థము నెరుగక 'ఆంధ్రమల్లినాథులు' శ. ర. లోని అపార్థము నట్టే ఒప్పజెప్పినారు.

"పుల్పొడుచుచున్ = ఱెప్పవేయక చూచుచు" అని టీక.

"ఆనీరే ... కన్నులం జొరఁగా ... వార్చివైచుటకు కన్ను తెఱవలేకుండినవి. లోని నీటిపోటుచే ఱెప్పలు కొంచెము తుదలను వీడఁగా, పక్షులును ఆనీరు వడియుటకుఁగాను రవంతసేపు కను దెఱచికొనియే యుండఁగా" అని తాత్పర్యము.

"పుల్పొడుచుట నీరు వడియుటకు" అని వివరణము.

కంటిలోని (నీటి) పోటుచేత రెప్పలు తుదలయందు తమకై తామే వీడిన వనుటయూ, అది సందుచేసికొని ఆపక్షులు అట్లే రెప్పవేయక చూచుచుండె ననుటయూ ప్రాణిస్వభావమునకు విరుద్ధము. కంటిలో పోటు కలిగినప్పుడు రెప్పలు గట్టిగా మూతపడుటయు, మనము బలవంతముగా తెరచుటయు, తెరచిననూ వెంటనే మరల మూతపడుటయూ అనుభవములో నున్న సంగతి. ఒకవంక కన్ను మండుచుండగా రెప్పవేయక చూచుట యెట్లు? ఈయర్థమును తెలిసికొనుటకు పాండిత్యముతో పనిలేదు; ప్రాణిస్వభావము నెరిగియుండిన చాలును. శ్రీ శాస్త్రిగారికి 'పులపాడుచు' ధాతువున కర్థము తెలియకపోవుటలో వింతలేదుగాని కంటిలో కుంకుడు నురుసు, సబ్బునీరు వంటివి పడినప్పుడు కలుగు అవస్థయొక్క అనుభవము తెలియకపోవుటమాత్రము గొప్ప వింత.

వావిళ్లవారి వ్యాఖ్యలో "పుల్పొడుచుచు = కన్నులు †పులకరించుచు (అనఁగాఁ దెఱవఁగూడని కన్నుల నతిప్రయత్నమునఁ దెఱచి లోనినీళ్లు వెలువరించుచు) " అని యెంత చక్కగా వివరింపబడియున్నదో చూడండి. ఆయర్థము తప్పనుకొని శాస్త్రిగారు శ. ర. మీది విశ్వాసముచేత 'ఱెప్పవేయక చూచుట'తోనే ముగించినారు.

'రెప్పవేయకచూచు' అనునర్థమున 'పులపాడుచు' అనుధాతువును వాడుట లోకవ్యవహారమునగాని, కావ్యలోకమునగాని నాకు కనపడలేదు. 'వాఁడాపిల్లవంక రెప్పవేయక చూచెను' అనవలసిన చోట 'వాఁడాపిల్లవంక పులపాడిచెను' అని తెనుగువాఁడన డనియే నా నమ్మకము.

† 'పులకించుచు' అనుట తప్పులేండి. దాని కేమి? అక్కడమనము గమనింపవలసినది భావము.

ఈ 'పులపాడుచుట' కొన్ని ప్రాంతములలో 'పులకార్చుట' గా వ్యవహరింపబడుచున్నది. ఏమయినను, 'పులపాడుచుట = రెప్ప వేయక చూచుట' అనుట తప్పు. ఈతప్పునే శుద్ధాంధ్రనిఘంటు కర్త శ. ర. మీది నమ్మకముచేత తన నిఘంటువున ముద్రించుకొన్నాడు. దానినే పిన్నలూ పెద్దలూ నిత్యమును పఠించుచున్నారు. ఇంతకునూ మూలము శ. ర. కర్తప్రమాదమే గదా?

### 3. కుళ్లగించు

"కుళ్లు – క్రుళ్లుయొక్క రూపాంతరము.

క్రుళ్లగించు = అ. క్రి. (మనసులో) దుఃఖించు.

క్రుళ్లు = క్రుళ్లగించు. "సీ.కోపశోకంబులఁ గ్రుళ్లుచుఁ దన లోన, మండుచు దితి చాల మఱుఁగఁదొడఁగె" —భా. ౬ స్కం.

క్రుళ్లుపోతు = క్రుళ్లగించు స్వభావము గలవాఁడు."

—శబ్దరత్నాకరము.

ఈవ్రాత మిక్కిలి విస్మయావహముగా నున్నది. శ. ర. కర్త తెనుగువాఁడేనా అను శంక కవకాశమును కల్పించుచున్నది. 'మనసులో దుఃఖించుట' అను నర్థమున 'కుళ్లగించు' ధాతువు తెనుగుసంఘమున వాడుకలో లేదు. 'దితి కోపశోకములచేత మనసులో కుళ్లగించినది' అని భాగవత కర్త అనలేదు; అనఁడు. అట్టి ప్రయోగము తెనుగు కావ్యములలో ఉండ దనియే నా దృఢ విశ్వాసము. 'కుళ్లగించుట' యనగా గట్టిపారిన భూమినిగాని, మరియొక వస్తువునుగాని త్రవ్వి సడలించుట. జాతీయముల తత్త్వ మెరిగిన బ్రౌనుదొరగా రెట్లు వివరించినారో చూడండి:

"కుళ్లగించుట—To loosdn or dibble ( the earth ) to stir ( the fire). " —బ్రౌణ్యము.

ద్విపద — "తనయింటి యావత్తు ధనమును మున్ను
సంచితం బగు వస్తుసమితియుఁ జిల్ల
పెంచాదిగా మట్టగించి తెప్పించి" —బసవపు. ౭౮.

'మట్టగించు=క్రుళ్లగించు. (చూ: బసవ. పీఠిక. పుట ౧౧౯.)

'మనంబున దుఃఖించు' అను నర్థము నిచ్చు క్రియ 'కుళ్లు' (-కుళ్లుకొను) "

మనంబున గ్రుళ్లుచు - grieving, sorrowing."

—బ్రౌణ్యము.

శ. ర. కర్తకు తెలియలేదు గాని 'కుళ్లు' విశేష్యముగా కూడ నున్నది. 'వాడికి మనసులో కుళ్లేర్పడ్డది', 'మనసులో వున్న కుళ్లు బయటపడ్డది' అను వ్యవహారము సర్వాంధ్రజనవిదితము.

'కుళ్లు'నకు 'ఇంచుక్కు'ను, 'గుగాగమంబు'ను కలుగుటచేత ఏర్పడ్డ రూపము 'కుళ్లగించు'; నామధాతువు. శ. ర. లో 'కుళ్లు' విశేష్యముగా చెప్పబడలేదు. 'కుళ్లు'అను విశేష్యరూపము లేకయే 'కుళ్లగించు' అనురూప మెట్లు పుట్టిన దనుకొన్నాడో గదా ఆప్రౌఢవ్యాకరణకర్త? దాని కేమి గాని, విదేశీయుడైన బ్రౌనుగూడా తెలిసికొన్న 'కుళ్లగించు' ధాతువును ఆయన గారు తెలిసికొనకుండుట ఆశ్చర్యకర మయిన విషయము. అంతేకాక, లోకవ్యవహారము నైనను ఎరుగక "క్రుళ్లు = క్రుళ్లగించు; క్రుళ్లుపోతు = క్రుళ్లగించు స్వభావము గలవాడు" అని వ్రాయుట అసహ్యముగా నున్నది. ఆయనగారి మాట అట్లుండగా, శుద్ధాంధ్రుఁడయిన శుద్ధాంధ్రనిఘంటు కర్త 'కుళ్లుపోతు (క్రుళ్లగించు స్వభావము గలవాఁడు) క్రుళ్లుపోతు' అని శ. ర. లోని ముక్కల నట్లే ముద్రించుకొనుట లజ్జాకరమయిన తప్పు.

### ౪. గామిడి

"గామిడి=శ్రేష్ఠుఁడు. "మ. ఊరి గామిడిబాపల్ చను దెంచి రద్దుపదభూమిభర్తయిల్ చేరఁగన్" — పాంచా. ౪. ఆ.

అగ్రణి=ముఖ్యుఁడు, గామిడి" —శబ్దరత్నాకరము.

శుద్ధాంధ్రనిఘంటుకర్త 'గామిడి=శ్రేష్ఠుఁడు' అని శ. ర. లోని ముక్కలనే నుడివి, పైపెచ్చు 'గామిడి' గ్రామణీ శబ్దభవ మనియు, 'కన్నాకు', 'తలకట్టు', 'జెట్టి' మొదలగు పదములు 'గామిడి'కి పర్యాయము లనియు విశేషించి వివరించినాడు. గొప్ప పొరపాటు.

'గామిడి' 'గ్రామీణ' శబ్దభవముగాని 'గ్రామణీ' శబ్దభవము కాదు. 'గ్రామీణు' డనగా పల్లెటూరుమనిషి = అనాగరకుఁడు. ఈశబ్దము శ. ర. లో లేదు. కాని ఆప్టేనిఘంటువులో నున్నది.

"గ్రామీణః – Vulgar, rude, a villager." —ఆప్టే.

'గామిడి'కి గల యర్థములును ఇట్టివే. బ్రౌను 'గామిడి' శబ్దార్థమును బహూదాహరణములతో వివరించి యున్నాడు చూడండి:

"గామిడి—A fiend, an ogre. Adj. cruel, har[sh] కఠినమైన, క్రూరమైన, కట్టడి.

'గామిడిచన్నదోయి యసికొను' —బిల్హ. ౧-౹

'వెఱ్ఱి యనరాదు పైబడి వెక్కరించు
గామి డనరాదు మొగమున గంటువెట్టు'—శుక. ౩"

'† గామిడిగొల్ల యీ కొనవనంబునను
మాకు నీడైయున్న యీ కొమ్మకొని
చేకొని నరకంగ జెట్టులు లేవు' — బసవ. పు. ౭.

'గామిడము' అను రూపముగూడా కనబడుచున్నది.

"ఈమాటు చని యిచటి కేతెంచు మనుఁడు
'కామిడంబున' రాక కారు లాడినను"

—నవచోళచరి. పుట ౧౬.

---

† 'గామిడి=గడుసరి' - అని బస పీఠి. పుట ౧౧౯.

ముద్రితప్రతిలో 'కామిడంబున' అని యున్నది. 'గా' కు 'కా' అచ్చుపొరపాటై యుండవచ్చును. లేదా, వ్రాయసకాని తప్పైన నై యుండవచ్చును. కా-గాల మాట కేమి, 'గామిడము' అను పద మొకటి గర్వము - పొగరు అనే యర్థమున గలదని తేలినది. 'గామి డమునరాక' అనుమాటకు 'శ్రేష్ఠత్వమునరాక' అని యర్థముచేయుట హాస్యాస్పదముగదా ? కావున, గామిడమునన్=గర్వమున అనునదే సరియైన అర్థము.

'గామిడి' అనుపదమునకు 'అనాగరకుడు' అనునదే సరి యైన యర్థము. శ. ర. కర్త ఉదాహరించిన పద్యములోని 'గామిడి బాపలు'న్నూ అనాగరకులేగాని శ్రేష్ఠులు కారు. పూర్వోత్తరము లను పరికింపక శ. ర. కర్త అపార్థము చేసినాడు, చూడండి:

"ఎంతటివన్నెఁ దెచ్చె గుణి యేసి యిశెంకు ద్విజన్మజాతికిన్
వింత యటంచు రాజుల గణింపక తిట్టుచు గేలిగొట్టుచున్
గంతులువైచుచున్ దలఁ గట్టిన చెంగిగవైచి పట్టుచున్
గొంతులురాయఁ గోయనుచుఁ గూఁతలువెట్టిరి గ్రామ్యభూసురుల్."

—పాంచాలీపరిణయము. పుట ౧౮

చేష్టలనుబట్టియే కాక 'గ్రామ్యభూసురుల్' అనుపదము చేతనే ఆబాప లనాగరకులని స్పష్టముగా తెలియుచుండగా శ. ర. కర్త వారిని 'శ్రేష్ఠులైన బాఁప'లని అర్థముచేసికొనుట యెంత పొరపాటో చూడండి. ఆయనపొరపాటు నట్లే అందుకొని, శు. ని కర్త 'గామిడి', కన్నాకు, తలకట్టు మున్నగుపదములు సహానార్థకము లని సిద్ధాంతముచేయుట ఎంత ప్రమాదమోమో ఆలో చించండి. శబ్దస్వరూపమునైనను గమనింపక 'గామిడి' గ్రామణీ శబ్దభవ మనుట ఎంతసాహసమో చూడండి. ఇట్టివ్రాతలు లోకమున కపకారకము లంటే తప్పా?

## ౫. చాఱపప్పు

"చాఱ = జీడిమామిడి. "గీ. ఒక్కయెఱుకు ఱేఁడు నక్క కొమ్మను నిల్చి, గోఱజంబు జున్ను చాఱపప్పు" —మను. ౪

చాఱపప్పు = జీడిమామిడిగింజలోనిపప్పు.
జీడిమామిడి=మోరటి (దీనికాయలయందలిదే చాఱపప్పు)"

—శబ్దరత్నాకరము.

ఇట్లు శ. ర. కర్త 'చాఱ'ను 'జీడిమామిడి' యని చెప్పి, 'ముంతమామిడి'ని వేరుగా పఠించినాడు. కాని, లోకవ్యవహారమున 'జీడిమామిడి' యన్నను, 'ముంతమామిడి' యన్నను ఒక్కటే. 'చాఱపప్పు' మాత్రము వేరు. 'వస్తుగుణదీపిక' అను వైద్యనిఘంటు వులో ఇట్లు వ్రాయబడియున్నది.

"సారపప్పు. ఇది మొరలిచెట్టు పండులోని పప్పు. దీనిని చారప ప్పనియు, చిరేంజిప ప్పనియు నందురు.

జీడిమామిడిపండు. దీనిని ముంతమామిడిపం డని, మొక్క జీడిపం డని యందురు.

జీడిమామిడిపప్పు. దీనిని జీడిప ప్పనియు నందురు"

బ్రౌనుదొర యిట్లు వివరించినాడు: —వ. దీ.

"మొరలిచెట్టు. The tree called Cettis Orientalis or ప్రియాళువృక్షము (Heyne) or చారపప్పుచెట్టు.

చారపప్పు. The pulp or inside of a sort of small filberts.

జీడిమామిడిచెట్టు. The cushoo (cashew, cacheu) nut tree Anacardium Occidentale.

ముంతమామిడి పప్పు. Cashoonuts."

—బ్రౌణ్యము.

సంస్కృతమున 'చారచెట్టు'కు 'ప్రియాల'మనియు, 'బహు వల్క'మనియు, 'రాజాదన'మనియు పేర్లు. ముంత(జీడి) మ మిడికి 'స్థూలచూతము', 'అగ్రబీజము' అని పేర్లు.

౧౮౩౧సం.లో మనుచరిత్రకు టీకవ్రాసిన జూలూరి అప్పయ్య పం డితుడు

"ఒక్క యెఱుకురేడు నక్కకొమ్మను నిల్చి
గోరజంబు జున్ను 'చారపప్పు' "—ర.౧౩.

అన్నచోట 'చారపప్పు = బహువల్క సూపము'† అని సరియైన యర్థమే వ్రాసియున్నాడు. (బహువల్కము= ప్రియాలము. చూ: శబ్దకల్పద్రుమము.) శ. ర. కర్త చూచినట్లు లేదు. శ.ర.లో 'చాఱపప్పు' = 'జీడిమామిడిపప్పు' అని యుండుటను చూచి, (జీడి మామిడి యన్నను ముంతమామిడియన్నను ఒక్కటేగదా అన్నతల పున)కాబోలు వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు తమ మనుచరిత్ర టీకలో 'చాఱపప్పున్ = ముంతమామిడిపప్పును' అన్నారు.

'మను' టీకాకారులలో నొకరైన కొ. అనంతాచార్యులవారు శ.ర. కర్తమాటను మీరుటకు జంకి 'చారపప్పున్ = జీడిమామిడి పప్పును' అనియే అన్నారు.

చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి (అనువారే కాబోలు) ఇటీవల తాము తాత్పర్యమాత్ర సహితముగా ప్రకటించిన మనుచరిత్రలో చాఱపప్పును ముంతమామిడి పప్పుగానే పేర్కొన్నారు. వారు వావిళ్లవారి వ్రాతను చూచి వ్రాసియుంటారు.

'చాఱపప్పు', 'జీడి(ముంత) మామిడిపప్పు' భిన్నపదార్థము లని బిడ్డలకుగూడా విదితమైన విషయమై యుండగా ఇందరు పండితు లిట్లు తారుమారుటీకలు వ్రాయుటకు కారణము శ. ర. మీది విశ్వాసముతప్ప మరియేమి? మొత్తముమీద శ.ర.కర్త 'చాఱపప్పు'ను 'జీడిమామిడిపప్పు' అనుట చిత్రమే. కాని,

† చారపప్పు - ముంతమామిడిపప్పు మొదలగు పప్పుగింజలను 'సూప'మనుట పొరపాటు. పక్వపదార్థమునకే 'సూపము' అని పేరు

అపరమల్లినాథుల టీకలలో ఇంతకంటెను విచిత్రము లున్నవి. వారు 'భల్లాతకి' అంటే 'ముంతమామిడిచెట్టు = మొక్కజీడిచెట్టు' అంటారు. ఆ వ్రాత నిక్కడ సంగ్రహముగా చూపుతాను:

సీ. "పల్లచీమల వక్రభల్లాతకియుఁ బోలె
నెఱ్ఱ దుప్పటి నొప్పు కత్తెవాని"

— ఆముక్త. ౬. ౧౯.

" బాఁపనచీమలచేత వంకర జీడిచెట్టువలె, రక్తవర్ణముగల దుప్పటిచేతను ఒప్పుచున్న నల్లనిమేనుగలవానిని" అని వావిళ్లవారి వ్యాఖ్య.

'వక్రభల్లాతకి' శబ్దమునకు 'వంకరజీడిచెట్టు' అను టీక తప్పను కొని శ్రీవారు 'వక్రభల్లాతకియుఁ బోలెన్ †= వంపుగింజల జీడిచెట్టువలె (*ముంతమామిడిచెట్టు = మొక్కజీడిచెట్టువలె.)' అని సవరించినారు. 'వక్ర' పదమునకు 'వంపుగింజలుగల' అని యర్థమును కల్పించుకొని, 'వంపుగింజలు కలది జీడిమామిడిగదా' అని యర్థమును చెప్పికొని సరిపెట్టుకొన్నారు. బాగానే ఉన్నదిగాని, నిజముగా 'వక్ర' అన్నంతమాత్రమున 'వంపు గింజలుగల' అనునర్థము సిద్ధించునా?

'వక్రనింబము', 'వక్రతాళము' అనుపదములకు 'వంపుగింజల వేపచెట్టు, వంపుగింజల తాటిచెట్టు' అని యర్థము చెప్పు పండితు లున్నారా? పోనియ్యండి. ఆసంగతి మన కంత ముఖ్యముకాదు.

'భల్లాతకి' యనగా ముంతమామిడిచెట్టా? నిఘంటుకర్త లేమన్నారు, చూడండి:

'వీరవృక్షో ౽ రుష్కరో ౽ గ్నిముఖీ భల్లాతకీ త్రిషు' — అమ. అరుష్కరః (=వ్రణములు చేయునది), అగ్నిముఖీ(=అగ్నివంటి ముఖముకలది), భల్లాతకి — జీడిమ్రాని పేళ్లు.

— గురుబాలప్రబోధిక.

"అడరు భల్లాతకియు జీడి యన మహీశ".

— ఆం. భా. ౨—౪.౬

"భల్లాతకి = జీడి. (శ. ర.)

"భల్లాతము — భల్లాతకి—The marking nut called జీడిగింజ " బ్రౌణ్యము.

వెంకటరాయశాస్త్రిగారి టీకలో 'జీడిగింజలు' 'ముంతమామిడిపప్పు' ఒకటే అయినవి. ఎంతప్రమాదమో, చూచారా? 'జీడిగింజ'ను అంటుకొంటే ఒళ్లు పెట్లి తెగవాచిపోతుంది. 'ముంతమామిడిపప్పు' కమ్మని ఆహారపదార్థము. 'జీడిగింజ' వైద్యవస్తువు. దానితో చేసెడిమందు (భల్లాతక లేహ్యము) చెలిదిరోగములకు వజ్రాయుధము.

క. "ఒళ్లు చెడఁ దిరిగి ముప్పున
భల్లాతకసేవ బాగుపడఁ గోరుట తా
నిల్లు దరికొనుచునుండఁగఁ
జల్లారుప బావి త్రవ్వుచందము సుమతీ"

—అభినవ సుమతిశతకము.




ఉత్తరసర్కారులలో 'ముంతమామిడిపప్పు'ను 'జీడిపప్పు' అంటారు. కాని 'జీడిగింజల'(Marking nuts)ను'జీడిపప్పు' అనరు. 'గింజ' కు 'పప్పు' కు భేద మున్నది. 'గింజ' లోనుండు పదార్థము 'పప్పు'. 'జీడిగింజ' నిండా చమురేగాని పప్పుండదు. జీడిమామిడిగింజల నుండి తీయబడునదే జీడిపప్పు, 'జీడిగింజలు', 'జీడిపప్పు' అనుపదములలో గల సూక్ష్మభేదము నెరుగక శాస్త్రిగారు 'జీడి' శబ్దసామ్యముంబట్టి రెండును ఒకటేననుకొన్నారు. గొప్పభ్రాంతి.

శాస్త్రిగారికి లోకములోని వస్తువులు, చెట్లు, జంతువులు, వాని స్వరూపస్వభావాదులు ఆట్టే తెలిసినట్లుకానరాదు. అందువల్లనే ననుకుంటాను ఆముక్తమాల్యదలో 'పనసపండు దిగిన పరిగ' (౪-౨౭౪) అన్నచోట పనసపంట తీరెరుగక, అర్థము, తన్మూలమున అలంకారము తప్పుగా వ్రాసినారు. 'పంది'కి, 'ఏదుపంది'కి గల ఆకారభేదము నెరుగక శృంగారనైషధవ్యాఖ్యలో (౮-౧౨౨) 'ఆదివరాహము'ను ఏదుపందిగా తేల్చినారు. వారి టీకలలో ఇట్టి యపార్థములు, అపపాఠములు అనేకముగా నున్నవి.

శ. ర. కర్తసిద్ధాంతములును, శాస్త్రిరాద్ధాంతములును మనకుపాదేయములే గాని వానిని కైకొనుటలోమాత్రము మనము జాగరూకులమై యుండవలెను. భరవసా పనికిరాదు. వారు పూజ్యులైనను వారిప్రమాదములు పూజ్యములు కావు; త్యాజ్యములే.

"తాతస్య కూపో౽య మితి బ్రువాణాః
క్షారం జలం కే పురుషాః పిబంతి ?"

సత్యనిర్ణయమునకై కావించిన నాయీచర్చలో నేమేని పొరపాటులు పొరలియున్నచో సవరించుకొనుటకు సంసిద్ధుడను.

---

†'వక్రభల్లాతకి' యనియు, 'ఋజుభల్లాతకి' యనియు భల్లాతకి రెండువిధములా? ఔరా !
* శాస్త్రిగారిమతమునను 'ముంతమామిడి' 'మొక్కజీడి' ఒక్కటే నసునది పాఠకులు గమనింతురుగాక.

EDITED PRINTED & PUBLISHED BY S. SAMBHU PRASAD,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.